# పాలసముద్రం

( నవల )

బాబు
(షేక్ ఆరిఫ్)



యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్‌రోడ్, హైదరాబాదు-500001

PAALASAMUDRAM - A Telugu Novel
by BABU (Shaik Arif)
Pablished by Yuvabharathi, A literary and
Cultural Organisation, Hyderabad - 500001


Yuvabharathi Publication No. 154
(under self financing scheme)

ప్రథమ ముద్రణ : మార్చి 1995

ప్రతులు : 500

వెల : రూ. 40

ముఖచిత్రం : శ్రీ శీలా వీర్రాజు

For Copies :

1. Yuvabharathi
Literary & Cultural Organisation,
Andhra Saraswatha Parishath Buildings,
Tilak Road, Hyderabad - 500001

2. Shaik Julakhabi
H. No. D 2-5, HUDA Colony,
Chandanagar, Hyderabad - 500 138

3. S. Babu
H. No. D 2-8, HUDA Colony,
Chandanagar, Hyderabad - 500 138

Printed at :
Padmavathi Art Printers,
Gandhinagar, Hyderabad-380

# యువభారతి ముందుమాట

చుట్టూరా ఆవరించుకొన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోటం కంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించుమనే సూక్తి ప్రేరణగా యువభారతి మూప్ఫయి యేళ్ళకు పైగా తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగంలో కృషి చేస్తోంది. సామాన్య ప్రజలలో సాహిత్య చైతన్యాన్ని కలిగించే ఉద్యమంలో భాగంగా సభలను, గోష్ఠులను ఏర్పాటు చేయటం, ప్రచురణలను అందించటం యువభారతి కార్యక్రమం. ప్రతినెలా 'సమాలోచనం' కార్యక్రమాలు నడుపుతూ, ఇప్పటికి 150 కి పైగా ప్రచురణలను వెలువరించి ప్రజా సేవకు యువభారతి అంకితమై సాగుతోంది.

యువభారతి సభ్యులు స్వీయవ్యయంతో ముద్రించుకొనే ప్రచురణల పథకం క్రింద శ్రీ బాబు రచించిన 'పాలసముద్రం' వెలువడుతున్నది. ప్రసిద్ధ నవలా రచయిత్రి ఆచార్య సి. ఆనందారామంగారు ఈ నవలకు ఆశీస్సులందించారు. వారికి యువభారతి కృతజ్ఞతలందజేస్తోంది. శ్రీ బాబు గారి 'పాలసముద్రం' యువభారతి ప్రచురణలలో మొదటి నవల. సహృదయలోకం ఈ రచనను సాదరంగా స్వీకరిస్తుందని ఆశిస్తున్నాం. యువభారతి ప్రచురణగా వెలువరిస్తున్నందుకు శ్రీ బాబుకు అభివందనాలందజేస్తున్నాం.

వృత్తిలో, ప్రవృత్తిలో, జీవితంలో, సేవలో కొన్ని విలువలు పాటిస్తేనే సమాజం అలజడులకు, అశాంతికి దూరమై మానవతతో శాంతితో మనగలుగుతుందని ఈ నవల చెపుతోంది. ఆధునికమైన కథా కథన శిల్పంతో పతితల నాకట్టుకుంటోంది.

యువభారతి సాగిస్తున్న సాహిత్యోద్యమానికి మీ చేయూత నందించాలని కోరుతూ—

హైదరాబాదు,
15-3-1995.

జి.వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

**ఆచార్య సి. ఆనందారామం**
తెలుగు ప్రొఫెసర్, ప్రఖ్యాత నవలా రచయిత్రి
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం
హైదరాబాదు 500134

# పాల సముద్రం

తెలుపు స్వచ్ఛతకు ప్రతీక. పాల సముద్రం స్వచ్ఛమైన సేవా నిరతితో కూడిన డాక్టర్ల జీవితాలకు, వైద్యరంగానికి ప్రతీక. నవలకు ఈ పేరు పెట్టటంలోనే రచయిత శ్రీ బాబుగారి ప్రతిభ స్పష్టమౌతుంది.

నవల అంటే కథ చెప్పటం కాదు. కథనంతో మేళవించి జీవితాన్ని వ్యాఖ్యానించటం. రచయిత వైద్యరంగాన్ని తన నవలకు రంగభూమిగా ఎన్నుకొన్నారు.

డాక్టర్ల చుట్టూ, ఆస్పత్రుల చుట్టూ అల్లుకొన్న ఈ ఇతివృత్తంలో విలువైన సమాచారం పొందుపరచటంలో రచయిత కృతకృత్యులయ్యారు. క్యాన్సర్ వ్యాధి అంటే ఏమిటో సాధారణ పాఠకులకు అర్థమయ్యేలా వివరించారు. డాక్టర్ల - నర్సుల - రోగుల మానసిక ప్రవృత్తులు చక్కగా విశ్లేషించారు.

పాల సముద్రంలో సైతం కాలకూటం తప్పదు. తెల్లకోటు తగిలించుకున్నంత మాత్రాన మనసులు తెల్లగా ఉండవు. డాక్టర్ చౌదరి, ఉమేష్ మొదలైన పాత్రలు ఈ చేదు సత్యాన్ని వ్యాఖ్యానిస్తాయి. సమాజంపై వీరి దుష్ప్రభావాన్ని దయనీయంగా చిత్రించారు రచయిత.

రుక్మిణీ బుజ్జిబాబుల వ్యవహారం రచనకు మంచి హాస్యాన్ని అందించింది.

శైలి సరళంగా - సాఫీగా - చక్కని వ్యావహారికంలో సాగింది. "వచ్చింది భాయీ" అనటానికి "వచ్చింది బై" అనటం రచయిత పాత్రోచిత భాషా ప్రయోగానికి కొక ఉదాహరణ.

ఆసాంతము చదివించే చిక్కని కథ.

స్వంతం చేసుకొని దాచుకోదగిన సమాచార సేకరణ.

మొత్తంమీద రచయిత శ్రీ బాబుగారి పాల సముద్రం ఆధునిక నవలా సాహిత్యంలో మరో ఆణిముత్యం.

13-3-1995 సి. ఆనందారామం

# ఈ రచయితవే రాబోయే రచనలు

1. మహాసంకల్పం
2. కల చెదిరింది
3. ఆగస్టు 15, 2047
4. మనసా స్మరామి
5. వార్డెన్
6. సినీ "ఆకాజీవి"
7. న్యూడ్ మోడల్ (English & Telugu)
8. బ్యూటీ "షి"యన్
9. SINCERE PROPOSAL
10. LIFE IS GOING ON
11. MY PERSONAL DAIRY
12. SHIRDI SAI BABA IS THE REAL MUSLIM MONK
13. UNIVERSITY CAMPUS
14. HE-MAN, SHE-WOMEN
15. సురక

# కృతజ్ఞతలు

నేటివరకు అనేక కథలు, వ్యాసాలు వ్రాశాను. ఒక సామాజిక ఇతివృత్తాన్ని గ్రహించి ఒక చక్కటి నవలను వ్రాయాలనే సంకల్పం నాలో చాలా కాలంనుంచి ఉంది. ఆ సంకల్పానికి రూపకల్పనే ఈ "పాల సముద్రం." ఇది నా మొదటి నవల. నా అంతర్మథనంనుంచి ఉద్భవించిందే "పాల సముద్రం." ఈ నవలను చదివి నన్ను ప్రోత్సహిస్తూ ఆశీర్వదించిన ప్రసిద్ధాంధ్ర నవలా రచయిత్రి, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్ ఆచార్య సి. ఆనందారామంగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఈ నవల "యువభారతి" ప్రచురణగా వెలుగులోకి తీసుకు రావడానికి అంగీకరించిన యువభారతీయులందరికీ ముఖ్యంగా సంస్థ అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారికి, యువభారతి కన్వీనర్ ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి, సంస్థ కార్యదర్శి డా॥ బి. జయరాములు గారికి, కోశాధికారి డా॥ జి. విద్యానాథ్ గారికి మరియు యువభారతి ఉపాధ్యక్షులకు, సంయుక్త కార్యదర్శులకు, సమాలోచనం సమావేశకర్తలకు, కార్యవర్గ సభ్యులకు, కార్యాలయ సిబ్బందికి నా ధన్యవాదాలు.

ముఖచిత్రంతో నవలను ముద్దుగా అలంకరించిన చిత్రశిల్పి శ్రీ శీలా వీర్రాజు గారికి కృతజ్ఞతలు.

నాకు ఇంటర్వ్యూలు, సలహాలు ఇచ్చి సహకరించి, ప్రోత్సహించిన పెద్దలకు నా హార్దికమైన ధన్యవాదాలు.

ఈ నవలను అందంగా ముద్రించి ఇచ్చిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ అధిపతి పి. శ్రీనివాస్‌గౌడ్ గారికి, వేయి కళ్ళతో ప్రూఫులను దిద్దిన శ్రీ కె.పి. బాబు గారికి, తదితర సిబ్బందికి—

హృదయపూర్వక ధన్యవాదాలు.

ఆప్యాయంగా ఈ కృతిని అందుకున్న అమ్మకు నమస్సులు.

—బాబు

# పాలసముద్రం

చార్మినార్ చౌరస్తా.

ట్విన్ సిటీస్‌లోని పెద్ద జంక్షన్లలో అది ఒకటి. ఓల్డ్ సిటీగా బాగా పాపులర్ అయిన సెంటర్.

సమయం రాత్రి పదకొండు గంటలు దాటింది....

రోడ్డుకు ఇరువైపుల ఉండే షాప్స్ అన్నీ మూసి ఉన్నాయి.

ఫ్లడ్ లైట్ల వెలుగులో రోడ్లన్నీ పాలవెన్నెలలా వెలిగిపోతున్నాయి.

ఆ విశాలమైన రోడ్‌మీద తెల్ల అంబాసిడర్ కార్ స్లోగా నరవాసన పసిగట్టిన తెల్లపులిలా కదులుతున్నది. ఆ కార్‌లో నలుగురు వ్యక్తులు ఉన్నారు. ఒకరు డాక్టర్ చౌదరి., మిగతా ముగ్గురు అతని చేతులు, కాళ్ళు, కళ్ళు లాంటి అతని అనుచరులు. వాళ్ళను చౌదరి ప్రేమగా "త్రిమూర్తులు" అని పిలుచుకుంటూ ఉంటాడు. వాళ్ళ పేర్లు నరేంద్ర, మస్తాన్, లూథర్.

కారు ఓ మలుపు తిరిగింది....

—అంతా నిశబ్దంగా ఉంది ఆవీథి. వీథి దీపాలు అన్నీ వెలగటం లేదు. అక్కడక్కడ కొన్ని వీథి ట్యూబ్ లైట్స్ వెలుగుతున్నాయి.

కార్ మరో మలుపు తిరిగింది - ఆ వీథి చివర.

సరిగ్గా ఓ ఇంటి ముందు వెళ్ళి ఆగింది కార్.

ఆ ఇంటికి వరండా లేదు - ఇంటి గోడకే "బి. మోహన్ కుమార్, ఎమ్.యస్.సి., ల్యాబ్ అసిస్టెంట్" అని వ్రాసి ఉంది. ఆ నేమ్ ప్లేట్ చూస్తూ తృప్తిగా నవ్వుకుంటూ కార్ దిగాడు చౌదరి.

అతని అనుచరులలో ఒకడైన మస్తాన్ వెళ్ళి కాలింగ్ బెల్ స్విచ్ నొక్కాడు. బెల్ మ్రోగిన ఓ నిమిషానికి మోహన్ కుమార్ వచ్చి డోర్ తెరిచాడు.

తలుపు తెరుచుకున్న మరుక్షణం మస్తాన్, లూథర్ ఇంటిలోకి జొరబడ్డారు. ఆ తరువాత చౌదరి ప్రవేశించాడు ఇంటిలోకి.

నరేంద్ర మాత్రం బయటి తలుపు దగ్గరే కాపలాగా నిలబడ్డాడు.

అకస్మాత్తుగా ఇంటిలోనికి జొరబడి వచ్చిన వ్యక్తులను చూస్తుంటే మోహన్ కుమార్‌కు నోట మాట రావటం లేదు. మృత్యుంజయ మంత్రాన్ని మనసులోనే జపించి ధైర్యంచేసి—

"ఎవరు సార్ మీరు....మీకు ఏం కావాలి...."అని తడబడుతూ అడుగుతున్నాడు.

కానీ, చౌదరి ఏమి పట్టించుకోకుండా, ఎంతో పరిచయం ఉన్న వ్యక్తిలా వెళ్ళి హాల్‌లో ఉన్న సోఫామీద చాలా రిలాక్స్‌గా కూర్చున్నాడు. చిరుదరహాసం చేస్తూ ''కంగారు పడకు మోహన్, మేము నీకు శత్రువులం ఏం కాదు. చాలా దగ్గరి వాళ్ళమే. అమ్మాయి ఏది....'' మోహన్ కుమార్ భార్యను గురించి కూడా అడుగుతున్నాడు.

మోహన్‌కు అంతా మిష్టరీలా ఉంది. తనకు తెలిసి తనకు గాని, తన భార్య తరపువారు కాని ఈ రకమైన బంధువులు ఎవరూ లేరు.

మస్తాన్, లూథర్‌ల రఫ్‌నెస్ చూస్తుంటే మోహన్ కుమార్‌కు వెన్నులో నుంచి వణుకు పుడుతున్నది.

సరిగ్గా అప్పుడే ప్రక్కగదిలో నుంచి వచ్చింది మోహన్ కుమార్ భార్య.

చౌదరి దృష్టి ఆమె మీద పడింది....

''ఏమ్మా బాగున్నావా....'' అని ఎంతో పరిచయం ఉన్న పెద్ద మనిషిలా పలుకరించి—

''పిల్లలు నిద్రపోతున్నారా అమ్మ? మీ ఆయనతో చిన్నపని పడి వచ్చాం....అ....అమ్మాయి! కాఫీ, టీ లాంటివి ఏమి పెట్టుకోవద్దు....మేం వెళ్ళాలి త్వరగా....'' అన్నాడు చౌదరి ధారగా.... (అంటే కాఫీ గాని, టీ గాని చేయిపో అని పరోక్షంగా అర్థం.)

మోహన్ భార్యకు కూడా వచ్చిన వారు ఎవరో ఒక్కసారిగా గుర్తుకు రావటల లేదు. అయినా పరాయివారు తమ యింటికి వచ్చి ఇలా కలుపుగోలుగా మాట్లాడగలరా అని లాజికల్‌గా ఆలోచించుకొని కాఫీ చెయ్యటానికి కిచెన్‌లోనికి వెళ్ళింది.

చౌదరి ఆమె కిచన్‌లోకి వెళ్ళిందని నిర్ధారించుకున్న తర్వాత, మోహన్ కుమార్ వైపు పరిశీలనగా చూస్తూ "చూడు మోహన్ కుమార్! నీవు చాలా బాధ్యతగల ఉద్యోగం చేస్తున్నావు....కనుక బాధ్యతతో మా పని కూడా చేస్తావని అనుకుంటాను.... ఇంతకీ అసలు విషయమే చెప్ప లేదు కదూ; నువ్వు వుద్యోగం చేసే డాక్టర్ అభిమన్యు మెడికల్ ఇనిస్టి ట్యూట్‌లో మా వ్యక్తి ఒకడు ట్రీట్‌మెంట్ తీసికొంటువ్నాడు. వాడికి వచ్చేవారం ఓపన్ హార్ట్ సర్జరీ ఆపరేషన్ జరుగుతుంది. అందుకు సంబం ధించి కాస్త మాట్లాడాలని...." అని ఇంకా ఏదో చెప్తూనే ఉన్నాడు చౌదరి.

మధ్యలోనే అందుకున్నాడు మోహన్ కుమార్ - "మా హాస్పి టల్‌లో జరిగే హార్ట్ ఆపరేషన్స్ అన్ని సక్సస్ అవుతుంటాయి సార్!....

మీరు ఈ విషయంలో ఏ౯ కంగారు పడవలసిన అవసరం లే..." అని ఇంకా ఏదో చెప్పబోయాడు ఉత్సాహంగా.

కాని మధ్యలోనే తుంచేస్తూ ''ఇక....అవుతావా....'' అని విసుగ్గా చురక అంటిస్తున్నట్లుగా అడిగాడు చౌదరి.

''.......'' బిక్కచచ్చి ఊరుకున్నాడు మోహన్.

"మా వాడికి ఆపరేషన్ అయిన తర్వాత వాడికి నాలుగు బాటిల్స్ రక్తం అవసరం అవుతుంది. ఆ విషయం గురించి...." అని ప్రారంభిం చాడు చౌదరి.

మోహన్ కుమార్ ఉత్సాహం ఆపుకోలేక మరలా మధ్యలోనే అడ్డు తగిలి "రక్తం గురించి మీరు ఏమి భయపడవలసిన పనిలేదు సార్! మా హాస్పిటల్‌లో అన్ని గ్రూప్‌ల రక్తం దొరుకుతుంది...." అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

కాని, చౌదరి ఉరిమి చూసేసరికి మోహన్‌కుమార్ మౌనం వహిం చాడు. - ఓ సారి నవ్వి తిరిగి చెప్పటం ప్రారంభించాడు చౌదరి :

"మా వాడి బ్లడ్‌గ్రూప్ ఏ పాజిటివ్. కానీ, నువ్వు దాన్ని బి. పాజి టివ్ అని వ్రాయాలి. అదే నువ్వు మాకు చేయ్యవలసిన చిన్న హెల్ప్."

''ఒక బ్లడ్ గ్రూప్ మనిషికి మరో గ్రూప్ రక్తం ఎక్కిస్తే రోగికి చాలా ప్రమాదం, రోగి చనిపోవచ్చు కూడా...." అన్నాడు మోహన్ కంగారుగా.

''మరేం పర్వాలేదు - మనిషిగా పుట్టిన తర్వాత ఏదో ఒక రోజు పోవలసిందేగా...." చాలా కూల్‌గా అన్నాడు చౌదరి.

"అంటే?...."

''ఆ.... అదే.... మా ఉద్దేశ్యం; లేకపోతే ఇంకోపని చెయి. మావాడికి అవసరమైన నాలుగు బాటిల్స్ ఏ పాజిటివ్ గ్రూప్‌లో రెండు బాటిల్స్

బి. పాజిటివ్ బ్లడ్ ఉంచేయి. సరేనా?...." అన్నాడు చౌదరి నచ్చచెబు తున్నట్లుగా.

"నో.... ఇది అన్యాయం, ఒక మనిషి నిండు ప్రాణాలతో చెలా గాటం" అన్నాడు మోహన్ బిత్తరపోతూ....

"మరీ అంత అప్ సెట్ అవ్వకు మోహన్‌కుమార్! భార్యబిడ్డలు కలవాడివి" అంటూ తనతో వచ్చిన మస్తాన్, లూథర్‌లకు ఏదో సైగ చూపాడు.

మరుక్షణం....

మస్తాన్ వచ్చి మోహన్ కుమార్‌కు ఎదురుగా ఉన్న టేబుల్ మీద ఐదువందల రూపాయల కట్టతీసి ఉంచాడు. - ఆ తర్వాత లూథర్ వచ్చి అదే టేబుల్ మీద మరోవైపు ఓ చిన్న బాటిల్ ఉంచాడు. ఆ బాటిల్ పైన "POISON" అని ఇంగ్లీషు అక్షరాలు వ్రాసి ఉన్నాయి.

అది అంతా గమనిస్తూనే ఉన్న మోహన్ కుమార్‌కు కోపం వస్తున్నది కాని, భయం వలన గొంతు కేదో అడ్డుపడినట్లుగా ఉంది....

"ఏమిటది...." అన్నాడు మోహన్ కుమార్ భయంతో గొంతు బొంగురుపోతుండగా....,

"చెప్తాను, నువ్వు కంగారుపడకు. అమ్మాయి వింటే భయపడుతుంది. మేము చెప్పేపని నీ కిష్టం అయితే ఆ రూపాయల కట్టతీసుకో. మేము చెప్పిన పని చేయటానికి నీకు యిష్టం లేకపోతే ప్రక్కనే ఉన్న ఆ చిన్న బాటిల్ తీసుకో.... నీ జీవితం నీ చేతుల్లో ఉంది...."

"నో....ఇది అన్యాయం.... నాకు ఏదీ వద్దు...." అన్నాడు వెంటనే.

"నువ్వు వద్దు అంటే మేము వెళ్ళిపోతాం అనుకుంటున్నావా....లేదు,

మొదట నీ భార్యను పిలిచి మావాళ్ళు నీ కళ్ళముందే 'రేప్' చేస్తారు. ఆ తరువాత నువ్వు ఈ విషం త్రాగేలా చేస్తాం, - ఎందుకు

లేనిపోనివి. నీకు నీ ప్రాణం, నీ భార్య మానం ముఖ్యమో లేక ఎవరో అనామకుడి ప్రాణం ముఖ్యమో నిర్ణయించుకో" చౌదరి తూచితూచి ఎంతో నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. ఆ గొంతు చాలా కఠినంగా ఉంది.

మోహన్ కుమార్ ఓ నిమిషం పాటు ఆలోచించి వణుకుతున్న చేతులతో డబ్బుకట్ట అందుకున్నాడు.

చౌదరి దర్పంగా నవ్వుకున్నాడు.

'గుడ్. తెలివైన వాడివి, జీవితంలో పైకొస్తావు....' అని చౌదరి అనేటప్పుడు, మోహన్ కుమార్ భార్య కాఫీ తెచ్చింది ట్రేలో.

ట్రేలోని కాఫీ ముందుగా చౌదరి అందుకొని, అది మోహన్‌కుమార్‌కు ఇచ్చాడు.

చౌదరి కాఫీ సిప్‌చేస్తూ ''కాఫీ చక్కగా కలిపావమ్మ" అన్నాడు ప్రశంసగా.

ఆ ప్రశంసకు ఆనందంతో వరద గోదారిలా పొంగిపోయింది మోహన్ కుమార్ భార్య.

చౌదరి కాఫీ త్రాగటం పూర్తిచేసి మోహన్‌ని ఉద్దేశించి, "పని జాగ్రత్తగా కానీ, నేను మరలా వచ్చి కలుస్తాను...." అని; మోహన్ కుమార్ భార్యవైపుచూస్తూ పెద్దమనిషి తరహాలో ''వస్తానమ్మ చిన్నారి..' అంటూ మరో మాటకు అవకాశం ఇవ్వకుండా తన అనుచరులతో బయటకు నడిచాడు.

చౌదరి బయటకువెళ్తూ మాట్లాడిన చివరిమాట "చిన్నారి''—

మోహన్‌కుమార్ ఒక్కడే తన భార్యను ఇంటిలో పిలుచుకొనే పేరు అది. ఆ పేరు చౌదరికి తెలిసిందటే- ఇంటిలో వాళ్ళ నిక్‌నేమ్స్‌తో సహా తెలుసుకోగలిగాడు అంటే- ఆ వ్యక్తి నెట్‌వర్క్ ఎంత పెద్దదో అంచనా వేస్తున్నాడు మోహన్‌కుమార్.

మరో నిమిషంలో కార్ స్టార్ట్ అయి వెళ్ళిపోయిన శబ్దం....

మోహన్‌కుమార్‌కు ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్లుగా అనిపిస్తున్నది ఇది అంతా....

"ఎవరండి వాళ్ళు....," అని భార్య అడిగిన ప్రశ్నతో స్పృహలోకి వచ్చాడు,

"ఎవరండి వాళ్ళు - చాలా మంచివాళ్ళలా ఉన్నారు! నేను చేసిన కాఫీ కూడా మెచ్చుకున్నారు...." అంది సంబరంగా....

భార్యకు ఏం చెప్పాలో అర్థంకావటం లేదు—

ఏది చెప్పినా ఆరా తీస్తుంది. అందువల్ల అందరు మగవాళ్ళలాగే మోహన్‌కుమార్ ఓ అందమైన అబద్ధం ఆడాడు,

"ఆయన మా సీనియర్ ఫ్రెండ్ .. ఆఫీస్ పనిమీద వచ్చాడు," అని దాటేసాడు.

ఆ క్షణంలో మోహనకుమార్ నిజం చెప్పి ఉంటే ఒక వ్యక్తి జీవితం నిలిచేది.

వీధి తలుపు వేసివచ్చి, మంచం మీద వాలాడు మోహన్. నిద్ర పట్టడంలేదు. చౌదరి మాట్లాడిన మాటలే చెవుల్లో వినిపిస్తున్నాయి. తనలో తనే మధన పడుతున్నాడు.

చౌదరి చెప్పిన పని చేయకపోతే తను భూమిమీద ఉండటం అసంభవం. ఆ ఆలోచన రాగానే మోహన్ శరీరమంతా జలదరించింది.

నిద్ర రావటం లేదు; మనసులో భయం ఉండే నిద్రరాదు. ఏ అర్ధరాత్రికో నిద్ర ఒడిలోకి చేరాడు.

*　　　*　　　*

హైదరాబాద్ మహానగరంలో ఓ చిన్న వీధి.

అన్ని ప్రాంతాలలో తెల్లవారినట్లే ఆ వీధిలో తెల్లవారుతున్నది.

సోమవారం.

సమయం ఉదయం ఆరు గంటలు దాటింది.

ఇంటర్వ్యూలకు వెళ్ళి వచ్చే నిరుద్యోగులు, నిరుద్యోగినులు ఈ వీధిలో ఓ రెండు డజన్ల మంది ఉంటారు. ఆఫీసులలో ఉద్యోగం వెలగ బెట్టేవారు ఆడ, మగ కలిపి ఓ డజన్ మంది ఉంటారు. వీళ్ళుకాక చదువు డొనేషన్‌లతో కొనుక్కొనేవారు (విద్యార్థులు)....వీధి అన్నాక అన్ని రకాల మనుషులు, అన్ని వయసులవాళ్ళుంటారు. ఆ వీధిలో ఏ సంబరం లేకపోయినా, కాస్త సందడిగానే ఉంది వీధి.

ఓ ఇంటి వీధి గుమ్మం దగ్గర పాలవాడు ఇంటిలోకి చూస్తూ "బామ్మా, పాలూ .... బామ్మా, పాలు...." అని గట్టిగా పిలుస్తున్నాడు.

ఆ ఇంటిలో బెడ్‌రూమ్‌లో బుజ్జిబాబు మగత నిద్రావస్థలో కళ్ళు మూసుకొని, క్రింది నుంచి పైదాక దుప్పటి కప్పుకొని ఏదో ఆలోచిస్తు న్నాడు

పాలవాడి గోలతో బుజ్జిబాబు ఆలోచనలకు గండి పండింది. ముసుగు తొలగించకుండావే "వసే బామ్మ ... వసే బామ్మ .... ఎక్కడ ఉన్నావే? ఆ పాలవాడు ఒకటే నసపెట్టేస్తున్నాడు. భాషను ఖూని చేసి పారేస్తున్నాడు. పాలు కాదు, పాలూ నట .... పాలూ .... దిక్కుమాలిన తెలివితేటలు వాడును'' అని విసుక్కొని-మరింత ముడుక్కోని, మోకాళ్ళు డొక్కలోకి తెచ్చుకొని ముసుగు కప్పుకున్నాడు.

బామ్మ పాలు తీసుకున్నట్లుంది - పాలవాడి పాట ఆగింది.

ప్రక్కింటిలో వేంకటేశ్వర సుప్రభాతం వినవస్తున్నది. వంట గదిలో అంట్లు కడుగుతున్న చప్పుడు, కొళాయిలో నీళ్ళు లావుధారగా వస్తున్న శబ్దం స్పష్టంగా బుజ్జిబాబు చెవులదాక వినిపిస్తూనే ఉంది.

బుజ్జిబాబుకు చిరాకుగా ఉంది.

ప్రక్కింటిలో రేడియోలో వస్తున్న వేంకటేశ్వర సుప్రభాతం అయిపోయింది.

పంపులో నీళ్ళు లావుధార నుంచి సన్నధారలోకి మారిన చప్పుడు స్పష్టంగా వినిపిస్తున్నది. కాని, బుజ్జిబాబుకు లేవటానికి మనస్కరించటం లేదు.

బుజ్జిబాబుకు రోజూ సరిగా ఆరుగంటలకు ముందే ఒక మంచి కల పడుతుంది. ఆ కల పడకపోతే ఆ రోజంతా బుజ్జిబాబు చాలా ముభావంగా ఏదో పోగొట్టుకున్నవాడిలా ఉంటాడు. ఆ విషయం బుజ్జిబాబుకు, వాళ్ళ బామ్మకే కాదు, ఆ వీధిలోని వాళ్ళందరికి తెలుసు.

ఇంతకీ ఆ కల ఏమిటంటే—

"అప్పుడు బుజ్జిబాబుకు పదహారు వసంతాలు పూర్తికావస్తుంటాయి; తణుకులో పదవ తరగతి చదువుతుండేవాడు. సుబ్బలక్ష్మి అనే పేరు గల అమ్మాయి బుజ్జిబాబు క్లాస్‌మేట్."

సరిగ్గా ఇక్కడ ప్రారంభమవుతుంది బుజ్జిబాబు కల. బుజ్జిబాబుకు సుబ్బలక్ష్మికి పల్లమాలిన చనువు, స్నేహం, అభిమానం. ఇద్దరిది ఒకే మాట, ఒకేబాట. ఇంతవరకు బాగానే ఉంది.

ఆ అతి చనువు వల్ల బుజ్జిబాబు సుబ్బలక్ష్మి ఎంచక్కా ఎన్నో మాటలు మాట్లాడేసుకున్నారు. తెలుగు బాషలో పబ్లిగ్గా మాట్లాడుకొనే మాటలన్ని అయిపోయాయి.

ఇక బుజ్జిబాబు, సుబ్బలక్ష్మి ఏకాంతం కోరుకునే స్నేహం వరకు వెళ్ళిపోయారు. ఏక్ దూజేకేలియే అని సీతాకోక చిలుకల్లా ఊరికి దూరంగా ఏకాంతంగా కూర్చొని మాట్లాడుకుంటున్నారు.

బుజ్జిబాబు తన బుల్లినోటితో "నేను టెన్త్‌పాస్ అయితే నువ్వు నాకు ఏం ఇస్తావు", అన్నాడు అతి గారాబం చేస్తూ.

ఆ మాట సుబ్బలక్ష్మికి ఎలా వినిపించిందో కానీ, - సుబ్బలక్ష్మి సంతోషం, సిగ్గు, ఆనందం అన్ని ఒకేసారి పడిపోయి, వెంటనే ఒక నిర్ణయానికి వచ్చినదానిలా పౌరాణిక సిన్మాలలోని దేవతలా పోజ్ పెట్టి "నీకు ఏం కావాలో అది ఇస్తాను పో...." అని చెప్పేసింది.

బుజ్జిబాబు కలలోని రెండవభాగం ప్రారంభం.

ఆ రోజు టెన్త్ రిజల్ట్ పేపర్‌లో ప్రకటించారు.

బుజ్జిబాబు టెన్త్ సెకెండ్ క్లాస్‌లో పాస్ అవుతాడు. -అక్కడ సుబ్బలక్ష్మి కూడా వాళ్ళ ఇంటిలో రిజల్ట్ లిస్ట్ చూసుకుంటుంది. సుబ్బలక్ష్మి బుజ్జిబాబుతో ఈ విషయం చెప్పటం కోసం ఒకటే పరుగు - బుజ్జిబాబు కూడా సుబ్బలక్ష్మితో ఈ శుభవార్త చెప్పటం కోసం పరుగు లంకించుకున్నాడు.

బుజ్జిబాబు, సుబ్బలక్ష్మి ఒక వీథి మలుపు దగ్గర ఒకరికొకరు ఎదురయ్యారు. -ఇద్దరు ఒక క్షణం ఆగిపోయారు. ఇమోషనల్‌గా ఇద్దరి చూపులు కలుసుకున్నాయి.

విపరీతమైన ఆనందం ఇద్దరి ముఖాలలో కన్పిచేస్తున్నది. ఇప్పుడు ఇద్దరు కలిసి పరుగు ప్రారంభించారు. వీధిలోని కొంత మంది చూసి ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. మరికొందరు ఇదేం విడ్డూరం అని దీర్ఘాలు తీస్తూ బుగ్గలొత్తుకున్నారు.

బుజ్జిబాబు సుబ్బలక్ష్మి ఇద్దరు పరుగెత్తుకుంటూ వచ్చి ఒక ఏకాంత ప్రదేశంలోకి చేరారు.

వారి ఆనందానికి అవధులు లేవు. సుబ్బలక్ష్మి ఆనందంతో ఒకటే నవ్వుతున్నది. బుజ్జిబాబు పళ్ళు ఇకిలిస్తున్నాడు. కాని, శబ్దం రావటం లేదు. కానీ భలే సంతోషంగా ఉన్నాడు.

ఇద్దరు కొండరాళ్ల మీద కూర్చున్నారు.

ఓ పది నిమిషాల తరువాత బుజ్జిబాబు ధీమాగా కాలర్ ఎగరేస్తూ ''నేను పాస్ అయితే ఏం కావాలంటే అది ఇస్తానన్నావుగా....ఇప్పుడు నేను అడిగేది ఇవ్వవూ? డ్రమెటిక్‌గా మలయాళం సినిమాలోని హీరో టైప్‌లో అన్నాడు.

''ఏం కావాలమ్మ?'' అంది సుబ్బలక్ష్మి గోముగా....

బుజ్జిబాబు ఏం అడగాలో ముందే ఆలోచించుకొని పెట్టుకున్నట్లుంది - వెంటనే రపీమని 'ఒక తియ్యటి ముద్దు' అన్నాడు.

సుబ్బలక్ష్మి కెంపులు ఎరుపెక్కాయి.

నవ యవ్వనంలో అన్ని కొత్తగానే ఉంటాయి, అన్నింటిని టెస్ట్ చేసి టేస్ట్ చూడాలి అనుకునే వయసది....

సుబ్బలక్ష్మి ఓ నిమిషం ఆలోచించి పారేసి, ఓ నిర్ణయానికి వచ్చింది. ఒకసారి ఇటు అటూ చూసింది. కనుచూపు మేరలో ఎవరూ కనిపించటం వేదు.

సుబ్బలక్ష్మి అమాయకంగా "'మరి నువ్వు కళ్లమూసుకోవాలి'' అంది సిగ్గుపడుతూ....

బుజ్జిబాబు మారు మాట్లాడకుండా గట్టిగా కళ్ళుమూసుకున్నాడు. సుబ్బలక్ష్మి భయంభయంగా ఎవరుచూస్తారో అని, ఎలా ఉంటుందో అని అనుకుంటూ బుజ్జిబాబు దగ్గరకు వచ్చి.... కుడి చెంపమీద తన మలినం కాని, లిప్‌స్టిక్ లేని స్వచ్ఛమైన పెదవులని అంటించింది.

అప్పుడు చిన్నచప్పుడు.... "ప్చ్‌చ్....,

బుజ్జిబాబు మనసు ఆనందంతో కేరింతలు కొడుతుంది. అక్కడితో కల ముగుస్తుంది.

నిజానికి అయితే దీని తరువాతే అసలైన తతంగం జరుగుతుంది.

రోజు బుజ్జిబాబుకు ఈ కల పడవలసిందే.... ఈ కల రాకపోతే బుజ్జిబాబుకు చిర్రెత్తుకొస్తుంది. ఈ కలే బుజ్జిబాబు సర్వస్వం.

కానీ ఈ రోజు ఉదయం ఎనిమిదిగంటలు అవుతున్నా కల కనుల లోకి రాలేదు.

వీధిలో కాస్త సందడి ఎక్కువ అయింది. వీధిలో ఊడుస్తున్న చప్పుడు, నీళ్ళు చల్లుతున్న శబ్దం, వీధిలో మాట్లాడుకొనే మాటలు బుజ్జి బాబు కళ్ళుమూసుకున్నా బాగానే వినిపిస్తూనే ఉన్నాయి.

బుజ్జిబాబుకు వీధిలో వారందరి మీద యమకోపంగా ఉంది. కానీ, అశక్తుడు. ఆ కల పడకపోతే అతనికి శక్తి రాదు.

ఓ అయిదు నిమిషాల తర్వాత ఒక నిర్ణయానికి వచ్చాడు బుజ్జి బాబు. ఇక లాభంలేదని లేచి కూర్చొని గడియారం చూసుకున్నాడు. ఎనిమిది దాటింది.

"ఓర్నాయనో.... అప్పుడే ఎనిమిది అయింది" అంటు ఒక్క ఉదటున లేచి బాత్‌రూమ్‌లోనికి వెళ్ళాడు.

పది నిమిషాలలో బాత్‌రూమ్‌నుండి బయటకు వచ్చాడు. స్నానం చేసిన బుజ్జిబాబులో ఉత్సాహం రాలేదు. చాలా నిరుత్సాహంగా ఉన్నాడు.

బట్టలు ఐరన్ చేసుకోటానికి కూర్చున్నాడు.

బుజ్జిబాబు నిరుత్సాహాన్ని గుర్తించింది బామ్మ, వచ్చి బుజ్జిబాబుకు కాఫీ అందించింది.

చాలా నిరుత్సాహంగా, యాంత్రికంగా కాఫీ అందుకున్నాడు.

"ఏంట్రా అయ్యా బుజ్జి, ఈ రోజు కల రాలేదా?" అని అడిగింది బామ్మ అనునయంగా.

బుజ్జిబాబు బాధగా ఏడుపు మొహం పెట్టి "రాలేదు బామ్మ"

"పోనీలేరా అయ్యా రేపు రెండుసార్లు కల కందువుగాని...." అని అన్నాడు.

చెప్పి పెరట్లో కెళ్ళింది చెట్లకు నీళ్ళు పెట్టడం కోసం.

బామ్మ పెరట్లో చెట్లకు నీళ్ళు పెట్టడంలో నిమగ్నమై పోయింది. ఐరన్ చేస్తున్న బుజ్జిబాబు గట్టిగా ఓ క్షుద్ర అరపు అరచి నేలమీద అడ్డం పడ్డాడు.

ఆ అరపు విని బామ్మ పెరట్లో నుంచి పరిగెత్తుకుంటూ వచ్చింది. "ఓల్లమో....ఎంతపని అయింది....ఓ శాస్త్రిగారు,ఒసే లక్ష్మి,ఒసే ఫాతిమా, ఒరే ఇస్మాయిల్! రాండిరా, బుజ్జిగాడు పడిపోయాడు" అని అరిచింది.

ప్రక్కింటి లక్ష్మి పిల్లాడి పని వదిలేసి పిల్లాడ్ని చంక నెత్తుకొని బుజ్జిబాబు ఇంటివైపు పరిగెత్తింది.

ఎదురింటి ఇస్మాయిల్ వచ్చి బుజ్జిబాబుని లేపి మంచం మీద కూర్చోబెట్టాడు.

ఎదురింటి వాళ్ళు, ప్రక్కింటి వాళ్ళు, వెనుకింటివాళ్ళు అందరూ వచ్చి బుజ్జిబాబు మంచం చుట్టూరా గుమికూడారు.

ఓ రెండు నిమిషాల తరువాత బుజ్జిబాబు తేరుకొని "నేనెక్కడ ఉన్నాను....తణుకులోనా....?" అన్నాడు.

బామ్మ బరస్ట్ అయి ఏడుపుకు లంకించుకోబోయింది బుజ్జిబాబు వాలకం చూసి.

"బామ్మా! నువ్వు ఊరుకో- ఏం కాలేదు, కరెంట్ షాక్ అంతే మరేం పర్వాలేదు నేనున్నాను కదా!" అన్నాడు స్పెషలిస్ట్ డాక్టర్‌లా ఎదురింటి ఇస్మాయిల్.

బామ్మ కాస్త శాంతించింది ఇస్మాయిల్ మాటలతో....,

"ఒరే బుజ్జిగా, ఏమయిందిరా నీకు...." అని, అంతలోనే మరలా ఇస్మాయిల్ వైపు తిరిగి ''అయ్యా ఇస్మాయిల్, ఉదయం నుండి ఇలాగే పరధ్యానంగా ఉన్నాడు. ఆ మాయదారి కరెంట్ చూసుకొని ఉన్నది. అది కుట్టినట్లున్నది" అన్నది బామ్మ నొచ్చుకుంటూ.

అక్కడే ఉన్న పెళ్ళికాని ఒకర్రిద్దరు బామ్మ మాటలకు ''కిసిక్కిన'' నవ్వుకున్నారు. మరో ఇద్దరు అమ్మాయిలు బలవంతంగా నవ్వును ఆపుకున్నారు. మిగతా వారు మాత్రం చాలా సీరియస్‌గా ఉన్నారు.

ఎవరో వెళ్ళి ''బుజ్జిబాబుకు కరెంట్ షాక్ కొట్టింది" అనే వార్తను వీధిన పడేసారు.

వాళ్ళకు ఆ క్షణంలో తెలియదు. ఆ వార్త ఎంతగా విజృంభిస్తుందో...., ఈ వార్త ఆ వీధిలోనే నాలుగిళ్ళు దాటేసరికి, "బుజ్జిబాబుకి కరెంట్‌షాక్ తగిలి చాలా సీరియస్‌గా ఉంటే హాస్పటల్‌లో చేర్చారు"గా మారింది.

ఇదే వార్త వీధిన పడి గునగున మని ఆ వీధి మలుపు తిరిగేసరికి పూర్తిగా మారిపోయింది. ఇప్పుడు ఆ వార్త రూపం "బుజ్జిబాబుకి కరెంట్ షాక్ తగిలి కాలు చేయి పడిపోయింది. చాలా సీరియస్‌గా ఉంది. చెప్పటం కష్టం...."గా మారింది.

ఓ మధ్య తరగతి నడివయసు వ్యక్తికి తెలిసింది ఈ వార్త. "పాపం, పెళ్ళి అయినా కాలేదు కుర్రాడికి'' అని ఓ నిమిషం పాటు వాపోయాడు.

ఈ విషయం ఊరికే ఎందుకు వదలాలి అని ప్రక్కింటి పేరయ్యశాస్త్రిని పిలిచి "మన వీధిలో బుజ్జిబాబు అనే కుర్రాడు లేడూ, అతనికి

కరెంట్ షాక్ కొట్టిందట; చెప్పటం కష్టం అంటున్నారట డాక్టర్లు...." అని చెప్పి మరో మాటకు అస్కారం ఇవ్వకుండ తన బాధ్యత తీరి పోయింది అనుకుంటూ వడివడిగా ఆఫీస్‌కు వెళ్ళిపోయాడు.

పేరయ్య శాస్త్రికి ఈ వార్త వెంటనే ఎవరితో చెప్పాలో తోచక క్రింద పంచ పైకి లాక్కుంటూ "శివ....శివ...." అనుకుంటూ "వసే పంకజం, ఏం చేస్తున్నావే...." అని ఇంటిలోకి వెళ్ళాడు.

ఎలాగైనాసరే ఆ వార్త ఎవరితో ఒకరితో చెప్పాలి. చెప్పకపోతే అతనికి ముళ్ళమీద నిలబడినట్లు ఉంటుంది. వంట గదిలోనుండి గరిట తీసుకొని వచ్చింది పంకజం. "ఏమిటండీ, చెవి కోసిన మేకలాగ ఆ కేకలు...." అంది.

ఇంకొక సమయంలో అయితే పేరయ్యగారికి భార్య వాలకం మీద కోపం వచ్చేదే కానీ, ఇప్పుడు బుజ్జిబాబుకు కరెంట్‌షాక్ కొట్టిన వార్త ఎవరితోనైన చెప్పకపోతే ఆయన మనసులో పెద్దతుఫాన్ వచ్చేలా ఉంది. అందువలన భార్యమీద కోపాన్ని ప్రక్కకునెట్టి, బుజ్జిబాబుకు జరిగిన ఘోరాన్ని తను చూసినట్లే వివరించి చెప్పాడు.

కాని బుజ్జిబాబు ఇంటి దగ్గర పరిస్థితి మరో రకంగా ఉంది. బుజ్జి బాబు ఆఫీసుకు వెళ్ళటానికి తయారై లంచ్‌బాక్స్ చేతపట్టుకొని బయలు దేరాడు.

వీధి మలుపు తిరిగినాడు, సరిగ్గా అప్పుడే పేరయ్య శాస్త్రి ఇంటి నుండి బయటకు వచ్చాడు.

పేరయ్యగారు బుజ్జిబాబును చూసి విస్తుబోతూ "ఏంవోయ్ బుజ్జి బాబూ! నీకు కరెంట్‌షాక్ తగిలిందనీ, చాలా సీరియసుగా ఉంటే అదేదో హాస్పటల్‌లో చేర్చారని చెప్పారు, ఎవరో...." అన్నాడు.

బుజ్జిబాబుకు ఏం చెప్పాలో ఓ నిమిషంపాటు అర్థం కాలేదు.-నో
మాట రావటం లేదు. అలా అబద్ధాలు చెప్పినవాళ్ళను కుడి ఎడమ తా
తమ్యం లేకుండా ధబిడ్ ధబిడ్‌మని వాయించాలి అనిపించింది

కోపాన్ని బలవంతాన కంట్రోల్ చేసుకొని పేరయ్యగారితో
"అవును పేరయ్యగారు.... నాకు సీరియస్‌గా ఉంది హాస్పటల్‌లో చేర్చి
పావుగంటకే నా ఊపిరి అనంత వాయువులలోకి కలిసి పోయింది. ఇప్పుడు
మాట్లాడుతున్నది నేను కాదు, బుజ్జిబాబు ఆత్మస్వరూపం— మీరు చాలా
ధన్యులు పేరయ్యగారు. నా ఆత్మస్వరూపాన్ని వీక్షించగలుగుతున్నారు
అన్నాడు బుజ్జిబాబు ఓర్పుగా....

ఆ మాటలు వింటూనే పేరయ్యశాస్త్రి "శ్రీ ఆంజనేయం ప్రస
న్నాంజనేయం...." అని గట్టిగా చదువుతూ, పడుతూ లేస్తూ ఇంటిలోకి
పరిగెత్తాడు.

బుజ్జిబాబు చిద్విలాసంగా నవ్వుకొని సంజీవరెడ్డినగర్ బస్‌స్టాప్
వైపు నడుస్తున్నాడు - ఆ క్షణంలో అతనికి తెలియదు తన జీవితం
ఆ రోజు నుంచి ఓ మలుపు తిరుగుతుందని.

* * *

దక్షిణ భారతదేశంలో పేరుపడ్డ హాస్పటల్‌లలో ఒకటైన డాక్టర్
అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్‌లోని ఆపరేషన్ థియేటర్‌లో ఓపెన్
హార్ట్ సర్జరీకి అన్ని పరికరాలు సిద్ధం చేస్తున్నారు సిస్టర్స్.

పేషంట్ బంధువులు పేషంట్‌కి ధైర్యం చెప్పి ఆపరేషన్ థియే
టర్‌లోకి పంపుతున్నారు. పేషంట్‌ని ఆపరేషన్ థియేటర్ లోకి తీసుకొని
వెళ్ళిన తరువాత రోగికి బంధువులుగా నటిస్తున్న నరేంద్ర, మస్తాన్,
తమ్ముడిగా నటిస్తున్న లూథర్ వెయిటింగ్‌రూమ్‌లోకి వెళ్ళికూర్చున్నారు.

పేషంట్ అడ్మిట్ అయిన వార్డులో ప్రాణాలు కాపాడే రక్తం ఓ
అమాయకమైన ప్రాణి ప్రాణం తీయటానికి ఎదురుచూస్తూ ఉన్నది.

డాక్టర్ విశ్వామిత్ర, డాక్టర్ సిద్ధార్థ, డాక్టర్ ప్రశాంత్ కుమార్‌ల ఆధ్వర్యంలో దాదాపు రెండు గంటల పాటు జరిగింది ఓపన్ హార్ట్ ఆపరేషన్.

ఆపరేషన్ సక్సస్ అయింది.

రోగికి తెచ్చి బెడ్ మీద పడుకోబెట్టారు.

సిస్టర్స్ తెల్లటి గౌన్‌లలో తూనీగల్లా తిరుగుతున్నారు పేషంట్ వార్డ్‌లోకి ఫార్మసీ వార్డ్‌లోకి.

పేషంట్‌కి రెండు బాటిల్స్ బ్లడ్ ఎక్కించారు.

సమయం సాయంత్రం నాలుగు గంటలు కావస్తున్నది.

ఆ హాస్పిటల్‌లో ఈవినింగ్ ఫోర్ టు సిక్స్ విజిటర్స్ టైమ్.

ఓ సిస్టర్ వచ్చి రొటీన్‌గా పేషంట్ దగ్గర ఉన్న మూడవ బాటిల్ రక్తం అరేంజ్ చేసి వెళ్ళింది. కాని, ఆ సిస్టర్‌కు ఆ క్షణంలో తెలియదు- ఆ బాటిల్‌లో వేరే గ్రూప్ బ్లడ్ ఉందని.

విజిటర్స్ టైమ్‌లో సిస్టర్స్‌కి కాస్త రిలీఫ్ ఉంటుంది. ఆ సమయంలో హార్ట్ ఆపరేషన్ రోగిలో విషంలాంటి వేరే గ్రూప్ బ్లడ్ ఫ్లో అవ్వటం ప్రారంభమయింది. పేషంట్‌కు ఇంకా స్పృహరాలేదు. రోగి శరీరంలోకి ప్రవేశించిన వేరే గ్రూప్ రక్తం గుండెకు చేరింది. ఆ ప్రక్రియ జరిగిన మరుక్షణం రోగి ఊపిరి అనంత విశ్వంలోకి వెళ్ళిపోయింది.

ప్రాణం పోయిన మరుక్షణం బ్లడ్ ఫ్లో అవ్వటం ఆగిపోయింది.

ఓ ఐదు నిమిషాలు గడచిపోయాయి.

ఒక సిస్టర్ వచ్చి చూసింది. బ్లడ్ ఫ్లో అవ్వటం లేదు. రోగి చేయి పట్టుకొని నీడిల్ సరిచేయబోయింది. అంతలో రోగి చర్మం చల్లగా తగిలింది. ఏదో అనుమానం వచ్చి వెంటనే పరిగెత్తుకుంటూ వెళ్ళి డ్యూటీ ఇన్‌చార్జ్ డాక్టర్ ప్రశాంత్ కుమార్‌కు చెప్పింది.

"ఇంపాజిబుల్! ఆపరేషన్ సక్సెస్ అయింది. మరి ఎందుకు ఇలా జరిగినట్లు?" అని పరిశీలనగా చూస్తున్నాడు పేషంట్ వైపు డాక్టర్ ప్రశాంత్.

మరుక్షణంలో డాక్టర్ విశ్వామిత్ర, డాక్టర్ సిద్ధార్థ వచ్చారు.

ముందుగా వేసుకున్న ప్లాన్ ప్రకారం నరేంద్ర, మస్తాన్, లూథర్ క్యారిడార్‌లో కూర్చొని ఉన్నారు.

డాక్టర్ సిద్ధార్థ వెళ్ళి ఆ ముగ్గురితో "సారీ....అతను ఇక లేడు.... ఆపరేషన్ సక్సెస్ అయిన తరువాత ఇలా చనిపోవటం ఇదే ప్రథమం...." అంటూ నొచ్చుకున్నాడు.

రోగి తమ్ముడిగా యాక్ట్ చేస్తున్న లూథర్ బోరున ఏడుస్తూ పేషంట్ బెడ్ వైపు పరిగెత్తాడు.

ఫ్రెండ్‌గా నటిస్తున్న మస్తాన్ నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. మరో ఫ్రెండ్‌గా అభియించటంలో నరేంద్ర మునిగిపోయాడు. కోపంతో ఊగిపోతున్నాడు నరేంద్ర. ఒక ఉదటున వెళ్ళి డాక్టర్ సిద్ధార్థ కాలర్ పట్టుకొని, "రేయి, నా ఫ్రెండ్‌ని ఏం చేశారు, చెప్పండి....నేను మామూలు వాడిని కాదురా, మిమ్మల్ని కోర్టుకు ఈడుస్తాను...." అంటూ పేషంట్ బెడ్ వైపుకు వెళ్ళాడు.

మరో పదినిమిషాలలో వేరేగ్రూప్ బ్లడ్ ఎక్కించటంవల్ల పేషంట్ చనిపోయాడని తెలిసింది. ఇది అంతా పొరపాటు వలన జరిగిందని చింతిస్తున్నారే కాని, దాని వెనుక ఒక మాస్టర్ ప్లాన్ ఉందని ఎవరూ ఊహించలేకపోయారు.

నరేంద్ర, మస్తాన్, లూథర్ వినియోగదారుల పరిరక్షణ చట్టం అనుసరించి రాష్ట్ర వినియోగదారుల ఫోరమ్‌లో దావా వేశారు.

ఆ తరువాత కొద్దిరోజులకే కోర్ట్ (ఫోరమ్) డాక్టర్ అభిమన్యు మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌దే పొరపాటని, డాక్టర్ల నిర్లక్ష్యం వలన ఒక నిండుప్రాణం బలి అయినందుకు, ఆ వ్యక్తి సంబంధీతులకు ఐదు లక్షలు చెల్లించాలని ఆదేశించింది.

* * *

పాఠకుల అనుకూలత కోసం - వినియోగదారుల ఫోరమ్‌లో వైద్య సేవలు గురించి రెండు మాటల్లో ముచ్చటిస్తాను.

1986 లో వినియోగదారుల హక్కుల పరిరక్షణ చట్టం (కోప్రా) క్రింద వైద్య సర్వీసులు కూడా జవాబుదారీ చెప్పవలసి ఉంటుంది. వినియోగదారులకు అందించే ఏ విధమైన సేవలనైనా సరే సర్వీసులుగా వర్గీకరించవచ్చు; ప్రైవేట్ డాక్టర్స్ ఫీజ్ వసూలు చేసి (తీసుకొని) వైద్యం చేస్తారు. కనుక, వైద్య సేవలు కూడా వినియోగదారుల హక్కుల పరిరక్షణ చట్టంలో చేర్చబడ్డాయి. కానీ, ఉచితంగా వైద్య సేవలు అందించే సంస్థలు ఉదా: ప్రభుత్వ డాక్టర్లు ఈ చట్టం క్రిందికి రారు.

మనదేశంలో వైద్య సంబంధమైన సమస్యలను పరిష్కరించేటందుకు జిల్లాస్థాయి ఫోరమ్స్, రాష్ట్రస్థాయి వినియోగదారుల ఫోరమ్స్, జాతీయ స్థాయి వినియోగదారుల ఫోరమ్స్ ఉన్నాయి.

జిల్లాస్థాయి ఫోరమ్‌లో లక్ష రూపాయల వరకు పరిహారం కోరవచ్చు. ఈ స్థాయి ఫోరమ్‌లో జిల్లా రిటైర్డ్ జడ్జ్ అధ్యక్షులుగా ఉండగా; మరో ఇద్దరు ప్రముఖ వ్యక్తులు సభ్యులుగా ఉంటారు. వారు లోకజ్ఞానం తెలిసినవారు, పరిపాలన అనుభవం, న్యాయవాద వృత్తిలో అనుభవం ఉన్నవారై ఉంటారు. ఆ ఇద్దరు సభ్యులలో ఒకరు తప్పని సరిగా స్త్రీ అభ్యర్థి ఉండాలి ఆ త్రిసభ్య సభ జిల్లా స్థాయిలో వచ్చే వివాదాలను పరిష్కరిస్తుంది.

రాష్ట్ర వినియోగదారుల ఫోరమ్‌లో హైకోర్టు రిటైర్డ్ జడ్జ్ అధ్యక్షునిగా వ్యవహరిస్తారు. అధ్యక్షుడు కాక మరో ఇద్దరు గౌరవ సభ్యులు ఉంటారు. ఈ ఇద్దరి సభ్యులలో ఒకరు తప్పనిసరిగా స్త్రీ అయి ఉండాలి. రాష్ట్రస్థాయి ఫోరమ్ లక్షరూపాయలకంటే తక్కువ విలువగల కేసులు పరిశీలించదు. అలాగే పదిలక్షల కంటే ఎక్కువ మొత్తం కోరే కేసులకు వాదించే అధికారం లేదు. పది లక్షల రూపాయల విలువకంటే ఎక్కువ నష్ట పరిహారాలను అత్యున్నత జాతీయ వినియోగదారుల ఫోరమ్ పరిశీలిస్తుంది. జాతీయ స్థాయి ఫోరమ్‌లో అధ్యక్షునిగా సుప్రీంకోర్టు రిటైర్డ్ జడ్జ్ ఉంటారు. అధ్యక్షుడు కాక మరో నలుగురు గౌరవ సభ్యులు ఉంటారు. ఈ సభ్యులు మంచి అనుభవం కలిగిన వారు, సామర్థ్యం కలిగిన సునిశిత పరిజ్ఞానం కలిగినవారై ఉంటారు. వీళ్ళు సాధారణంగా ఆర్థిక రంగానికి సంబంధించిన పరిజ్ఞానం కలవారు, చట్ట పరిజ్ఞానం కలిగినవారు, పరిశ్రమలలో అనుభవం కలిగిన ప్రముఖులు, మరియు రాజనీతిలో అనుభవం కలిగినవారు ఉంటారు. ఈ నలుగురు గౌరవ సభ్యులలో ఒకరు తప్పనిసరిగా స్త్రీ అయి ఉండాలి.

వైద్య సంబంధ కేసుల పరిష్కారానికి వినియోగదారుల ఫోరమ్‌ల పద్ధతిని ప్రవేశపెట్టిన చాలా తక్కువ దేశాలలో మనదేశం కూడా ఒకటి. సింగపూర్‌లో కూడా ఈ రకమైన పద్ధతి అమలులో ఉంది కాని, కొన్ని మార్పులు ఉన్నాయి. సింగపూర్‌లో వైద్యానికి సంబంధించిన వినియోగదారుల సమస్యలు పరిశీలించి సింగపూర్ మెడికల్ అసోసియేషన్ నైతిక ప్రమాణాల కమిటీకి వాటిని నివేదిస్తోంది. సమస్యకు ఆ కమిటీలో సామరస్యపూర్వక పరిష్కారం లభించకపోతే కేసును మెడికల్ కౌన్సిల్‌కి నివేదిస్తారు కాని, మనదేశంలో వైద్యానికి సంబంధించిన ఎలాంటి కేస్ అయినా వైద్యపరిజ్ఞానం లేని జిల్లా ఫోరమ్, రాష్ట్రస్థాయి ఫోరమ్.... తీర్పులు ఇచ్చేస్తున్నాయి.

(వైద్య సమస్యలు తర్కించే సమయంలో ఫోరమ్‌లో ఒక వైద్య పరిజ్ఞానం కలిగిన సభ్యుడు ఉండటం ఎంతైనా అవసరం.)

అది పెద్ద హాలు.

వైద్య గోష్ఠులు, సమావేశాలు, సభలు జరపటం కోసమే డాక్టర్ అభిమన్యు ఎంతో కళాత్మకంగా నిర్మించారు.

"డాక్టర్ అభిమన్యు హాస్పటల్‌లోని డాక్టర్ల అశ్రద్ధవల్ల ఓ ఓపన్ హార్ట్ సర్జరీ పేషంట్ చనిపోయాడని వినియోగదారుల ఫోరమ్ పరిహారంగా ఐదు లక్షల రోగి తరపువారికి ఇవ్వాలని ఆదేశించింది" - ఆ విషయానికి సంబంధించే ఇప్పుడు పత్రికా విలేఖరుల సభ ఏర్పాటు అయింది. దేశంలోని ప్రముఖ పత్రికల జర్నలిస్ట్‌లంతా ఆ సభలో ఉన్నారు.

మరికొద్ది క్షణాలలో ప్రముఖ డాక్టర్, శాస్త్రవేత్త అయిన డాక్టర్ విశ్వామిత్ర మరియు ఆ వైద్య సంస్థ డైరెక్టర్ అయిన అభిమన్యు జర్నలిస్ట్‌లు అడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానంగా ఇస్తారని ఎంతో ఉత్సాహంగా ఉన్నారు జర్నలిస్ట్స్, జూనియర్ డాక్టర్స్.

సభలో దాదాపు రెండు వందల మంది ఉన్నారు.

సభలోని చాలా మంది డాక్టర్స్ విశ్వామిత్ర పేరు వినటమే కాని ఎప్పుడు చూడలేదు. చూలేకపోవటానికి కారణం డాక్టర్ విశ్వామిత్ర ఎప్పుడు తన ప్రయోగశాలలోనే ఎక్కువ సమయం గడుపుతుంటారు. భారతదేశం గర్వించదగ్గ అతికొద్ది మంది వైద్యులలో డాక్టర్ విశ్వామిత్ర ఒకరు. అదే సభలో ఆ వైద్య సంస్థ అధినేత అయిన డాక్టర్ అభిమన్యు కూడా వస్తారు అని జూనియర్ డాక్టర్స్ చాలా ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు.

సరిగ్గా ఉదయం పదిగంటలకు డాక్టర్ విశ్వామిత్ర, డాక్టర్ అభిమన్యు సభలోకి వచ్చారు.

డాక్టర్ విశ్వామిత్ర చాలా సింపుల్‌గా ఉన్నారు. ఆయన వయసు యాభై ఐదు ఉంటుంది. కాని, కళ్ళకు అద్దాలు లేవు. సూడో సైంటిస్ట్‌లకు ఉండే హంగులు అర్భాటాలు ఆయనకు ఏమీలేవు. ఎందుకంటే, ఆయన హైపోక్రాట్స్ సైంటిస్ట్ కాదు. అతను ఓ నిజమైన సైంటిస్ట్. వైద్యవిజ్ఞానంలో ఓ విజ్ఞాన గనిలాంటివారు.

ఆయన ఎర్రగా ఉన్నారు. మరీ ఎత్తు, మరీ పొట్టీ కాకుండా ఓ మోస్తరు ఎత్తు. ఆయన వినియోగదారుల ఫోరమ్‌లో ఓడిపోయానని ఏం బాధతో కృంగిపోలేదు. అంతమంది ఆహూతులు తనకోసం ఎదురు చూస్తున్నారని ఆనందంతో ఉప్పొంగటం లేదు. ఆయన ముఖంలో ఏ భావం లేదు. చాలా ప్రశాంతంగా ఉన్నారు.

డాక్టర్ విశ్వామిత్ర ప్రక్కనే సంస్థ అధినేత డాక్టర్ అభిమన్యు బాగా ఎత్తుగా ఉన్నాడు. విశాలమైన మనసుకు ప్రతీకగా బలిష్ఠమైన నిలువెత్తు విగ్రహం. ఎవరి చూపుల్ని అయినా తన వైపుకు తిప్పుకోగల విగ్రహం. వయసు మూడు పదులు ప్లస్ ఒకటి రెండు ఉండవచ్చు.

సభకు వచ్చిన వారందరివైపుచూస్తూ చిన్న నవ్వు నవ్వాడు. అందమైన అతని ముఖానికి మరింత అందాన్ని ఇస్తున్నది ఆ చిరునవ్వు. అన్నింటికి మించి అభిమన్యు మంచి మాటకారి. సహజంగా అందంగా ఉన్న వారికి మాట్లాడటానికి నోరు పెగలదు. కాని, అభిమన్యుకు చక్రటి రూపం, మరింత అందంగా శ్రావ్యంగా మాటలు అల్లి నదీప్రవాహంలా మాట్లాడటం అతని స్పెషాలిటీ. ఇది నిజంగా అరుదైన ప్రతిభ.

డాక్టర్ విశ్వామిత్ర, డాక్టర్ అభిమన్యు వెళ్ళి, వేదిక మీద ఉన్న కుర్చీలలో కూర్చున్నారు.

"మీరు ఎంతో ఆసక్తితో వచ్చినందుకు చాలా ఆనందంగా ఉంది, గుడ్‌మార్నింగ్ టు ఆల్ ఆఫ్ యూ! ఇక మీరు అడగదలుచుకున్న ప్రశ్నలు అడగండి...." అన్నారు విశ్వామిత్ర మామూలుగానే.

జర్నలిస్టులలో ఒక జర్నలిస్ట్ లేచి వినయంగా డాక్టర్ విశ్వామిత్ర, అభిమన్యులను మార్చి మార్చి చూస్తూ "సనాతనంగా మన భారత దేశంలో వైద్యానికి వైద్య వృత్తికి మిగతా ఏ వృత్తికీ లేని గౌరవం ఉంటూ ఉంది. మరి ఇలాంటి ఈ వృత్తిపై వినియోగదారుల బిల్లు ప్రవేశ పెట్టారు. ఇది ఎంతవరకు సమంజసం అనుకుంటున్నారు?" అని అడిగి కూర్చున్నాడు.

ప్రెస్ మీటింగ్ స్టార్ట్ అయింది.

ఆ సభలో చీమ కదిలినా శబ్దం అయ్యే విధంగా నిశ్శబ్దం చోటు చేసుకుంది.

ఒక క్షణం ఆగి....డాక్టర్ విశ్వామిత్ర చెప్పటం ప్రారంభించారు: "భారతదేశంలో ఉన్న పవిత్రమైన కొన్ని వృత్తులలో వైద్య వృత్తి ముఖ్యమైనది. మన దేశంలోని కొన్ని ప్రాంతాలలో వైద్యుని సాక్షాత్తు భగవత్ స్వరూపంగా భావిస్తారు. డాక్టర్ కావాలంటే కృషి, పట్టుదల ఉండాలి. కాని, ఒక మంచి డాక్టర్‌గా రాణించాలి అంటే ఓర్పు, నేర్పు, మంచితనం మరింత అవసరం. ఈ గుణాలు లేకపోతే ఓ డాక్టర్‌గా రాణించలేరనేది నూరుపైసల నిజం.

ఈ దేశం శుశ్రుతుడు, ధన్వంతరి, చరకుడు - ఇంకా అనేకమంది పుట్టిన పుణ్యభూమి. ఆనాడు దీక్షతో, పట్టుదలతో వైద్యం నేర్చుకోవటం కోసం ఎన్నో ఏళ్ళు గురువులకు సేవ చేసి వైద్య వృత్తిని దీక్షగా తీసుకునేవారు. అంతేకాక, సేవా భావంతో వైద్యం చేసేవారు. అందువల్లనే ఆ గౌరవం ఇప్పటికీ ఉంది ఈ దేశంలోని వైద్యులకు....

మరి ఇప్పుడు మెడిసిన్‌లో సీట్ పొందటం కోసం కొందరు రిజర్వేషన్‌లను, మరికొందరు డొనేషన్స్ అడ్డుపెట్టుకొని మెడిసిన్‌లో చేరి చిలుక పలుకులు పలుకుతూ పాఠాలను ముక్కున పెట్టుకొని మొక్కు

ఐడిగా పరీక్షలు పాసై డాక్టర్లు అవుతున్నారు. స్వయంకృషి, దీక్ష అనే పదాలకు అర్థాలు వెతుక్కొనే స్థితిలో ఉన్నారు.... కాదంటారా?.... ఇదేకాక, వైద్యకళాశాలల్లో విద్యాప్రమాణాలు, నైతిక ప్రమాణాలు రోజు రోజుకు ఎలా దిగిపోతున్నాయో తెలిసిందే....

మరి ఇలాంటి యువ డాక్టర్లు తమ వద్దకు వచ్చిన రోగులను ఏ రకమైన వైద్య సేవలను అందివ్వగలరో ఒకసారి ఊహించుకోవచ్చు.... అందువల్ల వైద్యవృత్తిపై ఓ పర్యవేక్షణ ఎంతైనా అవసరం - అందు కోసమే వైద్య సేవలను వినిమోగదారుల పరిరక్షణ చట్టంలోకి చేర్చింది భారత ప్రభుత్వం.

ఓ. కే...., యస్'' అన్నారు తరువాతి ప్రశ్న అడగమని.

వెంటనే ఓ జర్నలిస్ట్ లేచి ''ఈ వినియోగదారుల పరిరక్షణ చట్టం రాకముందు డాక్టర్లు ఆడిందే ఆటగా, పాడిందే పాటగా సాగింది. అది ఇప్పుడు తగ్గిందని కొంతమంది ప్రముఖులు చెప్తున్నారు. దీనిపై మీ అభిప్రాయం?....''

''యస్.... ఇంతకు ముందే చెప్పినట్లు రిజర్వేషన్లు, డొనేషన్‌లతో డాక్టరయిన డాక్టర్లుకు మాత్రం ఈ చట్టం చాలా ప్రభావం చూపిందని చెప్పక తప్పదు. తూతూ మంత్రం చేసే సూడో డాక్టర్లకు ఈ చట్టం భయాన్ని పుట్టిస్తుంది అని చెప్పటంలో ఎలాంటి సందేహం లేదు.

కానీ దీక్షతో పట్టుదలతో వైద్యం చేసే డాక్టర్స్‌కు కూడా ఈ చట్టం కొంతవరకు అడ్డుగానే నిలిచింది.

ఎంత పెద్ద డాక్టర్ అయినా తప్పటడుగు వేయటానికి అవకాశం ఉంది. ఎంత పెద్ద డాక్టర్ అయినా అతనూ మనిషే. ప్రతిసారి సక్సెస్ అవ్వాలి అనే రూల్ ఏమీలేదు. ఉదాహరణకు ప్రతి టెస్ట్ క్రికెట్‌లో సెంచరీలు సాధించే ఒక ఓపన్ బ్యాట్స్‌మన్ మొదటి బాల్‌కే అవుట్ అవ్వవచ్చు.

ఎంత అనుభవం ఉన్నా చిన్నపొరపాటువలన కేస్ ఫేల్ కావచ్చు."

ఓ నిమిషం ఆగి హాలింతా కలియజూసారు. అంతా నిశ్శబ్దం. అందరు ఆయన వైపే ఆసక్తిగా చూస్తూ ఉన్నారు. డాక్టర్ విశ్వామిత్ర మరలా చెప్పటం ప్రారంభించారు:

"ఏ వ్యవస్థలోనైనా మార్పు సహజమే- కాదు అవసరం కూడాను. కానీ, ఆ మార్పు మానవ సంబంధాలను విడదీసేదిగా ఉండరాదు. డాక్టర్ రోగికి ఉండే అతి సున్నితమైన సంబంధం 'నమ్మకం'. ఈ వినియోగ దారుల పరిరక్షణ చట్టం వల్ల ఆ నమ్మకం తొలగి 'అనుమానం' దాని స్థానం ఆక్రమించవచ్చు. అంకిత భావంతో వైద్యసేవ చేసేవారు ఈ చట్టం వల్ల తమ అంకిత భావాన్ని నీళ్ళలో వదలవలసి ఉంటుంది. మన దేశంలో నూటికి డెబ్బయి శాతం మంది రోగులు ప్రైవేట్ వైద్యుల వద్దే చికిత్స పొందుతున్నారు.

నా ఉద్దేశ్యం ప్రకారం వైద్యం వ్యాపారం కావటం వలన ఈచట్ట అవసరం తలెత్తింది.

ఈ చట్ట ముందుముందు ఇలాగే కొనసాగితే వైద్యపరీక్షల ఖర్చులు మామూలు దానికన్నా అనేక రెట్లు అధికమై, సామాన్య వ్యక్తికి వైద్యం ఒక గగన కుసుమంగా తయారవటానికి అవకాశం ఉంది...." డాక్టర్ విశ్వామిత్ర మాటలను మధ్యలోనే ఓ జర్నలిస్ట్ అందుకొని—

"క్షమించండి సార్! ఒక డాక్టర్ కనుక అధిక ఫీజ్ వసూలుచేస్తే అతడి ప్రాక్టీస్ దెబ్బతింటుంది. కాబట్టి వైద్య పరీక్ష ఖర్చులు అసాధారణంగా పెరిగే అవకాశాలు అరుదే, .... మార్కెట్ శక్తులే ఆ సమస్యను తలెత్తకుండా నివారిస్తాయి కదుసార్?" అని అడిగాడు అర్థిక శాస్త్ర పరంగా.

డాక్టర్ విశ్వామిత్ర నవ్వుతూ ''మీరు చెప్పేది ఆర్థిక శాస్త్రపరంగా నిజమే. కానీ. ఇది వైద్య వృత్తి కనుక తక్కువ ఫీజుతో ఎక్కువ సమస్యలు కొనుక్కొనే కంటే, ఎక్కువ ఫీజుతో రిస్క్ లేకుండా ఉండాలని డాక్టర్స్ అందరూ ఓ నిర్ణయానికి రావటానికి అవకాశం లేదంటారా? అప్పుడు తప్పనిసరిగా వైద్య ఖర్చులు పెరుగుతాయి అన్నారు."

ఒక ఆడ జర్నలిస్ట్ లేచి "మన దేశంలో జాతీయ, రాష్ట్రీయ వినియోగదారుల ఫోరమ్స్ ఎంత వరకు సంతృప్తికరంగా పనిచేస్తున్నాయి అని మీ అభిప్రాయం....?" అని ప్రశ్నించింది.

డాక్టర్ విశ్వామిత్ర, అభిమన్యువైపు చూచి "నీ అభిప్రాయం ఏమిటి అభిమన్యు" అన్నట్లు చూసారు.

అభిమన్యు గొంతు సవరించుకొని హుందాగా చెప్పటం ప్రారంభించాడు "సాధారణంగా కోర్ట్‌లలో పదీ పన్నెండు సంవత్సరాలకు కాని తీర్పుకు సిద్ధంకాదు. కానీ వినియోగదాల ఫోరమ్‌లో ఎంత పెద్ద కేస్ అయినా ఒకే ఒక సంవత్సరంలో విచారణ, జడ్జ్‌మెంట్ పూర్తి అవుతాయి.

కానీ, మన వినియోగదారుల విచారణ సంఘంలో వైద్యవృత్తికి సంబంధించిన నైతిక ప్రమాణాలు సరిగా లేవు. ఎలాంటి కేసులు విచారణకు తీసుకోవాలి అన్న ఒక నిర్ణీత విధానం కూడా సరిగ్గా లేదు. రోగం నయం కాలేదని వచ్చిన కేస్‌కు, ఘోరమైన నిర్లక్ష్యానికి పాల్పడిన కేసుకు దాదాపు ఒకే రకమైన తీర్పు చెపుతున్నారు. అదీకాక - విచారణ కమిటీలో వైద్య పరిజ్ఞానం కలిగిన వ్యక్తులు ఉండరు. ఈ విచారణ సభ్యులలో వైద్యుడు ఉండక పోవటం వల్ల ఒక రోగికి చికిత్స చేసేటప్పుడు డాక్టర్ పొరపాటు చేశాడా లేదా అన్నది వైద్యపరిజ్ఞానం లేని వ్యక్తులు ఎలా నిర్ణయిస్తారు?ఒకవేళ న్యాయాన్యాయాలు నిర్ణయించినా అది పూర్తివాస్తవం అవ్వటానికి అవకాశం ఎంతవరకు ఉంది?....!'' అని ఎదురు ప్రశ్న వేస్తూ ఓ నిమిషం ఆగాడు.

"అలా అని నేను నిర్లక్ష్యాన్ని, అసమర్థతని సమర్థించటం లేదు-నిర్లక్ష్యాన్ని, అసమర్థతని ఏ వృత్తిలో అయినా సమర్థించుకోవచ్చు కాని, వైద్యవృత్తిలో సమర్థించుకొనే ప్రసక్తే లేదు. కాని పొరపాటు నిర్ణయం నేరం కాదు. వైద్యుని ముఖ్య ఉద్దేశం ఎట్టి పరిస్థితులలోనైన తన పేషంట్‌కు కాపాడుకోవాలని ఉంటుంది. అలాంటి సందర్భాలలో పొర పాటు నిర్ణయాలు తీసుకోవటానికి కొంతవరకు అవకాశం ఉంది. కొన్ని సంక్లిష్టమైన కేసులలో ఉత్తమ సర్జన్ అయినా పొరపాటు నిర్ణయాలు తీసుకోవచ్చు .... నిజానికి చికిత్సలో ఎక్కడ ఏ లోపం ఉన్నా డాక్టర్‌నే పూర్తి బాధ్యుడిగా చేయడం మనం వినియోగదారుల చట్టంలో ఉన్న మరో లోపం. ఏ చికిత్సలోనైనా కొంతవరకు మాత్రమే డాక్టర్ ప్రభావం ఉండేది. అలక్ష్యంగా ప్రవర్తించే మెడికల్ సిబ్బంది, నర్సులు, వార్డ్ బాయ్స్, అంతంత మాత్రంగా పనిచేసే నాసిరకం మందులు, ఇంకా చికిత్సకు పూర్తి సహకారం అందివ్వని పేషంట్స్ వారి బంధువులు - వైద్యానికి సంబంధించి ఎక్కడ పొరపాటు జరిగినా, ఎవరు నిర్లక్ష్యం చేసినా వైద్యులనే నిందితులుగా చేస్తున్నారు. కాని, సాధారణంగా డాక్టర్స్ పొరపాట్లు, నిర్లక్ష్యం చేయటం చాలా అరుదు.

- సరిగ్గా పనిచేయని మందులను విక్రయించే మందుల కంపెనీలను వినియోగదారులకోర్టులు తప్పుపట్టిన సందర్భాలు ఒకటంటే ఒకటి కూడ కనిపించవు...."

"ఈ వినియోగదారుల హక్కుల చట్టం వైద్య రంగంలో ఉండటం గురించి మీ అభిప్రాయం?...." అని సూటిగా అడిగాడు ఓ పత్రిక జర్నలిస్ట్.

డాక్టర్ విశ్వామిత్ర, డాక్టర్ అభిమన్యు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

మరుక్షణంలో అభిమన్యు చెప్పటం ప్రారంభించాడు: "డాక్టర్లు అందించే సేవలు వినోద ప్రధానమైనవి, విలాస ప్రధానమైనవికావు అనేది అందరికి తెలిసిన నిజమే. ప్రమాదం, రోగం బారిన పడిన వ్యక్తులకు సేవ చేస్తారు. దీనిని వ్యాపార పరం చేయటం ఎంతవరకు బాగుంటుంది? ఆహార వస్తువులు, వినియోగ వస్తువులకు ఉండే అగ్‌మార్క్ గుర్తు, ఐ. ఎస్. ఐ. మార్క్ గుర్తులు ఉన్నట్లు డాక్టర్ల నైపుణ్యాలను ప్రామాణిక రించడం ఎలా సాధ్యం? వైద్యసర్వీసుల లోపాలను వినియోగదారుల కోర్టులో ఏ గీటురాళ్ళ ఆధారంగా నిర్ణయించగలవు? అందరిలాగ డాక్టర్లు కూడా మనుష్యులే కనుక వారిలో నిర్లక్ష్యం, ఆలసత్వం ఉండటం సహజం. కానీ, వైద్య వృత్తిలో నిర్లక్ష్యం క్షమించరానిది. అందువలన వైద్య వృత్తిపై ఓ పర్యవేక్షణ అవసరం కానీ, వైద్య సంబంధ తీర్పులు మెడికల్ కౌన్సిల్‌కే ఉంటే బాగుంటుంది. వైద్యంలో నిర్లక్ష్యం ప్రదర్శించిన డాక్టర్‌ని శిక్షించే అధికారం మెడికల్ కౌన్సిల్‌కు ఉంటే భావ్యంగా ఉంటుంది. అది కానప్పుడు, వినియోగదారుల పరిరక్షణ కోర్టులో విధిగా ఓ వైద్యపరిజ్ఞానం కలిగిన వ్యక్తి ఉండటం ఎంతైన అవసరం" అంటూ లేచి నిలుచున్నాడు డాక్టర్ అభిమన్యు.

ఇక ఏ ఒక జర్నలిస్టో మరో ప్రశ్న అడగటానికి సాహసించలేదు.

"ఓ. కే. సీయూ ..." అంటూ వేదిక దిగుతున్న విశ్వామిత్రకు గాని, డాక్టర్ అభిమన్యుకు గాని ఆ క్షణంలో తెలియదు మరో రెండు రోజుల్లో ఒక పెద్ద ప్రమాదం జరగబోతుందని.

కాన్ఫరెన్స్ హాల్‌లోనుండి బయటకి వస్తున్న జర్నలిస్ట్‌లకి ఆ క్షణంలో తెలియదు- మరో యాభై గంటలలో అక్కడ ఒక ప్రమాదం జరుగుతుందని కనీసం ఊహించలేకపోయారు.

* * *

బుజ్జిబాబు సంజీవరెడ్డి నగర్ బస్‌స్టాప్‌లో బస్‌కోసం ఎదురుచూస్తూ ఉన్నాడు.

ఉదయం పదకొండు గంటలు అయింది. ఎండ కాల్చేస్తుంది. లేట్‌గా ఆఫీసులకు వెళ్ళేవాళ్ళు ఇంకా వెళ్ళుతూనే ఉన్నారు. కాని, మార్నింగ్‌షో సినిమాకు వెళ్ళేవాళ్ళు మాత్రం టికెట్స్ దొరుకుతాయో లేదో అని కంగారుగా తొందరపడుతున్నారు.

బస్‌స్టాప్‌లో బుజ్జిబాబు చుట్టూ కలియచూసి "అబ్బ, ఎంత మంది జనంరా బాబు'' అనుకున్నాడు మనసులోనే.

కాలేజీలకు వెళ్లే అమ్మాయిలు, అబ్బాయిలు, టీనేజర్స్ బుజ్జిబాబు ఆలోచనలకు ఎక్కడికో తీసుకెళ్ళి గిలిగింతలు పెట్టేస్తున్నాయి.

ఉద్యోగాలకు వెళ్ళే యువతీ యువకులు, ఉద్యోగ ప్రయత్నంలో ఉన్న నిరుద్యోగ యువతీయువకులు, షాపింగ్‌లకు వెళ్లే పెళ్ళి అయిన యువతులు, పెళ్ళికాని యువకన్యలు, వృద్ధకన్యలు ఒక్కరేమిటి అన్ని రకాలవాళ్ళు.

దూరంగా నిలబడి ఉన్న ఇద్దరు యువతులపై పడింది బుజ్జిబాబు దృష్టి. ఒక అమ్మాయి బొద్దుగా లావుగా ఉంది. పంజాబీడ్రస్‌లో ఉంది. ప్రక్కనే ఉన్న అమ్మాయి మాత్రం శారీలో ఉంది. ఆ శారీ కట్టిన అమ్మాయి గంధర్వ కన్నెలా ఉంది. ఆ అమ్మాయిని చూసిన వెంటనే బుజ్జిబాబుకు ఫ్లాష్‌బ్లాక్‌లో "అందం చూడవయ్యా, ఆనందించవయ్యా'' అనే దేవదాసు సినిమాలోని పాట గుర్తుకు వచ్చింది.

వెంటనే ఆ అమ్మాయి కాలి వేళ్ళవైపు చూడటానికి ప్రయత్నించాడు దూరం నుంచే. కానీ, చీరకున్న కుచ్చిళ్ళు బాగా క్రిందికి ఉన్నందు వల్ల ఆమె కాలి వేళ్ళు కనిపించటంలేదు.

ఎప్పుడు, ఎక్కడ అందమైన అమ్మాయిని కనిపించినా వెంటనే కాలి వేళ్ళవైపు చూడటం బుజ్జిబాబుకుండే వీక్‌నెసులలో అది ఒకటి. అలా చూసిన తర్వాత ఆ అమ్మాయికి పెళ్ళి అయిందా, కాలేదా అనే విషయాన్ని వెంటనే తేల్చిచెప్పేస్తాడు. టెక్నిక్ ఏమిటంటే- పెళ్ళి అయిన స్త్రీకి కాలివేళ్ళకి మెట్టెలుంటాయి. పెళ్ళి కానివాళ్ళకు ఉండవు. అది బుజ్జిబాబు ప్రతిభ.

"నో ప్రాబ్లమ్" అనుకుంటూ ఆ అందమైన అమ్మాయిని జాగ్రత్తగా కళాదృష్టితో చూస్తున్నాడు.

గులాబీరంగు అర్గండి వాయిల్ శారీ, బ్లాక్ కలర్ చిన్న బార్డర్. అప్పుడే వికసించిన రోజాలా ఉంది ఆ అమ్మాయి. బుజ్జిబాబు ఆరాధనగా చూస్తున్నాడు ఆ అమ్మాయి వైపు.

అందమైన ముఖం, పెద్ద పెద్ద కళ్ళు, సన్నటి నడుము, అబ్బ! తుమ్మెద నడుము అంటే ఇదే గావాల అనుకున్నాడు. ఆ ఊహ రాగానే బుజ్జిబాబు మనసు పులకింతగా కులికింది. గులాబ్ జామ్ తింటున్నట్లు తియ్యగా ఉంది ఆ ఊహ.

కానీ, సరిగ్గా అప్పుడే ఆ అందమైన అమ్మాయి ప్రక్కనే ఉన్న బొద్దుగా ఉన్న అమ్మాయి బుజ్జిబాబు వైపు అలవోకగా చూసింది.

బుజ్జిబాబు వెంటనే దృష్టి మరల్చుకొని ఆకాశంలోకి పక్షుల పరిశోధకుడిలా చూస్తూ నిలబడ్డాడు.

లావుగా ఉన్న అమ్మాయి ఆ అందమైన అమ్మాయితో ఏదో చెప్పింది. ఆ అందమైన అమ్మాయి బుజ్జిబాబు వైపు చూసింది. ఇప్పుడు ఇద్దరమ్మాయిలు ఏదో అనుకుంటూ నవ్వుకుంటున్నారు.

ఆ అందమైన అమ్మాయి నవ్వుతుంటే బుగ్గల మీద సొట్టపడి పిచ్చెక్కించే అందంగా కనిపిస్తున్నది బుజ్జిబాబుకు. ఆమెను అలా చూస్తుంటే

బుజ్జిబాబుకు టికెట్ కొనకుండా ఫ్రీగా తెలుగు సినిమా చూసినంత ఆనందంగా ఉంది.

అంతలో 187 ఎమ్ నెంబర్ సిటీ బస్ వచ్చి ఆగింది తాబేలులా, ఆ బస్‌లో వెళ్ళాలి బుజ్జిబాబు. బస్‌లోనుంచి ఒకరిద్దరు దిగారు. ఆ ఇద్దరు అమ్మాయిలు గబగబ వెళ్ళి ఎక్కారు. ఆ వెంటనే బుజ్జిబాబు కూడ ఎక్కాడు.

ఇంకా కొంత మంది బస్ ఎక్కుతూనే ఉన్నారు. కండెక్టర్ టిక్కెట్స్ ప్యాడ్ తీసుకొని బస్ టాప్ కేసి బాదాడు. అది సిగ్నల్ అన్న మాట. డ్రైవర్ ఓసారి రియ్యర్ మిర్రర్‌లో చూసి చిలిపిగా ఓ జర్క్ ఇచ్చి ముందుకు పోనిచ్చాడు.

కండెక్టర్ విసుగ్గా "లోపల్‌కి రాండ్రి వయ్యా, లోపల మస్తు జాగ ఉంది," అన్నాడు. కండెక్టర్ ఎవరో కాని అసలైన తెలంగాణా మనిషిలా ఉన్నాడు. తెలుగుభాషతో ఇష్టం వచ్చినట్లు నమిలేస్తున్నాడు - మహాను భావుడు అనుకున్నాడు భాషాభిమానం ఉన్న బుజ్జిబాబు.

''అరెనీ ... లోపల్‌కి రాండ్రువయ్యా అంటే....'' అన్నాడు మళ్ళీ ఏ మాత్రం సభ్యతా సంస్కారాలు లేకుండా గట్టిగా కండెక్టర్.

భాషాభిమానం ఉన్న బుజ్జిబాబుకి ఆవేశం కలిగింది, కానీ ఏం చేయ గలడు? అందులో ఆ కండెక్టర్ అడవి మనిషిలా ఉన్నాడు.

అప్పుడు బుజ్జిబాబు భాష గురించి ఏమి మాట్లాడినా ఆ తెలంగాణా కండెక్టర్ తిట్లతో కడిగి పారేస్తాడేమోనని భయంతో ఏమి మాట్లాడకుండా మౌనంగా నిలబడ్డాడు.

బుజ్జిబాబు దృష్టి మరలా ఆ ఇద్దరమ్మాయిల మీద పడింది. 'అయినా అందమైన వస్తువులను, అందమైన మనుషులను చూడటం ఏమి తప్పులేదులే' అని అంతరాత్మకు సర్దిచెప్పుకున్నాడు.

ఆ అందమైన అమ్మాయికి ఎవరో వ్యక్తి బాగా రాసుకుంటూ నిల్చున్నాడు. అలా నిలబడినవ్యక్తిమీద బుజ్జిబాబుకి పిచ్చికోపం వచ్చింది. వెంటనే 'ఒరేయి దున్నపోతా! ఆ అందమయిన అమ్మాయిని అలా రాసుకుంటూ నిలుచోకపోతే కాస్త ప్రక్కగా నిల్చోవచ్చుగా' అని చెప్పాలనిపించింది. కానీ, చెప్పాలంటే ఏదో శక్తి అడ్డువడింది.

ఏమి చెప్పలేని అశక్తత.... అన్ని చూస్తూనే ఉన్నాడు కాని, ఏమీ చేయలేని నిస్సహాయుడు బుజ్జిబాబు.

ఆ అందమైన అమ్మాయి ఎందుకోసమో మరి వెనక్కి తిరిగి ఓసారి చూసింది. ఆమె చూపు బుజ్జిబాబు చూపుతో కలుసుకున్నాయి. బుజ్జిబాబు సిగ్గుపడిపోతూ తల ప్రక్కకు తిప్పుకున్నాడు.

ఆ అందమైన అమ్మాయి తనను రాసుకుంటూ నిలబడిన వ్యక్తి వైపు ఒకసారి చీదరించుకున్నట్లుగా చూసి కాస్త ముందుకు జరిగి ఆ వ్యక్తికి కాస్త ఎడంగా నిలబడింది.

బస్ కండెక్టర్ బస్సులో ఇటు అటూ తిరుగుతూ "స్స్....స్స్...." అంటు టికెట్లకోసం పారాడుతున్నాడు. (హైదరాబాద్ సిటీ బస్‌లలో కండెక్టర్‌లు టిక్కెట్ అడగరు - "స్... స్'' అంటారు. దాని అర్థం టిక్కెట్స్ కొనండి అని )

కండెక్టర్ ఏదో గుర్తు వచ్చిన వాడిలా "లోపల్‌కి రాండ్రి వయ్యా, లోపట మస్తుగ జాగ ఉంది బై '' అన్నాడు.

ఆ పిలుపు అందుకొన్న ఒక వ్యక్తి బస్‌లో అందరిని తప్పించుకుంటూ వెళ్ళి ఆ అందమైన అమ్మాయిని రాసుకుంటూ నిలుచున్నాడు. అది చూసిన బుజ్జిబాబుకి కోపం కట్టలు కట్టి తనలోని మంచి మనిషిని నిద్రలేపాయి. ఇక సహించేది లేదు అనుకున్నాడు బుజ్జిబాబు.

"అంతలో ఖైరతాబాద్‌లో ఆ అందమైన అమ్మాయి దిగింది. బుజ్జిబాబు దిగులుగా బాధగా చూసాడు ఆ అమ్మాయి వైపు.

బస్సు మరలా స్టార్ట్ అయింది. సిటీబస్ భారంగా కదులుతున్నది.

బస్‌లో ఖాళీసీట్ ఏమయినా కనిపిస్తుందేమోనని ఆవురావురంటూ బస్సు అంతా కలియజూస్తున్నాడు బుజ్జిబాబు.

సెక్రటేరియట్ - కంట్రోల్‌రూమ్ - నాంపల్లి దాటి వెళ్లుతున్నది బస్సు. అయిన సీట్లు ఖాళీ అవటం లేదు. బుజ్జిబాబు పాపం, ఉసూరుమని నిలబడే ఉన్నాడు.

గాంధీభవన్ ముందు ఆగింది బస్సు.

మెల్లగా కదులుతూ ఉండగానే బస్సు దిగాడు బుజ్జిబాబు. గట్టిగా ఓసారి ఊపిరి పీల్చుకొని - బట్టలు సరిచేసుకొని కాలర్ ఎకరేసుకొని— గడియారం చూసుకున్నాడు పదకొండున్నర అయింది.

బుజ్జిబాబు గుండెల్లో డైనమైట్ పేలినట్లు అనిపించింది.

పెద్దగేట్ దాటి, తన ఆఫీస్ ఉన్న కాంప్లక్స్‌లోకి ప్రవేశించాడు.

ఆ ఆవరణలో కూడా ఎటుచూసినా గుంపులు గుంపులుగా ఉన్నారు జనం. అకౌంట్స్ సెక్షన్‌లోని కొంతమంది స్టాఫ్ క్యాంటిన్‌వద్ద ఉన్నారు. ఆ ఆఫీస్‌లో వాళ్ళు అందరు ఆ క్యాంటిన్‌ని "దివ్యలోకం" అని పేరుతో పిలుచుకుంటూ ఉంటారు. దానికి కారణం లేకపోలేదు. ఆఫీస్‌లో ఎట్టి పరిస్థితిలో స్మోక్ చేయరాదు. కాఫీ, టిఫిన్‌లు ఆఫీస్‌లోకి నాట్ అలవ్‌డ్ చిన్న చిన్న అవసరాలు తీరాలి అంటే, చిలిపి కోరికలు తీరాలి అంటే కేవలం ఈ ఒక్క క్యాంటినే గతి. అందువల్ల ఆ క్యాంటిన్‌కి "దివ్య లోకం" అని ముద్దుగా పేరు పెట్టుకొని మరీ పిలుచుకుంటూ ఉంటారు - సిగరెట్లు, కాఫీలు, వక్కపొడులు, కిళ్ళీలు, వద్దనుకున్నవారికి సాంప్ర

దాయబద్ధమైన తమలపాకులు, పొగాకు-ఒకటేమిటి అన్ని సలక్షణాలకు పుట్టిల్లు ఈ "దివ్యలోకం" అనుకున్నాడు కసిగా. "కసిగా" అనుకోవటానికి కారణం బుజ్జిబాబుకి అనవసరంగా డబ్బు ఖర్చు చేయాలి అంటే గిట్టదు, ఖర్చు చేసేవాళ్ళను చూస్తే పడదు.

బుజ్జిబాబు గబగబ లిఫ్ట్ దగ్గరికి వెళ్ళాడు.

లిఫ్ట్‌లో ఉన్న మెల్లకన్ను లిఫ్ట్‌బాయ్ కళ్ళతోనే ఎక్కడికి అన్నట్లుగా అడిగాడు బుజ్జిబాబును చూసి,

బుజ్జిబాబుకు చిర్రెత్తు కొచ్చింది "వెధవ.రోజూ చూస్తూనే ఉంటాడు, మళ్ళీ ఈ రోజూ ఎక్కడికి అని క్వశ్చన్ మార్క్ మొఖం వాడును అని మనసులో తిట్టుకుంటూ "సవెంత్ ఫ్లోర్'' అన్నాడు.

ఓ నిమిషం తరువాత, లిఫ్ట్ సవెంత్ ఫ్లోర్‌లో చిన్న జర్క్ ఇచ్చి ఆగింది.

లిఫ్ట్‌లో నుంచి బయటపడి ఆఫీస్‌లోకి వెళ్ళాడు.

అంతా నిశ్శబ్దంగా ఉంది ఎవరి సీట్లలో వాళ్లు ఉన్నారు.

బుజ్జిబాబు పిల్లిలా నడుస్తూ సెక్షన్ ఆఫీసర్ అంజయ్యగారి దగ్గరికి వెళ్ళాడు అటెండెన్స్ వేసుకోవటానికి; ఎస్. ఓ. టేబుల్ మీద అటెండెన్స్ రిజిస్టర్ కనిపించలేదు.

సెక్షన్ ఆఫీసర్ అంజయ్యగారు బుజ్జిబాబు రావటం గమనించారు అయినా తల ఎత్తకుండానే "జీ.ఎమ్. గారి దగ్గరుంది" అన్నారు.

ఏం చేయాలో అర్థం కావటంలేదు బుజ్జీబాబు, లేట్‌గా ఆఫీస్‌కువస్తే ఒకటి మాత్రం తప్పదు జి.ఎమ్. గారి దగ్గరికి వెళ్ళక తప్పదు. ఆయన దగ్గర ఉన్న రిజిష్టర్‌లో సంతకం చేయక తప్పదు! ఆయన పెట్టే చివాట్లు తినక తప్పదు - అని, ఓ నిర్ణయానికి వచ్చాడు.

జి.ఎమ్. రూములోకి ఎలాగో ధైర్యంచేసి వెళ్ళాడు.

జి.ఎమ్. వేమనరావు ఎవరితోనో నవ్వుతూ మాట్లాడుతున్నాడు. "చాలు - ఇక చాలు" అనుకున్నాడు మనసులోనే బుజ్జిబాబు.

ఆయన ముఖం మీద ఆ మాత్రం నవ్వు ఉంటే అదే పదివేలు అనుకుంటూ "గుడ్ మార్నింగ్ సార్...." అన్నాడు బుజ్జిబాబు జీ ఎమ్‌ని ఉద్దేశించి వినయంగా.

"మార్నింగ్....మార్నింగ్.... రా బుజ్జిబాబు. నీ పెళ్ళి ఎప్పుడు- " అని నవ్వుతూ అడిగా రాయన.

బుజ్జిబాబు ముఖం మీద సిగ్గు చిందులేసింది.

ఆ తరువాత చూసాడు జి.ఎమ్. ఎదురుగా కూర్చున వాళ్ళను. వాళ్ళు ఒకరు మగ, మరొకరు ఆడవాళ్ళు అని తెలుసుకొని, సిగ్గుతో చితికి పోయాడు బుజ్జిబాబు.

ఆ కూర్చున్న వాళ్ళలో ఒకరు శేఖర్, వయస్సు ఓ ఇరవై ఐదు ఉంటుంది. ఈ మధ్యలోనే ఆఫీస్‌లో టైపిస్ట్‌గా చేరాడు. ఇంకా మూడు నెలలు కూడా కాలేదు-అప్పుడే జి.ఎమ్‌కు ఎదురుగా కూర్చొని మాట్లాడే స్థాయికి ఎదిగాడు అని స్మరించి, శేఖర్ మీద బుజ్జిబాబుకు ఈర్ష్య కలిగింది ఒక నిమిషంపాటు.

శేఖర్ ప్రక్కనే వున్న వసంత వయసు ఓ ఇరవై ఐదు, ఇరవై ఆరు ఉంటుంది. గత ఆరేళ్ళ నుంచి ఆఫీస్‌లో స్టెనో గ్రాఫర్‌గా ఉద్యోగం చేస్తున్నది. మనిషి ఓ మోస్తరుగా ఉంటుంది. మేకప్ విషయంలో చాలా సిన్సియర్‌గా ఉంటుంది.

"వచ్చే ఆదివారం పద్నాలుగో తేది మన శేఖర్‌కు వసంతకు మెహిందీ మ్యారేజ్‌హాల్‌లో పెళ్ళి. మరి నీ పెళ్ళి ఎప్పుడు?" అని బుజ్జిబాబు నుద్దేశించి అడిగాడు జి.ఎమ్.

"అలాగ సార్!" అన్నాడు తేరింతవేసినట్లు బుజ్జిబాబు.

వసంత జి.ఎమ్‌ను ఉద్దేశించి "మీరు తప్పకుండా రావాలి సార్! శనివారం మళ్ళీ వచ్చి కలుస్తాం.... ఇంకా చాలామందికి పెళ్ళి పత్రికలు ఇవ్వాలి...." అని చెప్పేటప్పుడు, బుజ్జిబాబు ఎంచక్కా అటెండెన్స్ రిజిస్టర్‌లో తన సంతకం చేసేసాడు.

జి.ఎమ్. వేమనరావు పెద్దరికం ఒలికిస్తూ "ఓ షూర్ తప్పకుండా, విష్ యూ ఆల్ ది బెస్ట్" అన్నాడు.

"వస్తాం సార్!" అని చెప్పి శేఖర్, వసంత బయటికి వెళ్ళి పోయారు.

బుజ్జిబాబు కూడా జీ.ఎమ్.తో "నేనూ వస్తాను సార్!" అని చెప్పి బయటికి రాబోయాడు.

కాని, జీ.ఎమ్. వేమనరావు "ఎక్కడికోయ్ వెళ్ళేది? ఈ రోజు నువ్వు ఆఫీస్‌కు వచ్చిన టైమ్ చూడు, పన్నెండు గంటలు! రెండుగంటలు ఆలస్యం. చూడు బుజ్జిబాబు! ఆఫీస్‌కి టయానికి రావాలంటే తప్పకుండా పెళ్ళి అయి ఉండాలి. పెళ్ళిఅయిన ప్రతివాడు సరిగ్గా ఆఫీస్ సమయాని కంటే ఓ పది నిమిషాలు ముందే ఆఫీస్‌కు వస్తాడు అని నా ముప్పయి సంవత్సరాల అనుభవం చెప్తుంది. నేను ఇదే చివరిగా చెప్తున్నాను చూడు బుజ్జిబాబు, మరో రెండు వారాలలో నీవు నీ పెళ్ళి చేసుకోకపోతే నీ ఉద్యోగం ఊస్ట్. నీవు వేరే ఉద్యోగం చూసుకోవలసి ఉంటుంది. నీవే నిర్ణయించుకో...." అని ఒక క్షణం ఆగాడు.

బుజ్జిబాబు బిక్కమొహంతో "సార్! ఇంత అర్ధాంతరంగా ఒక సారిగా ఆఫీస్‌కి టయానికి రావటం లేదని, ఇంత పెద్ద శిక్షవేస్తే ఎలా సార్?.... అదీకాక పెళ్ళి కూతురు ఇంత తక్కువ సమయంలో ఎక్కడ దొరుకుతుంది?" - ప్రేమించే పెళ్ళి చేసుకోవాలని నాకు ఎప్పటి

నుందో కోరికగా ఉంది. కాని, మీరు ఇలా అర్ధాంతరంగా పెళ్ళి చేసుకో మంటే నా ఆశలన్నీ అడియాశలై పోతాయి సార్!....'' అన్నాడు డ్రమెటిక్ ఏడ్పుమొహం పెట్టి.

జీ. ఎమ్‌కు బుజ్జిబాబు మీద జాలి కలిగినట్లుంది, ''ఓ.కె, ఓ.కె, నాకు తెలిసిన ఒక ప్రముఖ ప్రేమ గురువు ఉన్నాడు. అతనికి ప్రేమలో మంచి ప్రావీణ్యం ఉంది. ఎప్పుడు ప్రేమ గురించి పెద్ద పెద్ద పరిశోధనలు చేస్తూ ఉంటాడు. వెళ్ళి ఆయనను కలువు - ఎలా ప్రేమించాలో మూడు రోజుల్లో నేర్పుతాడు'' అన్నాడు.

''అలాగ సార్? కానీ, నాకో చిన్న అనుమానం. పెళ్ళి అయితే ఆఫీస్‌కు ఎలా టయానికి వస్తారు - ఇంకా ఓ అరగంట లేట్ అవుతారు కాని,'' అంటూ అనుమానంగా అడిగాడు.

జి.ఎమ్. ఓ నిమిషం పాటు వంకరటింకర నవ్వు నవ్వేసి చెప్పటం ప్రారంభించాడు: "పొరపాటు పడుతున్నావు బుజ్జిబాబు! పెళ్ళి అయిన క్రొత్తలో ఓ అరగంట లేటుగా ఆఫీస్‌కు రావచ్చు. కాని, ఆ తరువాత మాత్రం ఎట్టి పరిస్థితులలోను ఆఫీస్‌కు లేట్‌గా రారు. ఎందుకంటే, ఇంటిలో ఉంటే భార్య ప్రశాంతంగా ఉండనివ్వదు. ఏదో ఒక పని చేయమంటుంది. ఏదో తెమ్మంటుంది, మరింకేదో ఇమ్మంటుంది. అంతకంటే మరో ముఖ్యమయిన విషయం....'', అని ఏదో చెప్పబోయి ఆగి-

''చిన్నవాడివి అర్థం చేసుకోలేవు. అన్ని జీవితం నీకే నేర్పుతుంది'' అని చెప్పి మరలా సీరియస్ అయిపోయి, ''గుర్తుంచుకో, బుజ్జిబాబు! నీకు సరిగ్గా నెల రోజులు టైమ్ ఇస్తున్నాను. నీవు ప్రేమించే పెళ్ళి చేసుకుంటావో, అరేంజ్‌డ్ మ్యారేజ్ ఏ చేసుకుంటావో- నీ ఇష్టం. కాని, సరిగ్గా నెల రోజులలో నీవు పెళ్ళి చేసుకోకపోతే మరో ఉద్యోగాన్ని వెతుక్కోవలసి ఉంటుంది'' అని, మరో మాటకు అవకాశం ఇవ్వకుండ అయన తన ఫైల్స్ చూసుకోవటంలో మునిగిపోయాడు.

బుజ్జిబాబు గోముగా "సార్! ఆ ప్రేమ గురువు అడ్రస్ కాస్త ఇస్తారా?'' అని అడిగాడు.

''ఓ ష్యూర్....'' అంటూ ఓ నిమిషం పాటు వెతికి ఓ విజిటింగ్ కార్డ్ తీసి బుజ్జిబాబు చేతికందించాడు.

''థాంక్ యూ సార్....''

''ఓ. కే, బెస్ట్ ఆఫ్ లక్.... గుర్తుంచుకో, సరిగ్గా నెల రోజులు'' అన్నాడు జి.ఎమ్. మరలా గుర్తు చేస్తూ.

అలాగే సార్ అన్నట్లు ముఖంతో చెప్పి,–'' వస్తాను సార్...." అంటూ జి.ఎమ్. రూమ్‌లో నుంచి బుజ్జిబాబు బయటకు వచ్చాడు.

బుచ్చిబాబు భారంగా వచ్చి తన సీట్‌లో కూలబడ్డాడు. శేఖర్, వసంతా ఆఫీస్ స్టాప్అందరికి తమ పెళ్ళి శుభలేఖలు పంచి పెడుతున్నారు. బుజ్జిబాబుకు కూడా ఒక శుభలేఖ ఇచ్చారు.

బుజ్జిబాబు పెళ్ళి శుభలేఖ చూస్తు ఆలోచలో పడ్డాడు. "నిన్నగాక మొన్న చేరిన శేఖర్‌గాడు మోస్ట్ సీనియర్ అయిన వసంతను ఎలా ప్రేమించగలిగాడు!" అని గొప్ప అనుమానం కలిగింది బుజ్జిబాబుకు. వెంటనే శేఖర్‌ని ప్రక్కకు పిలిచి అడగాలి అనుకున్నాడు.

లంచ్ టైమ్ అయింది.

ఆఫీస్‌లోని అందరూ భోజనాలు చేయటానికి డైనింగ్ రూమ్‌లోకి వెళ్తున్నారు. బుజ్జిబాబుకు ఏదో ఐడియా ఫ్లాష్ అయింది మైండ్‌లో. వెంటనే లంచ్ బాక్స్ తీసుకొని డైనింగ్ హాల్‌వైపు పరిగెత్తాడు.

డైనింగ్ హాల్‌లో అంతా భోజనాలు చేస్తున్నారు.

హాల్ అంతా కలియజూచాడు బుజ్జిబాబు. బుజ్జిబాబుకి అవసరం ఉన్న శేఖర్ వసంత ఒక ప్రక్కన కూర్చొని భోజనం చేస్తున్నాడు.

బుజ్జిబాబు సరాగ్గా శేఖర్ దగ్గరికి వెళ్ళాడు. ప్రక్కనే వసంత ఉంది, అందువల్ల శేఖర్‌తో "నీతో ఒక పర్సనల్ విషయం మాట్లాడాలి, భోజనం అయిన తర్వాత అలా బయటికి వస్తావా?" అన్నాడు శేఖర్ ముందు ఉన్న ఛైర్‌మీద కూర్చుంటూ,

"పర్సనల్ విషయమా! ఏ విషయంలో?...." అని దీర్ఘం తీసాడు శేఖర్ బుజ్జిబాబువైపు చూస్తు.

"తర్వాత చెప్తానుగా....", అని ముసిముసిగా నవ్వుకున్నాడు బుజ్జి బాబు.

"లేదు బుజ్జిబాబు, ఈరోజునుంచి శెలవు పెట్టాము, నేను వసంతా ఇంక నెల రోజుల తరువాతే మరలా ఆఫీస్‌కి వచ్చేది. పెళ్ళి పత్రికలు పంచాలి, అన్ని అరేంజ్ మెంట్స్ చూసుకోవాలి.... చెప్పండి పర్వాలేదు!" అన్నాడు శేఖర్.

బుజ్జిబాబు వసంతవైపు చూసి, చెప్పవచ్చా అన్నట్లుగా ఫిగర్ పెట్టాడు. శేఖర్ అర్థం చేసుకున్నట్లుంది బుజ్జిబాబు అవస్థ - "మరేం పర్వాలేదు చెప్పు బుజ్జిబాబు - నా విషయాలన్నీ వసంతకు తెలుసు. అలాగే వసంత విషయాలన్నీ నాకు తెలుసు...." అన్నాడు ధీమాగా.

ఇక లాభం లేదు అనుకొని బుజ్జిబాబు చెప్పటం ప్రారంభించాడు: "ఏంలేదు శేఖర్! జి ఎమ్.గారు, మరో నెలరోజుల్లో నన్ను ఎట్టి పరిస్థితు లలోనైనా పెళ్ళి చేసుకోమన్నారు. లేదా ఉద్యోగం పోతుంది అని చెప్పారు" అని మొదలుపెట్టి అంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

భోజనాలు చేయటం పూర్తి అయింది. బుజ్జిబాబుకు జి. ఎమ్. ఇచ్చిన కార్డ్ శేఖర్‌కు చూపాడు. ఆ విజిటింగ్ కార్డ్ చూసిన వెంటనే శేఖర్ ఉత్సాహంగా "అవును బుజ్జిబాబు! ప్రేమగురువు గారి దగ్గర ట్రైనింగ్‌తీసుకుంటే మిమల్ని ఏ అమ్మాయి అయిన ఇట్టే ప్రేమించేస్తుంది.

నేను ప్రేమ గురువు దగ్గర మూడు సంవత్సరాలు బ్యాచ్‌లర్స్ డిగ్రీ చేసాను. అందువలనే ఇప్పుడు ఈ పొజీషన్‌లో ఉన్నాను" (వసంతను పెళ్ళి చేసుకోగలుగుతున్నాను అని అర్థం.) అన్నాడు.

శేఖర్ మాటలు వింటూ బుజ్జిబాబు తెగ ఆనందపడిపోయాడు. శేఖర్ చెప్పటం అపగానే, "ఇంకా స్త వివరంగా చెప్పు శేఖర్!" అన్నాడు ఆసక్తిగా.

"చాలా సింపుల్ బుజ్జిబాబు! ప్రేమమందిరం కాలేజ్‌కి వెళ్ళగానే మొదట ఒక పరీక్ష పెడతారు జనరల్‌లామీద. అందులో పాస్ అయితే, ప్రేమించదగ్గ ముఖమా, కాదా అని టెస్ట్ ఉంటుంది. ఇందులోనే చిన్న ఇంటర్వ్యూ ఉంటుంది. వీటిలో పాస్ అయితే అక్కడ డిప్లమా, బ్యాచలర్స్ డిగ్రీ, ప్రేమలో పి.జి. కూడా చేయవచ్చు. ఉద్యోగాలు చేసే మనలాంటి వాళ్ళకు పార్ట్‌టైమ్ క్లాసులు ఉంటాయి. చాలా రీజనబుల్ ఫీజ్ ... నోట్స్ ఉంటుంది. చివరిగా ప్రాక్టికల్స్ కూడా ఉంటాయి '' అంటూ అపాడు.

''ప్రేమించాలి అంటే ఇంత హంగామా ఉందా శేఖర్?'' అన్నాడు బుచ్చిబాబు ఆశ్చర్యంగా.

''ఇది చాలా తక్కువ బుజ్జిబాబు! నీవు వెళ్ళి ఓ సారి చూడు, అక్కడ ఎంత మంది ప్రేమ విద్యార్థులు ఉంటారో నీకే తెలుస్తుంది....''

ఇక బుజ్జిబాబుకు ఏమి వినిపించటం లేదు. బుజ్జిబాబు మనసు, మెదడు ఏదో ఆలోచనలో పడిపోయింది. ''ఇక ఎట్టి పరిస్థితులలోనైన రేపు వెళ్ళి ఆ ప్రేమ మందిరాన్ని, చూసి, ప్రేమించటం ఎలాగైన నేర్చుకోవాలి అని గట్టిగా నిర్ణయించుకున్నాడు. -మరుక్షణమే ఓ వారం రోజుల కోసం శెలవు తీసుకున్నాడు.

ఇక రేపటి నుంచి "ప్రేమబడి"లో ఒక విద్యార్థిగా వెళ్ళితే ఎలా ఉంటుందో అనుకొని మధురంగా తన్మయంలో తేలిపోయాడు. ఇలాంటి ప్రేమబడి ఒకటుందని బుజ్జిబాబుకు తెలియనందుకు ఓ నిమిషం బాధ పడి - దేనికైనా సమయం రావాలి అనుకుంటూ జి.ఎమ్. ఇచ్చిన విజిటింగ్ కార్డ్ మురిపెంగా చూసుకున్నాడు.

"డాక్టర్ ప్రేమ గురువు పిహెచ్.డి., (ఇన్ ప్రేమ)
ప్రేమమందిరం,
బషీర్‌బాగ్, హైదరాబాద్ - 500 004."
అని ఉంది అడ్రస్.

* * *

డాక్టర్ అభిమన్యు తన ఛాంబర్‌లో ప్రాజెక్ట్-'సి' కి సంబంధించిన ఫైల్ సునిశితంగా చూస్తున్నాడు. మిల్క్‌వైట్ ఫుల్‌సూట్‌లో అందంగా హుందాగా ఉన్నాడు. అతని ముఖం చాలా ఫ్రెష్‌గా ఉంది. ఆ ఫైల్ చదువుతుంటే తృప్తితో కూడిన నవ్వు ఆయన పెదవులమీద కదలాడింది ఓ క్షణంపాటు. ఆ నవ్వులో ఓ తియ్యదనం ఉంది.

అభిమన్యు గత మూడు సంవత్సరాలనుంచి ప్రాజెక్ట్ - సి కోసం కనీసం పన్నెండు లక్షలు ఖర్చు చేశాడు. ప్రాజెక్ట్ - సి ముఖ్య ఉద్దేశ్యం కేన్సర్ వ్యాధికి వ్యాక్సిన్ కనుక్కోవటం. దీనికి సంబంధించిన పరిశోధనలో ఇప్పటివరకు ఎన్నో జటిలమైన సమస్యలను ఎదుర్కొన్నాడు. అభిమన్యు హాస్పటల్ అడ్మినిస్ట్రేషన్‌తోపాటు, రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ విషయాలలో చాలా కీన్‌గా ఇన్‌ట్రెస్ట్ తీసుకుంటాడు.

రీసర్చ్ విషయాలకు సంబంధించిన బాధ్యత డాక్టర్ విశ్వామిత్ర, సిద్ధార్థలకు అప్పగించినా రీసెర్చ్‌కు సంబంధించిన ప్రతి అడుగు డాక్టర్ అభిమన్యు గైడెన్స్‌తోనే నడుస్తోంది ఇప్పుడు ఆ ప్రాజెక్ట్- సి కు సంబంధించిన ఇంప్రూవ్‌మెంట్ ఫైల్ అతని చేతిలో ఉంది.

అభిమన్యు ముఖంమీద ఆనందఛాయలు వెల్లివిరిశాయి.

డోర్ దగ్గర ఎవరో వస్తున్న చప్పుడు అయింది.

ఆ వెంటనే "మే ఐ కమిన్ సర్" అంటూ శ్రావ్యమైన శబ్దం; ఆ గదిలోని అందమైన నిశ్శబ్దాన్ని మరింత అందంగా నిశ్శబ్దంలో శబ్ద తరంగంలా.

అది ఓ ఆడస్వరం.

అభిమన్యు దృష్టి డోర్ వైపు పడింది.

ఆమె పేరు "స్నేహిత."

అందమైన విశాలమైన కళ్లు, ఆ కళ్లలో కాంతి. సందూరి ఎంకికి ఉండే కొన్ని లక్షణాలు ఆమెలో ఉన్నాయి. అందమైన జీవిత స్వప్నంలా ఉంది. ఎర్ర గులాబీలాంటి రంగులో ఉండే పల్చటి పెదవులు, ఎప్పుడు నవ్వుతూ ఉన్నట్లుగా ఉండే అందమైన ముఖం. అపురూపమైన అజంతా చిత్రంలా ఉంది. ఆమె కళ్ళలో అంతు చిక్కని ఏదో ఆకర్షణ వుంది.

కానీ, తెలుగు సినిమా హీరోయిన్‌లకు ఉండేలా ఆమెకు వయసు పదహారు మాత్రం కాదు. ఆమె వయస్సు సరిగ్గా పదహారు ప్లస్ పది. నిజం కనుక అలాగే ఉంటుంది. అయిన ఆమె టోటల్‌గా చాలా అందంగా ఉంది. అందంగా ఉండటం వేరు, తెల్లగా పాలిపోయి రక్తహీన రోగిలా ఉండటం వేరు. ఆమె తెల్లగా లేదు. కాని, అందంగా ఆకర్షణీయంగా ఉంది.

ఆమె కట్టిన చీరకట్టు మరింత ఆకర్షనీయంగా అందానికే భాష్యం చెప్తున్నట్లుగా ఉంది. ఆమె చీరను చుట్టుకోలేదు, అందంగా కట్టుకుంది. ఆమె హంసలా నడవకపోయినా ఆ నడకలో ఓ ప్రత్యేక ఆడతనం ఉంది.

నవ్వుతూ వచ్చి- ''గుడ్ మార్నింగ్ డాక్టర్!'' అంటూ, అభిమన్యు టేబుల్‌కు ముందు ఉన్న ఓ ఛైర్ మీద కూర్చుంది.

అభిమన్యు నవ్వుతూ రిసీవ్ చేసుకొని - "నీ కొక గుడ్ న్యూస్! మన ప్రాజెక్ట్-ని నేటితో పూర్తి అయింది. ఇక టెస్టింగ్ ప్రాసెస్ ఉంది, చివరి దశ - ఈ మన ప్రయోగం సక్సెస్ అయితే ప్రపంచంలో క్యాన్సర్ వ్యాధితో ఇక మరణాలు ఉండవు. బి సి జి, పోలియో టీకాల్లా క్యాన్సర్ వ్యాధి రాకుండా ఈ వ్యాక్సిన్ వాడుకలోనికి వస్తుంది. మానవ జీవిత చరిత్రలో అనుకోని ఒక క్రొత్త అధ్యాయం ప్రారంభం అవుతుంది....నా ఉద్దేశ్యం ప్రకారం ఈ సాంపిల్ టెస్ట్ సక్సెస్ అవుతుందని పూర్తి నమ్మకంగా ఉంది.''అన్నాడుఅభిమాన్యు గొంతులో అనంతమైన ఆత్మవిశ్వాసం ఉంది.

స్నేహిత కళ్ళలోకి చూస్తూ తన దగ్గిర ఉన్న ప్రాజెక్ట్ - సి ఫైల్ స్నేహితకు అందించాడు.

''ఇది నిజంగా ప్రపంచ వైద్యచరిత్రలో ఒక అద్భుతమైన మలుపు అవుతుంది. వైర్యరంగంలో ఎవరూ కనీసం ఊహించలేని అపూర్వ విషయం.... డాక్టర్!'' అంది ఆనందంతో అభినందిస్తూ.

''కానీ ఈ విషయం సాంపిల్ టెస్ట్ సక్సస్ అయ్యేవరకుమీపత్రికలో కూడా ఎలాంటి ఇన్ఫర్మేషన్ పాస్ చేయకు. ఎందుకైనా మంచిది...." అన్నాడు అభిమన్యు.

''కానీ, మీరు ఈ ప్రాజెక్ట్-సి లో క్యాన్సర్‌కు వ్యాక్సిన్ కనుగొనే ప్రయత్నంలో గత మూడేళ్ళుగా మునిగిఉన్నారన్న విషయం మెడికల్ ప్రొఫెషన్‌లో ఉన్న చాలామందికి తెలుసుకదా....'' అంది స్నేహిత అనుమానాన్ని వ్యక్తం చేస్తూ.

సరిగ్గా అప్పుడే ఫోన్ రింగ్ అయింది.

ట్రింగ్.... ట్రింగ్.... గ్....

అందుకున్నాడు అభిమన్యు....

"....  ....  ...."

యస్, డాక్టర్, అభిమన్యు హియర్."

"....  ....  ...."

"నమస్తే, మీ ఆశీర్వాదం వల్ల బాగున్నాను సార్! పని వత్తిడి వల్ల రాలేకపోయాను, ఏమి అనుకోవద్దు...."

"..........."

"ఆ.... ప్రాజెక్ట్-సి, దాదాపు పూర్తి కావస్తుంది సార్!...."

"..........,"

"అయితే పంపండి.... నేను అపాంట్ చేసుకుంటాను "

"..........."

"ఓకె. సార్ సీయూ!' అంటూ ఫోన్ క్రెడిల్ చేసాడు.

ఎవరు ఫోన్‌లో మాట్లాడింది అన్నట్టుగా స్నేహిత అభిమన్యు వైపు చూసింది.

"న్యూరాలజీ సర్జన్, చౌదరిగారు, మన ప్రాజెక్ట్-సి గురించి అడిగారు ... వాళ్ళ క్యాండెట్‌ను మన ఇనిస్టిట్యూట్‌లో అపాంట్ చేసుకోమని రెకమెండ్ చేసారు,"

"ఓ అలాగా .... కానీ వాళ్ళదే పెద్ద హాస్పటల్ ఉందిగా-అందులోని అపాంట్ చేసుకోవచ్చుగా...." అంది స్నేహ అనుమానం వ్యక్తం చేస్తూ

"వాళ్ళ హాస్పటల్‌లో వేకన్సీస్ ప్రస్తుతానికి లేకపోవచ్చు. లేదా ఇంకేదైన కమిట్‌మెంట్ ఉండి ఉండవచ్చు. పెద్దాయన, సీనియర్ గైడ్, మంచి మనిషి అడిగారు, ఎందుకు కాదనాలి అని ఓకే. చేసాను."

కాని, ఆ క్షణంలో అభిమన్యుకు తెలియదు ఒక ప్రమాదాన్ని చేతులార తెచ్చుకుంటున్నాడని, - దాని ఫలితంగానే మరో కొద్ది గంటల్లో తన ప్రాజెక్ట్-ని ప్రయోగానికి గ్రహణం పట్టబోతుందని,

"ఓ.కె, నేను యీవినింగ్ కలుస్తాన్, సీ.యూ!" అని చెప్పి వెళ్ళిపోయింది స్నేహిత.

అభిమన్యు ఇంటర్ కమ్ నొక్కి సెక్రటరితో "డాక్టర్ సిద్ధార్థ్‌ను ఓసారి రమ్మని చెప్పండి," అని చెప్పి, తిరిగి తృప్తిగా మరోసారి ప్రాజెక్ట్-ని ఫైల్ చూడటంలో నిమగ్నమైపోయాడు. అభిమన్యు మనసులో చెప్పలేని ఆనందం, గుండెలోనుంచి గొంతులోవరకు ఆనంద తరంగాలు ఊపిరి ఆడనివ్వటంలేదు. ఆ ఆనందం వర్ణించటం అసాధ్యం. ఆ ఆనందంలో చిరుగర్వం ధీమాలు కూడా ఉన్నాయి.

మూడు సంవత్సరాలు రాత్రనక పగలనకా నిరంతరం ప్రాజెక్ట్-ని గురించే ఆలోచనలు, ఎవరితో మాట్లాడుతున్న, కూర్చున్న, నిల్చున్న, పడుకున్న, నిద్రలో కూడా ప్రాజెక్ట్-ని గురించే ఆలోచన. చివరకు కలలు కన్న ప్రాజెక్ట్-ని సక్సెస్ అయినట్లే. ఇన్నాళ్ళకు తను కన్న కలలు నిజం కాబోతున్నాయని, మూడు సంవత్సరాలు నిరంతర శ్రమ దీక్షలు ఒకరూపం దాల్చబోతున్నాయని ఒక అనిర్వచనీయమైన ఆనంద అనుభూతితో అభిమన్యు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు.

డాక్టర్ సిద్ధార్థ అభిమన్యు ఛాంబర్‌లోనికి వచ్చాడు.

"'వెల్‌కమ్ మిష్టర్ సిద్ధార్థ'' అన్నాడు ఆనందంగా అభిమన్యు సిద్ధార్థ వైపు చూస్తూ.

''గుడ్ మార్నింగ్ డాక్టర్", అంటూ లోపలికి వచ్చాడు.

"యస్.... వెరి గుడ్ మార్నింగ్.... ప్లీజ్ టేక్ యువర్ సీట్...." అన్నాడు హుందాగా....

సిద్ధార్థ కూర్చుంటూ ''ఈ రోజు మీరు చాలా సంతోషంగా కనిపిస్తున్నారు డాక్టర్".

''అవును. సిద్ధార్థ నా జీవితంలో ఇన్ని నాళ్ళు నేను పడిన శ్రమకు, మరొ కొద్ది గంటలలో ఫలితం దక్కబోతోంది....'' నేను నా జీవిత ఆశయాన్ని పొందిన ఆనందం కలుగుతున్నది సిద్ధార్థ అది సరే. సాంపిల్ టెస్ట్ కోసం ఏర్పాట్లు పూర్తి చేశారా.... ఎప్పుడు స్టార్ట్ చేయాలని....''

''అన్నీ కరెక్ట్‌గా అరేంజ్ చేసారు సార్ డా॥ ప్రశాంత్ కుమార్ గారు. క్యాన్సర్ వార్డ్‌లోనే ఉన్న ఓ పెషంట్ అనుమతితోనే, వాళ్ళ చేత అన్ని ఫార్మాలిటీస్ ఈ రోజు పూర్తి చేయాలని ప్రోగ్రామ్ ఫిక్స్ చేశారు. డాక్టర్ ప్రశాంత్‌గారు ''రేపు ఉదయం ఎనిమిది గంటలకు పేషంట్‌ని స్పెషల్ వార్డ్‌లో సాంపిల్ డోస్ ఇవ్వాలి అనుకుంటున్నారు. సర్ డాక్టర్ విశ్వామిత్రగారు" అని ఆగాడు

''నైస్, డా॥ విశ్వామిత్రగారు కూడా ఈ ప్రాజెక్ట్‌లో చాలా కృషి చేశారు. ఆ మహామనిషికి ఏం ఇచ్చి ఋణం తీర్చుకోగలం?.... ఓ.కే. మీరు ఈ రోజు ఆ పేషంట్‌తో వాళ్ళ బంధువులతో పర్మిషన్ తీసికొని ఫార్మలిటీస్ అన్నీ జాగ్రత్తగా పూర్తి చేయండి; నేను ఈ రోజు జరిగిన ఆపరేషన్ రిపోర్ట్స్ చూసుకొని మధ్యాహ్నం పన్నెండు గంటలకు ల్యాబ్‌కు వస్తాను. మీరు వెళ్ళి త్వరగా ఆ సాంపిల్ డోస్‌ను, పేషంట్‌ను అరేంజ్ చేయండి" అన్నాడు అభిమన్యు.

"ఓకే సార్!...." అంటూ సిద్ధార్థ చాంబర్ నుండి బయటకు నడిచాడు.

సరిగ్గా పదకొండున్నరకు సెక్రటరీ రేవతి వచ్చి ఆ రోజు జరిగిన ఆపరేషన్స్ సంబంధించి. రిపోర్ట్ ఫైల్ ఇచ్చి వెళ్ళింది. ఫైల్ తీసి చూసాడు.

ప్రతి హాస్పటల్ తనదంటు ఒక పద్ధతిని పాటిస్తుంది. కాని ప్రతి హాస్పటల్ ముఖ్యధ్యేయం పని త్వరగా సమర్థవంతంగా జరగాలనే.

డాక్టర్ అభిమన్యు హాస్పటల్ కూడ ఓ చక్కటి పద్ధతి పాటిస్తుంది. అది ఏమిటంటే ఎమర్జన్సీ కాని - సర్జికల్ కేసులన్ని అడ్మిట్ అయిన మరుసటి రోజు ఉదయాన్నే అన్ని ఆపరేషన్స్ చేస్తారు. అందు కోసమే రెండు ఆపరేషన్ థియేటర్స్ ప్లాన్ ప్రకారం నిర్మించారు.

ఆ రోజు ఆపరేషన్స్ ఫైల్‌లో చిన్న ఆపరేషన్స్ మొత్తం ఎనిమిది, పెద్ద ఆపరేషన్స్ ఓ రెండు ఉన్నాయి. అన్ని సక్సస్. ఆ ఫైల్ పూర్తిగా క్షుణ్ణంగా పరిశీలించి క్లోజ్ చేసేవరకు పన్నెండు కావచ్చింది. ఫైల్ క్లోజ్ చేసి లేచి ల్యాబ్‌కు బయలుదేరాడు అభిమన్యు.

ఆ హాస్పటల్ ఐదవ అంతస్తు అంతా రిసర్చ్‌కు మాత్రమే సంబంధించింది. ఈ అంతస్తంతా ఎయిర్ కండిషన్ చేయించారు.

డాక్టర్ అభిమన్యు ఐదవ అంతస్తులోని కారిడార్‌లో నడుస్తున్నాడు. ఆ అంతస్తంతా చాలా కామ్‌గా ఉంది. ప్రాజెక్ట్-సి. ల్యాబ్ ముందు అభిమన్యు రావటం చూసి వార్డ్‌బాయ్ గౌరవంగా నమస్కారం చేసి, ప్రాజెక్టు-సి. ల్యాబ్ డోర్ తెరచి పట్టుకున్నాడు.

అభిమన్యు ల్యాబ్ లోపలికి వెళ్ళాడు.

ల్యాబ్‌లో అంతా ఏదో మందువాసన, ఇదమిత్థంగా ఆ వాసన ఇది అని చెప్పలేని విధంగా ఉంది.

ఆ ల్యాబ్‌లో నలుగురు అసిస్టెంట్స్, విశ్వామిత్ర, సిద్ధార్థ ఉంటారు. అభిమన్యుని చూసి అసిస్టెంట్స్ లేచి నిలబడ్డారు.

"కూర్చొండి....'' అని సైగ చేశాడు అభిమన్యు ఆదరంగా. అసిస్టెంట్స్ ఎవరి స్థానాలలో వాళ్ళు కూర్చొని పనులు చేస్తున్నారు.

ల్యాబ్‌లోనే ఓవైపు కంప్యూటర్ విభాగం ఉంది.

డాక్టర్ విశ్వామిత్ర ఏదో ఎర్ర రంగు లిక్విడ్‌ని చాలా తీక్షణంగా టెస్టు చేస్తున్నారు.

ఆయన రీసెర్చ్‌లో మునిగితే, అన్నీ మరచిపోతారు. అభిమన్యు రావటం గమనించలేదు. విశ్వామిత్రగారు తన పనిలో తను ఉన్నారు.

డా॥ విశ్వామిత్ర ఓ పది నిమిషాల తరువాత ఎందుకో వెనక్కి తిరిగి చూశారు. వెనకనే డా॥ అభిమన్యు కళ్ళతోనే నవ్వుతూ నిలబడి ఉన్నాడు,

"హల్లో అభి.... ఎప్పుడు వచ్చారు?" అన్నారు డా॥ విశ్వామిత్ర.

"ఇప్పుడే-జెస్ట నౌ" అన్నాడు అభిమన్యు నవ్వుతూ.

"మన ప్రాజెక్ట్-నికి సంబంధించిన ఇంప్రువ్‌మెంట్ ఫైల్ పంపాను చూసారా? పర్‌ఫెక్ట్‌గా జేసాము అభి! ఇక రేపు ఉదయం దాన్ని టెస్ట్ డోస్‌గా అప్లయ్ చేయటమే ఆలస్యం. ..ఏం కంగారు పడాల్సిన పనిలేదు అభి! ఎలాంటి సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా చాలా జాగ్రత్తలు తీసుకున్నాను...."

''థాంక్‌యూ సార్....'' అన్నాడు అభిమన్యు ఆనందంగా.

సిద్దార్థ బయట నుంచి ల్యాబ్ లోనికి వచ్చాడు. "శాంపిల్ డోస్ టెస్ట్ కోసం అన్ని ఫార్మాలిటీస్ పూర్తి చేసాను సార్! ఆ పేషంట్ వాళ్ళ బంధువుల చేత కూడ డాక్యుమెంట్స్ మీద సంతకాలు తీసుకున్నాను. పేషంట్‌ని స్పెషల్ వార్డ్‌లోనికి మార్పించాను'' అన్నాడు సిద్దార్థ.

''గుడ్....'' అన్నాడు విశ్వామిత్ర తన ధోరణిలో.

''ఓకే డాక్టర్! నేను వస్తాను ఈవినింగ్ నా ఛాంబర్‌లో చిన్న మీటింగ్ అరేంజ్ చేసాను మీరు రండి, అక్కడ డిస్కస్ చేద్దాం—'' అన్నాడు అభిమన్యు, డా॥ విశ్వామిత్ర సిద్దార్థలని ఉద్దేశించి.

మధ్యాహ్నం రెండు గంటలకు అభిమన్యు భోజనానికి బయలు దేరాడు. డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు. కాని, ఆకలిగా లేదు. ప్రాజెక్ట్-ని గురించి ఆలోచిస్తుంటే అభిమన్యుకు క్షణ క్షణానికి మనసంతా ఆనందంతో నిండిపోతున్నది. ఏదో ఆనందపుపొర గొంతుకడ్డుపడుతున్నది. జీవితంలో ఒక విషయాన్ని సాధించబోయే ముందు ఎవరికైనా అలాగే ఉంటుంది. ఇప్పుడు అభిమన్యు కూడా అదే స్థితిలో ఉన్నాడు, - ఆకలి ఉండదు, దాహం ఉండదు, కేవలం ధ్యేయం - అది సాధించబోతున్నాను అన్న తృప్తి ఆకలిని, దాహాన్ని పట్టించుకోదు - చివరకు నిద్ర కూడా పోనివ్వదు ఆ ఆనందం.

అభిమన్యుకు రోజూ మధ్యాహ్నం భోజనం అయిన తర్వాత ఓ గంట నిద్రపోవటం అలవాటు. ఆ తరువాత సాయంత్రం నాలుగు గంటలకు హాస్పటల్‌కి వెళ్ళి రాత్రి పది పదకొండు గంటల వరకు సీరియస్ కేసులు చూస్తూ ఉంటారు. ఎన్ని పనులున్నా ప్రతిరోజు రాత్రి ఎనిమిది గంటల నుండి తొమ్మిది గంటల వరకు రౌండ్స్‌కు మాత్రం తప్పని సరిగ్గా వెళ్తారు- డా॥ అభిమన్యు మిగతా సమయాలలో ఏ పనిలో ఉన్నా రాత్రి ఎనిమిది గంటల నుండి తొమ్మిది గంటలలో మాత్రం రౌండ్స్‌లో ఉంటారు. (రౌండ్స్ అంటే అడ్మిట్‌లో ఉన్న పేషంటులను పరామర్శించి, పరిశీలించటం) కాని, ఆ రోజు మధ్యాహ్నం నిద్రకూడా రావటం లేదు. టేబుల్ మీద ఉన్న ఆరోజు పేపర్ చదవటం ప్రారంభించాడు. పేపర్ చదువుతున్నా అభిమన్యు ఆలోచనలన్నీ తన ప్రయోగ పరీక్ష చేయటానికి ఎలాంటి చర్యలు తీసుకోవాలనే ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నాడు అంతకంటే మించి ఆనందం....

సాయంత్రం నాలుగు గంటలకు వెళ్ళి తన ఛాంబర్‌లో కూర్చున్నాడు. ఐదు గంటలు అవుతుందనగా డా॥ ప్రశాంత కుమార్, కొంత మంది సీనియర్ సర్జన్స్ స్నేహలత, డా॥ విశ్వామిత్ర, సిద్ధార్థ వచ్చారు.

అక్కడికి వచ్చిన వారందరి ముఖాలలో ఒక మంచి పనిలో పాల్గొన్నాము అన్న ఆనందం వెల్లి విరుస్తున్నది.

అభిమన్యు అంటే అందరికీ గౌరవం. అంతకంటే మంచి అభిమానం. అతన్ని ఒక ఆరాధన భావంతో చూస్తారు. దానికి కారణాలు అనేకం. వాటిలో అతి చిన్న వయసులోనే ఒక పెద్ద హాస్పటల్‌ని నిర్మించటం ఒకటి అంతేకాక, దాన్ని సమర్థవంతంగా నడపటం కూడా మరొక కారణం కావచ్చు.

వందల సంఖ్యలో వచ్చే అన్నిరకాల రోగులకు డాక్టర్ అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్ ఓ చల్లటి ఆస్వాదన. కేవలం ఉన్నత వర్గాలకే అంకితం కాకుండా మధ్య తరగతి, క్రింది తరగతుల జనాభా కోసం వారికి అందుబాటులో ప్రత్యేక సర్వీసులు నెలకొల్పి, దక్షిణ భారతదేశంలో ఒక ప్రత్యేకమైన గుర్తింపు వున్న హాస్పటల్‌గా పేరుపొందింది.

ఒక పెద్ద హాస్పటల్‌లో సర్వీస్ చేస్తున్నా మన్న తృప్తి ఆ స్టాఫ్ అందరిలో ఉంది. ఇది ఒక వంతైతే, గవర్నమెంట్ డాక్టర్స్‌కు ఉండే అన్ని సదుపాయాలు అభిమన్యు హాస్పటలో ఉద్యోగం చేసే వారికి హెచ్. ఆర్. ఎ., సిటీ అలవెన్సు లాంటి అన్ని సదుపాయాలు ఉన్నాయి. అదేకాక హాస్పటల్‌కు దగ్గరలోనే నర్స్ క్వార్టర్స్, డాక్టర్స్ క్వార్టర్స్ అన్ని హంగులు, అన్ని స్పెషాలిటీస్ కల్పించిన అభిమన్యుని గౌరవంగా ఆవరంగా చూడటంలో ఆశ్చర్యం లేదు.

అభిమన్యుకు ఎదురుగా కూర్చున్న సీనియర్ డాక్టర్స్, సైంటిస్టులందరు, ల్యాబ్ అసిస్టెంట్స్ కూర్చొని ఉన్నారు. వాళ్ళంతా అభిమన్యు వైపే చూస్తూ ఉన్నారు, అభిమన్యు ఎప్పుడు మాట్లాడుతాడా అని ఆశగా. అందరి చూపులలో అభిమన్యు పట్ల ఓ ఆరాధన భావం ఉంది.

గోడ గడియారం రిథమిక్‌గా సాయంత్రం ఐదు గంటలయిందని గుర్తు చేసింది.

అభిమన్యు గొంతు సవరించుకొని, "గుడ్ ఈవినింగ్ టు ఆల్ ఆఫ్‌యూ, ప్లీజ్ బీ కంఫర్ట్ బుల్....చాలా రోజుల తర్వాత మనం మరలా ప్రాజెక్ట్-సిని రేపు టెస్ట్ బేస్‌లో ఉపయోగించ (ప్రయోగించ) బోతున్నాము.

ఎంతో దీక్షతో పట్టుదలతో కొత్త విషయాలను కనుగొన్న ప్రతి వ్యక్తిని ఆదిమ సమాజం మొదట తృణీకరించింది, నిర్లక్ష్యం చేసింది. కానీ నేడు మనం ఎంతో అదృష్టవంతులం. మన ప్రస్తుత సమాజం ఎప్పుడూ క్రొత్త విషయాలు తెలుసుకోవటం పట్ల ఎంతో ఆసక్తిని చూపుతుంది.

మీ కందరికి తెలుసు - ఈ ప్రాజెక్ట్-సి ప్రారంభించి మూడు సంవత్సరాలు దాటిపోయింది. దీనికిగాను పన్నెండులక్షలుకంటే ఎక్కువ మొత్తం ఖర్చు అయింది. ఈ ప్రాజెక్ట్‌లో మనం ఈ స్థాయికి రావటానికి ఎన్నో జటిలమైన సమస్యలను ఎదుర్కొన్నాం. ఆ మాటకొస్తే ప్రతి మహోత్కృష్టమైన కార్యంఎంతో జటిలమైందే....మీరందరూ ఈ ప్రోగ్రామ్ జయప్రదం అయ్యేందుకు అన్ని విధాలుగా సహకరిస్తారని అనుకుంటున్నాను....," అభిమన్యు మాటల్లోని హుందాతనం వెన్నెల చల్లదనంలా ఉంది; ఆ మాటలు వింటున్నవారికి ఎంతో తృప్తిగా ఉంది.

ఏ ప్రశ్నకైనా వెంటనే సమాధానం చెప్పగల స్పాంటేనిటీ-ఉన్న అభిమన్యు ఆ తరువాత ఏం చెప్పాలో మాటలు వెతుకున్నాడు ఆనందంతో.

ఆ ఆనందం అభిమన్యు ఒకనిది కాదు-అక్కడ ఉన్నవారందరిలో అదే ఆనందం, ఉత్సాహం కనిపిస్తున్నది. అందరి ముఖాల మీద చిరునవ్వు.

కాని అక్కడ ఉన్నవారిలో ఏ ఒక్కరికి తెలియదు - మరో కొద్ది గంటలలో ప్రాజెక్ట్-సి బ్లాస్ట్ అవుతుందని అభిమన్యు జీవితంలోని మధుర స్వప్నం నెరవేరబోతుందని ఆనందపడుతున్నారే కాని, ప్రయోగశాల సెక్యూరిటీ గురించి ఎవరూ కనీసం ఆలోచించలేకపోయారు ఆక్షణం.

మీటింగ్ ముగించేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది.

అభిమన్యు రౌండ్స్‌కు బయలుదేరాడు. అభిమన్యు రౌండ్స్‌కు వెళ్ళితే హాస్పటల్ స్టాఫ్ అంతా ఒకటే కంగారు కారణం అభిమన్యు ఎక్కడ తప్పుపడతారోనని. కాని సాధారణంగా ఎవరి మీద కోపపడని మనస్తత్వం అభిమన్యుది. అయినా హాస్పటల్‌లోని స్టాఫ్ అంతా ఒకటే కంగారు అభిమన్యు రౌండ్స్‌లో ఉంటే.

మొదట జనరల్ వార్డ్, తరువాత పిడియాట్రిక్ వార్డ్, ఆ తరువాత లేడిస్ వార్డ్ - అలా వరుసగా చూస్తూ చివరగా స్పెషల్ వార్డ్స్ చూడటం అభిమన్యుకు అలవాటు. రౌండ్స్ పూర్తిచేసేసరికి గంట పట్టింది. సీరియస్ కేసులు ఏమి లేవు.

హాస్పటల్‌నుంచి ఇంటికి వెళ్ళేసరికి రాత్రి తొమ్మిదిన్నర అయింది. ఫ్రెష్‌గా తలస్నానం చేసి వచ్చి భోజనానికి డైనింగ్ టేబుల్ దగ్గరికి వచ్చాడు. ఆకలిగా లేదు, అయినా ఏదో ఒకటి తినాలి - తినకపోతే పని మనిషి బాధపడుతాడని అభిమన్యుకి తెలుసు. అందువలన భోజనం పూర్తి అయిందనిపించి లేచి, వెళ్ళి బెడ్ రూమ్‌లో నడుం వాల్చాడు.

అభిమన్యుకి మరలా ఆలోచనలు ప్రాజెక్ట్‌-ని చుట్టూ చేరాయి. తన సాధించబోయే విజయాన్ని తలచుకుంటుంటే మనసు ఆనందంతో ఉప్పొంగిపోతున్నది.

ఎన్నో ఏళ్ళ నుంచి తను కన్న కలలు, ఆశలు; మరో కొద్ది గంటలలో ప్రపంచాన్నే ఓ మలుపు మలచబోతున్న తన ప్రయోగ ఫలితం - అభిమన్యు ఆనందానికి హద్దులు లేవు. ఆ ఆనందంలో నిద్ర కూడా రావడం లేదు.

బాల్యం నుంచి జరిగిన ప్రతి ఒక్క సంఘటన ఒక్కొక్కటిగా గుర్తుకు వస్తున్నది అభిమన్యుకి.

*　　*　　*

అప్పుడు అభిమన్యుకి వయసు ఆరేళ్ళు

అమ్మ లేదు. నాన్న ఏదో పేరు తెలియని రోగంతో మంచం పట్టి ఉన్నాడు. చిన్న కుగ్రామం ఆ ఊరు.

ఆ గ్రామంలో అందరికి బాగా తెలిసిన వైద్యుడు "రావులపల్లి తాత", కల్వంలో ఏదో మందులు వేసి నూరుతున్నాడు అభిమన్యు తండ్రికి తాపించటానికి.

ఆరేళ్ళ అభిమన్యు ఎంతో ఆసక్తిగా రావులపల్లి తాత ఏ యే వేర్లు, మందులు వేసి నూరుతాడా అని ఆసక్తి చూస్తున్నాడు.

పాల బుగ్గలతో ఉన్న అభిమన్యు ఎంతో ఆసక్తిగా అమాయకంగా "తాతా! ఆ మందు తాగితే మా అయ్య లేచి తిరుగుతాడా?" అని అడిగాడు?

"తప్పకుండారా, భడవ....", అనేవాడు రావులపల్లి తాత.

ఆ గ్రామానికి దగ్గరలో పెద్ద ఆసుపత్రి లేదు.

ఒకసారి రావులపల్లి తాత ఏవో పేర్లు తెలియని వేర్లు, కాయలు, రకరకాల ఆకులు అన్నీ లెక్క ప్రకారం తూచి కల్వంలో వేసి నూరుతున్నాడు.

అక్కడే చూస్తూ నిలుచొని ఉన్న అభిమన్యుకు ఏమనిపించిందో "తాతా! ఆ మందులు రోజూ కొంచెం కొంచెం ఎందుకు వేసి నూరుతావు? ఒకే రోజు బోలెడు మందులు నూరి మా అయ్యకు తాపవచ్చు కదా, అప్పుడు మా అయ్యకి ఎంచక్కా తొందరగా బాగైయుండక దా?" అన్నాడు కళ్ళు తిప్పుతూ.

రావులపల్లి తాత ఆరేళ్ళ అభిమన్యుని దగ్గరకు తీసుకొని గుండెలకు హత్తుకొని "ఆ మాయదారి జబ్బుకు ఇంకా మందులు ఇంగ్లీష్ వాళ్ళే కనుక్కోలేదటరా, ఏదో దేవుని పేరు తీసుకొని....'' ఇక చెప్పలేక బాధపడ్డాడు.

"అయితే తాతా, పెద్దయి నేను కనుక్కుంటాను అయ్యకు మందు కనుక్కుంటాను" అన్నాడు ఆ బుల్లి నోటితో.

ఆ తరువాత కొద్ది రోజులకే అభిమన్యు తండ్రి చనిపోయాడు.

ఎవరో మనసున్న వాళ్ళు అభిమన్యును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హాస్టల్‌లో చేర్చారు. అక్కడ చదువుకొని, ఆ తరువాత ఎంతో కష్టంమీద ఒకపూట తిని, మరోపూట పస్తులుండి, ఆ తరువాత వారాలు చెప్పుకొని బి.యస్సి. పూర్తిచేసి, స్కాలర్‌షిప్‌మీద ఎమ్.బి.బి.యస్. పూర్తిచేశాడు.

ఎమ్. బి. బి. యస్. చదివే రోజుల్లో అభిమన్యును ఎంతో దగ్గరగా తీసేది శారదా మేడమ్ ప్రొఫెసర్ ఆవిడకు వయస్సు యాభై సంవత్సరాలు ఉంటాయి. కాని, పిల్లలు లేరు. అభిమన్యుని చాలా ప్రేమగా చూసే దేవతలాంటి ఆమెకు ఏ దేవుళ్ళు శపించారో, బ్రెస్ట్ క్యాన్సర్ వచ్చింది. ఎట్లైనా డాక్టర్ కదా, శారదా మేడమ్ తన పరిస్థితిని, వ్యాధిని వెంటనే తెలుసుకోగలిగింది కాని, చికిత్స ప్రారంభించక మానసికంగా కృంగి పోయింది. ఆ వ్యాధితో నాలుగు సంవత్సరాలు ఉన్నది. ఆ తరువాత అభిమన్యు హౌస్‌సర్జన్సీ చేసేటప్పుడు ఆవిడ చనిపోయారు అభిమన్యు ఓ నెల రోజుల వరకు మామూలు మనిషి కాలేదు. ఒక వేదన, తన డాక్టర్ అయి ఉండి కూడా తన గురువుని కాపాడుకోలేకపోయాననే బాధ అభిమన్యుని ఎప్పుడూ వెంటాడుతుండేది.

అభిమన్యు తన హౌస్‌సర్జన్సీ చేసే రోజుల్లో ఒకసారి తన గ్రామం వెళ్ళాలి అనుకున్నాడు. ఏదో పండుగకు శెలవు దొరికితే అభిమన్యు తన గ్రామం బయలుదేరాడు.

ప్రైవేట్ బస్ దుమ్ము రేపుకుంటూ రోడ్డుకు వారగా ఆగింది. దాదాపు ఇరవై సంవత్సరాల తరువాత అభిమన్యు తన గ్రామం చూడటం. ఆ గ్రామం చాలా సామాన్యంగా ఉంది.

అది ఆంధ్ర ప్రదేశ్ లోని ఓ మారుమూల గ్రామం. ఊరికి తూర్పుగా ఎర్రమట్టి కొండ, పడమరగా మరో కొండ పచ్చగా. ఎటు చూసినా దూరంగా కొండలు.

ఊరిలో పెద్ద మార్పులు ఏమీ లేవు. ఆ గ్రామానికి దగ్గరలో పట్నం లేదు. ఈ ప్రపంచపు నాగరికతలకు దూరంగా విసిరేసినట్లుగా ఉంది ఆ ఊరు. బస్‌లోనుంచి దిగి అలవాటైన దారిలో నడుస్తున్నాడు. రాత్రి బాగా వర్షం పడినట్లుంది.

గ్రామం వీధులన్నీ రొచ్చురొచ్చుగా ఉన్నాయి. ఊరు టైఫాయిడ్ జ్వరంతో మంచం పట్టినట్లుగా ఉంది.

ఊరికి మొదట్లో పెద్ద దిగుడు బావి దగ్గర ఓ మలుపు తిరిగితే పెద్ద వీధి, వీధిలో అటు ఇటు పెద్ద ఇల్లు, చిన్న ఇల్లు. పూరిల్లు, అదే పెద్ద వీధి ఆ ఊరిలో ..., ఆ వీధి చివరలో రామస్వామి దేవాలయం.

ఊరిలో అభిమన్యుని ఎవరు గుర్తు పట్టటంలేదు. కాని అందరు పరీక్షగా చూస్తున్నారు. అభిమన్యు చిన్నప్పుడు ఉన్న ఇంటికి వెళ్ళాడు - ఎవరో ఉంటున్నారు. అభిమన్యు తన గురించి తన తండ్రి గురించి చెప్పాడు. ఒకరిద్దరు గుర్తు పట్టారు.

తనకు తన వాళ్ళు ఎవరులేకున్నా ఆ ఊరిని చూడటానికి రావటం ముఖ్య కారణం ఏమిటంటే-ఆ ఊరికి అతనికి ఉన్న దగ్గరి సంబంధమే. ఆ ఊరిలోనే అభిమన్యు పుట్టాడు, పెరిగాడు. అదే ఆ దగ్గరి సంబంధం - అది అందరికీ అర్థంకాదు- మనసు ఉన్న వాళ్ళకు తప్ప.

*　　*　　*

అభిమన్యు బెడ్ రూమ్ ఫోన్ రింగ్ అవుతున్నది.

"ట్రింగ్...ట్రింగ్...,"

ఆ శబ్దానికి గతంలోంచి వర్తమానంలోకి వచ్చాడు.

రిసీవర్ అందుకున్నాడు.

"........"

"యస్, అభిమన్యు హియర్" అన్నాడు.

"కంగ్రాచులేషన్స్ అభి, రేపు ప్రాజెక్ట్ ని శాంపిల్ టెస్ట్ చేస్తున్నారటగా" అన్నాడు అవతల వైపునుంచి చౌదరి.

"అవును, సార్ ..."

"అయితే నేను చూడటానికి రావచ్చా రేపు ఉదయం...."

"ఓ, తప్పకుండా....నేనే చెప్పాలి అనుకున్నాను....బై మిస్టేక్ మిస్ అయ్యాను, తప్పకుండా రండి" అన్నాడు అభిమన్యు

అభిమన్యుకి ఎప్పుడు అందరిని ప్లీజింగ్‌గా కన్విన్స్ చేయటం అలవాటు; అది అందరిలో ఉండని ఓ అరుదైన గుణం.

"అయితే రేపు శాంపిల్ టెస్ట్ వాచ్ చేయటానికి వస్తాను. ఇంత రాత్రివేళ డిస్టరబ్ చేసినందుకు సారీ - ఉంటాను మరి" అన్నాడు చౌదరి అవతలి వైపు నుంచి మరోమాటకు ఆస్కారం ఇవ్వకుండా.

అభిమన్యు ఫోన్ క్రేడిల్ చేసి టైమ్ చూసుకున్నాడు. పన్నెండు గంటలు కావస్తున్నది.

అభిమన్యు బంగారు భవిష్యత్‌లోకి పూవుల పడవలో వెళ్ళుతున్నట్లుగా ఫీలింగ్. - ఆ క్షణంలో అభిమన్యుకి తెలియదు మరో-కొద్ది గంటల్లో తన రీసర్చ్ ల్యాబ్ అంతా నాశనం కాబోతుందని.

తియ్యటి ఊహలలో ఎప్పటికో నిద్ర ఒడిలోకి జారుకున్నాడు.

*  *  *

నగరానికి సరిగా ముప్పయి కిలోమీటర్ల దూరంలో నేషనల్ హైవేకి ప్రక్కగా ఓ అందమైన రెండస్థుల భవనం ఫ్లడ్ లైట్ల వెలుగులో తెల్లటి మంచుముక్కలా మెరిసి పోతున్నది. అది దేవేంద్రుడి గెస్టహౌస్‌లా ఉంది. ఇంకా చెప్పాలంటే దేవలోకం నుంచి ఓ భవనాన్ని తస్కరించి తెచ్చి ఇక్కడ అమర్చినట్లుంది.

భవనం పోర్టికోలో మారుతీ జిప్సీ ఆగి ఉంది.

భవనానికి చుట్టూ ఖాళీస్థలం. ఆ తరువాత ఎత్తైన ప్రహరీ గోడ. ఆ ప్రహరీ గోడ దాటి బయటికి వస్తే అంతా నిశీధి, కటిక చీకటి, దానికి తోడు కీచుమంటూ శబ్దం.

ఆ భవనంలో నుండి బయటికి వస్తున్నారు ముగ్గురు. వాళ్ళు చాలా రఫ్‌గా ఉన్నారు - చాలా ధీమాగా నడుస్తున్నారు త్రిమూర్తుల్లా.... సృష్టి లయ, కార్య విధ్వంసాలకు తామే కారకులు అన్నంత ధీమాగా ఉంది వాళ్ళ నడక.

వాళ్ళ పేర్లు నరేంద్ర, లూథర్, మస్తాన్. ఆ ముగ్గురు విధ్వంసం, అన్యాయం, అక్రమం అనే వాళ్ళకు దత్తపుత్రుల్లా ఉన్నారు.

బిల్డింగ్ బయట నిశీధిలో ఒక వారగా నిలబెట్టిన తమ జీప్‌వైపు నడుస్తున్నారు - వాళ్ళకు ఆ క్షణంలో తెలియదు-తాము ఒక వ్యక్తి మూడు సంవత్సరాలు అహోరాత్రులు శ్రమపడి కనుగొన్న ఒక అపూర్వ ప్రాజెక్ట్‌ను నాశనం చేయబోతున్నారని.

వాళ్ళ ముందునుంచి ఓ లారి గంటకు ఎనభై కిలోమీటర్ల వేగంతో దూసుకొని వెళ్ళింది. ఆ వేగానికి దుమ్ము రేగి నరేంద్ర కళ్ళలో పడింది. "దొంగ నాయాళ్ళు, తాగి క్రింద మీద చూడకుండ పోనిస్తుంటారు.... లఫూట్ లం...." అని తిట్లకు లంకించుకున్నాడు నరేంద్ర.

"ఆగు భై. నీవు అలా తిట్టకూడదు. ఈ క్షణం నుండి నీవు ఒక డాక్టర్‌లా ప్రవర్తించాలి. లేకపోతే మన ప్లాన్ అంతా గోల్‌మాల్ అవుతుంది. అప్పుడు మళ్ళీ పరేషాన్ అవ్వాల్సి వస్తుంది....'' అన్నాడు వెనక నుండి నరేంద్ర వీపు చరుస్తూ మస్తాన్ వేళాకోళంగా....

"ఇంజెక్షన్ ఎలా పట్టుకోవాలో తెలియని మనకి ఖలేపని అప్పగించాడురా మన బాస్" అంటూ వెళ్ళి డ్రైవింగ్ సీట్‌లో కూర్చున్నాడు లూథర్.

లూథర్ మాటలకు వెంటనే రియాక్ట్ అయి "నీకు తెలియదేమో, నాకు ఇంజెక్షన్ ఎలా వేయాలో కూడా తెలుసు ..." అన్నాడు రోషంగా నరేంద్ర.

"సర్లే భై నువ్వు బి యస్‌సీ డిగ్రీ అయితే లూథర్ కామర్స్‌డిగ్రీ. నీకు ఇంజెక్షన్ వేయటం వస్తే....లూథర్‌కి వడ్డీ లెక్కలు వచ్చు...., ఏం అంటావ్ భై .... అన్నాడు మస్తాన్ ఇద్దరిని కన్విన్స్ చేస్తున్నట్లుగా.

ముగ్గురు వెళ్ళి జీప్ ఎక్కారు.

లూథర్ స్టార్ట్ చేశాడు. జీప్ హెడ్‌లైట్స్ వెలిగాయి. జీప్ రోడ్డెక్కింది... ఫాస్ట్‌గా సిటీవైపు వెళుతున్నది.

అంతా చీకటి....

జీప్ హెడ్‌లైట్స్ వెలుగులో సిటీవైపు దూసుకొని వెళ్తున్నది.

''టైమ్ ఏమయింది భై'' అన్నాడు అలవోకగా మస్తాన్.

"పదకొండు దాటింది'' అన్నాడు లూథర్.

జీప్ హెడ్‌లైట్స్‌కు ఎదుటగా చిన్న చిన్న మినుగురు పురుగులు ఇంకేవో పురుగులు అడ్డొచ్చి దయనీయంగా క్రిందకు రాలిపోతున్నాయి.

సరిగ్గా పదకొండున్నరకు అభిమన్యు మెడికల్ ఇన్‌స్టిట్యూట్ ముందు ఉండాలి అని వాళ్ళ ప్లాన్ షెడ్యూల్. ఆ తరువాత రిసర్చ్‌బ్లాక్

లోకి వెళ్ళి ప్రాజెక్ట్-నిని విధ్వంసం చేసి, ప్రాజెక్ట్-నికి సంబంధించిన ఫార్ములు చేజిక్కించుకోవాలి.

జీప్ వేగంగా సిటీవైపు వెళ్తున్నది.

నరేంద్ర తన దగ్గర ఉన్న బ్రీఫ్‌కేస్ తెరిచాడు. అందులో స్టెత స్కోప్, వైట్‌కోట్, అదికాక ఓ పాకెట్ రేడియో సైజ్‌లో ఎర్రటి వస్తువు. ఈ వస్తువులు తృప్తిగా చూసుకొని మరలా సూట్‌కేస్ మూసాడు.

ఈ దేశంలో జరిగే అతి హేయమైన, దారుణమైన ఘోరాలు కేవలం కడుపు నింపుకోవడం కోసమే జరుగుతున్నా యనుకుంటున్నారా? కేవలం కడుపు నింపుకోడానికే అయితే ఇన్ని నేరాలు, ఇంత హేయంగా చేయవలసిన పని లేదు.

అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్‌కు కొంత దూరంగా రోడ్‌కు ఓ ప్రక్కగా జీప్‌ని పార్క్ చేశారు

నరేంద్ర తన దగ్గర ఉన్న చిన్న సూట్ కేస్‌లోని స్టెతస్కోప్ బయటకు తీసి మెడలో వేసుకొని, వైట్ డ్రస్ చేసుకున్నాడు.

రోడ్డు మీద జనసంచారం బాగా తక్కువగా ఉంది.

వాళ్ళను ఎవరూ పరిశీలించి చూసే ప్రశ్నేలేదు ఒకవేళ ఎవరైనా చూసినా వారిని ప్రొఫెషనల్ కిల్లర్స్ అని కాని, నొటోరియస్ క్రిమినల్స్ అని గాని అనుమానించలేరు. మస్తాన్, లూథర్ జీప్ బైనట్ తీసి రేడియేటర్ చెక్ చేస్తున్నారు, ఏదో ట్రబుల్ ఇచ్చింది అనిపించినట్లు. నిజానికి జీప్ సలక్షణంగానే ఉంది.

నరేంద్ర మాత్రం డాక్టర్ నరేంద్రలా చాలా హుందాగా జీప్ ప్రక్కనే నిలబడి ఛాన్సలర్ సిగరెట్ కాలుస్తున్నాడు.

రోడ్డు మీద దూరం నుంచి పోలీస్ వ్యాన్ వస్తూ ఉంది - రంగు రంగుల లైట్స్ వెలుగుతూ, అరుతూ ...

మస్తాన్ దృష్టి పోలీస్ వ్యాన్ మీద పడింది. గుండె జారిపోయినట్లు అనిపించి "యా.... అల్లా...." అన్నాడు గట్టిగా.

"ఏమైంది...." అని అడిగాడు లూథర్.

"అటు చూడు భై...." అంటూ కళ్ళతోనే సైగ చేస్తూ.

దూరం నుండి రంగు రంగుల లైట్స్ వెలుగుతూ ఆరిపోతూ...., శబ్దంతో దగ్గరవుతున్నది పోలీస్ వ్యాన్.

"ఓ మై గాడ్'' అన్నాడు అప్రయత్నంగా.

నరేంద్ర కూడ వచ్చే పోలీస్ వ్యాన్‌ని గమనించాడు. వెంటనే చేతిలో ఉన్న సగం కాలిన సిగరెట్‌ను క్రింద పారేసి ఎడమ బూట్ కాలితో చిదిమి రోడ్‌వైపుకు వచ్చాడు హుందాగా.

ముగ్గురిలో ఏ ఒక్కరు ఏమీ మాట్లాడటం లేదు.

మస్తాన్, లూథర్ ఇద్దరు ఏదో ఆలోచించుకుంటూ జీప్ రిపేర్ చేస్తున్నట్లు తెగ నటించేస్తున్నారు - పోలీస్ వాళ్ళకు అనుమానం రాకుండా ఉండటం కోసం.

నరేంద్ర మాత్రం రోడ్ వారగా నిలబడి జీప్ ట్రబుల్ ఇచ్చినందుకు అసహనాన్ని నటిస్తున్నాడు.

పోలీస్ వ్యాన్ సరిగ్గా వచ్చి వాళ్ళు ఉన్న ప్రదేశం దగ్గర స్లోగా ఆగింది.

వ్యాన్‌లో ఫ్రెంట్ సీట్‌లో కూర్చొని ఉన్న ఎస్. ఐ. తల బైటకు పెట్టి "కౌన్ హై తుమ్" అని అడగబోయి,

తెల్ల సూట్‌లో ఉన్న నరేంద్రను చూసి వెంటనే సర్దుకొని పొలైట్‌గా "వాట్ హాపెన్డ్" అని అడిగాడు.

"వెహికల్ ట్రబుల్...." అన్నడు నరేంద్ర భుజాలెగరేస్తూ. ఆ ఇంగ్లీష్‌కు ఆ డైలాగ్ డెలివరికి ఎస్.ఐ. ఏమనుకున్నాడో ఏమో ,

"యు వాంట్ లిఫ్ట్". అని అడిగాడు

"నో, థాంక్ యూ" అన్నాడు చిద్విలాసంగా నవ్వుతూ.

ఎస్.ఐ కూడా అదే తీరులో నవ్వి "సీ....యూ" అన్నాడు.

పోలీస్ వ్యాన్ ముందుకు కదిలింది. కొద్ది నిమిషాలలోనే పోలీస్ వ్యాన్ వాళ్ళకు చాలా దూరంగా వెళ్ళిపోయింది.

వ్యాన్ బాగా దూరంగా వెళ్ళింది అని నిర్ధారించుకున్నాక మస్తాన్ మెల్లగా తల ఎత్తి వ్యాన్ వెళ్తున్న వైపుచూస్తూ "పోలీసులలో కూడా లిఫ్ట్ ఇస్తాము అనేవాళ్ళు ఉంటారా?" అని దీర్ఘం తీస్తూ తీరికగా ఆశ్చర్య పోయాడు.

లూథర్ కూడా పోలీస్ వ్యాన్ వెళ్తున్న వైపు చూసి "ఆ....డిపార్ట్ మెంట్‌లో క్రొత్తగా చేరినట్లున్నాడు ..." అని స్టేట్‌మెంట్ పాస్ చేశాడు.

"మీరిద్దరూ పొరపడ్డారు, అదంతా మన వాక్ చాతుర్యం...." అంటూ కాలర్ ఎగరేసుకుంటూ అన్నాడు నరేంద్ర.

"సరేలే, పెద్ద డాక్టర్ దిగివచ్చాడసి" అని వాపోయాడు లూథర్.

ముగ్గురూ ఇక వాళ్ళ ఆపరేషన్ ప్రారంభించటానికి ఉద్యుక్తులవుతున్నారు.

సమయం రాత్రి పన్నెండు కావస్తున్నది.

దూరం నుంచి హాస్పటల్ మెయిన్‌గేట్ వైపు దృష్టి సారించారు.

ఎవరో ఇద్దరు వ్యక్తులు ఏదో మాట్లాడుతున్నారు గేట్ దగ్గర గూర్ఖాతో....వాళ్ళు ఏం మాట్లాడుతున్నారో స్పష్టంగా వినిపించటం లేదు జీప్ వరకు; ఆ వ్యక్తుల వాలకం చూస్తుంటే గూర్ఖాతో లోపలికి వెళ్ళటానికి కాళ్ళవేళ్ళపడుతున్నారు.

ఇదే మంచి సమయం ప్రహరీగోడ దూకి హాస్పటల్‌లోకి వెళ్ళటానికి కాని, వాళ్ళ ప్లాన్ ప్రకారం మెయిన్‌గేట్‌లోనుంచే హాస్పటల్‌లోకి వెళ్ళాలి. అదీ కాక బాస్ ఆర్డర్స్ ప్రకారం ఆపరేషన్ అంతా చాలా కూల్‌గా జరగాలి. హాస్పటల్‌లో వాళ్ళే ఈ అఘాయిత్యం చేశారా అనేలా చేయాలి పని అంతా.

ఆ యిద్దరు వ్యక్తుల్ని గూర్ఖా హాస్పటల్‌లోనికి పంపలేదు. వాళ్ళు ఉసూరుమని వెళ్ళిపోయారు. ఆ సమయంలో బయటివారు ఎవరైనా సరే హాస్పటల్‌లోనికి వెళ్ళటం కష్టం.కాని హాస్పటల్ స్టాఫ్ కాని, ఇంకెవరైనా హాస్పటల్ నుంచి బయటకు రావచ్చు.

హాస్పటల్‌కు దగ్గరలోనే అందరు స్పెషలిస్ట్‌ల ఇల్లు ఉన్నాయి. హాస్పటల్ మెయిన్ గేట్‌కు సరిగ్గా ముందుగా ఉన్న పెద్ద ఇల్లు పెడియాటిక్ స్పెషలిస్ట్ డా॥మనోహర్‌ది, ఆ ప్రక్కనే న్యూరాలజిస్ట్ సత్యమూర్తిది, ఆ ఇంటి ప్రక్కనే సర్జన్ దత్తాత్రేయది. ఏ డాక్టర్ అయినా కాలి నడకతో హాస్పటల్‌కు రావచ్చు - "డాక్టర్స్ కాలి నడకన హాస్పటల్‌కు రావటం" అనేది చాలా బలమైన పాయింట్‌గా ఉపయోగించుకుంటున్నారు ఈ క్రిమినల్స్.

నరేంద్ర తన పేరు మీద తయారైన దమ్మీ ఐడెంటిటీ కార్డ్ తీసి చిద్విలాసంగా నవ్వుకొని, లూథర్, మస్తాన్‌ల వైపు చూసి "మీరిక్కడే ఉండండి, ఏట్టి పరిస్థితులో అయినా కదలవద్దు" అని బయలుదేరాడు.

"జాగ్రత్తగా చెయ్యి బై", అని గొణిగాడు మస్తాన్.

ప్రక్కనే ఉన్న లూథర్ అందుకొని "చెయ్యటం ఏమిటి, నాశనం చేయటానికి వాడెళ్ళేది. అయినా చెయ్యాదమంటే వాడిపల్ల కాదు కాని, ధ్వంసం చెయ్యటమంటే రెండు నిమిషాల్లో చేసి పారేస్తాడు - అది వాడికి వెన్నతో పెట్టిన విద్య" అని జోక్ వేసి, గారపళ్ళు ఇకిలించాడు.

విధ్వంసం సృష్టించటం కోసం నరేంద్ర అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్ వైపు నడుస్తున్నాడు.

మన దేశంలో చాలా కొద్ది మంది మాత్రమే ఇతరులకు ఉపయోగ పడే పనులు చేస్తారు. కానీ వీటిని నాశనం చేయటానికి ఎప్పుడు మరి కొంతమంది చూసుకొనే ఉంటారు

వందల సంఖ్యలో వచ్చే అనేక రకాల రోగులకు నీడగా, సాంత్వ నగా, చల్లగా ఉన్న ఆ ఆరంతస్థుల అందమైన భవనంలో విధ్వంసం సృష్టించాలంటే నరేంద్రకు అంతరాత్మ చెపి మెలిపెట్టింది. కాని అతను అంతరాత్మ ప్రబోధాన్ని వినిపించుకొనే స్థితిలో లేడు.

మిల్క్‌వైట్ డ్రస్‌లో, మెడలో స్టెతస్కోప్‌తో మెయిన్ గేట్ దగ్గరకు వెళ్ళిన నరేంద్రను చూసి గూర్ఖా అటెన్షన్‌లో మారి,

"షలామ్ షాబ్'' అన్నాడు (ఆ గూర్ఖాకు "స" పలకదు, ''స'' అక్షరాన్ని ''ష''గా పలుకుతాడు)

నరేంద్ర నవ్వుతూ రిసీవ్ చేసుకొని, తన కోట్ జేబులో ఉన్న డమ్మి ఐడెంటిటి తీసి చూపబోయాడు.

''జరూరత్ నై షాబ్'' (ఆ అవసరం లేదు సార్) అన్నాడు గూర్ఖా వినయంగా.

నరేంద్ర హాస్పటల్ ఆవరణలోనికి ప్రవేశించాడు.

హాస్పటల్‌లోని అన్ని అంతస్థులు లైట్ల వెలుగులో వెలిగిపోతు న్నాయి. ఆ పరిసర ప్రాంతం అంతా ప్రశాంతంగా ఉంది.

గ్రౌండ్ ఫ్లోర్ ఓ.పి. సెక్షన్ కాబట్టి మరింత నిశబ్దంగా ఉంది.

నరేంద్ర లిఫ్ట్‌వైపు వెళ్ళాడు.

లిఫ్ట్ ఆ టైమ్‌లో రెస్ట్ తీసుకుంటూ ఉంది. నరేంద్ర లిఫ్ట్ లోపలికి వెళ్ళి రెండు డోర్స్ క్లోజ్ చేసుకొని-

ప్రశాంతంగా.. ఇండికేటర్‌లో ఐదవ నెంబర్ స్విచ్ నొక్కాడు.

లిఫ్ట్ ఏ మాత్రం శబ్దం లేకుండా పైకి వెళ్ళుతున్నది.

నరేంద్ర తన కోటు జాబులో ఉన్న చిన్న రేడియో సైజ్‌లో ఉన్న ఎర్ర వస్తువును చూసుకొని తృప్తిగా కళ్ళుమూసుకున్నాడు.

లిఫ్ట్ చిన్న జర్క్ ఇచ్చి ఐదవ అంతస్థులో ఆగింది.

రెండు డోర్స్ తెరచుకొని క్యారిడార్‌లోకి వెళ్ళాడు.

ఐదవ అంతస్థు అంతా ఏ.సి. చేసి ఉండటం వల్ల, ఒక్కసారిగ ఏ.సి. స్మెల్ నరేంద్ర ముఖం మీద కొట్టినట్లుగా వీచింది. ఐదవ అంతస్థ లోని క్యారిడార్‌లో మెల్లగా, జాగ్రత్తగా నడుస్తున్నాడు. అన్ని డోర్స్ క్లోజ్‌చేసి ఉన్నారు. కొన్ని డోర్స్‌మీద ఏవో కోడ్స్ వ్రాసి ఉన్నారు. మరికొన్ని డోర్స్‌మీద సైంటిస్ట్‌ల పేర్లు వ్రాసి ఉన్నాయి.

''ప్రాజెక్ట్-సి'', అనే ఇంగ్లీష్ అక్షరాలు చూసిన వెంటనే ఆ డోర్ ముందు ఆగాడు నరేంద్ర.

అంతా నిశ్శబ్దంగా ఉంది. ఇటు అటు చూసాడు. ఎవరూ లేరు.

డోర్ హ్యాండిల్ మీద చేయి వేసాడు. డోర్ ఆటోమ్యాటిక్‌గా తెరుచుకుంది.

నరేంద్ర ల్యాబ్ లోపలికి అడుగు పెట్టాడు.

అది చాలా విశాలమైన హాలు. అంతా గాజు పరికరాలు. మైక్రో స్కోప్‌లు, టెస్ట్ ట్యూబ్‌స్, రకరకాల మందులు ఉన్నాయి.

నరేంద్రకు ఒక క్రొత్త ప్రపంచంలోనికి అడుగుపెట్టినట్లు అని పించింది. అక్కడ ఉన్న ఆ రంగు రంగుల ద్రవాలను పరిశీలించాలి

అన్న కోరిక కలిగింది. కాని అది సమయం కాదని తెలిసి ప్రయోగం జరుగుతున్న టేబుల్ దగ్గరకు వచ్చాడు. ఆ బల్లమీద ఒకవైపు ఏవో కొన్ని డాక్యుమెంట్స్ ఉన్నాయి.

ఆ డాక్యుమెంట్స్ అన్నీ చుట్టముట్టి తన కోట్ జేబులో ఉంచుకున్నాడు. ఆ తరువాత వేరే జేబులో ఉన్న చిన్న రేడియో సైజ్‌లో ఉన్న వస్తువు తీసాడు. ఆ వస్తువుకే ఉన్న చిన్న గడియారానికి టైమ్ ఫిక్స్ చేసి, ఆన్ చేశాడు. గడియారం నడవటం ప్రారంభించింది. ఆ వస్తువును ప్రయోగం జరుగుతున్న బల్లక్రింద అతికించాడు.

నరేంద్ర పని పూర్తి అయింది.

సమయం సరిగ్గా పన్నెండు అయింది. పేషంట్స్ మాత్రమే కాదు, మంచి ఆరోగ్యవంతులుకూడా ఆదమరచి నిద్రపోయే సమయం అది.

ల్యాబ్‌లోనుంచి ధీమాగా బయటకు నడిచాడు. సరిగ్గా లిఫ్ట్‌దగ్గరకి వచ్చాడు. లిఫ్ట్ తన కోసమే ఎదురు చూస్తున్నట్లుగా ఉంది. మరుక్షణం గ్రౌండ్‌ఫ్లోర్‌లోకి చేరాడు.

కాని గ్రౌండ్‌ఫ్లోర్‌లో కాస్త హడావుడి కనిపించింది నరేంద్రకు. కొంతమంది జనం ఉన్నారు. నర్సులు ఇటు అటు తిరుగుతున్నారు. దానికి కారణం పెళ్ళివారి బస్ ఏదో యాక్సిడెంట్ అయి ఎక్కువ మందికి గాయాలు తగిలి వచ్చారు. ఒకరిద్దరికి సీరియస్‌గా ఉందని సిస్టర్‌ద్వారా తెలుసుకొని కాస్త ఫ్రీగా రిలాక్స్‌గా నడవబోయాడు.

ముందువైపు క్యారిడార్‌లోనుంచి ఇద్దరు డాక్టర్లు నరేంద్ర ఉన్న వైపు వస్తున్నారు. ఆ డాక్టర్లలో ఏ ఒక డాక్టర్ దృష్టిలో పడ్డా నరేంద్ర బండారం బైటపడుతుంది. ఆ సంగతి అలా ఉంచి, అంతకంటే

ముందు బడితెపూజ జరగటం, ఆ తరువాత ఎమర్జన్సీవార్డ్‌లో పడేయట ఖాయం అనిపించింది నరేంద్రకు.

ఒక నిమిషంపాటు కాళ్ళుచేతులు ఆడలేదు. ఏం చేయాలో తో లేదు. వెంటనే దగ్గరలో ఉన్న బాత్‌రూమ్‌లోకి దూరాడు.

గట్టిగా ఊపిరి పీల్చుకొని తన కోట్‌ని విప్పి - కోట్ లోపలిభా పైకి వచ్చేటట్లు త్రిప్పి తొడుక్కున్నాడు కోట్‌లోపలి లైనింగ్‌క్లాత్ స్కై-బ్ల కలర్‌లో ఉంది. అది నైట్‌టైమ్ కావటంవల్ల బ్లాక్‌కలర్‌లో కనిపిస్తున్న ఎవరైనా పరీశీలనగా చూస్తేతప్ప అతడు కోట్‌త్రిప్పి తొడుకున్నాడు అన విషయం తెలియదు.

సరిగ్గా అప్పుడు తెలిసింది నరేంద్రకు - అతడు ఉన్నది లేడీ టాయిలెట్‌రూమ్‌లో అని. గుండె ఆగిపోయినంతపని అయింది. వెంట ఆదరాబాదరాగా వెళ్ళి టాయిలెట్‌రూమ్‌లోపలినుండి లాక్ చేసుకున్నా ఎవరైనా వస్తారేమోనని.

నరేంద్ర మెదడులో ఏదో ఆలోచన మెదిలింది. వెంటనే ప్యాం విప్పి లోపలిలైనింగ్ బయటకుకనిపించే విధంగా త్రిప్పితొడుక్కున్నాడ ఒక కాలిని మోకాలి దాకా మడిచాడు, మరో ప్యాంట్‌కాలిని కొంచె మడిచాడు.

రూమ్‌లో ఓ మూలన ఉన్న ప్లాస్టిక్ బకెట్, అందులో ఉన్న పొ కొబ్బరిపీచిని తీసుకున్నాడు. అద్దంముందు నిలబడి చూసుకున్నాడు. ఏ లోపంగా అనిపించి, నీట్‌గా ఉన్న క్రాఫ్‌ని చింపిరిగా చేసుకున్నాడ స్వీపర్ వేషంలో లేడీస్ టాయిలెట్ రూమ్‌నుంచి బయటపడ్డాడు.

బయట కారిడార్‌లోఉన్న పెళ్ళిబృందం ప్రమాదం జరగటాని కారణాన్ని తర్కించుకుంటున్నారు. సిస్టర్స్ ఎవరి పనిలో వా నిమగ్నమై ఉన్నారు.

నరేంద్ర స్వీపర్‌గా ఒక కాలు ఈడ్చుకుంటూ నడవటం ప్రారంభిం చాడు. కాని అక్కడ ఉన్నవారు ఏ ఒక్కరైన కాస్త లాజిక్‌తో ఆలో చించినా నరేంద్ర పట్టుబడటం ఖాయం. (రాత్రి పన్నెండు గంటల సమ యంలో సాధారణంగా స్వీపర్స్ హాస్పటల్‌కు రారు.)

నరేంద్ర స్వీపర్ వేషంలో ఒక చేతిలో ప్లాస్టిక్ బకెట్‌తో, ఒక కాలు ఈడ్చుకుంటూ మెయిన్‌గేట్ దాకా నడిచాడు. అక్కడ ఉన్న గూర్ఖా కాస్త అయోమయంగా చూసాడు. కానీ, ఏమి అభ్యంతరం చెప్పలేదు.

నరేంద్రకు చాలా గిల్టీగా ఉంది. పదిహేను సంవత్సరాల తన నేర జీవితంలో ఇలాంటి అవతారం ఎప్పుడు వేయలేదు. రఫ్‌గా పని చేయ వద్దని బాస్ ఆర్డర్స్.

ఇక గూర్ఖా గమనించటం లేదని నిర్ధారించుకున్న తరువాత పరుగు లాంటి నడకతో వెళ్ళి జీప్ దగ్గరకు చేరాడు.

మస్తాన్, లూథర్ పిచ్చాపాటిగా, పిచ్చిగా ఏదో మాట్లాడుకుంటు న్నారు.

నరేంద్ర రావటం మొదట లూథర్ గమనించి "అదేంటి ఇలా వస్తున్నావు : ఏం జరిగింది. పని సక్సస్ కాలేదా" అని అడిగాడు ఆతురతగా....

"అంతా బాగానే సక్సస్ అయింది. చివర్లో ఎవరో పెళ్ళి వాళ్ళు యాక్సిడెంట్ అయి వచ్చిపడ్డారు. వాళ్ళను చూడటం కోసం డాక్టర్లు వచ్చారు. ఆ పెళ్ళి వాళ్ళకు యాక్సిడెంట్ అయి వాళ్ళు వచ్చి సావక పోతుంటే, మనం ఈ పాటికి 'రోజీ' ప్రక్కన్న మస్తుగా మజా చేస్తూ వుండేవాళ్ళం" అన్నాడు గబగబ నరేంద్ర.

మస్తాన్ నరేంద్ర వైపు పరిశీలనగా చూస్తూ "అదేంటిబై డాక్టర్‌గా వెళ్ళి పాకీవాడిలా వచ్చావు" అన్నాడు తన హాస్య ధోరణిలో....

"నువ్వు అపు నీ వెధవ సరసం ..."అంటూ వచ్చి డ్రైవింగ్ సీట్లో కూర్చుంటూ తన దగ్గర ఉన్న ప్లాస్టిక్ బకెట్, చీపురు జీప్ ఫ్రెంట్ సీట్ మీద జాగ్రత్తగా ఉంచాడు.

"ఏంటిబై ఇంత దూరం మోసుకొచ్చింది చాలక ఇంక ఎందుకు అక్కడ వుంచుతున్నావు ఆ ప్లాస్టిక్ బకెట్‌ని పారేయక" అన్నాడు మస్తాన్ అనుమానం వ్యక్తం చేస్తూ.

"ఒరే మస్తాన్, నీకు ఇన్నాళ్లు బుద్ది మెదడులో లేదు, సరే అక్కడ ఉంది అనుకున్నాను. కాని, ఇప్పుడు అక్కడ కూడ అ లేదనిపిస్తుంది...." అన్నాడు నరేంద్ర విసుగ్గా.

లూథర్ నవ్వుతూ "సరిగ్గా అక్కడ...." అన్నాడు మస్తాన్ వెక్కిరిస్తూ.

జీప్ స్టార్ట్ అయి వేగంగా వెళ్తున్నది.

"అది కాదుబై, ఇప్పుడు ఆ ప్లాస్టిక్ బకెట్‌ని ఎందుకు తీసుకొ వెళ్తున్నట్లు" అని మరలా అనుమానాన్ని వ్యక్తంచేసాడు మస్తాన్.

నరేంద్ర జీప్ డ్రయివ్ చేస్తూనే "ఇప్పుడు మనం ఆ బకెట్ ఆ హాస్పటల్ పరిసర ప్రాంతంలోనే పడేస్తాం అనుకో. అక్కడి నుం ప్రారంభిస్తారు ఇన్వెష్టిగేషన్. ఆ బకెట్‌ని చివరిసారిగా ఎవరు, ఎప్పుడు ఎక్కడ చూశారు అనే ప్రశ్నలతో ఇన్వెష్టిగేషన్ ప్రారంభించి, మం రెండు గంటలలో మనం రైల్వేస్టేషన్ చేరేపరకు మనకు అరెస్టువారంట్ పాస్ అవుతాయి. అందుకని అక్కడ పారేయలేదు. అర్థమయిందా!! అంటూ జీప్‌ని ఒక చెత్తకుండి దగ్గర స్లో చేసి, "ఇప్పుడు ఆ బకెట్ ఆ చెత్తకుండీలో పారేయ్" అన్నాడు మస్తాన్‌ని ఉద్దేశించి.

మస్తాన్ ప్లాస్టిక్ బకెట్ తీసి చెత్తకుండీలో పారేశాడు.

జీప్ మరలా పూర్తి వేగాన్ని పుంజుకొని ఓల్డ్ బాంబే రూట్ మీద వెళ్తున్నది. నగర శివారు ప్రాంతాలైన టోలిచౌకి, గచ్చిబౌలి దాటి నగరం వెలుపలికి చేరుతున్నది జీప్.

సమయం రాత్రి ఒంటిగంట, ముప్పయి నిమిషాలయింది.

సరిగ్గా ఆ సమయంలో అభిమన్యు మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో పెద్ద శబ్దం అయింది. మరుక్షణంలో ప్రాజెక్ట్ - నికి సంబంధించిన ప్రయోగశాల అంతా మసిగా మారింది.

* * *

అభిమన్యు నిద్రనుండి ఉలిక్కిపడి లేచాడు. టైమ్ చూసుకున్నాడు. రాత్రి ఒంటిగంట ముప్పయి నిమిషాలయింది. అంటే, వేరేరోజు ప్రారంభమయింది. ఈరోజే ప్రాజెక్ట్ - ని శాంపిల్ టెస్ట్ చేసేది. ఆ టెస్ట్ శాంపిల్ సక్సెస్ అయితే ప్రపంచ చరిత్ర ఒక అద్భుతమైన మలుపు తిరుగుతుంది. ఇక ప్రపంచంలో క్యాన్సర్ వ్యాధితో ఎవరూ చనిపోరు. ఈ వ్యాధి పీడితులకు ఒక ఆశాకిరణం; ఎందరో జీవితాలలో ఆశాజ్యోతులు వెలిగిస్తుంది ఈ ప్రయోగ ఫలితం.

ఫోన్ రింగ్ అవుతున్నది - అందమైన ఆలోచనలలో అపశ్రుతిలా..., ట్రింగ్....ట్రింగ్....

అభిమన్యు యాంత్రికంగా అందుకున్నాడు.

"...... ..."

"యస్, అభిమన్యు హియర్, చెప్పండి."

"సార్...., నేను హాస్పిటల్ నుంచి మాట్లాడుతున్నాను ఇక్కడ ఏదో ప్రేలుడు జరిగింది. ల్యాబ్ సెక్షన్ అంతా దారుణంగా కాలిపోతున్నది ఇంకా" -అవతలివైపు నుంచి ఎవరో అసిస్టెంట్.

"డోంట్ టాక్ రబ్బిష్, ఈ రోజు ప్రాజెక్టకి సంబంధించి టెస్ట్ కూడా వుంది. ఎవరు చెప్పారు నీతో" అన్నాడు అభిమన్యు కంట్రోల్ కోల్పోతూ.

మనిషిని నిలువునా దహించివేసే వార్త.

ప్రాజెక్ట్-సి బ్లాస్ట్ అయింది అనే వార్తను అభిమన్యు నమ్మలేక పోతున్నాడు. ఎట్టి పరిస్థితులలో అయినా వెళ్ళి చూడాలి అనుకొని నైట్ డ్రస్‌లోనే బయలుదేరాడు.

మనసు, మనిషి ఆవేశంతో వేదనతో రగిలిపోతున్నాడు ఎవరి మీదో కోపం, తన అసమర్ధతవల్లే జరిగిందా అని బాధ.

ఇంటిలో పనివాళ్ళు అంతా నిద్రపోతున్నారు. ఇంటి తలుపులైనా వేయకుండా అచేతనంగా వెళ్ళి కార్‌లో కూర్చొని హాస్పిటల్‌కు బయలుదేరాడు.

ఎలా డ్రయివ్ చేస్తున్నాడో అభిమన్యుకు తెలియడంలేదు.

అర్ధరాత్రి రెండు గంటల సమయం కనుక రోడ్లు అన్ని ఖాళీగా ఉన్నాయి.

సరిగ్గా పది నిమిషాలలో హాస్పటల్ చేరుకున్నాడు.

నిజమే....

హాస్పటల్ ఆవరణ అంతా జనం. అంతా హాస్పటల్‌లో అడ్మిట్ అయి ఉన్న పేషంట్స్, డ్యూటీలో ఉన్న స్టాఫ్, హాస్పటల్‌కు దగ్గరగా ఉన్నవాళ్ళు వచ్చి భయం భయంగా చూస్తూ ఉన్నారు.

ఫైర్ సర్వీస్ వాళ్ళు ఐదవ అంతస్తులో నీళ్ళు చల్లుతున్నారు. పోలీసువాళ్లు బయటినుంచి ఎవరిని లోపలికి రానివ్వటంలేదు.

కలలో కూడా ఊహించనిది జరిగింది. ఆ దృశ్యం చూస్తుంటే అభిమన్యుకి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అచేతనంగా చూస్తూ ఉన్నాడు తన ఇనిస్టిట్యూట్ ని.

అదృష్టం బాగుంది మనుషులకెవరికి ఎలాంటి ప్రమాదం జరగ లేదు.

అభిమన్యు దగ్గరకు ఒక యస్.ఐ. వచ్చి సెల్యూట్ చేసి, ''రాత్రి సరిగ్గా ఒంటిగంట ముప్పయి నిమిషాలకు మేము ఈ రోడ్డుమీదే వెళ్తు ఉన్నాం. ఏమైందో ఏమో భయంకరమైన శబ్దం. ఆ వెంటనే నల్లని పొగలు హాస్పటల్ లోని ఐదవ అంతస్తులోనుంచి రావటం చూసి మెయిన్ గేట్ దగ్గర కాపలా ఉంచి అంతా వెతికాము, ఎవరు కనిపించలేదు. మేము హాస్పటల్ లోకి వచ్చిన తరువాత ఎవరూ బయటకు వెళ్ళలేదు" అని ఇంకా ఏదో చెప్తున్నాడు కాని, అభిమన్యుకు ఏమి వినిపించటం లేదు.

అంతలో సీనియర్ డాక్టర్లు కొంతమంది, డా॥విశ్వామిత్ర, ప్రశాంత్ సిద్ధార్థ వచ్చారు. డాక్టర్ విశ్వామిత్ర అభిమన్యు భుజం మీద చెయ్యివేసి, "ధైర్యంగా ఉండు అభి...." బాధతో ఇంకా ఎలా ఓదార్చాలో అర్థంకాక ఏమీ మాట్లాడలేదు.

అభిమన్యుకి అది కలో నిజమో అర్థం కావటం లేదు, నిజం అని తెలిసిన మరుక్షణం భరించలేని బాధతో నుదుటి మీద పిడికిలి బిగించి కొట్టుకున్నాడు. డబ్బు పోయినందుకు కాదు ఆ బాధ - తన ప్రయత్నం విఫలమయిందని వ్యధ.

డాక్టర్ ప్రశాంత్ వచ్చి అభిమన్యుని ఛాంబర్ లోనికి తీసుకొని వెళ్ళబోయాడు - కాని అభిమన్యు తిరస్కరించి, డా॥ విశ్వామిత్ర, ప్రశాంత్ లతో ఐదవ అంతస్తులోనికి వెళ్ళాడు. ల్యాబ్ లో పేలుడు జరిగిందని తెలుస్తూనే ఉంది కాని, ఎలా జరిగిందో అంతు చిక్కటం లేదు.

ల్యాబ్‌లోని కంప్యూటర్ కాస్త పనిచేస్తూనే ఉంది; ల్యాబ్‌లో అను మానించదగ్గ వస్తువు ఏమయిన కనిపిస్తుందేమోనని వెతికారు. కాని, అలాంటి ఆనవాలు ఏమి కనిపించలేదు.

అభిమన్యు వెళ్ళి తన ఛాంబర్‌లో కూర్చున్నాడు. మనసులో జీవితంలో విలువైనదేదో పోగొట్టుకున్న ఒక భావం. అభిమన్యులో ఒక లాంటి నీరసం, నిస్పృహ.

గుండెలోతులోనుండి ఏడుపు ఎగదన్నుకు వస్తున్నది.

ఆలోచనలన్నీ స్థంభించి పోయాయి.

జీవితం అంతా శూన్యంగా ఉంది.

ఉదయం ఐదుగంటలు కావస్తుందనగా అభిమన్యు ఛాంబర్‌లో ఫోన్ మ్రోగింది. అభిమన్యు మనసంతా వికలంగా ఉంది.

ఫోన్ రిసీవ్ చేసుకోవాలి అనిపించలేదు.

ఓ నిమిషం తరువాత ఫోన్ ఎత్తాడు అవతలి వ్యక్తి చౌదరి

"ప్రాజెక్ట్‌ని బ్లాస్ట్ అయిందటగా" అన్నాడు.

అభిమన్యు షార్ప్‌గా రియాక్ట్ అయ్యాడు, వెంటనే అప్రయత్నంగా "ఎవరు చెప్పారు మీకు?" అన్నాడు.

"ఎవరు చెప్పటం ఏమిటయ్యా పేపర్ చూడు - అయినా మరీ డిప్రెషన్‌కు గురి కాకు అభి! నేను సాయంత్రం వచ్చి కలుస్తాను, ఏం చేద్దాం అంతా అలాగే ఉంటుంది, ఐ యామ్ సారీ ధైర్యంగా ఉండు. ఉంటాను", అని మరో మాటకు అవకాశం ఇవ్వకుండా డిస్‌కనెక్ట్ చేశాడు.

అభిమన్యు వెంటనే తన ఛాంబర్‌లోకి పేపర్ తెప్పించుకొని చూసాడు, నిజమే, పేపర్‌లో "అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్‌లో బాంబుప్రేలుడు" అని ఉంది కాని, ఫొటో లేదు.

మరి కొద్ది సేపటికి డాక్టర్ విశ్వామిత్ర, ప్రశాంత్‌కుమార్, సిద్ధార్థ మరికొంత మంది సీనియర్ సర్జన్స్ అభిమన్యు చాంబర్‌లోకి వచ్చారు. అందరు ఎవరికి తోచిన కారణం వాళ్ళు ఊహించుకుంటున్నారు కాని, అసలు కారణాన్ని ఎవరూ ఊహించలేకపోతున్నారు.

* * *

తెల్లవారింది, ఉదయం ఆరుగంటలు కావస్తుంది.

షిఫ్టులు మారి నర్సులు వాడిన ముఖాలతో ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు. అంతలో డాక్టర్ అభిమన్యు మెడికల్ ఇన్స్టిట్యూట్ ముందు పోలీసు జీప్, అవెనుకే పెద్ద పోలీస్‌వ్యాన్ వచ్చి ఆగాయి.

పోలీస్‌వ్యాన్‌లో నుంచి పోలీసులు బిలబిల మని వచ్చి మెయిన్ గేట్‌ను క్లోజ్‌చేశారు. పోలీస్ జీప్‌లోనుంచి దిగిన ఆఫీసర్ షిఫ్ట్‌మారబోయే సిబ్బందివైపు ఓ అనుమానపు పోలీస్ చూపుచూసి షిఫ్టుమారిన ఉద్యోగులు కూడా బయటకు వెళ్ళరాదని హాస్పటల్ మెయిన్‌గేట్ మూయించాడు.

నర్సులలో, ఇతర స్టాఫ్‌లో ఒకే కలకలం ప్రారంభమయింది మన డైరెక్టర్‌గారు మన మీదే అనుమానిస్తున్నారా అని కొంతమంది దీర్ఘాలు తీయటం ప్రారంభించారు.

అభిమన్యు అలా అడిగితే తప్ప ఆఫీసర్ అలాంటి చర్యతీసుకోరని అందరు వాపోతున్నారు. కాని, ఆ ఉద్యోగులకు ఆ ఆసుపత్రితో, ఆ డైరెక్టర్‌తో ఒక అవినాభావ సంబంధం ఉంది, అందువలన వాళ్ళు ఎంతో ఓర్పుతో ఉంటున్నారు.

పోలీస్ ఆఫీసర్ సరిగ్గా అభిమన్యు చాంబర్ వైపు నడుస్తున్నాడు.

* * *

అభిమన్యు చాంబర్‌లో ఉన్న డా॥ విశ్వామిత్ర, సిద్ధార్థ, ప్రశాంత్ కుమారు, ఉన్నారు. ఏ ఒకరి ముఖంలో కూడా జీవకళ లేదు. వాళ్ళు అంతా రాత్రి రెండుగంటలనుండి మేలుకొనే ఉన్నారు.

అభిమన్యుకి కళ్ళు మండుతున్నాయి; మనసు అంతకంటే మండి పోతున్నది తనను ఇంత దారుణంగా ఇలా ఎవరు మోసం చేసి ఉంటారు. ఒకవేళ ఎవరైనా తన మీద దెబ్బతీయాలని అనుకుంటే హాస్పటల్‌లో ఎక్కడైనా విధ్వంసం సృష్టించవచ్చు. అదీకాక తననే ఎక్కడైనా ఏమైనా చేయవచ్చు, కాని కేవలం ప్రాజెక్ట్-సినే ఇలా స్మాష్ చేయటంలో అర్థం ఏమయివుంటుంది? మనసు ఆలోచించేకొద్దీ మెదడు మొద్దుబారుతున్నదే కాని, సరి అయిన సమాధానం దొరకటం లేదు. కూలింగ్ సిస్టమ్‌లో లోపం వల్ల ప్రమాదం జరగటానికి అవకాశం ఉంది కాని, ఇంత ఘోరంగా జరగదు.

అభిమన్యుకు ఎదురుగా కూర్చున్న విశామిత్ర కూడా ఏమీ మాట్లాడకుండ మౌనముద్రలో ఉన్నారు ప్రశాంత్ కుమార్, సిద్ధార్థ ఏదో చెప్పబోయి తిరిగి మౌనంగా ఉన్నారు

ఎవరైనా బాంబ్ పెట్టారు అని పబ్లిక్‌లో తెలిస్తే హాస్పటల్‌కు వైద్య వృత్తికే అవమానం. అదీ కాక హాస్పటల్‌లో అడ్మిట్ కావటానికి పబ్లిక్ భయపడవచ్చు. వ్యాపార పరంగా కాకపోయినా పేరు ప్రతిష్ఠలను అనుసరించి చూసినా తమ రెప్యుటేషన్ దెబ్బతింటుంది.కనుక హాస్పటల్‌లో జరిగిన ప్రమాదం కేవలం కెమికల్ రియాక్షన్ వలన ఏర్పడిన ప్రమాదం అని కాని, లేదా కరెంట్ షార్ట్ సర్క్యూట్ వలన అని కాని, లేదా ఎయిర్ కండిషన్ బ్లాక్ అవ్వటం వల్ల ప్రాజెక్ట్-సి బ్లాస్ట్ అయింది అని చెప్పాలి అని నిర్ణయించుకున్నాడు

సరిగ్గా అప్పుడు పోలీస్ ఆఫీసర్ అభిమన్యు చాంబర్‌లోకి వచ్చాడు.

అభిమన్యుని చూస్తూ "హలో, ఐ యామ్ అమర్‌జిత్ రెడ్డి, డి యస్.పి." అంటూ కరచాలనం చేసి,

"ఐ యామ్ సారి అభిమన్యుగారు! కాని, నేరస్థులు ఎక్కడ ఉన్నా పట్టుకొని చట్టానికి అప్పగించి తీరుతాను" అన్నాడు తెలుగు సినిమాల్లో

పోలీస్ హీరోలా. అంతలో మళ్ళీ మామూలుగా మారి, అభిమన్యుతో "ఈ కేస్ విషయంలో మీతో కొద్ది నిమిషాలు మాట్లాడాలి పర్సనల్‌గా....", అంటూ అభిమన్యుకు ఎదురుగా కూర్చొని ఉన్న విశ్వామిత్ర, ప్రశాంత్, సిద్ధార్థలను కొద్ది నిమిషాలు బయిటకు వెళ్ళవలసిందిగా చూసాడు.

"యస్ మిస్టర్ ఆఫీసర్! మేము ఇంకా పోలీస్ రిపోర్ట్ ఇవ్వలేదు. అదీకాక వాళ్ళు అందరూ ఈ హాస్పటల్‌లో మెయిన్ పార్ట్‌నర్స్, వాళ్ళకు నాకు భేదం లేదు - మీరు కూర్చోండి" అన్నాడు కూల్‌గా అభిమన్యు.

డి యస్. పి అమర్‌జిత్ కూర్చుంటూ "ఎలా జరిగింది, ఈ ప్రమాదము'' అని అడిగాడు ఇన్వెస్టిగేటివ్ టైప్‌లో.

''ల్యాబ్‌లో జరిగిన చిన్నపొరపాటువల్ల ఈ ప్రమాదం జరిగింది'' అని చెప్పటం ప్రారంభించబోయాడు.

కాని ఆఫీసర్ మధ్యలోనే అందుకొని, ''కాని, పేపర్‌లో బాంబు ప్రేలుడు అని వ్రాశారు....'' ఏదో చెప్పబోయాడు.

ప్రక్కనే ఉన్న డాక్టర్ విశ్వామిత్ర ''నో, నేను ఒప్పుకోను. ఇది కేవలం కెమికల్ రీయాక్షన్‌వలన ఏర్పడిన ప్రమాదమే. దానికితోడు ఎయిర్ కండీషన్ బ్లాక్ కావటంవల్ల ఈ ప్రమాదం జరిగిందని మా అభిప్రాయం. ఏ రకమైన ప్రమాదమో తెలుసుకోకుండా గాలి వార్తలు వ్రాసిన ఆ పత్రికపై ఎలాంటి చర్య తీసుకోవాలో మేము తర్వాత నిర్ణయించుతాము....''

అమర్‌జిత్ విశ్వామిత్రకు, అభిమన్యులను అనునయంగా చూస్తూ ''కెమికల్ రియాక్షన్ అయితే మా అవసరం లేదనుకుంటా. ఇక ఇలాంటి విషయాలను గోరంతలు కొండలు చేసే ఆ పత్రిక అవసరం ఉంది, ఓకె.... సీయూ మిస్టర్ అభిమన్యు" అంటూ తృప్తిగా వెళ్ళిపోయాడు.

బయట హాస్పటల్ ఆవరణలో ఏర్పాటు చేసిన బందోబస్తును ఉపసంహరించుకొని, హాస్పటల్ స్టాఫ్‌కు చిరునవ్వుతో "సారి" చెప్పు కున్నాడు.

అందుకు హాస్పటల్ స్టాఫ్ బోలెడు ఆనందపడిపోయారు.

*　　　*　　　*

అభిమన్యు చాంబర్‌లో అభిమన్యు విశ్వామిత్రను ప్రశంసగా చూస్తూ "సర్, నా మనసులోని అభిప్రాయాన్ని చెప్పారు మీరు ఆ పోలీస్ ఆఫీసర్‌తో, అని" "ఇక ఏ పత్రికకు ఇంటర్వ్యూ ఇవ్వకండి" అన్నాడు.

వెంటనే ప్రశాంత్ అందుకొని "కాని డాక్టర్ ఇక ఒక్కొక్కరు వచ్చి ఈ ప్రమాదం గురించి ఇంటర్వ్యూ ఇవ్వమని అడగవచ్చు. అందు వలన మనమే ప్రెస్‌మీట్ ఏర్పాటు చేస్తే ప్రాబ్లమ్ ఉండదు. అని నా అభిప్రాయం". అన్నాడు గత అనుభవంతో తదేకంగా

"సరే అయితే. రేపు ఏర్పాటు చేయండి, ఈ రోజు ప్రెస్‌మీట్ ఏర్పాటు చేయటం కుదరదు. రేపు ఉదయం పది గంటలనుండి పన్నెండు గంటల సమయంలో సెట్ చేయండి. ఓ కే..." అంటూ ప్రశాంత్, సిద్ధార్థలవైపు చూసాడు.

సిద్ధార్థ "ఓ. కె. సార్...." అన్నాడు.

అభిమన్యు పైకి మామూలుగా మాట్లాడుతున్నా మనసులో భరించ లేని వేదన అనుభవిస్తున్నాడు అది విశ్వామిత్రకు తెలుసు కాని, ఏమని ఓదార్చాలో అర్థం కావటం లేదు.

అభిమన్యుకి కడుపంతా దేవినట్లుగా ఉంది. గుండెల్లో కన్నీరు ఉప్పెనలా పరవళ్ళు తొక్కుతున్నది. అభిమన్యు ఎలాంటి మానసిక పరిస్థితిని అనుభవిస్తున్నాడో అతని ముఖం చూస్తే చెప్పవచ్చు.

''మూడు సంవత్సరాల శ్రమ, పన్నెండు లక్షల డబ్బు బూడిదలో పోసిన పన్నీరై పోయింది. ఇంకా అదృష్టం బాగుంది మనుషులకు ఎలాంటి ప్రమాదం జరగలేదు దేవుని దయవలన'' అన్నాడు ప్రశాంత్ నొచ్చుకుంటూ.

అభిమన్యు ఏమీ మాట్లాడలేదు.

విశ్వామిత్ర, ప్రశాంత్ కుమార్, సిద్ధార్థ ఒక్కొక్కరుగా అభిమన్యు చాంబర్‌లోనుంచి బయటకొచ్చారు.

అభిమన్యులో ఒక అవ్యక్తమైన బాధ, వర్ణించనలివికాని వ్యధగా ఉంది.

అభిమన్యు ఒంటరిగా కూర్చుని ఉన్నాడు.

అతనికి గుండెల్ని పిండేసే బాధగా ఉంది. ఏదో చెప్పలేని వ్యధ, ఆందోళన, వళ్ళంతా సన్నగా వణుకుతున్నట్లుగా ఫీలింగ్ బాధతో అతని గొంతుకేదో అడ్డుపడినట్లుగా ఉంది.

తన జీవితంలో ఎప్పుడు అనుభవించని చేదు క్షణాలు.

చాంబర్‌లోని డోర్ దగ్గర శబ్దం అయింది. అతని దృష్టి డోర్ వైపు పడింది.

స్నేహిత.

మౌనంగా వచ్చి అభిమన్యు ముందు ఉన్న ఛైర్ మీద కూర్చుంది. అభిమన్యుని ఎలా ఓదార్చాలో అర్థం కాక, సన్నగా గొంతు పెగల్చుకొని ''ఐ యామ్ సారీ, ఇంత ఘోరం జరుగుతుందని నేను కలలో కూడా ఊహించలేదు" అంది అనునయంగా.

''అంతే స్నేహ, అనుకున్నవి జరగవు. మనం అనుకోనివి చాల జరిగిపోతుంటాయి. అదే జీవితం'' అన్నాడు వేదాంత ధోరణిలో అభి

మన్యు అలా చెప్తున్నా అతడి కంఠంలో ఆవేదన సుళ్ళు తిరుగుతున్న సవ్వడి వినిపిస్తున్నది. గుండె తరుక్కుపోయే సన్నివేశం.

ఆనందాన్ని కానీ, దుఃఖాన్ని కానీ ఎప్పుడు బయటకు చెప్పని అభిమన్యు ఇలా మాట్లాడటం చూస్తుంటే స్నేహితకు గుండె తరుక్కుపోతున్నది. అభిమన్యుని గుండెకు హత్తుకొని ఓదార్చాలి అన్నంత బాధ కలిగింది స్నేహితకు. (అది ప్రేమకు మించిన కామం వలన పుట్టిన వికారం కాదు, ఎదుటి వ్యక్తి పడే బాధ చూడలేక ఒక మనసున్న మనిషి- ఆడ అయినా, మగ అయినా- పొందే ఒక భావ సంచలనం. అదే ఓదార్పు. అది కరెన్సీ నోట్ల వాసనకు అందని అనుభూతి.)

కాలం గడవటం లేదు. స్తంభించి పోయినట్లుగా భ్రాంతి. అభిమన్యు నిర్జీవంగా చెప్పటం ప్రారంభించాడు "ఎన్నో సంవత్సరాలు అహో రాత్రులు పడిన శ్రమ ఒక్క రాత్రిలో మసిగా మారింది....నాకు ఈ జీవితం మీదే విరక్తి కలుగుతున్నది , స్నేహ'' అన్నాడు నెమ్మదిగా.

''బాధ పడకండి, మీ జీవితంలో ఇది ఒక చేదు ఘట్టం, మన జీవితంలో ఏది జరిగినా, ఏది జరగకపోయినా, ఎవరు ఉన్నా ఎవరు లేక పోయినా మనం మన ఆశయాన్ని మరువరాదు....ఇలాంటి చిన్న చిన్న అడ్డంకులతో మనసు వికలం చెందటం సహజం కానీ అంత మాత్రం చేత జీవితం మీద విరక్తి కలగటం, జీవిత ఆశయాలను వదులుకోవటం ఎంతవరకు సమంజసం అంటారు?....''

అభిమన్యు కళ్ళు ఎత్తి స్నేహిత కళ్ళలోకి చూశాడు.

స్నేహిత చెప్పటం ఒకసారిగా ఆపింది - అభిమన్యు కళ్ళు తన కళ్ళతో కలవటం వల్ల కలవరంతో, ఓ క్షణంపాటు. మరలా అభిమన్యుని మామూలు మనిషి స్థితిలోకి తేవటంకోసం చెప్పటం ప్రారంభించింది "అలా మీరు మీ ఆశయాన్ని వదిలేయటానికి మీ ఆశయం అంత

బలహీనమైనదా....లేదండి, ఎవరు సాధించలేని అపూర్వ విషయాన్ని మీరు చేయవలసి ఉంది, ఎందరి ఇళ్ళల్లోనో ఆశాజ్యోతులను వెలిగించవలసి ఉంది .... అవునంటారా .... కాదంటారా....?"

"..............." అభిమన్యు స్నేహ వైపు చూస్తున్నాడు.

"మీకు ఆ రోజు గుర్తుందా .... ఆ రోజు సాయంత్రం నాకింకా గుర్తుంది, మామూలు గుర్తుకాదు కళ్ళకు కట్టినట్లుగా గుర్తుంది. మనం హౌస్ సర్జన్సీ చేస్తున్న చివరి రోజుల్లో మన మెడికల్ కాలేజి ప్రొఫెసర్ శారద మేడమ్ బ్రెస్ట్ క్యాన్సర్‌తో మనం పని చేస్తున్న హాస్పటల్‌లోనే స్పెషల్ వార్డ్‌లో చేర్చారు శారద మేడమ్ మిమ్మల్ని ఎందుకో గాని చాలా ప్రేమగా చూసేవారు. మీకు కూడా శారద మేడమ్ అంటే ఎంతో గౌరవం. శారద మేడమ్‌కు బ్రెస్ట్ క్యాన్సర్ చాలా అడ్వాన్స్డ్‌లో ఉందని చెప్పారు స్పెషలిస్ట్స్. ఆ సమయంలో క్యాన్సర్‌కు మందులు లేవని తెలుసుకొని మీరు ఎంత ఏడ్చారో గుర్తుందా....

ఆ తరువాత కొద్ది రోజులకు ఆవిడ చనిపోయారు. సరిగ్గా అప్పుడే మీరు నిర్ణయించుకున్నారు. జీవితంలో ఏదో ఒక రోజుకు ఒక మెడికల్ ఇనిస్టిట్యూట్ ప్రారంభించి క్యాన్సర్‌కు క్యూర్ చేసే మందు కనుగొంటానని మీరు గద్గద స్వరంతో అన్న మాటలు నాకు ఇంకా గుర్తుంది ...

అలాంటి ఆశయాన్ని మీరు ఈనాడు వదిలేస్తారా ...." అంది స్నేహిత బాధ నిండిన స్వరంతో నిలదీస్తున్నట్లుగా అభిమన్యు ఆత్మ విశ్వాసం పెంపొందించటానికి.

ఆ మాటలు అభిమన్యునిపై ఏరకంగా పని చేశాయో వెంటనే తేరుకొని "లేదు .... స్నేహ .... ఎట్టి పరిస్థితులలో అయిన రీసెర్చ్ మరలా ప్రారంభిస్తాను...." అన్నాడు.

ఆ మాటకు స్నేహ కళ్ళు సంతృప్తిగా ఆనందతాండవం చేశాయి.

అభి చిన్నగా మందహాసం చేశాడు. ఆ నవ్వులో ఎలాంటి ఒత్తిడులు కాని, భయాలు కాని, నిరాశ ఛాయలు కాని లేవు.

అభిమన్యు నవ్వులో ఎంతో చల్లదనం ఉంది.

స్నేహిత కూడా మనస్ఫూర్తిగా నవ్వి - "ఈరోజు ఈవినింగ్ మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంది మురిపెంగా.

"ఏమిటది... "

''సాయంత్రం టాంక్ బండ్ దగ్గరకు రండి, అక్కడ చెప్తాను. తప్పకుండా రావాలి. మీరు రాకపోతే ట్యాంక్ బండ్ దగ్గరే ఉన్న హుసేన్ సాగర్‌లో దూకుతాను....'' అంది గలగలగా నవ్వుతూ.

అభిమన్యు ఎప్పుడు నిరుత్సాహంగా ఉన్నా, స్నేహిత అలా మాటలతో ఉత్తేజపరచటం మామూలే.

అభిమన్యు నవ్వుకున్నాడు.

''ఓ.కే. నేను వస్తాను. సాయంత్రం సరిగ్గా ఆరు గంటలకు ట్యాంక్ బండ్ దగ్గర కలవాలి. ఒక ముఖ్యమైన విషయం....'' అంటూ మరలా గుర్తు చేసి స్నేహిత తన పత్రిక ఆఫీసుకి వెళ్ళిపోయింది.

స్నేహిత ఎమ్. బి. బి. యస్. చేసి, మెడికల్ రిపోర్టు అనే పత్రికను నడుపుతున్నది.

స్నేహిత మాటలు అభిమన్యుకు మంచి టానిక్‌లా పనిచేసాయి.

పగలంతా పత్రికలవాళ్ళు ఇంటర్వ్యూ ఇవ్వమని చాలామంది వచ్చారు. చాలామంది వచ్చి పరామర్శలు చేసి వెళ్తున్నారు. ప్రమాదం విషయం గురించి వాకబు చేస్తున్నారు.

సాయంత్రం ఐదుగంటలు కావస్తుందనగా అభిమన్యు చాంబర్‌లో ఫోన్ రింగ్ అయింది.

అభిమన్యు రిసీవ్ చేసుకున్నాడు.

అవతలి వ్యక్తి ప్రముఖ డాక్టర్ ప్రతాపరెడ్డిగారు ఊహించని మహోన్నత వ్యక్తి. ఎంతో ప్రేమగా, అనునయంగా పరామర్శించారు. ధైర్యాన్ని కలిగించే విధంగా మాట్లాడారు.

మరోఐదు నిమిషాలకు ఫోన్ మరలా మ్రోగింది. లైన్‌లో స్నేహిత "హలో నేను స్నేహితను. మరో అర్ధగంటలో ఇక్కడికి రండి, అబ్బ అదే ట్యాంక్‌బండ్, రాకపోతే హుసేన్‌సాగర్‌లో దూకేస్తాను"....ఆతరువాత ....నవ్వు....

ఆ మాటలకు అభిమన్యు పెదవులు అప్రయత్నంగా విచ్చుకున్నాయి స్వచ్ఛమైన నవ్వు నవ్వాడు.''

ఆ ట్రిక్ స్నేహిత తెలుస్తూనే ఉంది.

''ఓ.కే., త్వరగా బైలుదేరండి, నేను మీకోసం వెయిట్ చేస్తున్నాను'' అంది స్నేహిత. నిజానికి స్నేహిత ట్యాంక్‌బండ్ దగ్గర అభిమన్యు కోసం ఎదురుచూడటంలేదు. స్నేహిత తన ఇంటిలోనే స్నానంచేసి వచ్చి మాట్లాడుతున్నది.

అర్ధగంటలో అభిమన్యు ట్యాంక్‌బండ్ చేరుకున్నాడు. స్నేహిత కోసం చూసాడు. కాని ఎక్కడ కనిపించలేదు స్నేహిత. "కొంపదీసి హుసేన్ సాగర్‌లో దూకేసిందా'' అనుకొని నవ్వుకుంటున్నాడు.

ట్యాంక్‌బండ్ దగ్గర అప్పుడే కార్‌లోనుంచి దిగింది స్నేహిత. స్నేహితది నిజంగా చాలా అందమైన రూపం.

దూరం నుంచి అభిమన్యువైపు చూస్తూ చేయి ఊపింది.

ఇరవై ఆరు సంవత్సరాల మొఘల్ రాకుమారి నూర్జహాన్‌లా ఉంది. పంజాబీ డ్రస్‌లో ఉంది. సూర్యుడు ఇంకా అస్తమించలేదు. ఎర్రగా ఉండే తన ప్రతిబింబాన్ని హుసేన్‌సాగర్‌లో చూసుకుంటున్నాడు.

ఆ కాంతి పరావర్తన కిరణాల వెలుగులో స్నేహిత చెక్కిళ్ళు గంధపు చెక్కలా కనిపిస్తున్నాయి. ఆమె లిప్‌స్టిక్ పూయని పెదవులు ఎర్రగులాబీ రంగులో ఉన్నాయి.

స్నేహిత, అభిమన్యులు ఇద్దరు నడుస్తున్నారు. ఒకచోట ఆగి నీళ్ళలోకి చూస్తున్నారు.

ట్యాంక్‌బండ్ రోడ్డుమీద బస్సులు, కార్లు, కాలినడక వెళ్ళేవాళ్ళు ఎంతోమంది. కాని ఎవరూ స్నేహిత, అభిమన్యుల గురించి పట్టించు కోవటంలేదు కాని, ఒక వ్యక్తి రెండు కళ్ళు మాత్రం స్నేహిత, అభిమన్యుల ప్రతి కదలికను ఎంతో జాగ్రత్తగా పసిగడుతున్నాయి.

కాని ఈ విషయం అభిమన్యుకుగాని, స్నేహితకుగా ఏమాత్రం తెలియదు. వారిద్దరిని పరిశీలనగా చూస్తున్న ఆ వ్యక్తి చాలా ప్రమాద కరమైన వ్యక్తి అని అభిమన్యుకాని, స్నేహితకాని కనీసం ఊహించలేక పోయారు.

ట్యాంక్‌బండ్‌మీదున్న అభిమన్యు, స్నేహితలు ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉన్నారు. ఆ మౌనం కూడా ఎంతో అందంగా ఎన్నో భావాలను పలికిస్తున్నది.

అభిమన్యు కళ్ళతోనే నవ్వుతూ "ఏమిటి ఏదో ముఖ్యమైన విషయం చెప్పాలి అన్నావు...." అన్నాడు, తనకు ఏమి తెలియనివాడిలా. స్నేహి ఎందుకు రమ్మని అందో అభిమన్యుకి తెలుసు.

అభిమన్యు తెలిసి ఎందుకు అడుగుతున్నాడో స్నేహితకి తెలుసు

"కనుక్కోండి చూద్దాం" అంది లెమన్ ఎల్లోచున్ని సర్దుకుంటూ నవ్వుతూ.

"ఏమిటీ...." అని ఆలోచనలో పడ్డాడు. ఓ అరనిమిషం ఆలోచించి చివరకు "నువ్వే చెప్పు స్నేహ" అన్నాడు.

''రేపటితో మన మెడికల్ రిపోర్టర్ మంత్లీ మ్యాగజెన్‌కి మూడు సంవత్సరాలు పూర్తి అవుతాయి.''

''అరె అప్పుడే మూడు సంవత్సరాలు అయిందా, ఆ పత్రిక పెట్టి! ఎనీవే కంగ్రాచ్యులేషన్స్'' అంటూ స్నేహితతో చేయికలిపాడు.

స్నేహిత సుమధురంగా నవ్వింది - ఆమె నవ్వుతున్నప్పుడు దానిమ్మ గింజల్లాంటి పలు వరుస తళుక్కున మెరుస్తున్నాయి.

ఆమె నవ్వులో ఒక మధురమైన సాంత్వన ఉంది, ఒకరి నుంచి మరొకరికి మధురమైన ఇంటిమేట్ బ్రీజ్ వీస్తున్నది.

ఆ చల్లటి సంధ్య వేళ ఆమె వికసించబోయే తెల్ల కలువలా ఉంది. ఆమె అందమైన కనుపాపల్లో ఎన్నో భావాలు దోబూచులాడుతున్నాయి. చిలిపిగా నవ్వుతున్నావు - పెళ్ళి కాని ప్రతి ఆడపిల్లలో ఉండే ఆకర్షణ కంటే మించి మరేదో ప్రత్యేకమైన ఆకర్షణ ఉంది. అదే అభిమన్యు స్నేహితలను దగ్గర చేర్చింది. దానినే స్నేహం అని విశాల అర్థంలో చెప్పవచ్చు. కాని, ఆ స్నేహమే స్నేహితకు ప్రాణాంతకం అవుతుందని ఆ క్షణంలో తెలియదు.

ట్యాంక్ బండ్ రోడ్డు అంతా పచ్చటి నియాన్ లైట్ల వెలుగులో వెలిగిపోతున్నది.

* * *

పూర్వకాలం కవులు వర్ణించినట్లు - మంగళవాద్యాల ధ్వనులతో తెల్లవారకుండా - ఏ విధమైన చప్పుడు చేయకుండా గుట్టు చప్పుడు కాకుండా ఎంచక్కా తెల్లారింది.

కాని ఆ రోజు నుండే బుజ్జిబాబు జీవితం ఒక మలుపు తిరగబోతున్నది.

సమయం ఉదయం ఎనిమిది గంటలు దాటింది.

బుజ్జిబాబు మనసులోనే జి ఎమ్. ను తిట్టుకుంటూ మరోవైపు ఎలాగైనా చేసి నెలరోజుల్లో పెళ్ళి చేసుకొని జి. ఎమ్. ని మాటలతోనే ఎడాపెడా వాయించాలి అనుకున్నాడు పౌరుషంగా. ఆ ప్రయత్నంలోనే ఆఫీసుకు శెలవు పెట్టి ఉన్నాడు.

తను పనులన్ని పూర్తి చేసుకొని "ప్రేమ బడి"లో ఎలా మాట్లాడాలి అనుకుంటూ సంజీవరెడ్డి నగర్ బస్‌స్టాప్‌కు వచ్చి ఆగాడు.

ఏ బస్సు టయానికి రాదు. ఒకవేళ వచ్చినా నిండా జనం. కాలు పెట్టడానికి కూడా స్థలం ఉండదు. ఆ సమయంలో వెళ్ళేది అంతా చదువుకొనేవారే, ఉద్యోగాలు వెలగబెట్టేవారే. అయినా ఏ ఒకరు కల్చర్‌గా బిహేవ్ చేయరు. ఈ సిటీబస్సులలో వెళ్ళటం ఓ చిత్రవధ అనుకున్నాడు బుజ్జిబాబు.

ఒకసారి తనడ్రస్ వైపు చూసుకున్నాడు. బ్లాక్ ప్యాంటు ఎల్లోలో బ్లాక్ స్పాట్స్ ఉన్న షర్ట్ బాగా సూట్ అయింది. యాషన్ షూస్ డ్రస్‌కు బాగా సూట్ అయిన కలర్ ఉన్న టై బాగా ఉందనుకున్నాడు. ఇంత చక్కటి డ్రస్ గెటప్‌కి మారుతి కార్ అయితే బాగుండేది అనుకొని ఇప్పుడు బస్‌లో వెళ్ళితే మనిషి శరీరం అంతా చింతకాయ పచ్చడిలా తయారౌతుంది. పోనీ ఎలాగో ఢరిద్దామా అంటే డ్రస్ అంతా నలిగిపోతుంది అదో పెద్ద సమస్య.

ఎలాగైతేనేం ఆటోలో వెళ్ళి ప్రేమమందిరం దగ్గర చేరాడు.

ప్రేమ మందిరం చిన్న మరో ప్రపంచంలా ఉంది - బుజ్జిబాబు ఎప్పుడు కని విని ఎరుగని అద్భుత లోకంలా ఉంది.

రిసెప్షన్ కౌంటర్‌లో ఓ అమ్మాయి కూర్చొని ఉంది. ఆ అమ్మాయి ముఖమే పెద్ద క్వశ్చన్ మార్క్‌లా అనిపించింది బుజ్జిబాబుకి.

అమ్మాయి ముఖం అందంగా ఉంది. చాలా చిన్న వయస్సు అమ్మాయిలా ఉంది, కానీ, ఆమె అంగ సౌష్ఠవం ఆమె ముఖానికి పూర్తి విరుద్ధంగా ఉంది.

బుజ్జిబాబును చూచి ఆ అమ్మాయి నవ్వులు చిందిస్తూ "యస్, ప్లీజ్...." అంది.

"ఐ యామ్ బుజ్జిబాబు...." అని మొదలుపెట్టి, జి. ఎమ్. వేమన రావ్ పంపించగా వచ్చాను అని అంతా చెప్పాడు.

అంతా విని, "ఓ అలాగా...." అంది నవ్వులు చిందిస్తూనే. ఇంటర్‌కమ్ నొక్కి ఏదో మాట్లాడి,

"బుజ్జిబాబు గారు, మీరు మరో రెండు గంటలు వేచి ఉండవలసి ఉంటుంది. సార్, ప్రేమ సమావేశంలో ఉన్నారు" అని చెప్పింది సింపుల్‌గా.

బుజ్జిబాబు విచిత్రంగా మొహం పెట్టి రిసెప్షనిస్ట్ వంక చూశాడు.

"ఎప్పుడూ ఇక్కడికి రాలేదా! - ప్రతి మంగళవారం ప్రేమ సమావేశాలు జరుగుతుంటాయి. మీటింగ్ సాయంత్రందాకా జరగవచ్చు" అంది మరల.

బుజ్జిబాబుకు అంతా క్రొత్త క్రొత్తగా ఉంది; ఏం మాట్లాడాలో తెలియటం లేదు.

"మీరు బ్యాచ్‌లర్స్ డిగ్రీ కోసమా, లేక పీ జీ. కోర్స్ కోసమా" అని అడిగింది ఆ అమ్మాయి.

"అంటే...."

''డిగ్రీ ఇన్ ప్రేమ, పీజీ ఇన్ ప్రేమ కోర్సులు ఉన్నాయి. డిగ్రీ అయితే ఫీజ్ పదిహేను వేలు. పీ.జీ. ఇన్ ప్రేమకు ఫీజ్ ఇరవై వేలు. ఏ కోర్సులో చేరాలన్నా మొదట కామన్ ఎంట్రన్స్ టెస్ట్ ఉంటుంది. అది పాస్ అయితేనే మీకు సీట్ దొరికేది'' అంది బుజ్జిబాబు ముఖంలోకి చూస్తూ,

అంతకంటే ముందు మీ ముఖం ప్రేమించటానికి సరిపోయేదా, కాదా అని, ఒక చిన్న టెస్ట్ ఉంటుంది. అదేకాక చిన్న మాక్ ఇంటర్వ్యూ ఉంటుంది. ఇందులో సక్సస్ అయితేనే ఎంట్రన్స్ టెస్ట్‌కు క్వాలిఫై అయ్యేది'' అంటూ ఆ అమ్మాయి ఒక అప్లికేషన్ ఫారమ్‌ను బుజ్జిబాబుకు అందించింది.

బుజ్జిబాబు ట్రాన్స్‌లో ఉన్నవాడిలా అందుకున్నాడు ఆ అప్లికేషన్.

''మా కోఆర్డినేటర్ లవ్‌కుమార్ గారు ప్రాక్టికల్ క్లాసుల్లో ఉన్నారు. ఆయన తన క్లాస్ అయిపోయిన తరువాత మీతో ఇంటర్వ్యూ తీసుకుంటారు, మీరు ముందు ఈ అప్లికేషన్ పూర్తిచేయండి'' అంది.

బుజ్జిబాబు ఆ అప్లికేషన్‌లోకి చూసాడు. అది మామూలు బయోడేటాకంటే కాస్త విచిత్రంగా ఉంది. పేరు, తండ్రి పేరు అనే కాలమ్స్ తరువాత ''ప్రేమగురించి మీ అభిప్రాయం? ఇంతకంటే ముందు మీరు ఎవరినైనా ప్రేమించారా? ఎంతకాలం ప్రేమించారు? ఎంతవరకు ప్రేమించారు?'' అనే ప్రశ్నలు ఉన్నాయి.

ఈ ప్రశ్నలన్నీ చదివేసరికి బుజ్జిబాబుకు రెండు నిమిషాలపాటు కాళ్ళుచేతులు పనిచేయటం మానేశాయి.

వణుకుతున్న చేతులతో ఆ అప్లికేషన్ ఫారమ్‌ను ఆ అమ్మాయికి వాపస్ ఇచ్చాడు. అప్లికేషన్ ఫారమ్ పరీక్షగాచూస్తూ ఏమిటి చాలా కాలమ్స్ ఖాళీగా ఉన్నాయి, ఎందుకు పూర్తిచేయలేదు'', అంది.

''అనుభవంలేదు మేడమ్'' అన్నాడు ముభావంగా.

ఆ అమ్మాయి బుజ్జిబాబును ఎగాదిగాచూసి ముసిముసిగా నవ్వు తుంది.

అప్లికేషన్‌ను ఫైల్‌లో పెట్టుకుంటు, "ఆ.......అప్లికేషన్ ఫీజ్ యాభై ఇవ్వండి,'' అంది,

"యాభై యా....," అన్నాడు దీర్ఘంతీస్తూ

లేవు అంటే బాగోదు. బ్యారమాడటానికి వీలులేదు, మనసులోనే ''అబ్బ యాభైరూపాయలు'' అనుకుంటూ తప్పనిసరిఅయి యాభైరూపా యలు తీసి ఇచ్చాడు.

లవ కుమార్ ప్రేమ ప్రాక్టికల్ క్లాసులు అయిపోయినట్లుంది, టీనేజర్స్ కొంతమంది క్లాసులోనుంచి వస్తున్నారు.

బుజ్జిబాబుకు యాభైరూపాయలు అప్లికేషన్ కోసం ఖర్చుపెట్టి నందుకు కాస్తబాధగా ఉంది, మరుక్షణంలో ఆ బాధనుండి తేరుకొని ఆ యాభైరూపాయలను పూర్తిగా రాబట్టుకొనే సర్వీస్ తీసుకోవాలి అని పించింది. అందులో భాగంగానే, "మేడమ్, క్లాసులు అయిపోయినట్లుంది, లోపలికి వెళ్ళి క్లాస్‌రూమ్స్ చూడవచ్చా'' అన్నాడు.

ఆ అమ్మాయి నవ్వుతూ "క్లాస్‌రూమ్స్‌లోకి ఔటర్స్ నాట్ అలౌంట్ ఓ.కె. మీరు వెళ్ళి ప్రేమ గ్రంథాలయం చూడవచ్చు,'' అది.

దొరికిందే ఛాన్స్ అని బుజ్జిబాబు "సరే,'' అనేశాడు వెంటనే.

''అయితే మీరు సరిగ్గా వెళ్ళి రైట్‌కు తిరగండి, అక్కడే ఉంది ప్రేమగ్రంథాలయం, ఆ ప్రక్కనే సమావేశాల హాలు, కాని ప్రేమక్లాసుల లోకి వెళ్ళవద్దు. క్లాసుల్లో ప్రేమికులుంటారు,'' అంది హెచ్చరిస్తున్నట్లుగా,

ఆ వాతావరణమంతా కలల ప్రపంచంలా ఉంది.

బుజ్జిబాబు ప్రేమ గ్రంథాలయంలోకి వెళ్ళాడు. అక్కడ అంతా ఎటుచూసిన ప్రేమసాహిత్యమే. "ప్రేమ అంటే ఏమిటి? ప్రేమ ఎన్ని రకాలు, ఎందుకు ప్రేమించాలి, ఎలా ప్రేమించాలి," అన్ని పుస్తకాల పేర్లు దాదాపు ఇదే ధోరణిలో ఉన్నవే.

బుజ్జిబాబు చెయి అప్రయత్నంగా "ఎలా ప్రేమించాలి?" అనే పుస్తకం దగ్గర ఆగిపోయింది. యాభై రూపాయలు పోతేపోయ ఇంత చక్కటి ప్రేమ గ్రంథాలయాన్ని చూడగలిగాను అనుకున్నాడు తృప్తిగా మనసులో.

అక్కడకు వచ్చేది అంతా బాగా డబ్బు ఉన్నవాళ్ళ పిల్లలే...

అంతా జంటలే, సీతాకోక చిలుకల్లా ఉన్నారు.

అదంతా చూస్తుంటే, జీవితం ఎంత వృధా చేసుకున్నాను అని బుజ్జిబాబు బాధపడిపోయాడు.

ప్రేమ గ్రంథాలయంలో ఉన్న కొంతమంది ప్రేమ విద్యార్థులు అదే పనిగా బుజ్జిబాబు వైపే చూస్తున్నారు. అందువల్ల అక్కడ కూర్చో లేక రిసెప్షన్ కౌంటర్ దగ్గరికి వచ్చాడు.

కౌంటర్‌లో ఉన్న అమ్మాయి. "మిస్టర్ బుజ్జిబాబు, కో ఆర్డినేటర్ లవకుమార్‌గారు ఛాంబర్‌లో ఉన్నారు. మీతో ఇంటర్వ్యూ తీసుకుంటారు" అంటూ కో ఆర్డినేటర్ చాంబర్ చూపించింది.

బుజ్జిబాబు అనునయంగా లవకుమార్ చాంబర్‌లోకి వెళ్ళాడు. లవకుమార్‌కు వయస్సు ముప్పయి, ముప్పయి రెండు ఉంటుంది. బుజ్జి బాబుకు సంబంధించిన బయోడేటా, ప్రేమలో యక్స్‌పీరియన్స్ సంబం ధించిన అప్లికేషన్ చూస్తున్నాడు.

చాంబర్‌లోకి బుజ్జిబాబు రావటం చూసి "యస్ మిష్టర్ బుజ్జిబాబు, కమిన్ ప్లీజ్, టేక్ యువర్ సీట్" అన్నాడు.

మౌనంగా వెళ్ళి, ఛైర్‌మీద కూర్చున్నాడు.

లవకుమార్ ''చూడండి బుజ్జిబాబుగారు, ఇది దాదాపు ప్రభుత్వ సంస్థలాగే ఎలాంటి లాభాన్నీ ఆశించకుండా పని చేస్తుంది. మా సంస్థ ముఖ్య ఉద్దేశ్యం యువతీ యువకుల్లో ప్రేమజ్యోతులు వెలిగించటం. మా సంస్థ 1983లో స్థాపించారు...."అని ప్రారంభించి, సంస్థ చరిత్ర, ప్రతి సంవత్సరం ఎంత మంది చేరుతున్నారు...., ఎంతమంది ప్రేమ కోర్సులో సక్సెస్ అవుతున్నారు, అనే మొదలగు విషయాలన్ని గుక్క తిప్పుకోకుండా పావుగంటపాటు చెప్పాడు.

ఆ తరువాత లవకుమార్, బుజ్జిబాబుతో "ఇప్పుడు నేను మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు అడుగుతాను. వీటికి మీరు సిన్సియర్‌గా సమాధానాలు చెప్పాలి," అన్నాడు.

"సరే...." అన్నాడు బుజ్జిబాబు బుద్ధిగా.

''ఏదైన హోటల్‌కి వెళ్ళినప్పుడు మీరు స్టివట్‌కు ఎంత టిప్ ఇస్తారు....,'' అని అడిగాడు లవకుమార్.

''అలాంటి హోటల్స్‌కు నేను వెళ్ళను, ఒకవేళ వెళ్ళినా టిప్ మాత్రం ఇవ్వను. కారణం వాళ్ళకు హోటల్ యజమాని జీతం ఇస్తాడు కదా...." అని కనుగ్రుడ్లు మిటకరిస్తూ ఇంకా ఏదో చెప్పబోయాడు.

"ఓకే.... ఓకే" అంటూ మధ్యలోనే బుజ్జిబాబు మాటల్ని, తుంచేసాడు.

మరల లవకుమార్ రెండవ ప్రశ్నగా "బుజ్జిబాబుగారూ! మీకు ఒక గర్ల్‌ఫ్రెండ్ ఉందనుకోండి, ఆ అమ్మాయిని ఎక్కడికి పిలుచుకొనివెళ్ళి ఘాట్లాడాలి అనుకుంటారు....సినిమాకా, జూపార్క్‌కా లేక హోటల్‌కా...." అని అడిగాడు బుజ్జిబాబు కళ్ళలోకి చూస్తూ ప్రిటీష్‌నంది స్టైల్‌లో.

"ఈ హోటల్స్, సినిమాహాల్స్ అన్ని దబ్బు దండగ వేస్ట్ అండి. పైసా ఖర్చు కాకుండా ఉండటంకోసం ఇందిరాపార్క్ లాంటి ఏదైనా పబ్లిక్ పార్క్‌కు పిలుచుకొని...."

"ఓకే...." అంటూ లవకుమార్ మరల బుజ్జిబాబు మాటలకు విసుగ్గ అడ్డుతగిలి, "చివరిగా మూడవ ప్రశ్న మీరు మీ ప్రియురాలితో దారిలో వెళ్తుంటే మీకు ఐదురూపాయల నోట్ కనిపించిందనుకోండి, అప్పుడు మీరు ఆ నోట్‌ను చూసి చూడకుండా పోతారా, లేక...." అని లవకుమార్ ఇంకా ప్రశ్న అడుగుతూనే ఉన్నాడు, బుజ్జిబాబు అందు కున్నాడు.

"ఐదురూపాయల నోట్‌ను రోడ్డుమీద పడి ఉంటే చూసి చూడ కుండా ఎందుకు పోతానండి, ఎంచక్కా తీసుకొని కళ్ళకద్దుకొని జేబులో పెట్టుకుంటా...." అన్నాడు నవ్వుతూ.

"ఓ.కే.... మీ ఇంటర్వ్యూ అయిపోయింది. మీరు ఇక వెళ్ళవచ్చు. ఫొటో దిగటానికి, ఫొటో జనిక్ ఫేస్ అవసరం, అలాగే ప్రేమించటానికి కూడా కొన్ని అలవాట్లు ఉండాలి, ఆ లక్షణాలు మీలో లేవు. సారీ, మీరు అరేంజ్‌డ్ మ్యారేజ్ చేసుకోవటం మంచిది" అని ఒక ఉచిత సలహా పారేశాడు లవకుమార్.

ఆ మాట విన్న బుజ్జిబాబుకు ఎక్కడలేని నీరసం ముంచుకొచ్చింది. నీరసంగా ఏదో ఆలోచించుకుంటూ బయలు దేరాడు.

బుజ్జిబాబుకు పెళ్ళిళ్ళ పేరయ్య పేరు మదిలో మెదిలింది. లేడికి లేచిందే పరుగు అని సరిగ్గా పేరయ్య ఇంటికి వెళ్ళాడు. అరుబయట కూర్చొని ఏదో పంచాంగం చూసుకుంటూ ఉన్నాడు పేరయ్య.

పేరయ్యను చూడగానే బుజ్జిబాబు ఎక్కడలేని ఆనందం, భక్తి భావం కలిగింది. ఆ అవసరం అట్లాంటిది మరి,

"నమస్కారం పేరయ్యగారు" అన్నాడు.

పంచాంగంలో నుంచి తలతీసి "నమస్కారం, నీవటోయ్ బుజ్జిబాబు ....దా....రా కూర్చో - ఏమిటి సంగతి, అంతా కుశలమే కదా...." అన్నాడు.

బుజ్జిబాబు ఏడుపు మొహం పెట్టి తనకు వచ్చిన ఆపదను, బుజ్జిబాబుకు నెలరోజుల్లో పెళ్ళి చేసుకోమని వాళ్ళ బాస్ వేమనరావు వేసిన ఆర్డర్ని. ఆ తరువాత ప్రేమించి పెళ్ళి చేసుకోవటం కోసం ప్రేమబడికి వెళ్ళటం, అక్కడ జరిగిన నిర్వాకం అన్నీ ఏకరువు పెట్టి ఆపుకోలేక బావురుమన్నాడు.

"బాధపడకు బుజ్జిబాబు, కష్టాలు మనుషులకు కాక ఎవరికొస్తాయి? అయినా నేను ఉన్నాను కదా, నీవు ఊ అంటే ఈ హైదరాబాద్ మహా నగరంలో ఎంతమంది పెళ్ళికాని అమ్మాయిలు లేరు - నీలాంటి బుద్ధి వంతుడ్ని పెళ్ళి చేసుకోవటానికి - నీవు ఊ అంటే ముహూర్తం కూడా ఇప్పుడే పెట్టేస్తాను... సరేనా" అన్నాడు పేరయ్య.

"అది కాదు పేరయ్యగారు, జీవితంలో పెళ్ళి జరిగేది ఒకసారే కాబట్టి, ఒక్కసారి కూడ అమ్మాయిని చూడకుండ ఎలా చేసుకోవడం, ఒక్కసారి అమ్మాయిని చూసుకొని" అని నసిగాడు.

"ఓహో పెళ్ళి చూపులన్న మాట. సరే - ఆ ముచ్చట ఎందుకు కాదనాలి, ఊ కాని చేద్దాం, అన్నాడు పేరయ్య బ్రాహ్మణ రత్నాకరు డిలా.

"రేపు సాయంత్రం అమ్మాయిని చూడటం కోసం పిలుచుకెళ్తాను, సరేనా", అన్నాడు భరోసా ఇస్తున్నట్లు.

బుజ్జిబాబు ముఖం వంద వొల్టుల బల్బులా వెలిగింది. కాని బుజ్జిబాబుకు ఆ క్షణంలో తెలియదు ఆ పెళ్ళే తనకు ఓ శాపంగా మారబోతుందని.

మరుసటి రోజు మధ్యాహ్నం మూడింటికల్లా, బుజ్జిబాబు సీట్‌గా తయారై శాస్త్రిగారి ఇంటికి వచ్చేశాడు. పెళ్ళి చూపులకు వెళ్ళటం కోసం

సాయంత్రం నాలుగు గంటలకు బుజ్జిబాబు, పేరయ్యశాస్త్రి కాలి నడకన బయలుదేరి, ఓ అర్ధ గంట నడిచిన తరువాత ఓ చిన్న వీధిలోని ఇంటిలోనికి తీసుకొని వెళ్ళాడు పేరయ్యశాస్త్రి.

ఆ ఇల్లు మధ్య తరగతి ఇల్లు - ఇంటి అలంకరణ చాలా సామాన్యంగా ఉంది ఇంటిలో చాలామంది చిన్న పిల్లలున్నారు.

పెళ్ళి కూతురు తండ్రి ఒకటే హడావుడిగా ఇటు అటు తిరుగుతున్నాడు. అనవసరంగా హైరానా పడిపోతున్నాడు.

పెళ్ళి కూతురు ప్రక్కింటిలో కలర్ టి. వి. ముందు నుంచి లేచి రావటం లేదట, ఈ విషయం బుజ్జిబాబుకు కూడా తెలిసింది, కాని ఏదో తమాషకు అనుకుంటున్నారు ఏమో అనుకున్నాడు.

కాని నిజంగానే "రుక్మిణి" కలర్ టి. వి. ముందు కూర్చొని "నంజుకుతింట" అనే తెలుగు సినిమా చూస్తున్నది.

ఎవరి అదృష్టం కొద్దో సరిగ్గా అప్పుడే కరెంట్ పోవటంవల్ల రుక్మిణి ఇంటిలోకి వచ్చింది. అప్పుడే పెళ్ళికూతురి అలంకరణ పూర్తి చేశారు.

ఆ ఇంటిలో ఇద్దరు ముగ్గురు ముసలోళ్ళు కూడా ఉన్నారు. ఒక ముసలావిడ బుజ్జిబాబు దగ్గరకి వచ్చి, బుజ్జిబాబు ఒంటరిగా పెళ్ళి చూపులకు రావటం చూసి ''ఏం నాయినా! నీకు, అమ్మా బాబా లేరా'' అంది.

ఆ ముసలావిడ ఆ రకంగా అడగటంలో బుజ్జిబాబుకు చిర్రెత్తు కొచ్చింది ఐదింటికి వచ్చి కూర్చున్నాడు, ఇప్పుడు ఏడు గంటలు కావస్తుంది, ఇప్పటివరకు ఒక కప్పు కాఫీ కూడా ఇవ్వలేదు, దానికితోడు ఈ ముసలావిడ ఏమిటి నసపెట్టేస్తుంది అని మనసులోనే బాధపడి, ఇవి ఎక్కడి మాయదారి పెళ్ళి చూపులురా భగవంతుడా అని అనుకుంటూ,

అతి ప్రయత్నం మీద కోపాన్ని దాచుకుంటు, "అమ్మా నాన్న లేరు బామ్మ. మా అమ్మమ్మ ఉంది. ఆమెకు ఎందుకు శ్రమ అని నేనొక్కడినే వచ్చాను" అన్నాడు వినయంగా.

"నేను నీకేం బామ్మను కాను.... పెళ్ళి కూతురికి పెద్దమ్మను అంటే నీకు అత్తయ్యను, అత్తయ్య అని పిలువు" అని ఆర్డర్ పాస్ చేసింది ఆ ముసలావిడ.

బుజ్జిబాబుకి ఏదో చెడు అనుమానం మనసులోకి వచ్చింది. ఆ ఇంటిలోని వాళ్ళ వాలకం చూస్తుంటే బుజ్జిబాబుకు కాళ్ళు చేతులు కట్టి అయినా సరే పెళ్ళిచేసి పారేసేలా ఉన్నారు అనిపిస్తుంది.

ఇంతలో పేరయ్యశాస్త్రి "అమ్మాయికి కాస్త సిగ్గు ఎక్కువ, ఏమి మాట్లాడదు, కేవలం పేరు చెప్తుంది, మరింకేమి అడగకు" అన్నాడు మరో ఆర్డర్ పాస్ చేస్తూ.

బుజ్జిబాబు ఏద్వలేక నవ్వి "సరేనండి", అన్నాడు. ఇంతలో కరెంట్ వచ్చింది.

పెళ్ళి కూతుర్ని ఎంత మంది ఆపినా ఆగకుండా వెళ్ళి ప్రక్కింటిలో ఉన్న కలర్ టి.వి. ముందు కూర్చుంది.

ఏడు గంటల నుండి బుజ్జిబాబు పెళ్ళి చూపుల కోసం కదలకుండా కూర్చొనే ఉన్నాడు. ఏడు గంటలు దాటింది అయినా పెళ్ళి కూతుర్ని ఇంకా బుజ్జిబాబుకు చూపించలేదు. ఇరుగు పొరుగింట అమ్మలక్కలు వచ్చి బుజ్జిబాబును చూసి పోతున్నారు. బుజ్జిబాబుకు ఇదంతా చాలా నర్వస్‌గా ఉంది. కాని, తప్పదు ఇలాంటి విషయాలు కాస్త తెలుసు కనుక ఇప్పటి దాక ఓపిక పట్టాడు. ఇక అతనిలో ఓపిక నశించింది.

"ఏమిటండి పేరయ్యగారు ఆలస్యం" అన్నాడు బుజ్జిబాబు కాస్త ధైర్యంచేసి.

పేరయ్య సరిగ్గా ఈ ప్రశ్నకోసమే సమాధానం ఆలోచించుకొని ఉన్నట్లుంది. వెంటనే "ఏమిలేదు బుజ్జిబాబు - సరిగ్గా ఏడుగంటల ముప్పయి నిమిషాలకు దివ్యమైన సమయం; తెలుగు టి.వి. లో వార్తలు మొదలైనప్పుడు మీ జీవితంలో అపశృతులు దొర్లకుండా ఉండాలి అంటే ఆ టైమ్‌లోనే చూడాలి పెళ్ళి కూతురిని; మీ జీవితంలో దొర్లవలసిన అపశృతులన్ని టి.వి. వార్తలలో దొర్లుతాయి" అన్నాడు ఆపి ఆపి.

ఇది ఏదో నిజమే అనిపించింది బుజ్జిబాబుకి.

పేరయ్య శాస్త్రి ఆ సమయం చెప్పటానికి కారణం పెళ్ళికూతురు 'రుక్మిణి' కేవలం సినిమాలు చూస్తుంది. కాని, వార్తలను ఏ మాత్రం పట్టించుకోదు అప్పుడు ఇంటిలోకి వస్తుంది, అప్పుడు ఈ పెళ్ళి చూపుల తతంగం పూర్తి చేయాలని పేరయ్యగారి ప్లాన్.

రాత్రి ఏడుగంటల ముప్పయి నిమిషాల వరకు బుజ్జిబాబు దిష్టి బొమ్మలా కూర్చుండే ముసలి ఆడవాళ్ళు బుజ్జిబాబు ముఖం వైపునే చూస్తూ కూర్చున్నారు. ఆ ముసలి వాళ్ళు ఏమీ మాట్లాడటం లేదు - బుజ్జిబాబును జూలో జంతువులా చూడటం తప్ప

బుజ్జిబాబు ఆ చిత్రవధ భరించలేక ఇవెక్కడి పెళ్ళి చూపుల్రా భగవంతుడా అని మనసులోనే గబగబ ఏడ్చుకున్నాడు. ఇక జీవితంలో ఒంటరిగా ఎట్టి పరిస్థితులలో ఇలా పెళ్ళి చూపులకు రాకూడదు అని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

రాత్రి ఏడుగంటల ముప్పయి నిమిషాలయింది.

టి.వి. లో తెలుగు వార్తలు ప్రారంభమైనాయి.

రుక్మిణి టి. వి. వదిలి ఇంటికి వచ్చింది.

రుక్మిణిని బుజ్జిబాబు ముందుకు తీసుకొని వచ్చి కూర్చోబెట్టారు. పెళ్ళికూతురి అలంకరణలో ఉన్న రుక్మిణిని చూస్తూ ఉంటే బుజ్జిబాబుకు

గిలిగింతగా ఉంది. పెళ్ళికి ముందు పెళ్ళిచూపుల పేరుతో పెళ్ళికూతుర్ని చూసే మజాయే వేరు కదా అనిపించి బుజ్జిబాబుకు చిరుగర్వం కలిగింది ఓ క్షణంపాటు.

ఆనవాయితీ ప్రకారం "నీ పేరేంటి?" అన్నాడు బుజ్జిబాబు.

"రుక్మిణి" అంది. "మరి మీ పేరేంటి?" ఆ వెంటనే.

బుజ్జిబాబుకు చెడుకాలం చాలా దగ్గరలో ఉంది అని ఏదో అంతరాత్మ ప్రబోధిస్తూ ఉంది.

"అమ్మాయికి సిగ్గెక్కువ బాబు. అందువల్ల మీరు మాట్లాడిస్తే కంగారులో ఏదేదో మాట్లాడేస్తుంది. వంటలు మాత్రం బ్రహ్మాండంగా చేస్తుంది" అని తల్లి వెనుకనుంచి చెప్పింది.

ఆమె మాటలకు పెళ్ళికూతురి తండ్రి "అవును....అవును....అవును" అన్నాడు కోర్టులో ఉండే బంట్రోతులా.

"ఏం....కాదు. అంతా అబద్ధం" అంది పెళ్ళికూతురు కళ్ళు తిప్పుతూ.

అందరూ ఒక్కసారిగా నవ్వారు.

పెళ్ళికూతుర్ని ఇంకా అక్కడే కూర్చోబెడితే ఇంకేంమాట్లాడేస్తుందోనని భయంతో వెంటనే లోపలికి తీసుకెళ్ళారు.

పెళ్ళిచూపుల తతంగం అయిపోయింది.

పెళ్ళిచూపులు అయిన వారంలోనే పెళ్ళి ఘనంగా కాకపోయినా, పెళ్ళి జరిగిపోయింది.

ఆ రోజు బుజ్జిబాబు మొదటి రాత్రి. మామూలు రాత్రి కాదు. పెళ్ళి అయిన తరువాత జరుపుకొనే మొదటి రాత్రి.

తెల్లటి పంచె, పైచొక్కాలో బుజ్జిబాబు. గదిలో తియ్యని ఊహలతో భార్య రుక్మిణికోసం ఎదురుచూస్తూ ఉన్నాడు ఓ అర్ధగంటనుండి.

రుక్మిణి పాలగ్లాసు చేతిలో పట్టుకొని గదిలోకొచ్చింది. బుజ్జిబాబు రుక్మిణిని చూసి పరవశించి పోతున్నాడు. ఒళ్ళంతా తియ్యని బాధ ప్రారంభమయింది.

రుక్మిణి పాలగ్లాస్‌తో బుజ్జిబాబు దగ్గరకు వచ్చి నిలబడింది.

రుక్మిణి గంధర్వ కన్య కాకపోయినా అనాకారి మాత్రం కాదు, చూడగానే కంటికి ఆనే రూపం; మామూలు అందంకంటే ఓ బెత్త ఎక్కువే.

బుజ్జిబాబు సిగ్గుతో మొగ్గలేస్తూ రుక్మిణిని పలుకరించాడు.

రుక్మిణి పలికింది. ఆ తరువాత రుక్మిణి చెప్పటం ప్రారంభించింది. ఏకధాటిగా మాట్లాడుతూనే ఉంది. ఓ గంట దాటింది. రుక్మిణి ఏదో మాట్లాడుతోంది. రెండు గంటలు గడిచాయి. ఏదో సంఘటన చెప్తున్నది.

రుక్మిణి మాట్లాడే మాటలలోని తలాతోకా అర్థం కావటంలేదు. బుజ్జిబాబు ఏకాగ్రత్తతో వినటానికి ప్రయత్నిస్తున్నాడు.

"మీరు నా పెళ్ళిచూపుల కోసం వచ్చారు చూడండి. ఆ రోజు టి.వి.లో 'నంజుకు తింట' అనే తెలుగు సినిమా వస్తూ ఉన్నది. మధ్యలో కరెంట్ పోయినందుకు ఇంటిలోకి వచ్చాను. అప్పుడు నాకు పెళ్ళి కూతురిలా అలంకరించారు.

ఆ రోజు నన్ను ఏమి మాట్లాడనీయలేదు. మా అమ్మ నాన్న, నా సినిమా హాబీ, పాటలు పాడటం మీతో చెప్పనే లేదు...." అని గుక్క తిప్పుకోకుండా ఏదో చెప్పుకుంటూ పోతున్నది.

ఈ విషయాలన్నీ బుజ్జిబాబుకు నిజంగా ఏమీ తెలియవు. రుక్మిణి మాట్లాడుతున్న ప్రతి సెంటెన్స్ సెంటెన్స్‌కు బుజ్జిబాబు గుండెలో బాంబులు పేలుతున్నాయి. ఇప్పటికి అర్థమైంది "సెంటెన్స్‌డ్ టు డెత్" అంటే ఏమిటో....

ఇప్పుడు ఇక బుజ్జిబాబుకు ఏమీ వినిపించటం లేదు.

ఓ ఐదు నిమిషాలపాటు ట్రాన్స్‌లో ఉండిపోయాడు.

ఆ తరువాత తేరుకొని చూసేసరికి రుక్మిణి ఏదో చెప్తూ ఉంది; రుక్మిణి మాట్లాడే వాలకం చూసి బుజ్జిబాబు హిస్టీరియా వచ్చిన వానిలా కీచుగా అరుస్తూ జుట్టు పీక్కున్నాడు.

బుజ్జిబాబు అరుపుతో రుక్మిణి మాటలు ఆపి.... బుజ్జిబాబు వాలకం చూసి "స్క్రూ లూజా...." అంది క్వొచ్చన్ మార్క్ (ఫిగర్ పెట్టి) ఫేస్‌తో.

బుజ్జిబాబు ఏమీ మాట్లాడలేదు.

రుక్మిణి పట్టి కుదిపింది. ఆ కుదుపుతో ఉలిక్కిపడి స్పృహలోకి వచ్చాడు.

రుక్మిణి పాలగ్లాస్ అందించింది.

అందుకొని పాల గ్లాస్ ప్రక్కన పెట్టి "ఎంతవరకు చదువుకున్నావు" అన్నాడు దీర్ఘంగా.

రుక్మిణి సిన్సియర్‌గా "ఐదవ తరగతి మూడేళ్ళు చదివాను. ఆంధ్రభూమి, జ్యోతి, స్వాతి అన్ని సినిమా పత్రికలు ఎప్పటివి అప్పుడు చదివేస్తూ ఉంటాను" అంది ఘనకార్యంగా.

అంటే ఐదవ తరగతి అన్న మాట చదివింది అనుకున్నాడు. పోనీలే చదువులో ఏముంది, అని సరిపుచ్చుకొని...."

ప్రక్కనే ఉన్న పాలగ్లాస్ అందుకుంటు ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా "ప్రతి మనిషి అందని దానికే అర్రులు చాస్తాడు'' అని మనసులో అనుకుంటూనే బయటకు అనేశాడు.

ప్రక్కనే ఉన్న రుక్మిణి మరో రకం, పౌరుషంగా రియాక్ట్ అయి, "అవును నిజమే, మీరు నన్ను ఆశించి మరి అందుకోలేదు. లేకపోతే నా కోసం ఏ సినిమా యాక్టరో, అపోలో హాస్పటల్ డాక్టరో రావలసింది,. మనుషులు ఏం ఖర్మ జంతువులు కూడా తమకు అందని ఆకులు, అలములు తినటానికి ఇష్టపడతాయి. అవి అందకపోతే అర్రులు చేస్తుంటాయి...." అని ఇంకా ఏదో ఉపమానాలు చెప్పుకుంటూ పోతున్నది.

బుజ్జిబాబుకు అరికాలి మంట నెత్తికెక్కింది.

రాత్రి పన్నెండు దాటింది. రుక్మిణి నోటికి అడ్డు అదుపు లేదు. వాక్ధాటికి ఎదురు లేదు. ఏదో మాట్లాడుతున్నది అర్థం పర్థం లేకుండా.

బుజ్జిబాబుకు నిద్ర ముంచుకోవస్తున్నది.

ఇంక చేసేది లేక చిక్క చచ్చి అలాగే చూస్తూ నిద్రపోయాడు.

అర్ధరాత్రి రెండు గంటలప్పుడు ఉలిక్కిపడి లేచాడు.

ప్రక్కనే రుక్మిణి నిద్రపోవటం లేదు; ఏదో మాట్లాడుతున్నది ఇంకా....

బుజ్జిబాబు భార్యను చూసి గుండెలు బాదుకున్నాడు. ఏడ్చుకున్నాడు, కాళ్ళు చేతులు వణికాయి. విపరీతమైన బాధతో మనసు కుమిలిపోయింది.

రాత్రి అంతా బాగా ఆలోచించాడు. భార్య వాలకం ఏమి అంతు చిక్కకపోయిన మానసికంగా బాగా అలసిపోయాడు.

ఇక ఆలోచించలేక కళ్ళు గట్టిగా మూసుకొని తెల్లవారబోయే ముందు నిద్రలోనికి జారుకున్నాడు.

* * *

డాక్టర్ అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్‌లో ప్రేలుడు జరిగింది. అది ఎలా జరిగింది అనేది జంటనగరాలలో ప్రముఖ చర్చనీయాంశం అయింది.

హాస్పటల్ స్టాఫ్ ఎవరూ పేపర్ రిపోర్టర్స్‌కు ఇంటర్వ్యూ ఇవ్వక పోవటంతో అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్‌లో "గూడుపుఠాని" అనే వార్తలు హెడ్‌లైన్స్‌లలో ప్రచురించాయి కొన్ని పత్రికలు.

డాక్టర్ అభిమన్యు కాన్ఫరెన్స్ హాల్‌లో ప్రెస్ మీటింగ్ ఏర్పాటు చేశారు.

కాన్ఫరెన్స్ హాల్ అంతా విలేఖరులతో నిండిపోయింది. వీరేకాక నగర ప్రముఖులు కొంతమంది. జూనియర్ డాక్టర్స్, ప్రైవేట్ ప్రాక్టీష నర్స్ ఎంతో ఉత్కంఠతో డాక్టర్ అభిమన్యు కోసం ఎదురుచూస్తూ ఉన్నారు.

అభిమన్యు ఉదయం పది గంటలకు కాన్ఫరెన్స్ హాల్‌కు వచ్చారు. డాక్టర్ అభిమన్యు ఎంతో హుందాగా ఉన్నారు. అభిమన్యు ముఖం మీద ఎలాంటి విచార ఛాయలు లేవు. వెళ్ళి స్టేజి మీద ఉన్న ఛైర్ మీద కూర్చున్నారు. అభిమన్యుకు ఒకవైపు డాక్టర్ విశ్వామిత్ర మరోవైపు డాక్టర్ స్నేహిత, ప్రశాంత్ కూర్చున్నారు.

"హ్యావ్ ఎ నైస్‌డే. ఆల్ ఆఫ్ యూ" అన్నాడు సభను, సభ్యులను ఉద్దేశించి.

"ఒ.కే. మీరు అడగాలి అనుకున్నవి అడగవచ్చు" అన్నాడు ధీమాగా.

వెంటనే ఒక విలేఖరి లేచి "సర్, నిన్నగాక మొన్న జరిగింది బాంబ్ ప్రేలుడు, దానికి సంబంధించి ప్రెస్‌మీట్ రెండు రోజుల తరువాత

ఎందుకు ఏర్పాటు చేసినట్లు, ఆ రోజే కాని మరుసటి రోజు కాని ఎందుకు ఇంటర్వ్యూ ఇవ్వలేదు" అన్నాడు.

అభిమన్యు చాలా కూల్‌గా చిరునవ్వు నవ్వుతూ "వెల్, మీ ప్రశ్న రెండు భాగాలు. మొదట మీ ప్రశ్నే తప్పు. కారణం, మా రిసర్చ్ ఇన్స్టిట్యూట్‌లో ఎలాంటి బాంబ్ ప్రేలుడు జరగలేదు. అది ప్రయోగశాలలో జరిగిన చిన్న పొరపాటువల్ల సంభవించిన ప్రమాదం. మా సంస్థను ప్రజల దృష్టిలో దిగజార్చాలని ఎవరో పనిగట్టుకొని ప్రచారం చేస్తున్నారు. కాని నిజానికి మా ఇన్స్టిట్యూట్‌లో ఎలాంటి బాంబ్ ప్రేలుడు జరగలేదు. ఒక వేళ మీ మాట ప్రకారమే బాంబ్ ప్రేలుడు జరిగింది అనుకున్నా ఏ ఒక్క మనిషి కనీసం గాయపడలేదు. దీనికి కారణం ఏమిటంటారు? ఇది ప్రేలుడు కానే కాదు. కెమికల్ రియాక్షన్ వల్ల అలా జరిగింది అని మా సీనియర్ సైంటిస్ట్ డాక్టర్ విశ్వామిత్రగారు చెప్పారు. ఇక మీ రెండవ ప్రశ్నకు సమాధానం. ఆ ప్రమాదం జరిగింది రాత్రి ఒంటి గంట ముప్పయి నిమిషాలకు, కానీ మరుసటి రోజే ఒక ప్రముఖ పత్రికలో న్యూస్ వచ్చింది. ఆ రోజు ప్రెస్ మీట్ ఏర్పాటు చేయటానికి మా డాక్టర్స్, స్టాఫ్ మెంటల్‌గా అప్‌సెట్ అయి ఉండటం వలన ఏర్పాటు చేయలేక పోయాం.మా సిబ్బంది కూడా ఇంటర్వ్యూ ఇవ్వకపోటానికి కారణం, వాళ్ళు ఒక విషయం చెప్పితే మీరు మరో విషయం వ్రాస్తారని మా సిబ్బంది సహకరించి ఉండకపోవచ్చు'' అంటూ—

''ఓ.కే., టేక్ ఇట్ ఈజీ., యస్" అన్నాడు రెండవ ప్రశ్న ఎవరైనా అడగవచ్చని.ఒక జర్నలిస్ట్ లేచి ''ప్రయోగశాలలోని ప్రాజెక్ట్-సి పూర్తిగా దెబ్బతిసింది అని తెలిసింది,- ప్రాజెక్ట్-సి. అంటే ఏమిటి సర్, కాస్త వివరిస్తారా?" అని అడిగింది.

"ప్రతి ప్రయోగానికి ముందు మేం ఒక కోడ్ నేమ్‌తో ప్రారంభిస్తాం. ఆ ప్రయోగం సక్సెస్ అయిన తరువాత దానికి వెలుగులోనికి

తెస్తాం. ప్రాజెక్ట్-సి, అంటే క్యాన్సర్‌కు సంబంధించిన యాంటి బైటిక్ మెడిసన్ కనుక్కొనే ప్రయోగం - చిన్నపిల్లలకు బీ. సి. జి, పోలియో టీకాల వలెనే, క్యాన్సర్ రాకుండా యాంటి క్యాన్సర్ డ్రాప్ అనే ఒక మందును కనిపెట్టాము. ఆ ప్రయోగానికే ప్రాజెక్ట్-సి అనే పేరుతో ప్రారంభించాం. ఈ ప్రయోగం మొత్తం కొలాప్స్ అయింది - ఒకవేళ ఈ ప్రయోగం సక్సెస్ అయి ఉండుంటే క్యాన్సర్‌ను పూర్తిగా నిర్మూలించ గలిగి ఉండే వాళ్ళం."

"అసలు క్యాన్సర్ అంటే ఏమిటి సర్? ఈ వ్యాధికి మందే లేదని చెప్తుంటారు, ఎంతవరకు నిజం?" అని సూటిగా అడిగింది.

అభిమన్యు నవ్వుతూ "మీ ప్రశ్న చాలా చిన్నదిగా కనిపించే ప్రశ్న, కాని వాస్తవానికి ఇది చాలా పెద్ద ప్రశ్న. కనుక దీని సమాధానం కూడా పెద్దగానే ఉంటుంది కాని, సంక్షిప్తంగా చెప్తాను. మన శరీరం అనేక కణాలతో నిర్మితమై వుంటుంది. వయసు వచ్చేవరకు కణ విభజన ఎక్కువగా జరుగుతూ మనిషి ఎదుగుదలకు తోడ్పడుతుంది. ఈ ఎదుగుదల సాధారణంగా ఒక వయసు వచ్చిన తరువాత వేగం తగ్గిపోతుంది. అప్పటినుండి కేవలం డామేజ్ అయిన కణాల స్థానంలో కొత్త కణాలను పూరిస్తుంది.

"సాధారణంగా కణ విభజన ప్రతి యిరవై రోజులకి ఒకసారి జరుగుతుంది, కాని, అలాకాక రెండు లేక మూడు రోజులకి ఒకసారి విభజన చెందే కణాల సమూహాన్నే 'క్యాన్సర్' అని చెప్పవచ్చు - ఈ క్యాన్సర్ కణాలకు వేరే పని అంటూ ఏమీ ఉండదు. అవి కేవలం విభజన చెందుతూ ఉంటాయి. కణాల సముదాయం ఒక ప్రాంతంలో విపరీతంగా పెరిగిపోయి గడ్డలాగా, లేదా కురుపులాగా ఎదుగుతుంది. దీనినే 'క్యాన్సర్' అంటారు. ఈ క్యాన్సర్ కణాలు మామూలు కణాలకంటే

చాలా విలక్షణంగా ఉంటాయి. క్యాన్సర్‌గా మారిన కణం అదుపులేకుండా విభజన చెందుతూ క్యాన్సర్ కణాలని విపరీతంగా పెంచి వేయడమే కాకుండా వాటిని ప్రక్కనేవున్న ఆరోగ్యకరమైన శరీర భాగాలలోకి చొచ్చుకొని పోయేటట్లు చేస్తుంది. ఇలా చొచ్చుకొని పోయిన క్యాన్సర్ కణాలు ఆరోగ్యకర కణాలని నాశనం చేస్తాయి. ఈ క్యాన్సర్ కణాల మరో ముఖ్య లక్షణం అవి పుట్టిన ప్రదేశంలో ఉండక ఎప్పుడూ ఇతర భాగాలకు చొచ్చుకొని పోతూ ఉంటాయి. మామూలు శరీర కణానికి ఈ లక్షణం ఉండదు. ఈ క్యాన్సర్ మానవ శరీరంలోని మెదడు, ఊపిరి తిత్తులు, లివర్, శ్వాసకోశాలు, వక్షస్థలం, కడుపు, చర్మం, ప్రేపుల్లో ఒక మాటలో చెప్పాలంటే ఈ వ్యాధి ఏ అవయవానికైన రావచ్చు - అక్కడి నుండి మిగతా అవయవాలకు పాకి, ఆరోగ్యకరమైన కండని నాశనం చేస్తుంది. ఆరోగ్యకర కణాలని నాశనం చేయడం, అనారోగ్యకర కణాలని వృద్ధి చేయటం క్యాన్సర్ ప్రధాన లక్షణం.

"ఈ వ్యాధి కొందరిలో త్వరితంగా వ్యాప్తిచెంది హాని కలిగిస్తే, మరి కొందరిలో నిదానంగా వ్యాప్తి చెందుతుంది. ఇది క్యాన్సర్ రకాన్ని బట్టి అలా వ్యాప్తి చెందుతుంది. వ్యాధి ప్రారంభ దశ చాలా నిదానంగా కనబడి, వేరే చోట్లకి పాకిన తరువాత వేగం పుంజుకోవచ్చు. క్యాన్సర్ పుట్టిన చోటనుంచి క్యాన్సర్ కణాలు ప్రక్కనే వున్న శరీర భాగాల్లోకి చొచ్చుకొనిపోయి వ్యాధిని వ్యాప్తి చేయడం ఒక పద్ధతి కాగా, క్యాన్సర్ కణాలు రక్తనాళంలోకి చేరి, శరీర వివిధ భాగాలకి వ్యాప్తి చెందడం మరో రకం.

"క్యాన్సర్ పుట్టిన చోటనే వుంటే ప్రైమరీ స్టేజ్ అంటారు. శరీరంలో వివిధ చోట్లకి వ్యాప్తి చెంది అక్కడ కూడా వ్యాధి కలిగినప్పుడు సెకెండరీ స్టేజ్ అంటారు.

"శాస్త్రముందు మీరన్నట్లు క్యాన్సర్ వ్యాధికి మందులు లేవు అని అనుకోటం కేవలం అపోహ మాత్రమే. ఈ క్యాన్సర్ వ్యాధులు ముఖ్యంగా నాలుగు రకాలుగా వున్నాయి. వీటన్నిటికి చికిత్సలు ఉన్నాయి. అవి శస్త్ర చికిత్స, రేడియేషన్ చికిత్స (రేడియోథెరపి), కీమోథెరపి, హార్మోన్ల చికిత్స.

"క్యాన్సర్ వ్యాధి మొదటిదశలో చికిత్స ప్రారంభిస్తే నూటికి నూరు శాతం నయం చేయవచ్చు. ఈ వ్యాధిని దాచి, అలక్ష్యం చేయటం వలన చికిత్స క్లిష్టం అవుతున్నది.

"సరైన సమయంలో ప్రారంభిచవలసిన చికిత్స ప్రారంభించక పోతే మనిషికి ప్రమాదంగా పరిణమించవచ్చు....

"ఎలాంటి కారణం లేకుండా శరీరంలో ఏర్పడే కంతులను అలక్ష్యం చేయరాదు. వాటిని దాచరాదు. గత పది పన్నెండుఏళ్ళకాలంనుండి క్యాన్సర్ వ్యాధి వలన మరణించినవారు చాలా తక్కువ శాతమే!

"ఈ వ్యాధి సోకిన వాళ్ళు మానసికంగా కృశిస్తారు. కాని, నిజానికి అంతగా భయపడవలసిన అవసరంలేదు. ఈ క్యాన్సర్ వ్యాధికి వ్యాక్సిన్ కనుగొనుటయే నా జీవితాశయం...."

ఒక జర్నలిస్ట్ లేచి "సర్, మీరు ఈ విధంగా వైద్య వృత్తిలో కృషి చేయటానికి స్ఫూర్తి ఎవరు?''

డాక్టర్ అభిమన్యు అమృతం కురిపించే ఓ చిరునవ్వు నవ్వి చెప్పడం ప్రారంభించారు:

''నాకు ఇన్స్పిరేషన్ ఎవరు అని అడిగారు. అది ఒకరు కాదు. కొన్ని సంఘటనలు, చేదు అనుభవాల జీవితం. నా చిన్నతనంలో నా తండ్రి ఏదో పేరు తెలియని ఈ వ్యాధికి గురి కావటం, ఆ తరువాత మా మెడికల్ కాలేజ్ ప్రొఫెసర్ బ్రెస్ట్ క్యాన్సర్‌తో మరణించటంతో

నా మనసు వికలం అయింది. అప్పుడే నేను నిర్ణయించుకున్నాను నా జీవిత ఆశయం. క్యాన్సర్ వ్యాధిని పూర్తిగా నిర్మూలించాలి అని....", అంటూ ఆగాడు.

ఒక యంగ్ జర్నలిస్ట్ లేచి ''అభిమన్యుగారు! మీ గురించి మాకు కొంత తెలుసు. కాని అందులో ఏది నిజం ఏది అబద్ధమో తెలియదు, మీ గురించి కాస్త చెప్తారా? ప్లీజ్'' అన్నాడు.

తల ఊపి సరే అన్నట్లుగా "నేను చాలా పేద కుటుంబంలో పుట్టాను. మాది చాలా చిన్న గ్రామం. గ్రామ జనాభా మొత్తం కలిపి మూడువేలు ఉండవచ్చు. చిన్నప్పుడే అమ్మా, నాన్నా పోయారు. నాకృషి పట్టుదలలతోనే జీవితంలో ఒక్కొక్క మెట్టు విజయాలు సాధించాను. నా ఆత్మ విశ్వాసమే పెట్టుబడిగా ఈ స్థాయికి రాగలిగాను........ ''- అభిమన్యుకు భాషమీద అపారమైన పట్టు, అధికారం ఉంది. అంతకంటే మించి అతని స్వరంలో ఓ మాధుర్యం ఉంది. మాట్లాడటంకోసం మాటలు వెతుక్కోడు. అందంగా ఉన్నవారు, తెలివైనవారు సామాన్యంగా చక్కగా మాట్లాడలేరు. కానీ దీనికి విరుద్ధంగా ఎంతో తియ్యగా అమృతం కురిసేలా, గుండెలను స్పృశించేలా మాట్లాడుతాడు. ఇది చాలా గొప్పవరం.

"అయితే మీరు మరలా ప్రాజెక్ట్‌ను ప్రారంభిస్తారా", అని అను మానంగా అడిగాడు ఓ జర్నలిస్ట్.

''యస్. తప్పకుండా., నేను జీవితంలో కృషితో దీక్షతో వృద్ధి లోకి వచ్చిన వాడిని. ప్రారంభించిన ఏ పనీ పూర్తి కాకుండా వదలను. సరిగ్గా మరో ఆరునెలల్లో నా ప్రయోగం పూర్తి స్థాయిలో తయారు చేయ గలమని పత్రికాముఖంగా తెలియజేస్తున్నాను'' అన్నాడు. అతని మాటలు,వాగ్దానాలు బోళారాజకీయ నాయకుని మాటల్లా లేవు. అభిమన్యు ప్రతి మాటలో ఖచ్చితత్వం ఉంది. నిజాయితీ ఉంది. అంతకు మించి పట్టుదల ఉంది.

ఆ మాటలకు కాన్ఫరెన్స్ హాల్ అంతా ఆనందంతో కరతాళ ధ్వనులతో మార్మ్రోగింది.

కాని, హాల్ మధ్యలో కూర్చొని ఉన్న చౌదరికి అవి ముళ్లలా గుచ్చుకున్నాయి.

మరలా అభిమన్యు చెప్పటం ప్రారంభించాడు: "నా ఈ ప్రాజెక్ట్-నీ దేశంలోనుంచి, ప్రపంచంలో నుంచి క్యాన్సర్ మరణాలను పూర్తిగా తొలగించటంలోనే నిమగ్నమౌతాను..జీవితంలో సాధించాలి అనే ఆరాటం అందరికి ఉంటుంది. అలాగే నేను కూడా. నేను ఈ ప్రాజెక్ట్‌ను పూర్తిగా సాధించగలనో లేదో నాకు తెలియదు. అదేకాక, నా ఈ ప్రయోగంలో రిస్క్ తప్పదు. కానీ నాకు ఆ రిస్క్‌లోనే ఓ ఆనందం ఉంది. ఛాలెంజ్‌గా ఉంటుంది నా జీవితం.

"ఈ ప్రయోగంలో ఎన్ని అడ్డంకులు వచ్చినా నేను ఆగిపోను. మనిషి జీవితంలో మనం ఎవరినైనా వదులుకోవచ్చు కాని, మన జీవిత ఆశయాన్ని మనం వదులుకోరాదు. ఇక జీవితంలో ప్రతి క్షణం నా ఆశయ సాధనకోసం ఒక సంఘర్షణ సాగిస్తాను. ఒక మహాయజ్ఞం ప్రారంభిస్తాను. మరలా నా ప్రయోగాన్ని...."

ఆ కాన్ఫరెన్స్ హాల్‌లోనే ఉన్న చౌదరి కూడా అభిమన్యు ఆత్మ విశ్వాసాన్ని ధైర్యాన్ని మనసులోనే ఒప్పుకున్నాడు. నిజాన్ని అంతర్యంలోనైనా ఒప్పుకోవటం ఒక సుగుణమే!

కాన్ఫరెన్స్ హాల్ మరోసారి కరతాళధ్వనులతో మార్మ్రోగింది.

చివరిగా ఓ జర్నలిస్ట్ లేచి "నూతనంగా మీ రంగంలోకి అంటే మెడికల్ అండ్ రీసర్చ్‌లోకి వచ్చేవారికి మీరు ఎలాంటి సలహా ఇవ్వాలి అనుకుంటున్నారు?" అని అడిగాడు.

"లోతు, హద్దు తెలియని పాలసముద్రం లాంటిది వైద్య రంగం; సేవా భావంతో ఈ వృత్తిలోకి రావాలే కాని, మరో వ్యాపార ధోరణితో ఈ రంగంలో ప్రవేశించటం అమానుషం.

''ఇక రిసర్చ్ విషయాలంటారా? జీవితంలో ఏదో ఒకటి సాధించాలి అంటే ప్రతిక్షణం సంయమనం అవసరం. దీక్షతో, పట్టుదలతో పాటు ఓర్పుకూడా చాలాముఖ్యం. ఒకటి మాత్రం నిజం. జీవితంలో కృషి, దీక్ష, పట్టుదల, ఓర్పుతో పనిచేసిన వారికి తప్పని సరిగా మంచి ఫలితం లభిస్తుంది. ఓ కే థాంక్యూ'' అంటూ ముగించాడు.

కాన్ఫరెన్స్ హాల్‌లోని జర్నలిస్టులు, జూనియర్ డాక్టర్స్ మెస్మరైజ్ అయి, దానినుంచి బయటపడి లేవలేక లేస్తున్నారు. రెండు గంటల పాటు అంతమందిని మెస్మరైజ్ చేసిన అభిమన్యు మరలా నూతనంగా తన ప్రయోగాన్ని ప్రారంభించటానికి సంబంధించిన బ్లూప్రింట్ మెదడులో నెమరేసుకుంటూ తన ఛాంబర్ వైపు నడుస్తున్నారు.

ఆ ప్రయోగాన్ని ఏ రకంగా చేజిక్కించుకోవాలి అనే ఆలోచనతో చౌదరి కాన్ఫరెన్స్ హాల్ నుంచి బయటకు వస్తున్నాడు. ఒక అద్భుతమైన ప్లాన్ ఏదో చౌదరి మెదడులో ఫ్లాష్ అయింది. అందుకోసమే ఆనందంగా నవ్వుతూ కాన్ఫరెన్స్ హాల్ నుంచి తృప్తిగా బయటకు వస్తున్నాడు.

*                    *                    *

ఆ రోజు ఆదివారం కనుక ఉదయం ఎనిమిది గంటలకు నిద్ర లేచాడు బుజ్జిబాబు.

బుజ్జిబాబుకి పెళ్ళి అయి అప్పుడే ఆరు నెలలు కావస్తోంది. కాని పాపం ఒక ముద్దు ముచ్చట లేదు.

ఉదయం ఎనిమిది గంటలైనా నిద్ర లేవాలా వద్దా అనే సంశయంతో అలాగే నిద్రపోతూ ఉన్నాడు.

అంతలో భార్య రుక్మిణి వచ్చి "ఏమండీ లేవండి" అంది ఒకసారి.

మరుక్షణంలో దుప్పటిటీని అవతలపారేసి లేచి కూర్చున్నాడు. రుక్మిణి మాటలకు అలా లేవకపోతే రుక్మిణి ఒకటే సోది మొదలు పెడు తుంది. అది వింటే ఎవరికైనాసరే జీవితం మీద విరక్తి కలుగుతుంది. అందువల్లనే భార్య రుక్మిణి ఎంత అంటే అంతే, "కాదు" అంటే, వినక పోతే ఇక ఖతమ్, ఫినిష్.

రుక్మిణి మంచం మీద బుజ్జిబాబు ప్రక్కనే కూర్చుంటూ "ఏమండీ, ఈ రోజు ఆదివారం కదా మార్నింగ్‌షో వెళ్దాం, సుదర్శన్‌లో 'మాయదారి పెళ్ళి' అనే సినిమా ఆడుతోంది, భలే ఉందట ప్రక్కింటి అబ్బాయి చెప్పాడు" అంది, గుక్క తిప్పకుండా.

బుజ్జిబాబు ఓ వంకర నవ్వు నవ్వి "ఏ సినిమా?" అన్నాడు మరలా.

''మాయదారి పెళ్ళి'' అంది.

బుజ్జిబాబు మనసులో 'అబ్బ, భలే సినిమా సెలక్షన్ చేశావు నా తల్లీ, ఆ సినిమా నా పెళ్ళికంటే బాగుంటుందా" అనుకొని బాధ పడ్డాడే కాని మారుమాట్లాడలేదు. అది అంటే పెద్ద యుద్ధం ప్రారంభమవుతుందని బుజ్జిబాబుకు బాగా తెలుసు.

అందువల్లనే భార్యను కన్వెన్స్‌చేస్తూ "ఓ తప్పకుండా వెళ్దాము" అని మరోమాట అడగటానికి అవకాశం ఇవ్వకుండా బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

బాత్ రూమ్‌లో ఓ అర్ధగంట టైమ్‌పాస్ (స్నానం) చేసి బయటకు వచ్చాడు.

డ్రస్ చేసుకొని, డైనింగ్ టేబుల్ దగ్గరకు వచ్చాడు టిఫిన్ చేయటం కోసం. కాని, రుక్మిణి ''మాయదారి పెళ్ళి" సినిమా వెళ్ళటం కోసం పూర్తిగా తయారై ఉంది అప్పటికే.

సరిగ్గా అప్పుడు గుర్తుకొచ్చింది బుజ్జిబాబుకు ఆ రోజు వాళ్ళ బాస్ వేమనరావు పుట్టిన రోజని. వేమనరావుగారికి చిన్న సెంటిమెంట్ ఉంది. అదేమిటంటే వేమనరావు పుట్టినరోజునాడు ఉదయం పదిగంటలలోపల ఆయనతో కలిసిన వారే ఆయన శ్రేయోభిలాషులని.

బుజ్జిబాబు ఎట్టి పరిస్థితులలో అయినా వెళ్ళి బాస్ వేమనరావుతో కలవాలి, అదీ ఉదయం పదిగంటల లోపలే. లేకపోతే కొంప లంటుకుంటాయి.

బుజ్జిబాబు భార్య ఇప్పుడు మార్నింగ్‌షోకు వెళ్ళటానికి ఫుల్‌గా తయారై ఉంది.

ఎలాగో ధైర్యం చేసి వెళ్ళి భార్యతో "రుక్మిణి! ఆ 'మాయదారి పెళ్ళి' అనే సినిమా నిజంగా చాలా బాగుందట. కాని ఉదయం ఆటలో కొంత కట్ చేస్తున్నారట. మా ఆఫీస్‌లో అనుకుంటుంటే విన్నాను. అందువల్ల సాయంత్రం ఫస్ట్ షోకి వెళ్దాము. అదీకాక ఎండ బాగుంది. వెళితే ఉదయం పన్నెండు గంటలకు స్టార్ట్ చేస్తారు. మధ్యాహ్నం రెండు గంటలకే అయిపోతుంది "ఫస్ట్ షో"

"రాత్రి అయితే ఎంచక్కా ఆరింటి నుంచి తొమ్మిదింటిదాక చూడ వచ్చు, వాతావరణం కూడా చల్లగా ఉంటుంది. అదీకాక ఫస్ట్‌షో సినిమా కొంచెం కూడా కట్ చేయరు, ఇంకా రాబోయే సినిమాలు చూపిస్తారు...." అంటూ కాళ్ళావేళ్ళాపడి రుక్మిణిని మార్నింగ్ షోనుండి ఫస్ట్‌షోకు ఒప్పించాడు.

ఇంకా అక్కడే ఉంటే భార్య మనసు మరలా మార్నింగ్‌షో వైపు మళ్ళుతుందేమోనని, టిఫిన్ కూడా చేయకుండా బాస్ ఇంటికి బయలు దేరాడు.

అనుకున్నట్లే ఉదయం పదిగంటలకు ముందే బాస్‌తో వెళ్ళి కలి శాడు. వేమనరావు బుజ్జిబాబును చూసి ఆనందపడ్డాడు. ఆ ఆనందంలో

వేమనరావు బుజ్జిబాబుకు 'మరుసటిరోజు హాయిగా ఇంటిలోనే గడుపు ఆఫీస్‌గా అవసరం లేదుపో' అని వరం ఇచ్చాడు.

భార్యకు ఇచ్చినమాట ప్రకారం సాయంత్రం ఫస్ట్‌షో సినిమాకు వెళ్ళటంకోసం నాలుగింటికే ఇల్లు చేరబోతున్నాడు.

అప్పటికే రుక్మిణి సినిమాకు తయారై ఉంది.

ప్రక్కింటి కుర్రాడితో నవ్వుతూ ఏదో మాట్లాడుతుంది. ఆ కుర్రాడు కూడా పళ్ళు ఇకిలిస్తూ ఏదో మాట్లాడుతున్నాడు. ఆ కుర్రాడు మాట్లాడే మాటలకు రుక్మిణి విరగబడి నవ్వుతున్నది. ఆ కుర్రాడు రుక్మిణిని ఆసక్తిగా చూస్తున్నాడు.

దూరంనుంచి వస్తున్న బుజ్జిబాబుకి ఆ సీన్ కంటపడింది. అయినా రుక్మిణి ఏమాత్రం తగ్గకుండా ''నేనుగిన ఆ సినిమాకు డైరెక్టర్ అయి ఉంటే నా మిరంగ, ఆ విలన్‌కు బడితపూజ చేయించేదాన్ని....'' అని తొంబైతొమ్మిది శాతం రుద్రమదేవి ఫోజ్ పెట్టింది.

అది చూసి ఆ కుర్రాడు విరగబడి నవ్వుతున్నాడు.

ఆ దృశ్యం చూసి బుజ్జిబాబుకి తిక్కరేగినట్లయింది. రుక్మిణిని పట్టుకొని ఈ చెంప ఆ చెంప వాయించాలి అనుకున్నాడు.

ఆ కుర్రాడు బుజ్జిబాబు రావటం చూసి మెత్తగా "నేను ఉంటాను రుక్మిణిగారు'' అని వెళ్ళిపోయాడు.

బుజ్జిబాబుకు కోపం, ఏడుపు ఒకేసారి వచ్చాయి.

నీరసంగా వెళ్ళి హాల్‌లో కూర్చున్నాడు

భార్య రుక్మిణి వచ్చి "సినిమాకు టికెట్స్ తెచ్చారాండి?" అని అంది ఆవురావురుమంటు.

బుజ్జిబాబుకు కోపం తారాస్థాయికి చేరింది.

"రుక్మిణి...." అన్నాడు గట్టిగా కృష్ణంరాజు స్టైల్‌లో. నిజానికి బుజ్జిబాబు కోపాన్ని అణచుకోవాలే అనుకున్నాడు కాని తన ప్రమేయం లేకుండానే గొంతులోంచి జారిపోయింది గట్టిధ్వని.

"ఏమిటి టికెట్స్ దొరకలేదా?" అంది అమాయకంగా.

"ఆ కుర్రాడితో అలా నవ్వుతూ మాట్లాడితే.... (ఏదో చెప్పబోయి అంతరాత్మ అడ్డుపడింది).... "ఇంక ఏం చెప్పాలో అర్థంకాక "నా భార్య అందరితో నవ్వుతూ మాట్లాడకూడదు. నాతోనే నవ్వుతూ మాట్లాడాలి, అదే నిజమైన ప్రేమ అంటే.... నన్ను అర్థం చేసుకో రుక్మిణి" అని ప్రాధేయపడేపోజ్ పెట్టాడు.

"సరేనండి...." అంది ఏదో అర్థమయినదానిలా.

"నేను రిక్షాను పిలుసుకొస్తాను సినిమాకు వెళ్దాం రెడీగా ఉండు" అంటూ బయటకు వెళ్ళాడు బుజ్జిబాబు.

మరో పది నిమిషాలలో బుజ్జిబాబు ఇంటి ముందు రిక్షా ఆగింది.

బుజ్జిబాబు, రుక్మిణి రిక్షా ఎక్కారు.

రుక్మిణి ఎప్పుడు ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంటుంది. ఆ మాటలకు బదులుగా బుజ్జిబాబు మధ్య మధ్య "ఓ.... ఆ.... ఆహా, ఓహో" అంటూ ఉంటాడు "వింటున్నానులే" అన్నట్లుగా. అలా అనకపోతే పెద్ద ముప్పని బుజ్జిబాబుకు బాగా తెలుసు.

రిక్షా సినిమా హాల్ ముందు ఆగింది.

ఇద్దరు రిక్షా దిగారు.

హాల్ ఆవరణ అంతా బాగా జనం ఉన్నారు.

సినిమా మారిపోయిందని, 'మాయదారి పెళ్ళి' పోయిందని, ఈ రోజు ఉదయం ఆట చివరి ఆట అని ఎవరో చెప్పుకుంటూ ఉండగా రుక్మిణికి వినిపించింది.

రుక్మిణికి గుండెల్లో నుంచి ఏడుపు తన్నుకొచ్చింది.

బుజ్జిబాబును పట్టుకొని ఏదో మునిగిపోయినట్లు ఏడుపును తెచ్చేసుకొని అమాంతం బుజ్జిబాబు గుండెలమీద తలకాయను వదేసి "ధబీ ధబీ" మని గుద్దుకుంటూ బావురు మంటూ తలకాయని మరింత గట్టిగా కొట్టుకోవడం మొదలు పెట్టింది.

ఓ నిమిషం పాటు బుజ్జిబాబుకు ఏం జరుగుతుందో అర్థం కాలేదు.

రుక్మిణి దాడికి తట్టుకోలేక బుజ్జిబాబు కంగారుపడుతూ బలంగా తన గుండెలమీదున్న రుక్మిణి తలకాయని తీసి నిలబెట్టాడు.

సినిమాకు వచ్చిన వాళ్ళందరు ఔట్‌డోర్ షూటింగ్ చూస్తున్నట్లు బుజ్జిబాబు, రుక్మిణిల చుట్టూ గుమికూడారు.

భార్యమీద విపరీతమైన కోపం వచ్చింది, అంతకంటే మించి బాధతో "ఏమయింది రుక్మిణి?" అన్నాడు.

విషయం తెలుసుకుందామని, రుక్మిణి ఓసారి ముక్కు చీదుకొని "ఇంకేం జరగాలండి? ఆ సినిమా 'మాయదారి పెళ్ళి' పోయిందట. నేను ఉదయమే చెప్పాను. మార్నింగ్ షోకే వెళ్దామని, కానీ మీరు వినలేదు. ఇప్పుడు చూడండి ఎంత ఘోరం జరిగిపోయిందో;" అంటూ మరలా బావురుమంది. బుజ్జిబాబు గుండెలమీద తలేసి బాదుకుంటూ.

సినిమా కోసం ఇంతమంది జనం పబ్లిక్‌గా చూస్తూ ఉండగా ఇంత న్యూసెన్స్ అని అర్థం అయ్యేసరికి బుజ్జిబాబు గుండె ఆగినంతపని అయింది.

ఎలాగోలా సముదాయించి ఇంటికి పిలుచుకొని వచ్చేవరకు తల ప్రాణం నిజంగానే తోక లేదు కనుక కాళ్ళలోకి వచ్చింది.

మరుసటి రోజు,- ఉదయం ఎనిమిది గంటలు దాటింది.

ఆఫీస్ ఉన్నా బాస్ ఆనందపడి రెస్ట్ చేయమని ఇచ్చిన శెలవు. బాస్ మంచివాడే అనుకుంటూ ప్రశాంతంగా ఆ రోజు పేపర్ తిరగేస్తున్నాడు.

భార్య రుక్మిణి వంటింటిలోనుంచి ఏదో విషయంగురించి చెప్తున్నది.

భార్యతో ఏ మాట అన్నా సమస్యే. ఏమీ అనకపోతే పొద్దాకలు ఏదో మాట్లాడుతుంటుంది. ఎందుకు ఊరికే అలా మాట్లాడుతావు అంటే గింజుకుంటుంది, ఏడుస్తుంది.

రుక్మిణి వచ్చి కాఫీ ఇచ్చింది.

రుక్మిణి గుక్క తిప్పుకోకుండా ఏదో చెప్తూనే ఉంది.

బుజ్జిబాబు మాత్రం కాఫీ సిప్ చేస్తూ న్యూస్ పేపర్ దర్జాగా చదువుకుంటున్నాడు.

"పేపర్ దొరికితే చాలు - ప్రపంచాన్నే మరిచిపోతారు. ఇంటిలో ఇల్లాలు ఉంది కదా, దాని మాట వినాలి అనే యింగితం లేదు...." అని అంటూ బుజ్జిబాబు చేతిలో ఉన్న పేపర్‌ను అమాంతంగా లాక్కొని ప్రక్కన పడేసింది.

"ఏమిటే ఏమయింది ..." అన్నాడు చాలా మామూలుగానే.

"ఇంకేమి కావాలండి. ఎదురింటి వాళ్ల అమ్మాయిని మొగుడు వదిలేశాడట" అని చెప్పి ఏడుపు ముఖం పెట్టి, ఏడవాలా వద్దా అని ఆలోచిస్తూ నిలబడింది.

"ఓస్ అంతేనా...." అన్నాడు.

ఆ మాట విన్న రుక్మిణి గట్టిగా ఏడుపుకు లంకించుకుంది.

ఒక్కసారిగా అనుకోని పరిణామం ఏర్పడటంతో బుజ్జిబాబు అదిరిపడి "ఏమయింది రుక్మిణి నీకు, ఇప్పటిదాక బాగానే ఉన్నావు" అన్నాడు కంగారుపడుతూ.

బుజ్జిబాబుకు ఏదో పుస్తకంలో చదివిన ఒక వాక్యం గుర్తుకు వచ్చింది. అది ఏమిటంటే "భార్య నవ్వితే నవ్వాలి, భార్య ఏడిస్తే ఏడ్వాలి- అదే ఉత్తమ భర్త లక్షణం."ఉత్తమ భర్త అనే పుస్తకంలోని ఆ వాక్యం గుర్తు రావటంతో భార్యకు అనుగుణంగా "చెప్పు రుక్మిణీ నేను ఏం చేయమంటావు" అన్నాడు అనునయంగా.

మంత్రం వేసినట్లు రుక్మిణి ఒకసారిగా ఏడుపును ఆపింది.

తన ప్రయత్నం సఫలం అయినందుకు బుజ్జిబాబు సంబరపడి "ఉత్తమ భర్త" అనే పుస్తకంలోని ఇంకేదైనా వాక్యం గుర్తు కొస్తుందేమో నని కళ్ళుమూసుకొని ఆలోచనలో పడ్డాడు.

రుక్మిణి ఏడుపు ఆపి బుజ్జిబాబు వైపు చూసింది. బుజ్జిబాబు కళ్ళు మూసుకొని యోగ ముద్రలో ఉన్నట్లుగా పోజ్ పెట్టి కూర్చుని ఉన్నాడు. అలా ఉన్న బుజ్జిబాబును చూస్తుంటే రుక్మిణికి చిర్రెత్తుకొచ్చింది. భర్తను గిరగిర తిప్ప కొట్టాలనిపించింది, ఎంతైనా భారతీయ స్త్రీ కదా, అయినా ఆవేశం ఆపుకోలేక బుజ్జిబాబును వీపు మీద బలంకొద్ది ఓ చరుపు చరిచింది.

"ఉత్తమ భర్త" అనే పుస్తకంలోని మంచి పాయింట్స్ గుర్తు కొస్తాయి ఏమోనని ఆలోచిస్తూ ఉన్న బుజ్జిబాబుకి వీపు మీద భార్య చేయి బలంగా తగిలింది.

బుజ్జిబాబుకు వళ్ళుమండింది. "ఇదేం మాయ రోగమే" అన్నాడు కోపంగా వీపు రుద్దుకుంటూ.

రుక్మిణికి ఇక కోపం వచ్చింది. "ఏంటిది మాయరోగం అన్నారు, మా ఇంటావంట లేదు ఆ రోగం, మీకుంది ఆ రోగం, మీ వాళ్ళకు ఉంది...." అని మొదలు పెట్టింది. ఇక రెండుగంటల వరకు ఆమెను

ఎవరు ఆపలేరని బుజ్జిబాబుకు తెలుసు. రెండు గంటలపాటు ఏకధాటిగా ఏకపాత్రాభినయం చేసేస్తుంది.

బుజ్జిబాబు భయం భయంగా భార్యవైపు చూస్తున్నాడు.

రుక్మిణి వాక్ధాటి క్షణక్షణానికి పెరుగుతుందేకాని తగ్గటంలేదు, అదే తీరులో బుజ్జిబాబుమీద విరుచుకుపడుతూ వీధిలోకి వచ్చింది, వీధిలో కనిపించిన వారందరికి వివరించి చెప్తున్నది, మరుక్షణంలో బుజ్జిబాబుమీద విరుచుకు పడుతూ.

వీధిలో వాళ్ళంతా రుక్మిణిమాట వినేవాళ్ళే కానీ ఏ ఒక్కరు ముందుకు వచ్చి ఒకమాటకూడ అనలేరు. ఎవరైనా పొరపాటున ముందు కొచ్చి "నీవు ఎందుకు ఇలా ప్రవర్తిస్తావు" అని అంటే-

ఇక రుక్మిణికి రోషం ముంచుకొస్తుంది, తోక తొక్కిన పాములా విజృంభిస్తుంది, ఏదేదో మాట్లాడుతుంది. - అది వినేవాళ్ళకు అర్థం అయ్యే అవకాశమేలేదు. కాని చెప్పే తనకైనా ఏమి మాట్లాడుతుందో అర్థమవుతుందా? అని బిక్కచచ్చి చూస్తూ ఉండిపోవలసిందే.

కొంతమంది మనస్తత్వం అంతే - తమ తప్పులను, పొరపాట్లను చచ్చినా ఒప్పుకోరు. అలా ప్రవర్తించటానికి కారణం ఏదయినా అలాంటి మొండి అలవాటు అంతమంచిది కాదు అనుకున్నాడు బుజ్జిబాబు కసిగా భార్యవైపు చూస్తూ.

రుక్మిణి తన వాక్ధాటి ఏమాత్రం తగ్గించకుండా కొనసాగిస్తూనే ఉంది. వీధిలోని వాళ్ళంతా రుక్మిణివైపు, బుజ్జిబాబువైపు ఆసక్తిగా చూస్తున్నారు. అందరూ చూస్తున్నారేకాని, ఎవరూ ముందుకు వచ్చి, "ఇది పద్ధతి కాదు" అని చెప్పటానికి సాహసం చేయరు. ఆ చూసేవాళ్ళు ఎవరూ ఏమీ చెప్పలేరు. కేవలం అనుకోవలసిందే. అదీ మనసులోనే అనుకోవలసిందే.

ఎవరైన సర్ది చెప్పటానికి ప్రయత్నిస్తే....

వాళ్ళతో వితండ వాదానికి దిగుతుంది. ఇప్పుడు రుక్మిణి నోటికి తగలాలంటే (మాట్లాడా లంటే) గుండెలుతీసిన బంటునైన, ప్రొఫెషనల్ కిల్లర్‌నైన, ఇంటర్ నేషనల్ క్రిమినల్‌నైన, నోటోరియస్ రౌడి షీటర్ నయిన రుక్మిణి వాక్ ధాటికి తట్టుకోలేక దబ్బున ఆమె కాళ్ళు మీదపడి "నన్ను క్షమించు తల్లి, అర్భకుడిని నన్ను వదిలేయి తల్లి'' అనేలా చేస్తుంది.

ఇది ఇప్పటి రుక్మిణి వాక్ ప్రతిభ.

ఆ క్షణాన రుక్మిణికి తెలియదు-బుజ్జిబాబు ఎలాంటి ప్లాన్ తయారు చేస్తున్నాడో....

*　　　*　　　*

సరూర్‌నగర్....

నగర శివారు ప్రాంతం కనుక పెద్దగా జనసంచారం లేదు.

సమయం ఉదయం తొమ్మిది గంటలు కావస్తున్నది.

స్నేహిత తన పత్రికకు కావలసిన ఇన్ఫర్‌మేషన్ తీసుకొని ఓ హాస్పటల్‌నుండి బయటకు వచ్చింది.

ఆమెను చూసినవారు ఎవరైనా ఆమెను డాక్టర్ అనుకోరు, ఓ జర్నలిస్ట్‌గా కనిపిస్తుంది.

స్నేహిత వెళ్ళి తన కార్ ఎక్కబోయింది.

అంతలో ఇద్దరు వ్యక్తులు స్నేహిత దగ్గరకు సమీపించారు.

''మేడమ్! మా అయ్యగారు స్పృహ తప్పి పడిపోయారు, కాస్త మీరొచ్చి చూడండి....'' అన్నాడు ఆ ఇద్దరిలో ఓ వ్యక్తి.

స్నేహిత తన కార్ డోర్ తెరవబోతూ ''ఎదురుగా హాస్పిటల్ ఉందిగా, హాస్పిటల్‌కు తీసుకెళ్ళండి" అంది మామూలుగానే.

"అసలు లేచే స్థితిలో లేరు మేడమ్! అదికాక డాక్టర్ అభిమన్యు గారికి బాగా పరిచయం ఉన్న పేషంట్...." అంటూ ఇంకా ఏదో చెప్ప బోయాడు.

"పేషంట్ ఎక్కడ...." అంది అసహనంగా.

"ఇక్కడే, అ కనిపిస్తున్న వైట్ మారుతీ వ్యాన్‌లో - రండి మేడమ్, ప్లీజ్" అంటూ ఆ వైట్ మారుతి ఆగి ఉన్నవైపు నడిచారు.

స్నేహిత వాళ్ళను అనుసరించింది.

వాళ్ళిద్దరిలో ఒకడు వ్యాన్ డోర్ తెరిచాడు.

స్నేహిత వెళ్ళి చూసింది. నిజమే....

యాభై ఏళ్ళు ఉన్న వ్యక్తి ఎవరో వెనుక సీట్‌లో కూర్చొని, అలాగే సీట్‌లోకే వాలిపోయి ఉన్నాడు - తెల్లపంచె, తెల్ల పైచొక్కాలో ఉన్నాడు.

పేషంట్‌ని చూసి ఆగలేకపోయింది స్నేహిత. (సాధారణంగా నిజమైన డాక్టర్స్ పేషంట్‌లను చూస్తే టెస్ట్ చేయకుండా ఉండలేరు.) వ్యాన్ లోపలికి వచ్చింది స్నేహ.

పేషంట్‌ని పరీక్ష చేయటం కోసం ఆ వ్యక్తి చేయి పట్టుకుందో లేదో బయట ఉన్న ఇద్దరు వ్యక్తులు వ్యాన్‌డోర్ బయటినుంచి క్లోజ్ చేశారు.

రోగి వేషంలో యాక్టింగ్ చేస్తున్న నరేంద్ర లేచి దర్జాగా వెనక్కి వాలి కూర్చుంటూ బటన్ నైఫ్ బయటకు తీసాడు.

ఒక్కసారిగా వచ్చిన ఈ పరిణామాన్ని స్నేహిత జీర్ణించుకోలేక పోతున్నది.

"చూడండి మేడమ్, నేను చాలా మంచి వాడిని, వృత్తి ప్రొఫెషనల్ కిల్లింగ్. మీరు అనవసరంగా కంగారుపడి మా చేతికి పని కల్పించకండి, సరేనా?" అన్నాడు కూల్‌గా నరేంద్ర.

స్నేహితను మోసంతో పిలుచుకొని వచ్చిన ఇద్దరు వ్యక్తులు వ్యాన్‌లోని ఫ్రెంట్ సీట్‌లో కూర్చున్నారు. మరుక్షణంలో వ్యాన్ బయయిదేరింది. అంతా క్షణాలలో జరిగిపోతున్నది. వ్యాన్ రోడ్డుమీద జింకలా ఫాస్ట్‌గా వెళ్తున్నది.

స్నేహితకు అర్థమయి పోయింది - తనను కిడ్నాప్ చేస్తున్నారని.

ఆ వ్యాన్‌కు స్మోక్ గ్లాస్ మిర్రర్స్ బిగించి ఉన్నారు. వ్యాన్ లోపల కూర్చున్న వాళ్ళు బయటకు చూడగలరు కాని, బయట ఉన్నవాళ్ళకు వ్యాన్‌లో ఉన్నవాళ్ళు ఎట్టి పరిస్థితుల్లో కనిపించరు.

"మీరు అనవసరంగా అరిస్తే కూడా ఏమీ ప్రయోజనము లేదు. లేనిపోని ప్రమాదమే కాని, మీకు ఏమయినా ప్రమాదం అయితే మాకు విపరీతమైన బాధ, అనవసరంగా ఎందుకు లేనిపోని కంగారు. ఫ్రీగా రిలాక్స్‌గా రెస్ట్ తీసుకోండి" అన్నాడు నరేంద్ర స్నేహిత పరిస్థితి చూసి.

వ్యాన్ సిటీవదిలి ఎక్కడికో వెళ్ళిపోతూ ఉన్నది. స్నేహితకు తన మంచితనం మీద తనకే కోపంవచ్చింది. వాళ్ళు ఏ జె.కె.ఎల్.ఎఫ్. మిలిటెంట్లో అనుకుంది. కానీ వాళ్ళు చాలా స్వచ్ఛంగా తెలుగు మాట్లాడుతున్నారు. కనుక మిలిటెంట్లు అన్న అనుమానం తప్పింది.

స్నేహిత కొంత ధైర్యంచేసి, "ఎవరు మీరు? మీకు ఏం కావాలి? నన్ను ఎక్కడికి తీసుకొని వెళ్తున్నారు?...." అంది భయాన్ని కప్పిపుచ్చుకుంటూ మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తూ....

"అన్ని ప్రశ్నలు ఒక్కసారి వేస్తే ఎలా మేడమ్? ఒక్కొక్కటి అడగండి. అన్నీ నిజాలే చెప్తాము" అన్నాడు కోర్టులో సాక్ష్యానికి ముందు ప్రమాణం చేసినట్లు.

వారి మాట తీరునుబట్టి వాళ్ళనుండి తనకు ఎలాంటి ప్రాణహాని లేదనుకొని - ధైర్యాన్ని నటిస్తూ 'ఎవరు మీరు' అంది ధీమాగా.

"నా పేరు నరేంద్ర, చాలా మంచివాడిని. ప్రొఫెషనల్ కిల్లర్ని. ఆ డ్రయివింగ్ సీట్లో ఉన్నవాడి పేరు మస్తాన్. అడ్వంచర్స్ చేస్తూ ఉంటాడు. మొన్నటివరకు ఏదో సర్కస్‌లో ఉండి, ఆ ప్రొపరేటర్‌తో కుదరక అతన్ని పిప్పి కట్టించి, హైదరాబాద్ వచ్చేసి మాతో ఉంటు న్నాడు. పసిపిల్లాడి మనస్తత్వం వాడిది. ఎప్పుడో కానీ కోపం రాదు. వాడి ప్రక్కనే ఉన్నవాడు లూథర్. వాడి దృష్టిలో నుండి తప్పించుకో గలిగిన ..." అని ఏదో చెప్పబోయాడు.

"స్టాప్ ఇట్, మీకు ఏం కావాలి" అంది సూటిగా చూస్తూ అసహనంగా.

"అది మాకు తెలియదు...., కాని...." అని ఏదో చెప్పబోయాడు.

స్నేహిత నరేంద్రవైపు అసహ్యంగా చూసి "మీరు ఏం చేస్తున్నారో మీకు తెలియదు. ఎందుకు చేస్తున్నారో తెలియదు. ఎందుకు ఈ దొంగ బ్రతుకులు...." అంది ఆవేశంగా.

"షట్ అప్", అంటూ గట్టిగా అరిచాడు హిస్టీరియా వచ్చిన వాడిలా. ఆ గొంతులో భయంకరమైన క్రూరత్వం ఉంది.

స్నేహిత అదిరిపడింది. ఆ అరుపుకు చిన్న భయం, వణుకు ప్రారంభమయింది. ఆమె చెక్కిళ్ళు పాలిపోయాయి. భీతితో కళ్ళు వెడల్పయ్యాయి.

స్నేహిత కళ్ళకు గంతలు కట్టమని సైగ చేసాడు లూథర్.

నరేంద్ర తన దగ్గిర ఉన్న పెద్ద క్లాత్‌తో ఆమె కళ్ళకు గంతలు కట్టాడు.

ఆమెకు భయంతో ఒళ్ళంతా చెమట పట్టేస్తున్నది.

ఇక వ్యాన్ ఎంత స్పీడ్‌గా వెళ్తున్నదో అంచనా వేయటం కష్టం.

మనసులోనే బాధపడుతున్నది. "నేను ఈరోజు ఆ హాస్పటల్‌లో ఇంటర్వ్యూ తీసుకోవటానికి వచ్చి ఉండకపోయి ఉంటే ఈ ప్రమాదం జరిగి ఉండేది కాదు" అనుకుంటుంది-కాని జీవితంలో కొన్ని జరగటానికి ఎంత అవకాశం ఉందో జరగకపోవటానికి అంతే అవకాశం ఉంది. కొంత మందికి బాధలో వేదాంతం అర్థమయితే, మరి కొందరికి భయంలో వేదాంతం వంటపడుతుంది.

వ్యాన్ ఓ మలుపు తిరిగింది. కొంత దూరం వెళ్ళి, మరో మలుపు తిరిగి, కొంత దూరం వెళ్ళి ఆగింది.

ఉదయం పదిన్నర అయి ఉంటుంది.

ఓ ఇంటి ముందు స్నేహితను దించారు. అయినా ఇంకా కళ్ళకు కట్టిన గంతలు విప్పలేదు.

స్నేహితకు మనసు పొరలలో ఎంతో బాధగా ఉంది. జీవితంలో ఎప్పుడు ఎదురుకాని, ఎదుర్కోని విచిత్ర పరిస్థితి. మనసంతా బాధగా ఉంది. తనను ఎందుకు కిడ్నాప్ చేశారో ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదు.

ఆ ముగ్గురు వ్యక్తులలో ఒకరు పట్టుకొని ఇంటి లోపలికి తీసుకొని వెళ్ళారు. ఆ ఇంటిలో ఒక రకమైన లిక్విడ్ వాసన - ఆ వాసనలో క్లొరోఫారమ్ వాసన కూడా మిళితమై ఉంది.

స్నేహితకు ఇంకా గంతలు కట్టే ఉన్నారు.

మాటలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి. వాళ్ళు ప్రాజెక్ట్-ని గురించి మాట్లాడుకుంటున్నారని అర్థం అవుతున్నది.

"ప్రాజెక్ట్-సి.కి సంబంధించిన ఫార్ములా ఎక్కడ ఉంది మిస్ స్నేహిత?" అని ఒక కంఠం వినిపించింది, ఆ గొంతు బాగా పరిచయమైనదే కాని, ఆ వ్యక్తి ఎవరో అంచనా వేయలేకపోతున్నది.

అయినా ఈ మాటలు వినగానే స్నేహితలో కాస్త ధైర్యం వచ్చింది. ఆ ఫార్ములా ఎక్కడ ఉందో తెలుసుకొనే వరకు తనకు ప్రమాదం లేదన్నమాట-అంటే కిడ్నాపర్ల మెయిన్ ఎయిమ్ ప్రాజెక్ట్-సి ఫార్ములా చేజిక్కించుకోవటం అనుకుంది.

"చూడు స్నేహిత! నీకేమీ భయం లేదు, మాకు కావలసింది కేవలం ప్రాజెక్ట్-సి ఫార్ములా ఎక్కడ ఉందో చెప్పు...." అన్నాడు. ఈ గొంతు బాగా దగ్గరగా వినిపిస్తున్నది, బాగా పరిచయం ఉన్న కంఠమే, అయినా ఎంత ఆలోచించినా ఆ వ్యక్తి ఎవరో స్నేహితకు అంతు పట్టడం లేదు.

"నో...., నేను చెప్పను. మూడు సంవత్సరాలు ఎంతో కృషితో ఒక మంచిపని చేస్తున్న మనిషిని ఇంత హేయంగా దెబ్బతీయాలి అనుకుంటున్నారు. ఇది మనుషులు చేసే పనికాదు...."

"చూడు మిస్ స్నేహిత! నీ ప్రసంగాలు, నీతి వాక్యాలు వినటానికి నిన్ను తీసుకొని రాలేదు. బుద్ధిగా అడిగింది చెప్పి, ఫార్ములా ఎక్కడుందో చెప్పి, నీ మానం, నీ పత్రిక ఆఫీస్ కాపాడుకో...." ఆ కంఠం చాలా కఠినంగా మారుతున్నది.

ఆమెలో వణుకు ప్రారంభమైంది, పుట్టెడు దుఃఖం వచ్చింది. పుట్టినప్పటినుండి ఇంత ఘోరంగా ఎవరు తనతో మాట్లాడలేదు.

దేవుడనేవాడు ఉన్నాడా? వుంటే ఇలాంటి అన్యాయాలు జరగవు. అదే ఏదో సినిమా అయితే ఎలాగోలా హీరో వచ్చి కాపాడేస్తాడు. కాని, ఇది నిజ జీవితం.

అయినా స్నేహిత మొండిగా "నేను ఎట్టి పరిస్థితులలో ఆ ఫార్ములా ఎక్కడ ఉందో చెప్పను' అంది.

"కళ్ళ గంతలు తీయండిరా.... ఎందుకు చెప్పదో నేను చూస్తాను" అన్నది ఓ కంఠం నిర్భయంగా.

ఇద్దరు వచ్చి స్నేహిత కళ్ళకు ఉన్న గంతలు విప్పారు. ఒక్క సారిగా కళ్ళు తెరవలేకపోయింది.

అది విశాలమైన గది. గది అనేకంటే హాల్ అనవచ్చు. గదిలో అద్భుతమైన ఇంటీరియర్ డెకరేషన్, ఫ్లోరింగ్‌పై ఖరీదైన కార్పెట్, ఖరీదైన కర్టన్స్, హాల్ మధ్యలో వ్రేలాడదీసి ఉన్న షాండ్లియర్ లైట్ చాలా కాస్ట్లీగా ఉంది. టోటల్‌గా ఆ గది బ్రిటిష్ మ్యూజియంలోని ఒక భాగంలా ఉంది.

అప్పుడు కనిపించాడు ఓ వ్యక్తి స్నేహిత కంటికి.

వయసు నలభై ఐదు సంవత్సరాలు ఉంటాయి.మనిషి కాస్త పొట్టిగా దృఢంగా ఉన్నాడు. అతని పేరే డాక్టర్ చౌదరి.

స్నేహిత తన కంటిని తనే నమ్మలేక పోయింది. ఓ క్షణం పాటు మాట మూగబోయింది.

''ఏమిటి మిస్ స్నేహిత? ఆశ్చర్యంగా ఉందా, నన్ను చూసి'' అన్నాడు నవ్వుతూ.

స్నేహిత గొంతు పెగల్చుకుంటూ ''మీరు డాక్టర్ చౌదరి కదా!" అంది అనుమానంగా.

వికృతంగా నవ్వుతూ "అవును మిస్! చాలా కరెక్ట్‌గానే కనిపెట్టావు. నేనే చౌదరిని .... బాగున్నాడా నీ ప్రియుడు అభిమన్యు .... పరామర్శలు అయిపోయాయి. ఇక చెప్పు ఆ ప్రాజెక్ట్ ఫార్ములా ఎక్కడ ఉంది."

''నో డాక్టర్....మీరూ ఒక డాక్టరే - మీ తోటి డాక్టర్ చేసే ఒక అపూర్వ ప్రయోగాన్ని స్వంతం చేసుకోవాలనుకోవటం న్యాయం కాదు. ఏదో ఒకనాడు మీ నిజస్వరూపం అభిమన్యుకు తెలియకపోదు. అప్పుడు మీ....''

''అవు నీ అధిక ప్రసంగం....చూడు బేబి! ఈ దేశంలో జరిగే అన్ని నేరాలు అందరికి తెలియవు. ఒక వేళ ఎవరికైన తెలిసినా ఆ నేరాలు నిరూపించబడవు. ఇంకా చెప్పాలంటే నేరం అని నిరూపించ బడినా శిక్షింపబడని పుణ్యభూమిలో ఉన్నాం మనం.... సో, నాకు ఎలాంటి భయంలేదు. కాని, ఈ సంగతి నీ ద్వారా అభిమన్యుకు తెలిస్తే మాత్రం పరిణామాలు చాలా దారుణంగా ఉంటాయి.''

''అంటే ఏం చేస్తారు చంపేస్తారా....చంపేయండి."

"ఛీ....ఛీ.... ఏంటి బేబి ఇంత చదువుకున్నావ్, కనీస లోకజ్ఞానం లేదే....చంపటం తప్పమ్మా.... నీ చేత ఎలా చెప్పించాలో మా త్రిమూర్తు లకు బాగా తెలుసు. చెప్పేయి బేబి, ఆ ఫార్ముల్యాలా ఎక్కడ ఉందో చెప్పేయి."

''నేను చెప్పను - చెప్పి సంవత్సరాల కృషిని మీ చేతుల్లో పోయ లేను,'' అంది మరింత మొండిగా.

''ఓహ్....చూడు మిస్ స్నేహిత! నలుగురు పోయేదార్నే నువ్వుపో, ఆదర్శానికి పోయి కష్టాలు కొని తెచ్చుకోకు. ఆశయాలు, ఆదర్శాలు జీవి తాన్ని చక్కదిద్దలేవు.... నువ్వు చాలా తెలివైన డాక్టర్వి, బాగా ఆలో చించుకో. నీ జీవితం కుక్కలు చించిన విస్తరి కాకముందే.''

''ఏంచేస్తారు?'' అంది రోషంగా.

''ఏం చేస్తామో నే చెప్పబోయాను, నువ్వే అడిగావు చెప్తాను విను, భూమిమీద ఎలాగోలా బ్రతకటం కంటే క్షేమంగా గౌరవంగా బ్రతకటం

ముఖ్యం. భారతీయస్త్రీ ప్రాణం కంటే మానానికే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది. మేం అడిగేది నువ్వు చెప్పకపోతే అది పోతుంది. మొదట నీ బట్టలన్నీ ఊడదీసి వివిధ పోజులలో ఫొటోలు. ఆ తరువాత నీ జీవితం ఎలా ఉంటుందో ఒక్కసారి ఊహించుకో, - అంతేకాదు, ఆ తరువాత ఏ ఆడది పోగొట్టుకోకూడనిది నీ నుంచి దోచుకుంటారు మా త్రిమూర్తులు''

స్నేహిత ఆ మాటలు వింటూ ఎండుటాకులా వణికిపోతున్నది.

''చివరిసారి అడుగుతున్నాను ఆ ప్రాజెక్ట్ ఫార్ములా ఎక్కడ ఉందో చెప్పు....'' ఆ గొంతులో అభ్యర్థనలేదు - డిక్టేటింగ్‌గా ఉంది.

మౌనంగా నిలబడింది ''........''

''చెప్పవు... ఎవరు ఏంచేయగలరు ... ఫొటోగ్రాఫర్, మస్తాన్, లూథర్, నరేంద్ర కమాన్. చేసుకున్న వారికి చేసుకున్నంత అని ఊరికే అన్నారా?'' అన్నాడు.

స్నేహిత అంతవరకు నటించిన ధైర్యం ఆవిరైపోతోంది. ధైర్యం స్థానంలో భయం ఆవరించింది. వెన్నులోనుంచి వణుకు ప్రారంభ మయింది.

లూథర్, నరేంద్ర, మస్తాన్ స్నేహిత చుట్టు చేరారు. - లేడికూన చుట్టూ తోడేళ్ళలా.

స్నేహితకు తన పరిస్థితి ఏమిటో అర్థమయిపోయింది.

ఆమెలో వణుకు అధికమైనది. స్నేహిత తనకే భయంలేనట్లు కనిపించటానికి ఎంత ప్రయత్నిస్తున్నా ఆ స్వరం ఎంతో హీనంగా హృదయ విదారకంగా ఉంది.

చుట్టుచేరిన ఆ ముగ్గురికి ఏమాత్రం జాలికలగటంలేదు.

'భగవాన్! నువ్వు ఉన్నావా-ఉంటే ఇలాంటి సంఘటనలు చూస్తూ ఎందుకు ఊరుకుంటావ్?' మనసు మూగగా ఘోషించింది.

లూథర్ చేయి ఆమె వీపు మీద ఉన్న చోలి మీద పడింది. మరు క్షణంలో జాకెట్ వెనుకభాగం అంతా చినిగి పీలికలుగా లూథర్ చేతిలోకి వచ్చింది.

ఆమె వీపంతా ఎర్రటి ఎండలో థార్ ఎడారిలా కనిపిస్తున్నది. వీపు మీద బాడీ బ్యాక్ బెల్ట్ ఒక్కటి మిగిలింది.

ఆ ముగ్గురి పైశాచిక ఆనందం క్షణక్షణానికి అధికమౌతున్నది.

స్నేహిత నిలువున కుప్పకూలిపోయింది స్పృహ తప్పి.

చౌదరికి ఏమనిపించిందో ''స్టాప్ ఇట్!'' అని గదిలో మారుమ్రోగేలా అన్నాడు.

ముగ్గురు ఆగిపోయారు.

''స్పృహ తప్పిపడిపోయింది, మరో కొద్దిసేపట్లో తేరుకోవచ్చు, పదండి బైటికి'' అంటూ బైటికి నడిచాడు చౌదరి.

ముగ్గురు చౌదరిని అనుసరించారు.

* * *

డాక్టర్ అభిమన్యు తన ఛాంబర్‌లో ప్రశాంత్‌తో సెక్యూరిటీ ప్రికాషన్స్ గురించి మాట్లాడుతున్నాడు.

ఛాంబర్‌లోని ఇంటర్‌కమ్ మ్రోగింది. రిసీవర్ అందుకొని 'యస్' అన్నాడు ఎంతో హుందాగా.

''సర్, మీకోసం డాక్టర్ రాజేష్ వచ్చిఉన్నారు,''అంది సెక్రటరి.

"ఓ.కె. పంపించండి'' అంటూ ఇంటర్‌కమ్ రిసీవర్ క్రెడిల్ చేశాడు.

మరుక్షణంలో డోర్ తెరుచుకొని రాజేష్ ఛాంబర్‌లోకి వచ్చాడు. రాజేష్ చాలా సింపుల్‌గా ఉన్నాడు.

''గుడ్ మార్నింగ్ సర్'' అన్నాడు వినయంగా

''మారింగ్, కమిన్ ప్లీజ్, ప్లీజ్ సిట్,'' అన్నాడు అభిమన్యు రాజేష్‌వైపు చూస్తూ.

రాజేష్ నవ్వుతూ కూర్చొని, ''మీ గురించి చాలా విన్నాను సర్, ఇప్పుడు మిమ్మల్ని ప్రత్యక్షంగా చూస్తున్నాను. అతి తక్కువ వయస్సులో ఇంత సక్సెస్ చాలా అరుదు. మెడికల్ ఫీల్డ్‌లో ఒక అసామాన్యమైన వ్యక్తిగా మా మెడికల్ కాలేజీలో చెప్పుకుంటుంటే విన్నాను....' -

''అభిమన్యు పెదవులమీద చిన్న మందహాసం నాట్యం చేసింది.

''రాబోయే జూనియర్ డాక్టర్స్‌కి మీలాంటివారే ఇన్స్పిరేషన్....'' అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడు.

అభిమన్యు మధ్యలో అందుకొని ''నైస్, మీరు ఏ పత్రికనుంచి వచ్చారు....'' అన్నాడు.

''లేదు సర్, నేను ఏ పత్రికనుంచి రాలేదు, మా అంకుల్ డాక్టర్ చౌదరిగారు మీ దగ్గరికి పంపారు, డాక్టర్‌గా మీ దగ్గర కొన్ని ముఖ్యమైన విషయాలు నేర్చుకోమని.... మీతో ఫోన్‌లో మాట్లాడాను అన్నారు, నాకు మీ దగ్గర కొద్దిరోజులు జూనియర్‌గా ఉంచండి సర్'' అన్నాడు.

''ఓ....డాక్టర్ చౌదరిగారు పంపారా, ఐసీ, అయిన ఒక డాక్టర్ లైఫ్‌లో హౌస్ సర్జన్సీలోనే అన్ని సూక్ష్మంగా నేర్చుకోవాలి, హౌస్ సర్జన్సీ పిరియడ్ ఒక అద్భుతమైన టర్నింగ్ పాయింట్, ఏదైనా స్పెషల్ ఇంట్రెస్ట్ ఉందా....? అని అడిగాడు డాక్టర్ అభిమన్యు.

"లేదు సర్, జనరల్ ఫిజీషియన్ అంటే ఇష్టం....'' అన్నాడు.

''ఓ.కె. హౌస్ సర్జన్సీ ఎక్కడ చేశారు.''

''సింహపురి, జనరల్ హాస్పటల్‌లో సర్'' అన్నాడు వినయంగా.

ఆ ఊరి పేరు అభిమన్యు చెవులకి ఎంతో మధురంగా వినిపించింది కారణం అభిమన్యు, ప్రశాంత్, స్నేహిత అక్కడే హౌస్ సర్జన్సీ పూర్తి చేశారు. ఆ ఊరి పేరులోనే ఎంతో దగ్గరితనం ఉంది. ఓ సంవత్సరంపాటు జరిగిన హౌస్‌సర్జన్సీ ఆ హాస్పటల్ వాతావరణంతో ఎంతో దగ్గర సంబంధము ఏర్పరచింది.

"ఓ....అలాగ ఆ హాస్పటల్‌లో డాక్టర్ యాదగిరి, డాక్టర్ ఉమేష్ ఉన్నారనుకుంటా...."

"అవును సర్ యాదగిరిగారు ఆరు నెలల్కితం రిటైర్‌అయ్యారు. ఇప్పుడు చీఫ్‌గా దత్తాత్రేయగారు ఉన్నారు. డాక్టర్ ఉమేష్‌గారు మాత్రం ఆంత్రాలజీ వార్డ్‌కు ఉన్నారనుకుంటాను" అన్నాడు రాజేష్ గుర్తుచేసుకుంటూ.

ప్రశాంత్ ఆసక్తిగా "ఉమేష్ బాగా పరిచయమేనా?" అన్నాడు రాజేష్‌ని ఉద్దేశించి.

"పరిచయం పెద్దగా లేకపోయినా మాకంటే సీనియర్ కదా! తెలుసు, అయినా ఉమేష్‌గారు చాలా ఫ్రీగా మూవ్ అవుతుంటారు. ఇంతకు ముందు అలా ఉండేవాళ్ళు కాదట...." అన్నాడు తనకు తెలిసిన నిజం చెప్తున్నట్లుగా.

డాక్టర్ మభిమన్యు, ప్రశాంత్ ఇద్దరు ఒకవైపు ఒకరు చూసుకొని నవ్వుకున్నారు.

ఇభిమన్యు ఇంటర్‌కమ్ బటన్ నొక్కి "మేనేజర్‌గారిని రమ్మనండి" అన్నాడు.

కొన్ని సెకన్స్‌లోనే మేనేజర్ అభిమన్యు ఛాంబర్‌లోకి వచ్చాడు. "గుడ్ మార్నింగ్ సర్" అంటూ.

''యస్, మార్నింగ్, ఇతను మిష్టర్ రాజేష్. జనరల్ ఫిజీషియన్‌గా అపాయింట్ చేయండి...ఓ కే'' అన్నాడు పలదాకు ఆర్డర్ పాస్ చేస్తూ.

"అలాగే సర్" అన్నాడు మేనేజర్.

రాజేష్ వైపు చూస్తూ "వెళ్ళి అపాయింట్‌మెంట్ ఆర్డర్స్ తీసుకోండి", అన్నాడు అభిమన్యు.

''థాంక్ యూ సర్'' అని వినయంగా చెప్పి, ఆనందంగా బయటకు వెళ్ళాడు.

డాక్టర్ అభిమన్యు, ప్రశాంత్‌ల ఆలోచనలు తమ ప్రమేయం లేకుండానే గతంలోకి వెళ్ళి తాము హౌస్ సర్జన్సీ చేసిన రోజులు కళ్ల ముందే కదలాడుతున్నాయి.

*　　　*　　　*

ఆ రోజే అభిమన్యు హాస్పటల్‌లో హౌస్‌సర్జన్‌గా చేరిన మొదటిరోజు. క్రొత్త హాస్పటల్, క్రొత్త వాతావరణం. మెడిసన్ మీద శ్రద్ధాసక్తులున్న ప్రతి డాక్టర్‌కి ఈ హౌస్‌సర్జన్సీ పిరియడ్ ఒక అమూల్యమైన దశ అని మెడికల్ ఫీల్డ్‌లో ఉన్న ప్రతి ఒక్కరు చెప్పేదే! ఆ దశలోకి ప్రవేశించాడు అభిమన్యు.

హాస్పటల్ - క్రొత్తదైన హాస్పటల్ గురించి అంతా తెలిసిందే.... అభిమన్యుకు తను కూడా డాక్టర్నయానన్న సంతృప్తి అణువణువులో చేరి ఒక రకమైన పులకరింతలు కలిగిస్తున్నది. స్టెతస్కోప్ మెడలో వేసుకొని, మిల్క్‌వైట్ డ్రస్‌లో హాస్పటల్ అంతా తిరుగుతుంటే ఎంతో తృప్తిగా ఉంది. హాస్పటల్ ఆవరణలో ఉన్న కొంత మంది పేషంట్స్ మాత్రం అభిమన్యుకు సమస్కారాలు (దండాలు) పెడుతున్నారు. మనసు ఆనందంతో ఉరకలు వేస్తున్నది.

హాస్పటల్‌లోని ఓ. పి. వార్డ్ అది చెప్పకూడదు కాని అది ఒక సంతలా ఉంది. యింజక్షన్‌లు వేయించుకోవటం కోసం అక్కడ మహా సంగ్రామంలా నానా బీభత్సం చేస్తున్నారు. వరుసలో నిలబడ్డ రోగులు విసిగిపోయి నాకు ముందంటే, నాకు ముందని తోసుకురావటం. సిస్టర్స్‌తో తగవులాడటం, బ్రతిమాలటం, పెద్ద డాక్టర్‌కు చెప్తాను అని సిస్టర్స్‌ని బెదిరించటం. గౌర్నమెంట్ హాస్పటల్ నర్సులు మాత్రం తక్కువ తిన్నరా అని నిరూపించటం కోసం రోగుల మీద ఇష్టం వచ్చినట్లుగా విరుచుకొని పడుతుంటారు. వరుసలో నిలబడమని, మాట్లాడకండి అని, ప్రతి చిన్న విషయానికి రోగులను విదిలించి వేసేవారు కొంత మంది నర్సులు ఏ మాత్రం దయాదాక్షిణ్యాలు లేకుండా ప్రవర్తిస్తుంటారు. విసుగుతో రోగులతో వెటకారంగా మాట్లాడుతుంటారు. "అధికంగా మాట్లాడకు, నీకు తెలుసా, నాకు తెలుసా, ఇష్టం అయితే యింజక్షన్ చేయించుకో. లేకపోతే వెళ్ళు...." అనే ధోరణిలో ఉండేవారు. ఈ రకం నర్సులకు కోపం ముక్కు మీదే ఉంటుంది.

మరి కొంత మంది నర్సులు పని తప్పించుకోవటం కోసం సిరంజీ పగిలిపోయిందని, నీడిల్ బ్లాక్ అయిందని స్టోర్ రూమ్‌కు వెళ్ళి తీరికగా అదే పనిలో క్యాంటిన్‌లో టిఫిన్ చేసి, ఆ తరువాత నెమ్మదిగా ఓ.పి. వార్డ్‌కు వస్తుంటారు.

నిజానికి ఎక్కువ మంది సిస్టర్స్ నిజాయితీగా, అంకితభావంతో ఎంతో సౌమ్యంగా ఉంటారు. వీళ్ళు ఎప్పుడు నవ్వుతూ పనిచేసి వెళ్తుంటారు. సిస్టర్స్ ఎక్కువ మంది బీద కుటుంబాల నుంచే వచ్చిన వారై ఉంటారు. వీళ్ళ మీదే ఎన్నో ఆశలు పెట్టుకొని ఉంటారు వాళ్ళ కుటుంబ సభ్యులు. వీళ్ళకు పని ఎక్కువగానే ఉంటుంది. షిఫ్ట్ ఎక్కినప్పటినుంచి, షిఫ్ట్ దిగే దాక ఒకటే పని. పేషంట్స్ తమకు అది కావాలని, ఇది బాగోలేదని ఎప్పుడు ఏదో ఒక ఫిర్యాదు చేస్తూనే ఉంటారు. తెల్లటి డ్రస్‌లలో కనిపించే

వీరి అందరి జీవితాలు సాఫీగా, ఆనందంగా, తృప్తిగా ఉండవు అనేది ఒక చేదు నిజం.

చికిత్స కోసం రకరకాల మనుషులు వస్తుంటారు. ఒక్కొక్కరికి ఒక్కో రకమైన పిచ్చి, ఒకరు "నాకు ఇంజక్షన్ రాయండి బాబు" అని నసపెట్టేస్తుంటారు. మరి కొంత మంది తమను హాస్పటల్‌లో అడ్మిట్ చేసుకోమని కాళ్ళవేళ్ళ పడుతూ ఇబ్బంది పెట్టేస్తుంటారు. వాళ్ళ బాధ భరించలేక ఇద్దరిని అడ్మిట్ చేసుకున్నాడు అభిమన్యు.

పేషంట్స్‌గా వచ్చేవారు చాలా మంది నిరక్షరాస్యులే. చాలా అరుదుగా చదువుకున్న వాళ్ళు కూడా వస్తుంటారు. వీళ్ళు చదువుకోని వాళ్ళకంటే మరీ విచిత్రంగా ప్రవర్తిస్తూ అడిగిందే అడిగి, చెప్పిందే చెప్పి విసిగిస్తుంటారు.

డాక్టర్ తన దగ్గరకు వచ్చిన పేషంట్ జబ్బుకి మందివ్వటం, ఆ జబ్బు కొద్ది రోజులకు నయం కావటం అనేది ఒక పద్ధతి అయితే, ఆ పేషంట్‌కి తన వ్యాధి ఏమిటో వివరించి చెప్పి, ఏ మందు ఎందుకు వాడుతున్నది వివరించి చెప్పటం మరో పద్ధతి. మనుషులను బట్టి ఈ రెండు పద్ధతులలో ఏది సరియైనదో ఎన్నుకోవాలి. ఏ పద్ధతి పాలో అయినా పేషంట్‌లో నిరుత్సాహాన్ని కలిగించకుండా సునిశితంగా ప్రవర్తించాలి. అదే వైద్య వృత్తిలో మొదటి నీతి సూత్రం. దీనిని అభిమన్యు తూచా తప్పకుండ పాటించటంలో నిమగ్నమయ్యాడు.

హాస్పటల్‌లో చేరి ఇంకా ఒక్కరోజు కూడా పూర్తి కాలేదు. అప్పుడే హాస్పటల్ స్టాఫ్ అంతా బాగా పరిచయమయ్యారు.

ఆ హాస్పటల్ ఎప్పుడో బ్రిటీష్‌వారు కట్టించింది. అది కాక ఆ ఆవరణలో మరికొన్ని క్రొత్త బిల్డింగ్స్ కూడా కడుతున్నారు.

అభిమన్యు ఏ వార్డులోకి వెళ్ళినా డాక్టర్‌గారూ, డాక్టర్‌గారూ అని ఆప్యాయంగా వచ్చి తమ సమస్యలు ఎడతెరిపి లేకుండా మొరపెట్టుకుంటున్నారు. తనకు తోచినది చెప్పి మందుల గురించి సిస్టర్స్‌తో చెప్పి ముందుకు వెళ్ళిపోతున్నాడు.

పేషంట్స్‌లో చాలా మందికి హౌస్ సర్జన్‌కు, సర్జన్‌కు ఉన్న తేడా కూడా తెలియదు. హాస్పటల్ ఆవరణలో తెల్లదుస్ వేసుకొని మెడలో స్టెతస్కోప్ వేసుకొని ఉండే అతనిని భగవంతునిలా చూస్తారు. పేషంట్స్ ఉద్దేశ్యంలో ఆ డాక్టర్లకు అన్ని వ్యాధుల గురించి తెలిసి ఉంటుంది. కానీ, ఏ స్పెషలిస్ట్ ఇ. ఎన్. టి. డాక్టర్స్ ఉంటారని వాళ్ళలో చాలా మందికి తెలియదు. కడుపు నొప్పితో వచ్చిన ఒక పేషంట్ పనిలో పనిగా జనరల్ ఫిజీషియన్‌తో చెవినొప్పి విషయం కూడా అడిగితే అది ఇ. ఎన్. టి. కేస్ అని చెప్పి ఇ. ఎన్. టి. డాక్టర్ వద్దకు వెళ్ళమంటే. "అదేమిటి డాక్టర్‌బాబు, మీరూ డాక్టరేగా మీరు చూస్తే పోదూ" అని అమాయకంగా అడుగుతుంటారు. అలాంటి పేషంట్స్‌కి అర్థం అయ్యేలా చెప్పటం కొంచెం కష్టం.

అభిమన్యు తన హౌస్ సర్జన్సీ రోజులో రోజు ఉదయం నిద్ర లేవటం, ఎనిమిది గంటలకల్లా, వార్డ్‌కి వెళ్ళి కేస్ షీట్‌లన్ని సరిగ్గా ఉన్నాయో లేదో చూసుకోవటం, బ్లడ్ ప్రెషర్ నోట్ చేయటం, అనిపిస్తే పేషంట్స్ స్పెసిమన్స్ ఇన్వెష్టిగేషన్‌కు పంపటం, ఇన్వెష్టిగేషన్ నుంచి వచ్చిన రిపోర్ట్స్‌ని రికార్డ్ చేయటం. ఆ తరువాత ఎవరికైనా సీరియస్‌గా ఉందేమో చూసుకొని, చీఫ్ రౌండ్స్‌కు వచ్చి వెళ్ళిన తరువాత ఓ.పి.లో పని పూర్తి చేసేసరికి సమయం ఎలా గడిచిపోతుందో తెలియనే తెలియదు. రోజంతా చాలా బిజీగా గడచిపోతుంది. వారంలో కొన్ని రోజులు నైట్ డ్యూటీస్ ఉంటాయి.

* * *

ఆ రోజు ఉదయం అభిమన్యు మొట్ట మొదటిసారిగా ఓ చిన్న ఆపరేషన్ చేయటానికి ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్ళాడు. క్లొరో ఫారమ్ వాసన ఘుమాయించేస్తోంది. ఇంతకు ముందు ఎన్నోసార్లు ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్ళినా ఈ సారి ఎందుకనో కొత్తగా అని పిస్తోంది.

అభిమన్యు తన చేతులార చేయబోయే మొదటి ఆపరేషన్. డాక్టర్ అయిన ప్రతి ఒక్కరు ఏదో ఒక రోజు ఆపరేషన్ చేయక తప్పదు అనుకున్నాడు మనసులోనే. ఒకవైపు అమితమైన ఉత్సాహం మరోవైపు సీనియర్ సర్జన్ ప్రక్కనే ఉండటం వల్ల కాస్త భయం; ఒక మనిషి ప్రాణాలతో చెలగాటం కాకపోయిన అదోరకమైన భయం, ఆపరేషన్ సక్సెస్ కావాలని మనసులోనే దేవుణ్ణి ప్రార్థించుకున్నాడు.

పేషంట్‌కి ఎనస్థేషియా ఇచ్చారు.

అది హైడ్రోసిల్ కేస్; ఆపరేషన్ ప్రారంభమయింది. ప్రక్కనే సీనియర్ సర్జన్ అబ్జర్వ్ చేస్తున్నారు. ఒక వైపు పూర్తి చేసేసరికి ఇరవై ఐదు నిమిషాలు పట్టింది.

''మరీ అంత స్లోగా అయితే ఎలాగయ్యా, పది నిమిషాలల్లో పూర్తి చేయాలి. చాలా చిన్న ఆపరేషన్ ఇది'' అన్నారు ప్రక్కనే ఉన్న సర్జన్.

రెండవ వైపు చేయటానికి ఇరవై రెండు నిమిషాలు పట్టాయి.

"గుడ్ చాలా బాగా చేసావ్, కీప్ ఇట్ అప్", అన్నారు ప్రశంసగా సర్జన్, పేషంట్‌ను వార్డ్‌లోకి పంపించిన తరువాత.

సీనియర్ సర్జన్ వాష్ బేసిన్ దగ్గర చేతులు కడుకుంటూ ఉంటే, అభిమన్యు దగ్గరకు వెళ్ళి, ''సార్...., డాక్టర్ ఈ రోజు నాకెందుకో రక్తాన్ని చూసిన వెంటనే ఒక రకమైన భావం కలిగింది.... కళ్ళు తిరిగి నట్లుగా అనిపించింది" అన్నాడు.

"ఓహో అలా అనిపించిందా", అన్నారు సర్జన్ నవ్వుతూ. ఆయన సాధారణంగా ఎప్పుడూ నవ్వుతూనే ఉంటారు.

"అభిమన్యు నీకు తెలుసా? నేను మొదటి ఆపరేషన్ చేసేటప్పుడు. రక్తాన్ని చూసి కళ్ళు తిరిగి పడిపోయాను. కాని, ఇప్పుడు సీనియర్ సర్జన్ని. అంతే అభిమన్యు. ప్రతీది, క్రొత్తలో అలాగే ఉంటుంది. ఈనాడు ఆపరేషన్‌చూస్తూ కళ్ళు తిరిగి పడిపోయిన వారే రేపు పెద్ద సర్జన్లయి, అవలీలగా ఆపరేషన్లు చేసేస్తారేమో, నాలాగే" అని నవ్వుకుంటూ ఆపరేషన్ థియేటర్‌లో నుంచి బయటకు వెళ్ళిపోయారు. ఆయన పేరుకు సర్జనే అయినా హాస్పటలే ఆయన ప్రపంచం.

ఆ రోజు మనసంతా తృప్తిగా ఉంది. మొదటి ఆపరేషన్ సక్సెస్ అయింది.

సాయంత్రం అయింది. మసక చీకటి పడుతుండగా లైట్లు వెలిగాయి. ఆ లైట్స్ వెలుగులో హాస్పటల్ క్రొత్త అందాలను సంతరించు కున్నది.

అభిమన్యు మనసులో ఆ లైట్ల వెలుగు కంటె పదిరెట్లు ఎక్కువ వెలుగుపరచుకుంది. హాస్పటల్ క్యారిడార్‌లో ఎంతో నిశ్చలంగా, దృఢంగా,ఆత్మవిశ్వాసంతో ముందుకు నడుస్తున్నాడు. ఆ నడక ఎప్పుడూ; ఎక్కడా తడబడలేదు, ఆగలేదు. జీవితంలో ఇక వెనుతిరిగి చూడలేదు.

*   *   *

హాస్పిటల్‌కు క్రొత్త హౌస్ సర్జన్‌గా వచ్చిన ప్రశాంత్ కుమార్‌కు మొదట పరిచయమైన వ్యక్తి దివ్య.

ప్రశాంత్‌కు దివ్యను చూడగానే ఎక్కడో, ఎప్పుడో చూసినట్లుగా అనిపించింది. కొందరు వ్యక్తులకు చాలా సాధారణంగా అలా అనిపిస్తుంది. దివ్య ఇరవై ఐదు వసంతాలు నిండిన కన్య. మనిషి చాలా కళగా

ఉంటుంది. అందరితో కలసి మెలసి నవ్వుతూ, నవ్విస్తూ ఉంటుంది. మధ్య తరగతి కుటుంబం నుంచి వచ్చిన ఒక సామాన్య నర్స్. నర్సులుగా ఉండేవారు ఎక్కువ మంది మధ్య తరగతి, పేద తరగతి వారే ఎక్కువగా ఉంటారు, తెల్లటి యూనిఫార్మ్ వేసుకొని రోగులకు తన పర అనే భేదం లేకుండా సేవ చేసే వారి నిజ జీవితంలో ఆనందం, సంతోషం అంతంత మాత్రంగానే ఉంటాయి అనేది చేదు నిజం.

హాస్పిటల్ సూపరిడెంట్ ఆఫీస్ ముందు నర్సులందరూ అటెండెన్స్ తీసుకోవటం కోసం గుంపుగా నిలబడి వున్నారు. దూరం నుంచి చూస్తే తెల్లటి యూనిఫార్మ్‌లో ఉన్న నర్సులందరు పారం కోడిపిల్లలా ఉన్నారు. వాళ్ళలో ఎక్కువమంది ఇరవై ఐదు సంవత్సరాల నుంచి ముప్పయి ఐదు ఏజ్ గ్రూప్ వాళ్ళే ఎక్కువ. వీరిలో ఎక్కువ మంది అన్ మ్యారీడ్ (అవివాహితలే).

ప్రశాంత్ కుమార్ తన ఛాంబర్‌లోని కిటికీలో నుంచి, నర్సులు అటెండెన్స్ తీసుకోవటం ఆసక్తిగా చూస్తూ ఉన్నాడు.

ఓ. పి. వార్డ్‌లో ఇంకా స్లిప్స్ వ్రాయటం ప్రారంభం కాలేదు. కాని ఓ పి. సెషన్‌లో వేచి ఉన్న పేషంట్స్‌తో కిక్కిరిసిపోతూ ఉంది. పేషంట్స్‌గా వచ్చిన వాళ్ళు మరీ చిన్న పిల్లలు, వాళ్ళ తల్లులు, ఒక వయసు వచ్చిన వాళ్ళు, మధ్యవయస్కులు, వృద్ధులు, స్త్రీలు, అన్ని వయస్సులవారు, అన్ని వర్గాలవారు. వాళ్ళ అందరినోర్లు ఒక నిమిషం ఊరుకోవు. ఒక టే మాటలు. ఆ శబ్దం అంతా కలిసి ఒక విచిత్ర శబ్దంలా మారుతున్నది. ఓ పి. వార్డు అంతా ఒక సంతలా ఉంది. ఎవరైనా డాక్టర్ కాని, హౌస్‌సర్జన్ కాని అటువైపు వస్తే ఒక నిముషంపాటు వాళ్ళ మాటలు తగ్గుతాయి. ఆ డాక్టర్ అలా వెళ్ళగానే మరలా మామూలే. మధ్యమధ్యలో వార్డుబాయిస్, నర్సులు వచ్చి 'సైలెన్స్-సైలెన్స్' అని గొంతుచించుకుంటుంటారు.

డాక్టర్ ప్రశాంత్ కుమార్‌కు అసిస్టెంట్‌గా ఉండవలసిన నర్స్ ఇంకా రాలేదు. ఏ క్షణంలో అయినా రావచ్చు అసిస్టెంట్ నర్స్. (అసిస్టెంట్ నర్స్ వచ్చిన తర్వాత దయాగ్నస్టిస్ చేయవలసి ఉంటుంది.)

"గుడ్‌మార్నింగ్ సర్. డాక్టర్ ఈరోజు మీ అసిస్టెంట్ సెలవులో ఉన్నారు. ఇన్‌చార్జిగా మీకు అసిస్టెంట్‌గా నన్ను వెళ్ళమన్నారు" అంది ఓ ఆడగొంతు శ్రావ్యంగా సుమధురంగా.

ప్రశాంత్ ఆమెవైపు చూసాడు. ఆమె చాలా సామాన్యంగా ఉంది. కానీ అసామాన్యమైన ఆకర్షణ ఉంది.

"ఓకే. మీ పేరేమిటి?" అన్నాడు.

''దివ్య....''అని చెప్పి, సిస్టర్స్‌కు రొటీన్‌గా ఉండే వర్క్‌లో ఖాగాలైన బి.పి. ఇంస్ట్రుమెంట్ ఓపన్‌చేసి ఉంచటం, టేబుల్‌మీద డేట్ కార్డు మార్చటంలో మునిగిపోయింది.

''చక్కటి పేరు....'' అన్నాడు ముఖస్తుతిగా.

''మీ పేరు డాక్టర్ ప్రశాంత్‌కుమార్ కదా" అంది అసిస్టెంట్ నర్స్ దివ్య.

ప్రశాంత్ నవ్వి, ''కాదు, ఓన్లీ ప్రశాంత్'' అన్నాడు చిలిపిగా.

ఉదయం ఎనిమిదిన్నర గంటలనుంచి, పేషంట్స్ ఒక్కొక్కరు దయాగ్నసిస్ కోసం వస్తూ ఉన్నారు.

పేషంట్స్ కొంతమంది చాలా విచిత్రంగా ప్రవర్తిస్తూ ఉంటారు. కొంతమంది రోగులు తమను హాస్పటల్‌లో అడ్మిట్ చేసుకోమని కాళ్ళా వేళ్ళా పడుతుంటారు.

"సలక్షణంగా ఉండి, హాస్పటల్‌లో అడ్మిట్ చేయించుకోండి అని అడుగుతారు ఏంటి చెప్మా" అని ఆశ్చర్యపోయాడు ప్రశాంత్.

పన్నెండు కావస్తుందనగా డయాగ్నసిస్ స్లిప్స్ వ్రాయటం పని అయిపోయింది. అడ్మిట్ చేయవలసిన కేసులు ఏమీ కనిపించలేదు.

దివ్య ప్రశాంత్ వైపు పరీక్షగా చూస్తూ "పని అయిపోయింది డాక్టర్, టీ తీసుకుంటారా?" అంది.

"ఇప్పుడా...." అన్నాడు ప్రశ్నార్థకంగా మొహమాటంతో.

''నేను ఇంటినుండి వస్తూనే ఫ్లాస్క్‌లో 'టీ' తీసుకొని వచ్చాను. ఈ 'టీ' కోసం క్యాంటిన్‌కు వెళ్ళటం, రావటం దేనికని'' అంటూ ఫ్లాస్క్‌లోని టీ'ని ఓ కప్పులో పోసి ప్రశాంత్‌కు అందిస్తూ ''చూడండి నా చేతి టీ రుచి.'' తను ఒక కప్పులో తీసుకుంది.

(హాస్పటల్‌లో, టి.వి. స్టేషన్‌లలో, ఆకాశవాణి లాంటి సంస్థలలో కొలీగ్స్ ఆడ, మగ అనే తేడా లేకుండా చాలా లిబరల్‌గా ఉంటారు. పాఠకులు గమనించ ప్రార్థన.)

ప్రశాంత్ నవ్వుతూ అందుకొని టీ త్రాగటం ప్రారంభించాడు.

''ఎలా ఉంది డాక్టర్ నా చేతి టీ....?''

''బ్రహ్మాండం! అమృతంలా ఉంది'' అన్నాడు పొగడ్తగా.

"నాకు తెల్సులెండి, మొహమాటానికి అలా అంటున్నారు...."అని సరదాగా నవ్వుతూ అంది.

ఆమె నవ్వులో అసాధారణమైన ఆకర్షణ ఉంది. ఆ నవ్వులో వెన్నెల చల్లదనం ఉంది. ప్రశాంత్ ఆమె అందమైన చిరునవ్వు చూసి ఏం మాట్లాడాలో అర్థంకాక, చిన్నగా నవ్వాడు. ప్రశాంత్ చిరునవ్వులో ఎలాంటి కల్మషం లేదు. అతని ముఖం చాలా అమాయకంగా ఉంది. ప్రశాంత్ నవ్వు దివ్యను ఎంతో ఆకర్షించింది.

అలా సరదాగా ఒకరివైపు ఒకరు చూసుకొని చిరునవ్వు నవ్వుకోవడంలతో ప్రారంభమైంది వాళ్ళ స్నేహం. ఆ చిరునవ్వు ఛలోక్తుల్లోకి

మారాయి, క్రమంగా, బస్ స్టాప్‌లలో ఒకరి కోసం ఒకరు వెయిటింగ్ చేయటం, కలసి సిటీ బస్‌లలో వెళ్ళటం, సినిమాకు, జూపార్క్‌లకు వెళ్ళటం కూడా అయిపోయి, ఇద్దరు కలిసి నిర్జన ప్రాంతంలో కూర్చొని గంటల తరబడి కబుర్లు చెప్పుకోవటాలు, ఆదివారం ఎప్పుడు వస్తుందా అని నిరీక్షణలో గడపటం, ఆదివారం వస్తే ఇద్దరూ కలసి ఎక్కడికైనా వెళ్ళి సరదాగా గడపటం వరకు చేరింది. రోజులు క్షణాలల్లో గడచి పోతున్నాయి. కేవలం నెల రోజుల్లోనే ఇంత చనువు ఎలా ఏర్పడిందో ఏ ఒకరు చెప్పలేరు - అదే జీవితం. ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు.

ప్రశాంత్, దివ్యలకు జీవితం ఎంతో అందంగా అలంకరించబడిన ఫ్లవర్ బొకేలా ఉంది.

ఆ రోజు శుక్రవారం.

దివ్య హాస్పటల్‌కు రాలేదు. ఆరోగ్యం బాగోలేదని ప్రశాంత్ తెలుసుకున్నాడు - ఈ విషయం తెలుసుకున్న ప్రశాంత్‌కు మనసు మనసులో లేదు. ఏ పని చేస్తున్నా ఆలోచనలన్నీ దివ్యచుట్టే తిరుగుతున్నాయి. దివ్యకు ఏమయి ఉంటుంది? ప్రశాంత్‌కు ఏమీ తోచటం లేదు - ఆలోచించే కొద్దీ మెదడు మొద్దుబారి పోతున్నదేకాని ఆలోచనలు ఓ దరి చేరటం లేదు. పేషంట్స్‌ను యాంత్రికంగా డయాగ్నసిస్ చేసి పంపిస్తున్నాడు.

పదకొండు గంటలకు ఔట్ పేషంట్స్‌ను డియాగ్నసిస్ చేయటం అయిపోయింది.

ప్రశాంత్ చైర్ మీద కూర్చోలేకపోతున్నాడు. ముళ్ళమీద కూర్చునట్లుగా ఉంది. శారీరకంగా కాదు, మానసికంగా. ''మనిషి ఎంత బలహీనుడు" అనుకున్నాడు మనసులోనే. ఏవేవో ఆలోచనలు ప్రశాంత్ బుర్రలో బ్రేక్ డాన్స్ చేస్తున్నాయి.

దివ్య నర్స్ క్వాటర్స్‌లో ఉంటుందని తెలుసు. కాని, ఇంటినెంబర్ తెలియదు. ఇక లాభం లేదని ఓ నిర్ణయానికి వచ్చి నర్సెస్ క్వార్టర్స్ వైపు నడకన బయలుదేరాడు

ఓ పది నిమిషాలు నడిచిన తర్వాత నర్సెస్ క్వాటర్స్ చేరాడు. అక్కడ కొంత మంది చిన్న పిల్లలు గోలీల ఆట ఆడుకుంటున్నారు. ప్రశాంత్ ఆ ఆడుకొనే పిల్లల్లో ఒకర్ని పిలిచి దివ్య ఇంటి గురించి అడిగాడు, ఆ కుర్రాడు దివ్య ఇంటిదాకా వచ్చి చూపించాడు.

ప్రశాంత్ దివ్య ఇంటిముందు ఆగాడు. ఇంటి ముందు చిన్న చిన్న పూలమొక్కలు చక్కగా పెట్టి ఉన్నారు. ఇంటిచుట్టూ వెదురు తడికలతో బౌండరీలా ఉంది.

ప్రశాంత్‌కు ఇంటిలోపలికి ఏరకంగా వెళ్ళాలో అర్థం కావటం లేదు. "ఎవరు ఉంటారో ఇంటిలో, ఏమని మాట్లాడాలి" అని ఆలోచించు కుంటున్నాడు. ఇంతలో ఓ పన్నెండు సంవత్సరాల పాప ఇంటిలోనుంచి బయటికి వచ్చింది.

పాపదృష్టి ఇంటి ముందు ఉన్న ప్రశాంత్‌మీద పడింది. ప్రశాంత్ వైపు చూస్తూ "ఎవరు కావాలి అంకుల్," అంది మర్యాదగా.

ప్రశాంత్ ఎంతో హుందాగా ''దివ్య, ఇల్లు ఇదేనా'' అన్నాడు.

''అవునండి, ఇదే,'' అంది అయోమయంగా చూస్తూ.

''ఉన్నారా....,'' అంటు చొరవగా తడిక గేట్ (వెదురు గేట్) తీసుకొని లోపలికి వచ్చాడు.

''అక్కా.... నీ కోసం ఎవరో వచ్చారే....,'' అంటూ లోపలికి వెళ్ళింది.

ఇంటి లోపలికి వెళ్ళటం పద్ధతి కాదని వరండాలో ఇంటి వాతావరణం అంతా చూస్తూ నిలబడ్డాడు. మధ్యతరగతి కుటుంబం, అంతా మధ్యతరగతి వాసనే, అయినా ఎంతో సాంప్రదాయబద్ధంగా ఉంది.

దివ్య ఇంట్లో నుండి బయటికి వచ్చింది, నైటీలో ఉంది, ఎందుకోసమో నీరసంగా ఉంది.

దివ్య ప్రశాంత్‌ని చూడగానే "మీరా....," అంది ఆనందంతో ఇంకేమి మాట్లాడాలో అర్థంకాక.ఒక డాక్టర్ ఇంటికి వచ్చినందుకు కలిగే ఆనందం కాదు, అంతకంటే మించి పదిరెట్లు ఎక్కువ ఆనందం అది. ఆ ఆనందానికి పెద్ద కారణం ఏమి లేకపోయినా, ఒక రకమైన అవ్యక్త ఆనందం. కొందరికి ఆనందంలో మాటలురావు సరిగ్గా అదేస్థితిలో ఉంది దివ్య.

"రండి డాక్టర్, కూర్చోండి" అంటూ మధ్య హాల్‌లో ఉన్న చెక్క సోఫా చూపింది. ఆ గది హాలు, ఆ గదిలో వస్తుసామాగ్రి పెద్దగా లేకపోయిన నీట్‌గా ఉంది.

"ఎలా ఉంది ఆరోగ్యం," అని అడిగాడు ప్రశాంత్.

ఒక ఆడపిల్లకు, అందులో పెళ్ళికాని ఆడపిల్లకు - తన గురించి ఒక మగాడు (పెళ్ళికాని అబ్బాయి) ఇన్‌ట్రస్ట్ చూపుతున్నాడు అని తెలిసిన మరుక్షణం ఆమె పొందే ఆనందానికి అవధులు ఉండవు ఇది నిజం.సరిగ్గా ఇదే జరిగింది ఇక్కడ కూడ.

తనపై ఉద్యోగి, ఇంత అభిమానంగా తన ఆరోగ్యం గురించి అడగటానికి వచ్చాడు. ప్రశాంత్ పెద్ద అందగాడు కాకపోయినా, అనాకారి మాత్రం కాదు. చూడగానే కంటికి ఆనేరూపం, మంచి గౌరవనీయమైన హోదాలో ఉన్నవ్యక్తి, అంతకంటే ముఖ్యమైన మరో అంశం మూడు పదులు వయస్సులో ఉన్న పెళ్ళికాని యువకుడు.

ఈ దేశంలో ఒక ఆడపిల్ల తన జీవితభాగస్వామిలో ఇంతకంటే ఇంకా ఏం ఆశించగలదు?

ప్రేమ, అనురాగం మిళితమైన కళ్ళతో దివ్యవైపే చూస్తున్నాడు. ఆడవాళ్ళుమాత్రమే కాదు మగవాళ్ళుకూడా - ప్రేమగా చూడగలరు అనేలా ఉన్నాయి ప్రశాంత్‌చూపులు.

అతనిచూపుల్లో అనంతమైన ప్రేమ ఉంది, పెళ్ళికాని ఏ ఆడపిల్లనైనా సమ్మోహనపరచగల శక్తి, అమాయకమైన కన్య గుండెలకు తూట్లు పరచగల తూపులు ఆ చూపులు.

మనసు స్పందించేటప్పుడు, మెదడు ఆలోచించేటప్పుడు నోరు మాట్లాడలేదు. సాధారణంగా అందువల్లనే దివ్యకాని, ప్రశాంత్‌కాని ఏమీ మాట్లాడలేకపోతున్నారు.

పది నిమిషాల తర్వాత దివ్య ఇచ్చిన కాఫీ త్రాగి, హాస్పటల్ వైపు నడుస్తున్నాడు. దివ్య వీధి గుమ్మంలో నుంచి ప్రశాంత్ వెళ్ళటం చూస్తూ మనసులోనే తృప్తిగా నవ్వుకుంది. ఆ క్షణంలో దివ్యకు తెలియదు మరో కొద్ది రోజుల్లో తన జీవితంలో ఎలా అపశ్రుతి పలుకుతుందో అదే సగటు జీవితం.

హాస్టల్‌లోని కొంతమంది జూనియర్ కొలీగ్స్ పిక్‌నిక్ వెళ్ళాలి అని నిర్ణయించుకున్నారు. పిక్‌నిక్ వెళ్ళేవాళ్ళలో ప్రశాంత్, దివ్య కూడ ఉన్నారు. పిక్‌నిక్‌స్టార్ సింహపురికి ముప్ఫయి కిలోమీటర్ల దూరంలో ఉన్న బీచ్ లొకేషన్. పిక్‌నిక్‌కి వచ్చినవారు ఎక్కువమంది ఇద్దరు ముగ్గురు ఒక్కొక్క గ్రూప్‌గా తయారై ఒక్కొక్క చోట కూర్చొని ఏవో మాట్లాడుకుంటూ ఉన్నారు. ప్రశాంత్, దివ్య-ఇద్దరు ఒక వైపు వచ్చి చుట్టూ చెట్లు మధ్యలో ఇసుక దిన్నెల ఉన్న ప్రదేశంలో కూర్చున్నారు. వాళ్ళు బయటి వాళ్ళకు మామూలుగా అయితే కనిపించే అవకాశం లేదు - చుట్టు చెట్లు ఉండటం వల్ల.

ప్రశాంత్ దివ్య కళ్ళలోకి చూస్తూ "నా గురించి నీ అభిప్రాయం ఏమిటి దివ్య?" అన్నాడు.

"ఈ ప్రశ్నకు సమాధానం కోసం ఆలోచించవలసి ఉంటుంది," అంది మురిపెంగా; ఒక నిమిషం తటపటాయించి.

ప్రశాంత్ ఏ ఉద్దేశ్యంతో అడిగాడు అన్నది దివ్యకు బాగా తెలుసు. దివ్యకు ప్రశాంత్ మీద ఎలాంటి అభిప్రాయం ఉందో ప్రశాంత్‌కు తెలుసు.

"చెప్పు దివ్య, ప్లీజ్" దివ్య చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ ఆర్తిగా అడిగాడు.

కొంత మంది ఉంటారు తాము ఏమి మాట్లాడకుండానే ఉన్నట్లు అనిపిస్తూ అన్ని మాట్లాడేస్తారు. అలాంటి వ్యక్తే ప్రశాంత్.

ఇక తప్పదు అన్నట్లు దివ్య ముద్దు ముద్దుగా "మీరు మంచి డాక్టర్, మనసున్న మనిషి, ఇంకా...." అంటూ ఏదో ఆలోచించుకుంటూ.

"అంతేనా...." అన్నాడు బాధగా.

ఒక్క నిమిషం మౌనం తరువాత "నా గురించి అంతేనా దివ్య, ఓ. కే. దివ్య నీకు నేనంటే ఇష్టం లేనట్లుంది. నేను కొన్ని ప్రిన్స్‌పుల్స్ పాటించే మనిషిని. ఈ విషయంలో నేను ఓడిపోయాననుకుంటాను" అన్నాడు. ఆ గొంతులో బాధ సుడులు తిరుగుతుంది.

వాళ్ళిద్దరికి తెలుసు తాము ప్రేమలో పడ్డారని. ఎవరు ముందుగా బయట పెట్టటం లేదు.

ప్రశాంత్ దివ్య కళ్ళలోకి చూస్తూ "దివ్య, ఒక నిజం చెప్పు-నీవు నన్ను ప్రేమించటం లేదు అని, ప్లీజ్ చెప్పు" అన్నాడు.

దివ్య కళ్ళలో ఒక్కసారిగా నీళ్ళు తిరిగాయి. వలవల ఏడ్చింది.

"నీ ఆలోచనలు మూగవైనా నష్టం లేదు కాని, నీ ప్రేమ మూగది కారాదు దివ్య" అన్నాడు.

"నన్ను క్షమించండి. నేను మిమ్మల్ని ప్రేమించటానికి అర్హురాలిని కాను. నాకు తెలిసీ నా తహతుకు నేను మిమ్మల్ని ఆశించలేను. అదిగాక నా అనుభవం ప్రకారం ప్రేమించటానికి మనిషికి ధైర్యం, డబ్బు అవసరం. నా దగ్గర ఆ రెండూ లేవు. అంతకంటే మించి నా మీద కొన్ని బాధ్యత లున్నాయి. నా తరువాత ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు. వాళ్ళకు పెళ్ళిళ్ళు చేయాలి. నా తమ్ముణ్ణి ప్రయోజకునిగా చేయాలి" అంది నిశ్చలంగా.

"పొరపాటు పడుతున్నావు దివ్య! నీ బాధ్యతలు నా బాధ్యతలు కావా? నేను ఇదే చెప్తున్నాను. నీ ఇద్దరు చెల్లెళ్ళకు మంచి సంబంధాలు తెచ్చి ఘనంగా పెళ్ళిళ్ళు చేసే బాధ్యత నాది. మీ తమ్ముడ్ని మన దగ్గరే ఉంచుకొని బాగా చదివిద్దాం. కాని, నన్ను దూరం చెయ్యటానికి ప్రయత్నించకు దివ్యా, నీవు లేకపోతే నేను లేను" ప్రశాంత్ మాటల్లో ఎంతో నిజాయితీ ఉన్నట్లు అనిపిస్తోంది.

ఈ మాటలు ఆమెను మెస్మరైజ్ చేస్తున్నాయి. దానితో ఏవో ఆలోచనలు, ఎన్నో కోరికలు దివ్యను పులకరింతలు రేపుతున్నాయి.

ఆ రాత్రి దివ్యకు నిద్ర రావటం లేదు. మనసంతా గిలిగింతలుగా ఉంది. గుండెల్లో ఏదో అలజడి. ఆ అలజడి పేరే ప్రేమ ఏమో! ఎంత విచిత్రం అనుకుంది మనసులోనే. ఏవో మధుర స్మృతులు మనస్సు కల్లోల పరుస్తుండగా పడకలో తుళ్ళిపడి కిలకిలగా నవ్వుకుంది.

జీవితంలో ప్రేమించటం కన్న ప్రేమించబడటం ఎంతో గిలిగింతలు పెట్టే అనుభూతి. ఆ అనుభూతిలో తేలిపోతున్నది దివ్య.

ప్రశాంత్ కళ్ళు అందంగా ఉంటాయి. ఆ కళ్ళలో దివ్య అంటే ఎంతో ప్రేమా, ఆరాధన భావం ఉండేది. ఆ కళ్ళలో కళ్ళు పెట్టి జీవితం

అంతా గడిపేయాలని ఉంది. నిద్రకు మించిన ఆనంద అనుభూతి ఆవహించనట్లుగా ఉంది. అందువల్లే నిద్ర రావటం లేదు ఏ అర్ధరాత్రికో నిద్రలోకి జారిపోయింది తియ్యటి ఊహలతో.

* * *

క్యాజువాలిటీ సెక్షన్‌లో అభిమన్యు ఏదో అటెండెన్స్ రిజిస్టర్ చూస్తున్నాడు. నలుగురు వ్యక్తులు ఏదో యాక్సిడెంట్ అయిన మనిషిని ఎత్తుకొని వచ్చారు. పేషంట్‌కు బాగా సివియర్‌గా దెబ్బలు తగిలి ఉన్నాయి. ఆ వ్యక్తి అంతా రక్తపు ముద్దలా ఉన్నాడు. అయినా స్పృహలోనే ఉన్నాడు ఎవరినో చూడటానికి కలవరిస్తున్నాడు. మనిషి ఎత్తుగా బలంగా ఉన్నాడు. ఉండి ఉండి గట్టిగా కేకలు పెడుతున్నాడు బాధతో.

తలమీద బలమైన దెబ్బ తగలటం వలన తలనుంచి రక్తం కారి ముఖం అంతా తడిపేసి, కాస్త భయం కలిగిస్తున్నది.

అతని పరిస్థితి ఇది అని చెప్పలేని స్థితిలో ఉన్నాడు. ఆ వ్యక్తి చాలా విచిత్రంగా ప్రవర్తిస్తున్నాడు. అకారణంగా నవ్వటం, ఏడ్వటం చేస్తున్నాడు.

పేషంట్‌ని తెచ్చి ఓ ఖాళీ బెడ్ మీద పడుకోబెట్టారు. అభిమన్యు భయం భయంగా వెళ్ళి అతని చేయి పట్టుకొని చూసాడు. అతని శరీరం కాస్త వెచ్చగా ఉంది. పల్స్ బాగా అందుతున్నాయి.

బ్లడ్ తీసి గ్రూప్ టెస్ట్ కోసం పంపాడు. పేషంట్ ఊరికే కదులుతూ ఏమీ చేయనీయటంలేదు. దానికితోడు ఉండి ఉండి ఒక్కసారిగా గట్టిగా నవ్వటం, ఏడవటం వల్ల ప్రక్కనున్న పేషంట్లేకాక, అభిమన్యు కూడ బిక్కు బిక్కుమంటు చూస్తున్నాడు. గాయాలకు డ్రస్సింగ్ చేయటం కోసం.

ఇంతలో దేవుడు పంపినట్లు డాక్టర్ మనోహర్ వచ్చాడు. అభిమన్యు మనసులోనే ''హమ్మయ్య'' అనుకున్నాడు. ఇద్దరు కలిసి పేషంట్‌ని డ్రసింగ్ చేస్తుండగా మీనా సిస్టర్ వచ్చి ''డాక్టర్! ఏడవ నెంబర్ బెడ్ పేషంట్ పరిస్థితి చాలా క్రిటికల్‌గా ఉంది. రండి చూద్దురు."

"సరే పద, నేను వస్తాను" అని అభిమన్యు ఆ సిస్టర్ వెంట నడిచాడు.

వార్డ్‌లో దూరంనుంచే చూసాడు. ఓ అడ పేషంట్ కళ్ళు తేలేసి కొనఊపిరితో పడి ఉంది. చేయి పట్టుకొని చూసాడు. నాడి ఎక్కడో పల్చగా కొట్టుకుంటోంది. ఏదో చేయాలని గాబరా పడుతున్నాడు. కాని, ఏం చేయాలో అర్థం కావటం లేదు.

ఆమెకు ఊపిరి అందటంలేదు.

వెంటనే ప్రక్కన ఉన్న నర్స్ సహాయంతో ఆర్టిఫిషియల్ ఆక్సిజన్ అందించటం కోసం ఆక్సిజన్ అమర్చి, చిన్న ట్యూబ్‌ను ముక్కులో ఉంచాడు. అయిదు నిమిషాల తర్వాత పేషంట్ పరిస్థితి కాస్త కుదటపడింది. ఊపిరి బాగా పీల్చుకోగలుగుతున్నది. పల్స్ బాగా అందుతున్నాయి.

అభిమన్యు తృప్తిగా ఊపిరి పీల్చుకొని ముందు కదిలి వెళ్ళి మరలా క్యాజుయలిటీ సెక్షన్‌లో కూర్చున్నాడు. ఆ సెక్షన్ సీరియస్ కేసులతో ప్రమాద భరితమైన వాటి కోసమే ఉండేది. కాని క్యాజుయాలిటికి సీరియస్ కేస్‌లతోపాటు చాలా ఆర్డినరీ కేసులు కూడా వస్తుంటారు చాలా తెలివిగా పని త్వరగా అవుతుందని.

ఓ యాభై సంవత్సరాలు దాటిన వ్యక్తి వచ్చాడు ఆ సెక్షన్‌కి. వచ్చి నమస్కారం చేసి నిలబడ్డాడు.

''రండి కూర్చోండి'', అన్నాడు అభిమన్యు.

ఆ వ్యక్తి మౌనంగా వచ్చి కూర్చున్నాడు. ఆ వ్యక్తి నిరక్షరాస్యుడు అని చూడగానే తెలుస్తున్నది. అందువల్లే సీరియస్ కేసులు చూసే ఆ

సెషన్‌కు వచ్చాడు. అతని ముఖం చాలా అమాయకంగా, నిజాయితీగా ఉంది. ఆ పెద్ద మనిషి ముఖం చూస్తూ చూస్తూ "నీ వ్యాధి పెద్ద ప్రమాద కరమైనది కాదు, అందువలన రేపు ఓ.పి. వార్డ్‌కిరా'' అని చెప్పలేక పోతున్నాడు. అభిమన్యు అతనితో అలా కఠినంగా మాట్లాడి ఉండి ఉంటే బాగుండేది, కాని విధిని ఎవరు వక్రించగలరు?

ఆ వ్యక్తి రొటీన్ హిస్టరీ నోట్ చేసుకొని, డయాగ్నసిస్ చేయటం కోసం ''ఏమిటి సమస్య'' అని వ్యాధి గురించి అడిగాడు.

''గుండెపోటండి, ప్రతి నెలా వస్తున్నది, పోయిన నెల గుండెపోటు వచ్చి ఐదు నిమిషాలు గుండె ఆగిపోయింది....'' అన్నాడు కళ్ళు మిటకరిస్తూ.

అభిమన్యు ప్రక్కనే ఉన్న అసిస్టెంట్ నర్స్ పేషంట్ మాటలకు నవ్వింది. కారణం ఏమిటంటే చాలా మంది సామాన్య ప్రజలలో గుండె పోటు అంటే గుండె పని చేయటం ఆగిపోతుందని అనుకుంటారు కాని అది కేవలం అపోహ మాత్రమే. గుండెపోటు అంటే గుండె ఆగటం కాదు; గుండె ఆగితే మనిషి జీవించటం అసంభవం.

''సరే వెళ్ళి బల్లమీద పడుకోండి పరీక్ష చేస్తాను'' అన్నాడు అభిమన్యు. అభిమన్యు నవ్వుతూ వెళ్ళి పరీక్షలో బాగంగా గుండెలపై స్టెతస్కోప్ పెట్టి ''గట్టిగా ఊపిరి పీల్చండి'' అన్నాడు.

పేషంట్ గట్టిగా ఊపిరి పీల్చాడు, అంతే.

''గుండె నొప్పి వచ్చింది బాబు. అయ్యో...." అంటూ గింగిరాలు తిరిగిపోతున్నాడు బల్లమీద.

నర్స్‌కు ఇది అంతా డ్రామాలా అనిపించిందేమో, ఒకటే నవ్వు తున్నది. ''అదేంటి డాక్టర్, మీరు గట్టిగా ఊపిరి పీల్చమన్నారు. సరిగ్గా అప్పుడే అతనికి గుండెపోటు వచ్చింది...." అని అంటూ మరలా నవ్వు తున్నది.

ఆ రోగికి బాధతో కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. బల్లమీద నిలకడగా ఉండలేకపోతున్నాడు.

అభిమన్యుకి అర్థమయింది, అది గుండెపోటని. "సిస్టర్! క్విక్. త్వరగా వెళ్ళి సర్జన్ మనోహర్‌ని కానీ, రంగారావుగారిని కానీ పిలుచుకొనిరా ... ఆపరేషన్ అవసరమవ్వవచ్చు.... క్విక్.... త్వరగా వెళ్ళు...." అని తొందరపడుతూ అన్నాడు.

సిస్టర్ వెళ్ళింది పిలుచుకొని రావటంకోసం.

ఆ వ్యక్తి వేసుకొని ఉన్న పై చొక్కాను వదులుచేశాడు. పేషంట్‌కు గుండె నొప్పి తగ్గటంకోసం ఒక పెథిడిన్ ఇంజక్షన్ ఇచ్చి, ఆ తరువాత రోగికి ఆపరేషన్‌కు కావలసిన అన్ని స్టెరిలైజిడ్ గూడ్స్‌ని సిద్ధం చేయటంలో మునిగిపోయాడు. సాధారణంగా అయితే ఈ పనులన్నీ సిస్టర్స్ చేస్తారు.

నిజంగా మనిషి శరీరంలోని అన్ని భాగాలలోనూ కంట్రోల్ చేస్తూ పనిచేస్తూ రక్తాన్ని అందించే ప్రధాన అవయవం గుండె. అది సరిగ్గా పనిచేయకపోతే మనిషి ప్రాణానికే ముప్పు. శరీరపు బరువు చాలా ఎక్కువగా ఉండి శరీర వ్యాయామం చేయక పోవటంవల్ల, తిరగకుండా ఒకేచోట చాలా సేపు పనిలోకాని, అలవాటుగా కాని కూర్చొని వుండటం, జంతు సంబంధమైన క్రొవ్వు పదార్థాలు అతిగా వున్న ఆహారాన్ని ఎక్కువగా తీసుకోవటంవల్ల గుండెపోటు వస్తుంది" అని అనుకుంటూ ఆపరేషన్ కోసం ప్రిపేర్ అవుతున్నాడు.

పేషంట్‌కి గుండె నొప్పి ఎక్కువైనట్లుంది. మెలికలు తిరిగిపోతున్నాడు. చూస్తూ ఉండగానే వాంతి చేసుకున్నాడు. శరీరమంతా చమటలు పట్టి బల్లమీద వణికిపోతూ ఉన్నాడు. స్పృహతప్పిపోయాడు.

అతని పరిస్థితి చూస్తుంటే అభిమన్యుకు ఏం చేయాలో తోచటం లేదు. అసిస్టెంట్ నర్స్ కూడా లేదు. నాడి చూశాడు. సంతృప్తికరంగానే కొట్టుకుంటూ ఉంది.

మరలా వెళ్ళి ఆపరేషన్‌కోసం ప్రిపేర్ చేయటం ప్రారంభించాడు. సాధారణంగా అయితే ఈ పని సిస్టర్స్ చేస్తారు.

ఐదు నిమిషాలు అయింది దూరంనుంచి సిస్టర్, డాక్టర్ మనోహర్ రావటం కనిపించింది. వాళ్ళు వచ్చిన మరుక్షణం ఆపరేషన్ మొదలు పెట్టేయాలి అనుకుంటూ రోగి చేయి పట్టుకున్నాడు, పల్స్ చూడటం కోసం. కాని పల్స్ అందలేదు. అవి ఇక అందవు. ఆ వ్యక్తి శ్వాస ఒక నిమిషం మాత్రమే అనంతవిశ్వంలో కలిసిపోయింది.

ఒక జీవి మౌనంగా శాశ్వతంగా కన్నుమూసింది. అంతా క్షణాల్లో జరిగిపోయింది.

అభిమన్యు చేష్టలుడిగి నిలబడిపోయాడు. మనసున్నవారికి మనసు వికలమై, చెదిరిపోయే సన్నివేశం. గుండెల్ని పిండేసే బాధ. కొన్ని క్షణాల ముందువరకు మృత్యువుతో పోరాడి, ఓడిపోయిన సైనికునిలా నిర్జీవంగా హాస్పటల్ బెడ్‌మీద పడి ఉన్నాడు. ఐదు నిమిషాల క్రితం వరకూ మాట్లాడిన అతనిలో ఇప్పుడు జీవం లేదు. తన వైద్యవృత్తిలో ఎదుర్కొన్న మొదటి మరణం.

అభిమన్యుకి బాధతో కళ్ళు చీకట్లు క్రమ్మాయి. ఆ చావుకు తాను కారణం కాదు అని తెలిసినా చెప్పలేని బాధ. ఇన్ని సంవత్సరాలు తను చదివిన చదువు ఒక మనిషిని కాపాడలేకపోయింది అనే నిర్వేదంలో అతనికి కళ్ళు కన్నీటితో నిండిపోయాయి.

అప్పుడు వచ్చారు సిస్టర్, డాక్టర్ మనోహర్.

ఆ డాక్టర్ అభిమన్యు మనస్థితిని పసిగట్టాడు. "ఓ. కె. మిస్టర్ అభిమన్యు! మన తప్పు ఏమీ లేదు, మనం కేవలం నిమిత్తమాత్రులం. టేక్ ఇట్ ఈజీ, మనం గౌర్నమెంట్ ఎంప్లాయీస్. అందువలన ఎవరి మీద అంత ప్రేమను పెంచుకొని ఆ తరువాత మనసు పాడు చేసుకో కూడదు" అన్నాడు అనునయంగా. రోజూ అనేక చావులు చూసే డాక్టర్లకు అది చిన్న విషయమే. కాని అభిమన్యుకు అలా కాదు. తను దగ్గర ఉండి చూసిన మరణం అది.

"డెత్ సర్టిఫికెట్ ప్రిపేర్ చేయండి" అని డాక్టర్ మనోహర్ భుజం తట్టి వెళ్ళిపోయారు.

అభిమన్యు మనసులో చెప్పలేని బాధ. ఆ రోజు భోజనం కూడా సహించలేదు. రెండు రోజుల వరకూ మామూలు మనిషి కాలేదు.

హాస్పటల్‌లోని ఇంటెన్‌సివ్‌కేర్ యూనిట్ ఎప్పుడు మూసే ఉంటారు. ఎవరైన వి. ఐ. పి. అడ్మిట్ అయితే అందులో ఉంచుతారు.

స్పెషల్ రూమ్స్‌లో వుండే వాళ్ళు మాత్రం చాలా గారాలు చేస్తూ ఉంటారు. ఈ రూమ్స్ ఒక్కొక్క పేషంట్‌కి ప్రత్యేకించి ఉంటాయి. ఎటాచ్‌డ్ బాత్ రూమ్ ఉంటుంది. అన్ని విధాలుగా స్పెషల్ ట్రీట్‌మెంట్ ఉంటుంది. కాని ప్రపంచంలో ఎక్కడ, ఎవరికి ఉండని అనుమానాలన్నీ వీరికే ఉంటాయి. వీళ్ళు ఎవరైనా డాక్టర్ కనిపిస్తే ఒక పట్టాన వదలరు. ఆ వార్డ్‌లో ఉండే వాళ్ళకు సాధారణంగా చాలా సామాన్యమైన జబ్బులే ఉంటాయి. అయినా నానా కంగారు పడిపోతుంటారు. ఈ వార్డ్‌లోని పేషంట్స్ తమ అన్ని సమస్యలను డాక్టర్లతో ఏకరువు పెట్టుకుంటూ ఉంటారు. అప్పుడప్పుడు తమ జీవిత చరిత్రలు చెప్పి కంట తడి పెట్టు కుంటూ ఉంటారు.

జనరల్ వార్డ్‌లోని పేషంట్స్ మరో రకం. వీళ్ళకు డాక్టర్‌ని చూడ గానే ఎక్కడలేని ఉత్సాహం వస్తుంది. లేచి దండాలు పెడుతూ ఉంటారు. తమ ప్రతిభను చూపటానికి ప్రయత్నిస్తూ ఉంటారు. డాక్టర్ రౌండ్స్‌కు వస్తే తమ సమస్యలను గడగడ పాఠం ఒప్పచెప్పినట్లుగా చెప్తుంటారు. ఇక్కడ కొందరు పేషంట్స్ ఎంత ప్రమాదకరమైన స్థితిలో ఉన్నా ఏ మాత్రం భయంగా కాని, కంగారుగా కానీ లేకుండా ఎంతో నిండుగా ఉంటారు.

అభిమన్యు ఎక్కువ సమయం హాస్పిటల్‌లోనే ఉండేవాడు. రోగులను రోజూ రెండుసార్లు పలకరించటానికి వెళ్ళేవాడు. ఉదయం తొమ్మిది గంటలు; సాయంత్రం ఏడు, ఏడున్నర సమయంలో వెళ్ళి ప్రతి పేషంట్ దగ్గర కనీసం ఐదు నిమిషాలు ఉండి బాగోగులు తెలుసుకొనే వాడు. అతనికి వార్డ్‌లో పని చేస్తుంటే గంటలు నిమిషాల్లా గడిచి పోతుండేవి.

వారంలో కొన్ని రోజులు నైట్ డ్యూటీ చేయాలి.

ఆ రోజు అభిమన్యుకి నైట్ షిఫ్ట్. ఎనిమిది గంటల సమయంలో నైట్ రౌండ్స్‌కు బయలుదేరాడు. జనరల్ వార్డ్‌లో కొంతమంది కదలలేని పేషంట్స్ బెడ్‌మీదే పడుకొని కళ్ళుతెరచి పైకప్పుకేసి చూస్తూ ఉన్నారు. మరి కొంతమంది నిద్రపోవటానికి ప్రయత్నిస్తూ నిద్ర రాక మంచంమీదే అటూ ఇటూ కదులుతున్నారు. ఒకరిద్దరు గాఢనిద్రలో ఉన్నారు.

ఒక రోగి చాలా సీరియస్‌గా ఉన్న తన పరిస్థితి తెలుసుకొని గుండె దిటవు చేసుకొని "నా సంగతి నాకు తెలుసు డాక్టర్. నేను ఇంకా ఎప్పుడు పోతాను?" అని అడిగాడు.

"తప్పు, అలా అనకూడదు. బ్రతకటం చావుకోసం ఎదురు చూడ టానికి కాదు, జీవించటానికి. మరో రెండు రోజుల్లో మీకు నయం అవుతుంది. ఆ తరువాత మిమ్మల్ని డిస్‌చార్జ్ చేస్తాం'' అన్నాడు ఊరటగా ధైర్యాన్ని కలిగిస్తూ.

రౌండ్స్ పూర్తి అయ్యేసరికి రాత్రి పది దాటింది.

హాస్పటల్ క్యారిడార్ నుంచి నడుచుకుంటూ డ్యూటీ రూమ్‌లోకి వెళ్తున్నాడు. క్యారిడార్‌లో నుంచి అలా నడుచుకుంటూ వెళ్తుంటే ఎన్నో విచిత్రమైన దృశ్యాలు, ఆసక్తికరమైన సన్నివేశాలు కనిపిస్తుంటాయి. ఆ సన్నివేశాలలో ప్రధాన పాత్రధారులు నర్సులు, డాక్టర్స్, జూనియర్ డాక్టర్స్ ఉంటారు. వారి సరస సంభాషణలు సరిగమలు పలుకుతుంటాయి. ప్రపంచంలో వైద్యవృత్తి ఎంతో పవిత్రమైంది. ''మన ప్రకృతి ఎలా ఉన్నా పర్వాలేదు కాని డ్యూటీలో ఉన్న ఆ సమయంలోనైనా సంస్కారంగా ప్రవర్తించకపోవటం ఘోరం" అనుకున్నాడు.

డ్యూటీ రూమ్‌కి వెళ్ళాడు.

స్నేహితకు కూడా నైట్‌డ్యూటి ఉన్నట్లుంది. డ్యూటి రూమ్‌లో కూర్చొని ఏదో పత్రిక చదువుతూ ఉంది.

అభిమన్యు వెళ్ళటం గమనించి అతనివైపు చూసి పలకరింపుగా నవ్వి "రౌండ్స్ అయిపోయాయా?'' అంది.

''....'' నవ్వాడు. ''ప్రస్తుతానికి అయింది'' అన్నట్లుగా.

అభిమన్యు నవ్వులో ఓ తియ్యదనం ఉంది. అందుకే స్నేహిత కూడా నవ్వు కలిపింది.

వార్డ్‌బాయ్ డ్యూటీరూమ్ దగ్గర నిలబడి ''సార్....సార్....'' అని పిలిచాడు.

''యస్....'', అంటూ డోర్ వైపు చూసాడు అభిమన్యు; వార్డ్ బాయ్ చేతిలో మెమో పుస్తకం కనిపించింది, అతనికి అర్థమయింది ఏదో కేస్ సీరియస్‌గా ఉంది.

వార్డ్‌బాయ్ ఇంకా సమాధానం చెప్పకముందే ''ఏ వార్డ్?'' అని ప్రశ్నించాడు.

''జనరల్ వార్డ్ సర్....'' అన్నాడు. ఆ మాటలతోపాటు వార్డ్ బాయ్ దగ్గర నుండి చౌక ధర సారా వాసన గుప్పున కొట్టింది.

''సరే పద.... వస్తున్నాను'' అని బయలుదేరాడు.

''నేనూ వస్తానుండండి'' అని స్నేహిత కూడా అభిమన్యుతోపాటు నడవటం ప్రారంభించింది.

వార్డ్ బాయ్ ముందుగా వెళ్ళిపోయాడు.

''ఆ వార్డ్ బాయ్ తాగి ఉన్నాడు. డ్యూటీ అవర్స్‌లో కూడా అలా సారా త్రాగటం దారుణం....'' అంది స్నేహిత.

''అవును.... స్నేహా! మనం మెడిసిన్ చదివే రోజుల్లో మన ప్రొఫెసర్ నర్సింహంగారు 'ఆల్కహాల్ త్రాగటం గురించి - దాని నుండి వచ్చే నష్టాల గురించి' ఎన్ని క్లాసులు తీసుకున్నారో గుర్తుందా?'' అని అడిగాడు.

''సరిగ్గా గుర్తు లేదు కాని, చాలా బాగా తర్కించి మరీ చెప్పేవారు కదూ? మత్తు పానీయాలు తీసుకోవటంవలన ఆత్మవిశ్వాసం పెరుగుతుందని కొందరు భ్రమతో త్రాగుతారు, కొందరు పర్సనాలిటీ రంగు వస్తుందని, మరికొందరు మత్తు పానీయాలు త్రాగటంవలన బలం వస్తుందనీ, చలి ఉండదని ఇలా ఎన్నో కారణాలు చెప్పుకొని ఈ మద్యపానాన్ని సేవిస్తుంటారు. కాని ఈ మద్యపానమే చివరికి వారి ప్రాణం తీస్తుందని గుర్తించలేరు. నిజానికి సారా కాని, మత్తుపానీయాలు కాని త్రాగటంవలన

గాని ఎలాంటి పర్సనాలిటీ పెరగదు- అంతా అపోహ మాత్రమే'' అంటూ ఆగింది.

ఇద్దరూ జనరల్ వార్డ్ వైపు నడుస్తున్నారు.

"అవును స్నేహా! నువ్వు చెప్పింది ముమ్మాటికి నిజం. ఈ మద్యం సేవించటంవల్ల మొదట లివర్, ఆ తరువాత జీర్ణ ప్రక్రియ, అటు తర్వాత గుండె, మూత్రపిండాలు, చర్మం- ఒక్కటేమిటి, సర్వ అవయవాల్లో వ్యాధి రావటానికి అవకాశం ఉంది. అంతకంటే మించి మనిషిలో రోగ నిరోధక శక్తి క్రమంగా తగ్గి, ఏదైనా జబ్బు వస్తే త్వరగా నయం కాదు, అందువలన ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిని, ఆయుఃప్రమాణం క్షీణిస్తుంది.... త్రాగుబోతులు త్రాగుడులో వివిధ స్థాయిలలో ఉంటారు. ఒక పెగ్ తీసుకుంటే అరమరికలు లేకుండా ఆనందంగా ఉంటారు. మూడు నాలుగు పెగ్గులు తీసుకుంటే తల తిరగటంతో నడపటం, మాట్లాడటం, బట్టలు మార్చుకోవటం కోసం ఇతరుల సహాయం అవసరమవుతుంది. కాని ఇతరుల సహాయం తీసుకోవటానికి ఏమాత్రం ఇష్టపడడు త్రాగుబోతు. అందులో భాగంగానే అతనికి అకారణంగా కోపం వస్తుంది.

"అలాగే మూడవ స్థితిలో చేరిన త్రాగుబోతుకు ఎదుట ఉన్న మనిషి కనిపించడు. విచక్షణ స్థితి పూర్తిగా కోల్పోతాడు. అనవసరంగా నవ్వుతాడు. అకారణంగా దుర్భాషలాడుతాడు. అదీకాదు అంటే ఏడుస్తాడు. ఏ క్షణంలో అయినా స్పృహతప్పి పడిపోయే స్థితిలో ఉంటాడు.

''ఎలాంటి వ్యక్తి అయినా పదిహేను, పదహారు పెగ్గులకు మించి సారా త్రాగితే చాలా ప్రమాదం. ఇలాంటి వ్యక్తి బ్రతకటం చాలా కష్టం. కడుపులోని ప్రేగులలో రక్తస్రావం జరిగి కొద్ది నిమిషాలలోనే మనిషి చనిపోతాడు. అది కల్తీసారా కావలసిన అవసరం లేదు, మామూలు సారా అయినా పదిహేను పెగ్గులకంటే ఎక్కువ సేవిస్తే మరణం తథ్యం'' అన్నాడు.

''అసలు ఈ సారా అనేది ఇంధనంగా ఉపయోగపడే పదార్థమే కానీ, త్రాగటానికి ఉపయోగించేది ఎంత మాత్రం కాదు" అంది స్నేహ.

ఇద్దరూ మాట్లాడుకుంటూ జనరల్ వార్డులోనికి వచ్చారు.

ఓ సిస్టర్ ఎదురు వచ్చి ''రండి సర్ త్వరగా, పేషంట్ కండిషన్ చాలా సీరియస్‌గా ఉంది'' అంటూ పేషంట్ ఉన్న బెడ్ వైపు నడిచింది.

ఆ పేషంట్‌కు ఆరు అడుగుల దూరంలో ఉండగానే సారా వాసన కొడుతున్నది. ప్రక్కనే మరో వ్యక్తి నిలబడి ఉన్నాడు. వాళ్ళు రోజు కూలీ పని చేసుకొనేవారు.

రోగి ప్రక్కన నిలుచున్న వ్యక్తి అభిమన్యు వైపు ఆశగా చూస్తూ ఉన్నాడు.

ఆ వ్యక్తిని ఉద్దేశించి "ఏం జరిగింది?" అని అడిగాడు.

"పందెం వేసుకొని, ఇరవై సారా ప్యాకెట్లు త్రాగాడు సార్, పది రూపాయల పందెం కోసం."

పేషంట్ స్పృహలో లేడు.

అభిమన్యు వెళ్ళి నాడి చూడటానికి ప్రయత్నించాడు. ఎక్కడో పల్చగా వుండీ ఉండనట్లుగా తగుల్తోంది. కొన్ని సెకండ్ల తర్వాత అదీ ఆగిపోయింది.

చేయి వదిలేసి మౌనంగా నిలబడ్డాడు. చేతులారా కొనుక్కొన్న మరణం ఇది. ఇంకా ట్రీట్‌మెంట్ కూడా ప్రారంభించలేదు. అప్పుడే చనిపోయాడు.

అభిమన్యు అక్కడ నిలబడలేక ఇవతలికి వచ్చేశాడు.

స్నేహిత ఎవరో లేడీ పేషంట్‌కు సీరియస్‌గా ఉంటే చూడటానికి వెళ్ళింది.

అభిమన్యు మెల్లగా కాలినడకతో డ్యూటీ రూమ్‌వైపు నడుస్తున్నాడు. అతని కళ్ళు మండుతున్నాయి.

ఆ రోజు తన వైద్య జీవితంలో ఒక అద్భుత విజయం సాధిస్తాడని ఆ క్షణంలో అతనికి తెలియదు.

*   *   *

సమయం ఉదయం పదకొండున్నర అయింది. ఔట్ పేషంట్ వార్డ్‌లో జనాలు బాగా పలుచబడ్డారు.

స్కిన్ డిసీస్ కన్సల్‌టింగ్‌వార్డ్‌లో క్రొత్తగా వచ్చిన హౌస్‌సర్జన్ ఉమేష్‌కు చిరుగర్వంగా తృప్తిగా ఉంది. అందువల్లే దర్జాగా కూర్చొని ఉన్నాడు. ఆ వార్డ్‌కు సీరియస్ కేసులు సాధారణంగా ఉండవు. అన్నీ ఆర్డనరీకేసులే. అంతేకాక పేషంట్స్ చాలా తక్కువమంది వస్తారు.

ఉదయం పదకొండుగంటల వరకు కన్సల్‌టింగ్ కోసం వచ్చిన పేషంట్లకి ఏవో మందులు. ఇంజక్షన్‌లు వ్రాసి ఇచ్చి పంపాడు.

ఉమేష్ వయసు ముప్ఫయి సంవత్సరాలు ఉంటాయి కాని, పాపం తలమీద ఎక్కువ భాగం వెంట్రుకలు లేక బట్టతలలా కనిపిస్తుంది. అయినా, ప్రతి పదినిమిషాలకు ఒకసారి దువ్వెనతో తల దువ్వుకుంటు ఉంటాడు. అది అతని అనేక బలహీనతల్లో ఒకటి.

కన్సల్‌టింగ్‌కోసం ఎవరూ రాకపోవటంతో ఉమేష్ ఆలోచనలు ఒకసారి తన కాలేజ్ లైఫ్‌లోనికి వెళ్ళాయి. కాలేజ్‌లో సీనియర్స్ తమ వికృత చర్యల ద్వారా జూనియర్లలో శాడిజాన్ని ప్రేరేపించేవారు. జూనియర్స్, సీనియర్స్‌చేత అవమానించబడటంతో వాళ్ళలో శాడిజం జీర్ణించుకొని, క్రొత్తగా చేరిన వారిపై తమకక్ష తీర్చుకొనేవారు. జూనియర్‌లకు సీనియర్ స్టూడెంట్స్ ర్యాగింగ్ పేరుతో పెట్టే ఫిజికల్ అండ్

మెంటల్ టార్చర్ వర్ణనాతీతం. జూనియర్లచేత కంటతడి పెట్టించటమే తమ ప్రతిభగా భావించేవారు సీనియర్ మెడికల్‌కాలేజ్ స్టూడెంట్స్.

చీఫ్ రౌండ్స్‌కు వెళ్తున్నట్లు ఉంది - హాస్పటల్ సిబ్బంది అంతా ఒకటే కంగారు పడిపోతున్నారు. ఉమేష్ ఆలోచనల నుండి వర్తమానంలోకి వచ్చి తన సీట్‌లో సర్దుకొని కూర్చున్నాడు. నర్సులు, వార్డ్‌బాయ్స్, ఆయాలు అంతా ఒక్కటే కంగారుగా ఉన్నారు.

హాస్పటల్‌స్టాఫ్ అంతా చీఫ్‌ని "చండశాసనుడు" అని పేరుపెట్టి మరీ భయపడుతుంటారు. కాని, ఆయన అలా భయంకరంగా కనిపించరు. ఎర్రగా ఐదడుగుల ఎత్తు ఉంటారు. మనిషి చాలా సింపుల్‌గా ఉంటారు.

ఓ చేతిలో స్టెతస్కోప్ ఊపుకుంటూ ఉమేష్ కూర్చున వార్డ్ ముందు నుండి చీఫ్ వెళ్ళారు.

హాస్పటల్ వాతావరణం చాలా ప్రశాంతంగా ఉంది. ఔట్ పేషంట్స్ అంతా వెళ్ళిపోయారు. ఫార్మసీ కౌంటర్ దగ్గర కొంతమంది మందులు తీసుకోవటానికి నిలబడి ఉన్నారు.

ఉమేష్‌కు హాస్పటల్‌లో ఉండే జూనియర్ నర్సుల నుండి హెడ్ నర్సుల వరకు ఎవరినైనా టీజ్ చేయటం మహా సరదా! పుట్టుకతో వచ్చిన బుద్ధి కొంత అయితే, మెడికల్ కాలేజ్‌లో ర్యాగింగ్ పేరుతో రాటుతేలింది. ఆ అలవాటుతోనే డబల్ మీనింగ్ మాటలు మానుకోలేక, జూనియర్ నర్సులను "సిస్టర్" అని పిలవటానికి బదులుగా "బేబి" అని, హెడ్ నర్స్‌గా కాస్త పెద్ద వయస్సు వాళ్ళను "ఆంటీ" అని వరుస కలిపి పిలుస్తూ దివ్యానందాన్ని పొందుతుంటాడు. ఆ నర్సులు కూడా "పోనీలే డాక్టర్ కదా!'' అని ఏం పట్టించుకొనేవారుకాదు.

కాని, వార్డ్‌బాయ్స్ కొంతమంది మాత్రం ''ఓవర్ యాక్టింగ్'' ''అతి'' అని చాటుమాటుగా అనుకుంటూ ఉంటారు.

అదేకాక, ఉమేష్‌లో ఉన్న మరో గొప్ప లక్షణం ''ఐడెంటిటీ కాంప్లెక్స్.'' అందరిలో తను మాత్రమే మంచివాడు, తెలివైన వ్యక్తిలా గుర్తింపబడాలని తపన. ఏదో ఒక రకంగా అందరిచేత గుర్తింపబడాలని ఆశ. ''అ....అలురావు అగ్రతాంబూలం మాత్రం కావాలి'' అనే రకం. ఎంత మంది ఉన్నా, తనని గౌరవించాలి అనే పిచ్చి ఆశ. కాని, అది సాధ్యం కానప్పుడు నర్సుల మీద, వార్డ్ బాయ్స్ మీద అనవసరంగా విరుచుకుపడుతుంటాడు. పొద్దాకులు తనను ఎవరైనా పొగడాలి. లేని పోని మాటలతో పొగిడితే బోలెడు ఆనందపడిపోతాడు. ఎదుటి మనిషిలో లోపాలను వెతకటం, ఎవరి గురించైనా తప్పుగా ఆలోచించటం, విపరీతార్థాలు తీయటం, లేనిపోనివి, ఉన్నవి లేనట్లు, లేని విషయాలు కల్పించి తను చూసినవాడిలాగానే సాక్షిగా చెప్పటం అంటే ఉమేష్‌కు మహాసరదా! ఈ ప్రపంచంలో ఒక్కొక్కరికి ఒక్కోరకమైన ఆనందం కావాలి. ఒక అబద్ధాన్ని నిజంగా, వాస్తవాన్ని అబద్ధంగా చెప్పటం, ఆ విషయాన్ని ఎవరో చెప్పినట్టుగా, విన్నట్లుగా కాక, తనే స్వయంగా ఆ నిజాన్ని తెలుసుకున్న వాడిలా చెప్పటం, నిజంగానే జరిగిందని చెప్పి తాము విపరీతమైన ఆనందం పొందుతుంటారు. సరిగ్గా అలాంటి వ్యక్తే ఉమేష్.

వీటన్నిటికీమించి మరోసుగుణం ఉంది ఉమేష్‌లో. అది ఏమిటంటే. ఎలాంటి ఆడదాన్ని అయిన ఇట్టే తన ట్రాప్‌లోకి తెచ్చుకోగలనని గొప్ప నమ్మకం.

ఎవరో ఆడ మనిషి ఉమేష్ ఉన్న వార్డ్ వైపు వస్తున్నది. ఆమె దూరం నుంచే ఉమేష్ ఉన్న వార్డ్ వైపు చూసుకుంటూ వస్తోంది.

ఎందుకైనా మంచిదని ప్యాంట్ జేబ్‌లోని దువ్వెన తీసి నీట్‌గా క్రాఫ్ సవరించుకున్నాడు ఉమేష్. ఆ తరువాత కాలర్ సరిచేసుకొని, ఒకసారి తన గొంతు సవరించుకున్నాడు. అతని ప్రతి కదలికలో ఒక లాంటి గర్వం, గుర్తింపు కావాలన్న తపన కనిపిస్తున్నాయి.

అతని అదృష్టంకొద్దీ ఆ వార్డ్‌లోకే వచ్చింది ఆ స్త్రీ.

ఆమె దగ్గరనుండి బాగా ఎత్తుగా కనిపిస్తుంది.

"మే ఐ కమిన్ సర్" అంది లోపలికి వచ్చేసి.

"యస్....యస్" అన్నాడు - నిజానికి అయితే అతను అలా అనవలసిన అవసరం లేదు. ఆమె లోపలికి వచ్చేసే "రావచ్చా" అని అడిగింది. ఆ విషయం గమనించలేదు ఉమేష్

ఆమె సుమారు ఐదున్నర అడుగుల ఎత్తు ఉంటుంది. రోజ్ అద్దిన చెంపలవైపు, ఎర్రటి లిప్‌స్టిక్ వేసిన తడి పెదవుల వైపు చూస్తూ ఉండి పోయాడు. ఆమె నిమ్మపండు రంగు షిఫాన్ పాలిస్టర్ శారీ కట్టుకొని ఉంది.

ఉమేష్ కంటికి ఆమె నిజంగా చాలా అందంగా ఉంది.

ఎత్తుకుతగ్గ లావు.

లోనెక్ జాకెట్.వంటి పొరపైటలోనుంచి జాకెట్ షేప్స్ మొత్తం చాలా స్పష్టంగా కనిపిస్తున్నాయి. అనుభవం కల టైలర్ అయితే కొలతలు తీసుకోకుండా జాకెట్ కుట్టి పారేస్తాడు. "పాలరాతి విగ్రహంలా ఉంది మనిషి" అనుకున్నాడు.

బొడ్డుకు రెండు మూడంగుళాల క్రింద కట్టిన ఆ చీర కట్టు ఉమేష్‌లో క్షణక్షణానికి ఆవేశం, కసి పెంచేస్తోంది.

ఆమెను చూస్తుంటే ఉమేష్‌కు నోటి తడి ఆరిపోతున్నది. ఊపిరి పీల్చటం కూడా ఆపేసి చూస్తున్నాడు.

ఆమె వయసు ఎట్టి పరిస్థితులలో ఇరవై ఐదు వసంతాలకు మించి ఉండదు అని ఖచ్చితంగా ఓ నిర్ణయానికి వచ్చేసాడు.

ఒక క్షణం తరువాత తేరుకొని అతికష్టంమీద చూపులు మరల్చు కుంటూ "యస్....యస్...." అన్నాడు కంగారుగా.

ఇదంతా ఆమె గమనిస్తున్నట్లుగా ఉంది. అందుకే ఆమె ఒక మనో హరమైన అద్భుతమైన నవ్వు నవ్వింది. ఆ నవ్వులో ముత్యాలు వర్షించి నట్లు అనిపించింది - అదే నవ్వుకు రాజులైతే రాజ్యాలు వదిలి అడవులు పట్టుకొని వెళ్ళేవారు. కాని, ఉమేష్ రాజు కాదు కనుక మూర్ఛపోయే అంత పని అయింది.

ఉమేష్ ఆనందంతో ఓ వంకర టింకర నవ్వు నవ్వుకున్నాడు.

ఆమె చెప్పటం ప్రారంభించింది: "నా పేరు లక్ష్మి. ఉదయం ఔట్ పేషంట్ వార్డ్‌లో స్లిప్ వ్రాయించుకొని, ఆఫీస్‌కి వెళ్ళి అటెండెన్స్ వేసుకొని, పర్మిషన్ తీసుకొని మరలా హాస్పటల్‌కి వచ్చేసరికి ఆలస్యం అయింది" అంది.

ఇప్పుడు అర్థమైంది అతనికి ఆమె ఔట్ పేషంట్‌గా వచ్చిందని. సమయం పన్నెండు కావచ్చింది. ఈ సమయంలో ట్రీట్ మెంట్ చేయటం కుదరదు అని చెప్తే, ఆమె బాధపడుతుందని, ఉమేషే మనసులో బాధపడి డయాగ్నసిస్ చేసేందుకు పేషంట్ రొటీన్ హిస్టరీ తీసుకోవటం మొదలు పెట్టాడు.

ఆమెను చూస్తుంటే పేషంట్ రొటీన్ హిస్టరీకి అడిగే ప్రశ్నలు కూడా మరచిపోయాడు. టేబుల్ డ్రాయర్‌లోనుంచి క్వొచ్చనరీ తీసి యాంత్రికంగా "పేరు..." అని అడిగాడు.

"ఇప్పుడే చెప్పాను కదండి, లక్ష్మి అని" అంది గడుసుగా....

"వయసు" అంటూ ఆమె వైపు చూస్తూ అడిగాడు.

ఆమె సిగ్గుతో మొగ్గలేస్తూ "పది ప్లస్ ఎనిమిది" అంది. అది నిజంకాదని ఉమేష్‌కి తెలుసు; ఈ ప్రశ్నకు చాలా మంది ఆడవాళ్ళు నిజం చెప్పరు. అలాంటి మనిషే ఈమె కూడ అనుకొని—

''మ్యారీడా (పెళ్ళి అయిందా) ....'' అన్నాడు.

''లేదు, అన్ - మ్యారీడ్" అంది.

"ఏమిటి అన్‌మ్యారీడా'', అన్నాడు ఆనందంతో కేరింతగా కీచు గొంతేసుకొని.,

ప్రాబ్లమ్ ఏమిటి అని వ్యాధి గురించి అడిగాడు.

''అరికాళ్ళు, అరిచేతులు ఒకటే జిలగా ఉన్నాయండి'' అంది.

''ఎప్పటినుండి...."

"రెండు రోజుల నుండి...." అంది.,

ఉమేష్ మనసులో ఏదేదో ఊహించుకుంటూ ''ఏది చూపించండి" అన్నాడు.

గోముగా ముఖంపెట్టి అరచేతులను ముందుకు చాచి చూపించింది.

అతనికి ఆ చేతులు చూస్తుంటే ముద్దొస్తున్నాయి.

పరీక్ష చేస్తున్నట్లుగా అరచేతులను పట్టుకొని చూసాడు. ఆమె అరచేతులు చాలా మెత్తగా ఉన్నాయి. అవి తాకగానే కరెంట్ షాక్ కొట్టి నట్లుగా అనిపించింది.

''ఓ.కె. నో ప్రాబ్లమ్, నేను ఇంజక్షన్, ట్యాబ్‌లెట్స్ వ్రాస్తాను. అవి వాడి, మరలా ఎల్లుండి వచ్చికలవండి....'', అంటూ రెండు చిన్న చీటీముక్కలు ఆమెచేతికి అందించాడు.

''వస్తానండి...." అని చెప్పి ఆమె వెళ్ళబోయింది.

"ఎల్లుండి తప్పకుండా రండి...." అంటూ ఇంకా ఏదో చెప్ప బోయాడు. మధ్యలోనే అందుకొని "తప్పకుండా" అంది లక్ష్మి నవ్వు కుంటూ వెళ్ళిపోతూ.

నేను చెప్పటం ఏమిటి, తనే రావాలి అనుకున్నాడు.

నిజమే. అందం అయస్కాంతం వంటిది. ఆకర్షణ దాని స్వభావం. అందాలను చూసి ఆనందించవలసిందే అనుకున్నాడు. ఆవిడతో మాట్లాడిన సంభాషణే మరలా మరలా గుర్తుకు వస్తున్నది. ఇలాంటి అనూహ్యమైన సంభాషణ తను ఇప్పటి వరకు ఎదుర్కోలేదు. "అబ్బ! ఆమె అందమే అందం" అనుకున్నాడు మరోసారి.

ఇక రాత్రి పగలు ఒకటే ఆలోచనలు, ఆ ఆలోచనలు అన్నీ ఆమె చుట్టే; ఎటుచూసినా ఆమే కనిపిస్తున్నది ఉమేష్ కంటికి. ఆమె మరలా ఎప్పుడు వస్తుందా అనే నిరీక్షణతో ఆశగా ఎదురు చూస్తూ ఉన్నాడు. ఏ పని చేస్తున్నా ఆమె రూపమే కళ్ళముందు కదలాడుతున్నది. ఈ ఆలోచనలతో ఒక పేషంట్‌తో ప్రేమగా మాట్లాడితే మరో పేషంట్‌ని కసురుకొనేవాడు.

పేషంట్ ఆసక్తిగా "ఏ మందులిస్తున్నారు సార్...." అని అడిగితే,

"నీకు అవసరమైన మందులే వ్రాస్తానులే, నువ్వు నోరు మూసుకొని కూర్చో. ప్రతి ఒక్కడు మాట్లాడేవాడే!" పేషంట్స్ గౌర్నమెంట్ హాస్పటల్ కనుక నోరు మూసుకొని ఉండేవారు.

ఎవరైనా పేషంట్ తన వ్యాధి గురించి కాస్త వివరంగా చెప్తుంటే "నువ్వు ఆపు, నాకు తెలుసా? నీకు తెలుసా? మీ వ్యాధి ఏమిటో తెలుసుకోవటం కోసం ఐదేళ్ళు చదివాము. నువ్వా డాక్టరివీ, నేనా?" అని ప్రశ్నించి మరీ కసురుకొనేవాడు.

లక్ష్మి కోసం నిరీక్షణ పూర్తి కావచ్చింది.

వాష్ బేసిన్ దగ్గర నీట్‌గా ముఖం కడుకున్నాడు. నీట్‌గా తయారై వచ్చి కూర్చున్నాడు.

ఆమె చెప్పిన టైమ్ అయింది కాని, ఇంకా రాలేదు. ప్రతి ఐదు నిమిషాలకు రోడ్డువైపు చూస్తూ తల దువ్వుకొంటున్నాడు, ఏ క్షణంలో అయినా లక్ష్మి వస్తుందేమోనని ఆశగా ఎదురు చూస్తూ ఉన్నాడు.

ఉదయం పదకొండున్నర సమయంలో దూరం నుంచి అందంగా వస్తున్నది లక్ష్మి.

దువ్వెన తీసి గబగబ బట్టతల దువ్వుకున్నాడు.

ఆమె రావటం చూస్తుంటే ఉమేష్‌లో వేయి ఏనుగుల బలం వచ్చినట్లుగా ఉంది. క్రాఫ్ కాలర్ మరోసారి సరిచేసుకున్నాడు. ఆమె కొలతలు మనసులోనే లెక్కిస్తున్నాడు. అన్నీ చాలా చక్కగా అమరి ఉన్నాయి. ఆమెను సృష్టించటానికి బ్రహ్మదేవుడు ఓవర్ టైమ్ తీసుకొని మరీ పని చేసి ఉంటాడు అనుకున్నాడు.

లక్ష్మి ఉమేష్ కంటికి దివి నుండి దిగి వచ్చిన దేవకన్యలా ఉంది. ఆమె రాకతో చల్లటి, తియ్యటి సువాసన వీచిక ఒకటి వీచింది. కోకిలలా "హలో"అంది.

"హలో....రండి....రండ...." అన్నాడు.

"కూర్చోండి, ఎలా ఉంది మీ...." అన్నాడు చొరవగా.

''తగ్గిందండి....ఇంకా కాస్త తగ్గాలి....'' అంది.

ఉమేష్ మంచి డాక్టర్‌లా "నైస్, కాస్త తగ్గింది కదా, ఏంపర్వా లేదు. మరో రెండు వారాలలో పూర్తిగా తగ్గిపోతుంది'' అన్నాడు.

లక్ష్మి తరువాత మరలా వస్తుందో లేదో అనే అనుమానంతో ఉమేష్ తన గురించి తను చెప్పుకోవటం ప్రారంభించాడు. "నా పేరు కె. ఉమేష్, ఎమ్.బి.బి.ఎస్.....'' అని ప్రారంభించి అర్ధగంటపాటు తన గురించే చెప్పుకుంటూ ఉన్నాడు, స్వీయ చరిత్ర చదువుతున్నట్లు. ఉమేష్‌కు ఉండే అనేక అలవాట్లలలో ఇదీ ఒకటి. అవకాశం వచ్చినప్పుడు సమయం, సందర్భం చూడకుండా తనను తానే యిష్టం వచ్చినట్లు పొగుడుకునే క్యారెక్టర్. అలా తనను తాను పొగుడుకోవటం అతనికి సిగ్గుగా అనిపించదు. అర్ధగంటపాటు తనను తానే పొగుడుకుంటూ ఆనందపడిపోయాడు.

అర్ధగంట ఏకధాటిగా మాట్లాడటం వల్ల రొప్పుతూ ఆగి "నేను మిమ్మల్ని ఏం బోర్ కొట్టించటం లేదు కదండి లక్ష్మిగారూ?" అన్నాడు.

"అబ్బే లేదండి....కాని, ఇంకా అయిపోలేదా?" బిక్కముఖంతో అంది.

ఉమేష్ ఆమె మాటల్ని ఎలా రిసీవ్ చేసుకున్నాడో మురిపెంగా తనలో తనే నవ్వుకున్నాడు. "మీ గురించి ఏం చెప్పనే లేదు...."

"నా పేరు తెల్సు కదండి, నేను ఎక్స్.వై.జెడ్ కంపెనీ లిమిటెడ్‌లో అకౌంట్స్ అసిస్టెంట్ ఉద్యోగం చేస్తున్నానండి. కానీ, నాకు మీకున్నంత గొప్ప హిస్టరీ లేదులెండి...." అంటూ సిగ్గుపడుతూ నవ్వి, పైట ముఖం మీదకు లాక్కుంది.

ఇప్పటి వరకు....

ఉమేష్ జీవితంలో ఎవరితో ఇంత క్లోజ్‌గా ఎప్పుడూ మాట్లాడలేదు. అందువలన అతనికి ఈ ఊహే పులకరింతగా ఉంది.

ఊహల ఉయ్యాలలో తేలిపోతున్నాడు.

అతనికి ఎన్నో మాట్లాడాలని, ఎన్నెన్నో అడగాలని మనసులో ఉబలాటంగా ఉంది. కాని, మాట పెగలటం లేదు. మనసులోని మాట పెదవులపైకి రావటం లేదు. చాలా విచిత్రమైన స్థితి.

ధైర్యం చేసి "రేపు సండే కదా, మీ ప్రోగ్రామ్ ఏమిటి...."అన్నాడు.

""స్పెషల్‌గా ఏమి లేదండి" అంది నవ్వుతూ.

"అయితే మీతో కలిసి ఒకసారి కాఫీ త్రాగాలని ఉందండి" అన్నాడు రొప్పుతూ. ఉమేష్ దృష్టిలో కాఫీ త్రాగటం అంటే ఇంకో అర్థం ఉంది.

ఆమె మరింత చొరవగా ''కాఫీ త్రాగటం కోసం రేపు ఎందుకు, ఈ రోజే త్రాగుదాం పదండి'' అంది చిలిపిగా నవ్వుతూ.

ఆహా, చొరవ అంటే ఇలా ఉండాలి అని మనసులోనే కులికాడు. అంతలోనే ఏమి గుర్తొచ్చిందో వెంటనే "కాని ఇప్పుడు వద్దు, సాయంత్రం వెళ్దాం'' అన్నాడు.

''ఓ. కె. ఏ టైమ్‌లో వెళ్దామండి?'' అంది.

''సరిగ్గా ఐదు గంటలకు వెళ్దామండి'' అన్నాడు.

లక్ష్మి తనతో కాఫీ త్రాగటానికి వస్తున్నందుకు ఉమేష్‌కు తెగ ఆనందంగా ఉంది. ఈ ఊహ కలా నిజమా నమ్మలేకపోతున్నాడు.

ఆ రోజు మిగతా రోజుల్లా లేదు.

''మరి నేను వస్తాను. సీ యూ'' అని నవ్వుతూ వెళ్ళిపోయింది.

సాయంత్రం ఐదు గంటలు ఎప్పుడు అవుతుందా అని నిరీక్షించటంలో ఉన్నాడు ఉమేష్.

అతని ఆలోచనలన్ని లక్ష్మి చుట్టే, ఒక క్షణం కూడా ఆలోచనలు డైవర్ట్ కావటం లేదు. తియ్యటి ఊహలతో పరవశించిపోతున్నాడు.

మధ్యాహ్నం భోజనానికి కూడా వెళ్ళాలనిపించలేదు. లక్ష్మిరూపాన్ని ఊహించుకుంటుంటే ఆకలి కూడ కలగటం లేదు. కాని, ప్రతి గంటకు ఓ సారి సబ్బుతో ఫేస్‌వాష్ చేసుకుంటున్నాడు - లక్ష్మికి తను అందంగా ఆకర్షణీయంగా కనిపించాలని తపించిపోతున్నాడు. అందులో భాగంగానే ప్రతి గంటకు ఓసారి సబ్బుతో "కసకస" మంటూ ముఖం తోముకుంటూ ఉన్నాడు.

సాయంత్రం నాలుగున్నరకు ఉమేష్‌కు విరహవేదన అధికమైంది. మరోసారి వాష్ బేసిన్ దగ్గర సబ్బుతో ముఖం కడుకున్నాడు. ముఖానికి సుతారంగా పౌడర్ అద్దుకున్నాడు.

కాని, ఆతనికి ఆ క్షణంలో తెలియదు - మరో కొన్ని గంటల్లో అతను దారుణంగా పరాభవించబడతాడని. ఉమేష్‌కు ఆ క్షణం తెలియదు - మరో కొద్ది సేపటిలో ఓ విచిత్రమైన సమస్యలో పడతాడని.

భవిష్యత్ తెలియకపోవటం మనిషికి గొప్ప వరం.

సాయంత్రం ఐదు గంటల కంటే ముందే హాస్పటల్ మెయిన్ గేట్ దాటి బయటకు వచ్చి నిలబడ్డాడు.

లక్ష్మి చెప్పిన టయానికే వచ్చేసింది.

అమాయకంగా ఆమెను అనుసరించాడు ఉమేష్. కాని, మరి కొద్ది నిమిషాల్లో ఏం జరగబోతుందో ఆ క్షణాన తెలియదు.

ఇద్దరు కలిసి రోడ్డుకు ఓ ప్రక్కగా నడుస్తున్నారు.

ప్రపంచంలోని ఆనందం అంతా అతని ముఖంమీదే తొణికిసలాడుతున్నది.

ఉమేష్ మాట్లాడాలని ఏదేదో ఊహించుకుంటూ ఉన్నాడు. లక్ష్మితో ఏవేవో మాట్లాడాలి అనుకుంటూ ఉన్నాడు కాని, ఎలా మాటలు మొదలుపెట్టాలో అర్థం కావటం లేదు. అతను ఆలోచనలలోనే ఉన్నాడు.

"మీ వయసెంత...." అని అడిగింది.

ఊహించని ప్రశ్న. ఎం చెప్పాలో అర్థం కాలేదు. టైట్ కార్నర్. నిజం చెప్పాలా, అబద్ధం చెప్పాలా, ఓ అర నిమిషం ఆలోచించి—

"ఇరవై ఐదు" అన్నాడు ముక్తసరిగా....

"నేను నమ్మను, నేనే కాదు ఎవరూ నమ్మరు.... నేను అన్నానని కాదు కాని, మీరు రేషనల్‌గా ఆలోచించండి. మీకు ఇరవై ఐదు సంవత్సరాలే అయితే; మీ తల బట్టతలలా అప్పుడే ఎందుకు మారినట్లు" అంది నవ్వుతూ;

ఏం చెప్పాలో అర్థం కాలేదు, నళిగాడు.

ఇద్దరు ఓ మోస్తరు స్థాయిలో ఉండే హోటల్‌లోకి వెళ్ళారు.

సాయంత్ర సమయం కనుక హోటల్ నిండా జనం ఉన్నారు. హోటల్‌లోని జనాలను తప్పించుకుంటూ వెళ్ళి ఓ చోట కూర్చున్నారు ఉమేష్, లక్ష్మి.

ఇద్దరు ఎదురెదురుగా కూర్చున్నారు.

ఉమేష్ ధీమాగా "నో ఫార్మాలిటీస్ ఏం కావాలో మీరే ఆర్డర్ ఇవ్వండి" అన్నాడు.

"ఓన్లీ కాఫీ ఏ అన్నారుగా, అదీకాక పెళ్ళికి ముందే ఎవరితో పడితే వారితో ఏం పడితే అది తినవద్దంది మా అమ్మ." గారాలు చేస్తూ చిన్నపిల్లలా అంది.

సర్వర్‌తో "రెండు కాఫీ" అని ఆర్డర్ ఇచ్చాడు.

సర్వర్ మరలా "రెండు కాఫీ...." అని గట్టిగా అరుస్తూ కాఫీ తీసుకొని రావటానికి వెళ్ళాడు.

ఆ క్షణం లక్ష్మి తన ప్రక్కనే ఉన్నందుకు ఉమేష్‌కి యమ తృప్తిగా ఉంది. ఏదో చెప్పలేని ఆనందంతో మాటలు తడబడుతున్నాయి. అయినా ఏదో మాట్లాడాలని తపన.

ఆ ఆనందంలోనే "ప్రేమించటం వేరు, ప్రేమను వ్యక్తం చేయటం వేరు'' అని డ్రమెటిక్‌గా ఓ స్టేట్‌మెంట్ పాస్ చేశాడు.

లక్ష్మి దూరంగా ఎటో చూస్తూ ఉంది. ఆమె ముఖం ఒక్కసారిగా రంగులు మారుతున్నాయి కోపంతో; కాని ఆ కోపంలో కూడా ఉమేష్‌కు లక్ష్మి అందంగానే కనిపిస్తోంది.

ఉమేష్ మెడికల్ కాలేజీలో చదివే రోజుల్లో తన సీనియర్స్ అంతా ఓ ఉద్దేశ్యం కలిగి ఉండేవారు. "వయసులో ఉంటే గాడిదైనా అందంగా ఉండి ముద్దొస్తుంది. ఇక అదే థియరీ దేనికైనా అప్లయి చేసుకోవచ్చు." ఉమేష్ ముందు కూర్చొని ఉన్న లక్ష్మి పెద్ద రూపవతి కావలసిన అవసరం లేదు. కాని వయసులో ఉంది కనుక. సో అండ్ సో; లక్ష్మి వయసులో ఉంది కనుక అందంగా ఉంది థియరీ ప్రకారం. ఆమె కోపంతో లేచి నిలబడింది.

''అరె నీ-నేను మనసులో అనుకొనేది ఎలా వినిపించినట్లు చెప్మా?'' అంటూ ఉమేష్ ఆశ్చర్యపోతున్నాడు.

''ఏమండీ, అటు చూడండి. ఆ ఎదురుగా కూర్చున్న మనిషి ఊరికే నావైపు చూస్తూ కన్ను గీటుతున్నాడు'' అంటూ దూరంగా కూర్చున్న ఓ మెల్లకన్ను మనిషిని చూపింది.

ఉమేష్‌కి కోపం తారాస్థాయికి చేరింది. లేచి ఆ వ్యక్తి దగ్గరికి వెళ్ళి ''లెయిరా ...'' అన్నాడు.

ఆ వ్యక్తి అమాయకంగా "ఎందుకు?" అన్నాడు.

ఉమేష్ ఉక్రోషంతో ''లెయిరా రాస్కెల్!" అన్నాడు తీవ్ర స్వరంతో.

ఈ తమాషా చూడటానికి హోటల్‌లోని జనం ఒకరు ఇద్దరై, ఇద్దరు పది మందిగా గుమికూడారు.

"ఏం జరిగింది" అని ఓ పెద్దమనిషి ముందుకువచ్చి అడిగాడు.

లక్ష్మి జనం ముందుకువచ్చి ''నేను ఇతను కలిసి హోటల్‌కు కాఫీ త్రాగటానికి వచ్చాము. కాని వచ్చినప్పటినుండి అతను (ఉమేష్‌వైపు చూపుతూ) నావైపే చూస్తూ కన్నుగొట్టాడు'' అంది కంగారుపడుతూ.

ఆ చుట్టూ ఉన్న పది మందికి ఆవేశం వచ్చేసింది. ''ఆడ కూతురంటే అంత చులకనరా, దున్నపోతా, చదువుకున్నవాడిలా ఉన్నావు'' అని అంటూనే పది మంది చేతులు ఉమేష్ మీద పడ్డాయి. పడిన దెబ్బ పడకుండా ఓ పది నిమిషాలపాటు ఉమేష్ వీపుమీద ధబిడ్ ధబిడ్‌మని పిడిగుద్దులు పడ్డాయి. తారలన్నీ తెగి మీదపడ్డటయింది. ఈ సమయంలో ఆ మెల్లకన్ను మనిషి తప్పించుకున్నాడు.

ఉమేష్ వీపుమీద పిడిగుద్దులు భారీవర్షం వెలిసినట్లు వెలిసింది.

లక్ష్మికోసం వెతికాడు, అక్కడ కనిపించకపోయేసరికి.

పడిన దెబ్బలకు బాధగా ఒక పెద్దమనిషి దగ్గరికి వచ్చి "అక్కడ నిలబడి ఉన్న అమ్మాయి ఎటు వెళ్ళింది?'' అని అడిగాడు.

ఆ పెద్ద మనిషి కోపంగా" ఏం నాయనా, ఇన్ని దెబ్బలు తినికూడా ఆమె కావలసి వచ్చిందా?'' అన్నాడు.

''అవిడతో నేనే సార్ వచ్చింది, ఆమె కంగారులో అలా తారుమారుగా చెప్పింది'', అన్నాడు.

ఉమేష్‌ని కొట్టిన వాళ్ళందరు ఒక్కొక్కరు నెమ్మదిగా తప్పుకున్నారు

ఉమేష్ అడుగుతీసి అడుగువేసే స్థితిలోలేడు. శరీరమంతా హూనం హూనం అయి ఉంది.

కేవలం రెండు రోజుల్లోనే ఆ అమ్మాయి అంతగా పరిచయం కావటం ఏమిటి? పరిచయం అయిందనుకో - ఆమెను తీసుకొని హోటల్‌కు ఎందుకు వెళ్ళాల్సి వచ్చింది? అక్కడ పేరు ఊరు లేని అనామకుల చేత చావు దెబ్బలు తినటం ఏమిటి? ఇదంతా ఆలోచిస్తూ ఉమేష్ హిస్టీరియా వచ్చినవాడిలా కీచుగా అరుస్తూ జుట్టు పీక్కున్నాడు.

మరు నిమిషంలో అంతా విధి తలరాత అనుకొని సరిపెట్టుకొని తన జీవిత భాగస్వామి కోసం మరో యాంగిల్‌లో ప్రొసీడ్ అవ్వబో తున్నాడు.

* * *

ప్రశాంత్, దివ్య ఒకే వార్డ్‌లో ఎదురెదురుగా నిరంతరం చూసు కుంటూ చతురోక్తులతో కాలం చాలా త్వరగా గడచిపోతోంది.

జీవితంలో ప్రేమించే క్షణాలు, ప్రేమించబడే క్షణాలు ఎప్పుడూ గుర్తుండి పోతాయి. ఆ ప్రేమలో కల్తీ లేకపోతే, ఆ అనుభవాలు ఎప్పుడూ తియ్యటి స్మృతులను గుర్తు చేస్తూనే ఉంటాయి. ప్రేమించే వారిలో కల్మషం లేకపోతే. మనిషి మనిషిగా ఎదగాలి అంటే ప్రేమించాలి, ప్రేమించబడాలి. ప్రేమలేని జీవితం చాలా నిస్సారంగా, కళా విహీనంగా ఉంటుంది. ప్రేమలో గెలుపు ఓటములు వుండవు. ప్రేమ గెలుపు ఓట ములకు అతీతమైంది. అదే నిజమైన ప్రేమ.

దివ్యది ఒక రకంగా చూస్తే అసాధారణమైన అందమే, అందానికి మించిన మంచితనం అనుకున్నాడు ప్రశాంత్.

ఆ రోజు ప్రశాంత్, దివ్య ఇద్దరికి నైట్ షిఫ్ట్. సాయంత్రం ఆరు గంటల నుండి ఉదయం ఎనిమిది గంటల వరకు హాస్పటల్‌లోనే ఉండాలి. సాధారణంగా ఎలాంటి సీరియస్ కేస్ అయినా చెకప్ చేయాలి. మరీ అవసరం అనుకుంటే స్పెషలిస్ట్‌ని పిలిపించవచ్చు. కాదు అంటే తోటి కొలీగ్స్ ఎలాగూ ఉంటారు.

నైట్ షిఫ్ట్‌లో డ్యూటీ డాక్టర్స్ రెస్ట్ తీసుకోవటానికి డ్యూటీ రూమ్‌లో రేకుమంచం, పరుపు కూడా వుంటాయి. కాని, నైట్ షిఫ్ట్ డ్యూటీకి వచ్చి అలా ఆ మంచాల మీద పడుకోవటం ప్రశాంత్‌కు గిల్టీగా ఉంటుంది. అందుకోసమే రెండు మూడుసార్లు వెళ్ళి టీ త్రాగి వస్తూ

ఉంటాడు. ఇంకా నిద్రవస్తే ఏదో ఓ పుస్తకం చదువుకుంటూ ఉంటాడు, ఏదో ఒక వార్డ్‌లో సీరియస్‌గా ఉందని కంప్లయిట్స్ వస్తూనే ఉంటాయి. వెళ్ళి అది చూసి వచ్చేసరికి సమయం ఇట్టే గడిచిపోతుంది.

కాని, సిస్టర్స్ మాత్రం రాత్రంతా ఏదో ఒక పనిమీద వార్డ్‌లోకి, స్టెరిలైజేషన్‌లోకి, స్టాక్‌రూమ్‌లోకి, దాదాపు ఆస్పటల్ అంతా తిరుగుతూనే ఉంటారు.

రాత్రి పన్నెండు గంటలు దాటింది.

ప్రశాంత్ డ్యూటీ రూమ్‌లో ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు.

దివ్య వచ్చింది డ్యూటీ రూమ్‌లోకి. టేబుల్ మీదున్న ఫ్లాస్క్‌లో ఉన్న టీ కప్పులో పోసి ప్రశాంత్‌కు అందించింది.

టీ కప్పు అందుకుంటూ దివ్యవైపు అదోలా చూసి దీమాగా "జీవితంలో ఓ సంవత్సరం పాటు ప్రేమించుకోవాలి ప్రతి ఒక్కరు అని ఒక రూల్ ఉండుంటే ఎంత బాగుండేది...." అన్నాడు ప్రశాంత్ డ్రామా ఫక్కీలో.

''ఇప్పుడు చేసేది అదేగా?" అంది నవ్వుతూ టీ సిప్ చేస్తూ.

ప్రభాకర్ మాయల ఫకీర్ నవ్వునవ్వి "భలే దానివే దివ్య! ఈ భూత్ బంగ్లాలోనా...." అన్నాడు పాత ఆ హాస్పటల్ భవనాన్ని కళ్లతోనే చూపిస్తూ.

''ప్రేమలేని జీవితం నిల్, అలాగే థ్రిల్ లేని ప్రేమ వేస్ట్'' అన్నాడు.

దివ్య ఏం చెప్పలేదు - మౌనంగా టీ సిప్ చేస్తున్నది.

ప్రశాంత్ మరలా చెప్పటం ప్రారంభించాడు. రోజూ ఇలా గడిపే కన్న ఒక్కరోజు మంచి హాలిడే ఇన్ లాంటి హోటల్‌లో ఓ రోజు తృప్తిగా ప్రేమగా గడిపితే ఎంత బాగుంటుంది!'' అంటూ ఆపాడు, దివ్య రియాక్షన్ తెలుసుకోవటంకోసం.

దివ్య ప్రశాంత్ వైపు తీక్షణంగా చూసింది.

ఆమె తల ఎత్తగానే ముక్కుకున్న ముక్కుపుడక తళుక్కున మెరిసింది.

"అలా కోపంగా చూడకు. ఏదో ఫ్రెండ్స్‌లా వెళ్ళి ఆ సముద్రం ఒడ్డున ఓ రోజు గడిపి వస్తే ఎంత బాగుంటుంది అని నా చిన్న ఇది...." అంటూ ఏదో చెప్పబోయి చెప్పలేకపోయాడు.

ప్రశాంత్ ప్రవర్తనకు మనసులోనే నవ్వుకొని, పైకి మాత్రం నిండుగా నిశ్చలంగా ఏం మాట్లాడలేదు.

ప్రశాంత్‌కూడా "చాలు, మౌనం అర్ధాంగీకారం" అనుకున్నాడు మనసులోనే.

ఇంకాస్త చొరవతో "అయితే, రేపు శనివారం సెలవు పెడదాం. ఆదివారం శెలవు. సోమవారం వచ్చి డ్యూటీలో జాయిన్ అవుదామ్" అని చెప్పాడు. అతని మాటల్లో తత్తరపాటు కాని, మోసపూరిత ఆలోచన కాని మచ్చుకయినా కనిపించటం లేదు.

దివ్య ఏదో ఆలోచనల్లో పడిపోయింది.

మరలా ఆమె కళ్ళలోకి చూస్తూ "సున్నితమైన మనసుండాలి దివ్య, అందమైన ప్రదేశాలు చూసి ఆనందించటానికి" అని ఒక స్టేట్‌మెంట్ పాస్ చేసాడు.

వెంటనే రోషంగా "అయితే, నాకు సున్నితమయిన మనస్సు లేదంటారా?" అంది నిలదీస్తున్నట్లు.

"ఎల్లుండి తెలుస్తుంది...."ప్రశాంత్ మరింత మొండిగా అన్నాడు.

"సరే చూద్దాం - కాని, ఇక్కడ మన కొలీగ్స్‌కు తెలిస్తే అంతా అపార్థాలు తీస్తారు ఎలాగ?" అంది అనుమానంగా....

"దీని కోసమే ఒక చక్కటి ప్లాన్ చేసి ఉంచాను, మనసుంటే మార్గం ఉండకపోతుందా? నేను రేపు ఉదయమే శెలవు పెడతాను. నీవు రేపు సాయంత్రం శెలవు పెట్టు ఎల్లుండి ఉదయమే బయలుదేరుదాం. ఇంటిలో పిక్‌నిక్‌కి వెళ్తున్నామని చెప్పు, ఆదివారం మధ్యాన్నానికెల్లా వచ్చేదాం" అన్నాడు.

అనుకున్న ప్రకారమే ప్రశాంత్ మరుసటి రోజు శెలవు పెట్టాడు. ఆ రోజు సాయంత్రం దివ్యకూడా శెలవు పెట్టింది. రోజులు గంటలలోకి, గంటలు నిమిషాలలోకి....శనివారం ఉదయం ఐదు గంటలకెల్లా ప్రశాంత్. దివ్య హాస్పటల్ క్వార్టర్స్ నుంచి బయటపడి, రిక్షాలో బస్‌స్టాప్ చేరారు.

ఇద్దరికి క్రొత్తగానే ఉంది ఈ ప్రయాణం. అయినా తప్పదు ఈ జీవిత ప్రయాణం అనే దోరణిలో ఉంది వారి వాలకం.

బీచ్‌కు వెళ్ళే బస్ వచ్చి ఆగింది. ఇద్దరు బస్ ఎక్కి కూర్చున్నారు.

ప్రశాంత్, దివ్య ప్రక్క-ప్రక్కనే కూర్చున్నారు. పరిచయం ఉన్న వాళ్ళు ఎవరైనా కనిపిస్తారని బస్ ఎంత త్వరగా బయలుదేరితే అంత బాగుండు ననుకుంటున్నారు.

ఉదయం ఆరు గంటలకు బస్ స్టార్ట్ అయింది.

బస్ కిటికిలో నుంచి చల్లటి గాలి దివ్యమీదిగా వీస్తున్నది. అంతకంటే మంచి వాసన దివ్యనుంచి ప్రశాంత్ మీదకు వీస్తుంది.

దివ్య తన ప్రక్కన ఉంది అన్న ఫీలింగ్ చాలా బలాన్ని, ఆనందాన్ని ఇస్తున్నది.

ఇద్దరు చతురులే, మాటకారులే, ఒకరంటే ఒకరికి ప్రేమే, ఇష్టమే అయినా ఏ ఒక్కరూ ఏదైన మాట అంటే పడరు, దానికి తిప్పి మరో మాట చెప్పందే శాంతించరు. అది ప్రేమలో ఒక స్థాయి.

కాని, ఇప్పుడు దివ్య మౌనంగా కూర్చుంది.

"ఏయ్ దివ్య......." ప్రశాంత్‌కి అప్పుడప్పుడు అలా పిలవటం అలవా టే.

దివ్య ప్రశాంత్ వంక చూసింది.

"ఏమైంది అలా ఉన్నావ్?" అన్నాడు.

దివ్య ఏమీ మాట్లాడలేదు. ఆమె పరిస్థితి అర్థమయింది. అందు వల్ల అనునయంగా "అయితే, తరువాత స్టాప్‌లో బస్ దిగేసి తిరిగి వెనక్కి వెళ్ళిపోదామా?" అన్నాడు ఆమెను తన వైపుకు త్రిప్పుకోవటంకోసం.

చిన్నగా నవ్వింది.

ఆ నవ్వు నిజంగా అద్భుతం, మనోహరం. వర్ణించటానికి అలివి కాని అందమైన నవ్వు. మనుషుల్లో ఎక్కడో కాని ఇంత అందమయిన వ్యక్తి కనపడరు; పచ్చటి మేని ఛాయ. నోట్లో నీళ్ళుపోస్తే గొంతులోకి దిగేది కనిపిస్తాయా అన్నంత పచ్చగా ఉంది ఆమె వంటి ఛాయ. జాకెట్‌కు చీరకట్టుకు మధ్యనున్న తెల్లటి ప్రదేశం వెన్నెల వాగులాంటి నడుము.

దివ్య ప్రశాంత్ వైపు చూడకపోయినా మనసు నిండా ప్రశాంత్ రూపమే. అంత ఎత్తు కాక, అంత పొట్టి కాక యావరేజ్ హైట్, యావ రేజ్ కంటే కాస్త అందగాడు, చదువుకున్నవాడు, ఒక స్థాయిలో ఉన్న వాడు, సంస్కారం కలవాడు. అన్నింటికంటే ప్రశాంత్‌లో ఎక్కువ ఆకర్షించిన విషయం సుతిమెత్తగా కనిపించే ఎర్రటి బుగ్గలు, మెరిసే కళ్ళు, అన్నింటికంటే మించి అమాయకంగా కనిపించే అతని ముఖం.

కాని, ఆ అమాయకుడే మరి కొద్ది సేపటిలో తన జీవితాన్ని ఒక మలుపు తిప్పుతాడని ఆ క్షణంలో ఊహించలేకపోయింది. అదే జీవితం.

బస్ వేగంగా వెళ్తున్నది. బీచ్‌కు వెళ్ళే స్పెషల్ బస్ అది. బీచ్ దగ్గర ఉన్న ఒక రిసార్ట్‌కు సమీపంగా వెళ్ళి ఆగింది.

బస్ దిగిన వెంటనే రిసార్ట్‌లోకి వెళ్ళి రూమ్ బుక్ చేయించాడు ప్రశాంత్. రిసెప్షనిస్ట్ ''ఏం పేరు'' అని అడిగాడు.

''మిస్టర్. ప్రశాంత్ అండ్ మిసెస్ ప్రశాంత్'' అని స్వంత భార్య పేరు భర్త చెప్పుకున్నంత ధీమాతో చెప్పాడు ప్రశాంత్.

ప్రక్కనే ఉన్న దివ్యకు ఎందుకోగాని, ప్రశాంత్ మాటలు వింటుంటే గుండె కాస్త వేగంగా కొట్టుకుంది.

''మరేం పర్వాలేదు దివ్య, ఏమి కంగారుపడకు. దగ్గరలో చూడదగ్గ ప్రదేశాలు చాలా ఉన్నాయట. అవి అన్నీ చూసి రావాలి అంటే ఈ బ్యాగ్స్ తీసుకొని ఎక్కడ తిరుగుతాం? అందుకని మన పెళ్ళి అయిందని చెప్పా, పెళ్ళి కాలేదంటే రూమ్ ఇచ్చే వాడు, అందువల్ల అబద్ధం చెప్పాల్సొచ్చింది, ఐయామ్ సారీ!" అన్నాడు నొచ్చుకుంటూ.

స్టీవర్డ్ వచ్చి రూమ్ తాళం తీసి అన్నీ వివరంగా చెప్పి "ఏమయినా కావాలంటే ఫోన్ చేయండి సర్" అని చెప్పి వెళ్ళాడు.

ప్రశాంత్ మరలా ఇంకోసారి ''దివ్యా! ఐయామ్ యిక్స్ట్రీమ్లీ సారీ...." అన్నాడు. ఆమె అతని వైపు చూసి ''క్షమించాను పో" అని ఫేసియల్ యిక్స్ప్రెషన్ చేసింది.

''థాంక్ గాడ్...., ఎంత కోపం వచ్చిందో అనుకొని భయపడి పోయాను, ఉదయం నుంచి బస్‌లో కూర్చొని బాగా అలసిపోయాను, నువ్వు రెస్ట్ తీసుకుంటూండు, నేను వెళ్ళి స్నానం చేసి వస్తాను" అంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

''ఎందుకండి.... ఇప్పుడు...." అని ఏదో చెప్పబోయింది తను ఒంటరిగా కూర్చోవలసి వస్తుందని.

ఓ పది నిమిషాల తర్వాత బాత్‌రూమ్ నుంచి బయటకు వచ్చాడు. "అహా...చాలా ఫ్రెష్‌గా ఉంది. దివ్యా! నువ్వూ వెళ్ళి స్నానం చేసిరా. దగ్గరలో పెద్ద దేవాలయం ఉందట. వెళ్ళి దర్శించుకొని వద్దాం'' అన్నాడు తలం తువ్వాలుతో తుడుచుకుంటూ.

దివ్య కిటికీలో నుంచి కనిపిస్తున్న నీలి సముద్రాన్ని చూస్తూ నిలుచొని ఉంది. "నేను ఎందుకు లెండి" అంది ముక్తసరిగా.

"అంటే నేనొక్కడినే బిచ్చగాడిలా దేవాలయానికి వెళ్ళాలా? అదేం కుదరదు, వెళ్ళి స్నానం చేయి, ఆ తరువాత వేడివేడి కాఫీ త్రాగి అలా గుడికివెళ్ళి వద్దాం'' అన్నాడు ముద్దుముద్దుగా, - ఆ గొంతులో డిక్టేటింగ్ పవర్ ఏమీలేదు అయినా దివ్య మారు చెప్పలేకపోయింది.

అయిష్టంగానే స్నానానికి బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది.

వేడినీళ్ళు, చల్లటి నీళ్ళు వేరు వేరు షవర్‌లనుంచి వస్తున్నాయి.

కొంతమంది ఆడవాళ్ళకు స్నానం చేయటం అంటే మహా సరదా. అలాంటి ఆడవాళ్ళకు చెందిందే దివ్య కూడాను. వంటి మీద నున్న చీర బ్రాకెట్, బాడీ ఒక్కొకటీ వదిలి వేస్తోంది వంటిమీద నుంచి. ఆ క్షణంలో ఆమెకు తెలియదు - ఆ చీరమార్చిన తర్వాత వేరే చీరను బాత్‌రూమ్‌లోకి తెచ్చుకోవటం మరచిపోయింది అని.

జలకాలడటం ప్రారంభించింది.

చాలా హాయిగా ఉంది. షవర్ నుంచి జల్లులుగా పడే నీళ్ళు ఆమెను తమకంలో అంగాంగాలు తడిపేస్తున్నాయి. కళ్ళు మూసుకొని తలకు షాంపు పట్టిస్తుంది. అది నురగలతో ఆమెను చిత్రడి చిత్రడిగా చేస్తున్నది.

ఓ అర్ధగంట స్నానం చేసిన తరువాత, తృప్తిగా స్నానం అయిపోయింది అనిపించి - అప్పుడు గుర్తు కొచ్చింది తను వేరే లంగా, శారీ

లోపలకు తెచ్చుకోలేదని. బాత్‌రూమ్‌లో టర్కీటవల్ వెక్కిరిస్తున్నట్టుగా కనిపిస్తుంది. గుండెలు గుభేలు మన్నాయి.

''ఏమండి....'' అంటూ బాత్‌రూమ్ తలుపుకాస్త తెరిచి ప్రశాంత్‌ని ఉద్దేశించి పిలిచింది.

కాని, ఎలాంటి సమాధానం లేదు. నాలుగైదుసార్లు ప్రశాంత్‌ని పిలిచింది. కాని, సమాధానం లేదు. ఇక లాభం లేదని బాత్ రూమ్‌లో ఉన్న టర్కీటవల్ చుట్టుకొని బాత్‌రూమ్‌లో నుంచి బెడ్ రూమ్‌లోకి వచ్చింది. బెడ్‌రూమ్‌లో ప్రశాంత్ జాడలేదు. ప్రశాంత్ వస్తాడేమోనని త్వరత్వరగా బ్యాగ్‌లోనుంచి ఒక చీర, లంగా, బాడీ, బయటికి తీసింది.

గది అంతా కలియజూచి, టవల్ తొలగించి లంగా తొడుక్కొంది. ఆ వెంటనే బాడీ, ఆ తరువాత జాకెట్ తొడుక్కొంటూ ఉండగా ప్రశాంత్ వచ్చాడు.

వెంటనే కంగారుపడుతూ టర్కీ తువ్వాలును గుండెలకు పైటలా వేసుకుంది. ''బట్టలు మార్చుకుంటున్నాను, బయటకు వెళ్ళండి, ప్లీజ్!'' అంది.

చీర కట్టుకోవడానికి వీలుగా అడుగులంగా మీద, గుండెల్ని కప్పుకొని టర్కీతువ్వాలు - ఆ పోజులో దివ్యను చూస్తుంచే ప్రశాంత్ అమాంతంగా ఎత్తుకొని, గిరగిర తిప్పి గట్టిగా ఓ ఇంగ్లీషు ముద్దు పెట్టుకోవాలని అనుకున్నాడు.

స్నానంచేసి అప్పుడే వచ్చింది కనుక కురులనుంచి ముత్యాలు రాలుతున్నట్లు రాలుతున్నాయి నీటిబిందువులు. దివ్య కడిగిన మంచి ముత్యంలా ఉంది. "ఇంకా చెప్పాలంటే దేవలోకంనుంచి దారితప్పివచ్చిన దేవకన్యలా ఉంది'' అనుకుంటూ తన్మయత్వంగా చూస్తూ ఉన్నాడు.

"అబ్బ వెళ్ళండి...." అంది కాస్త కోపం నటిస్తూ.

ప్రశాంత్ తేరుకొని వెంటనే బయటికి వెళ్ళాడు.

దివ్య త్వరగా చీర మార్చుకొని రూమ్‌డోర్ తెరుచుకొని బయటకు వచ్చింది. బయట ప్రశాంత్ గోడకు ఆనుకొని సముద్రం వైపు చూస్తూ నిలబడి ఉన్నాడు.

"రండి లోపలికి" అంది.

ప్రశాంత్ పరధ్యానంగా సముద్రంవంకే చూస్తూ నిలబడి ఉన్నాడు.

"కోపమా.... నామీద?" అంది ప్రశాంత్ కళ్ళలోకి చూస్తూ.

"నో.... ఏంలేదు" అన్నాడు.

ఇద్దరు రూమ్‌లోకి వచ్చారు. "కాఫీ తాగుదామా?" అంటూ డబల్ కాట్ బెడ్ ప్రక్కనేవున్న ఫోన్ అందుకొని రెండు కాఫీ ఆర్డర్ ఇచ్చాడు.

అయిదు నిమిషాలలో స్టీవర్డ్ వచ్చి కాఫీ సర్వ్‌చేశాడు.

కాఫీ తాగటం పూర్తిచేసి, ఇద్దరూ బయటికి వచ్చారు.

రిసార్ట్‌లో అందరూ హైక్లాస్‌వాళ్ళే (దనవంతులే). అంతేకాదు, ఎక్కువమంది పెళ్ళి అయినవాళ్ళే ఉన్నట్లుంది.

రిసార్ట్‌కు రెండొందల గజాల దూరంలోనే సముద్రం ఉంది. రిసార్ట్ బయట ఉన్న కొత్త ప్రాంతమంతా కలియజూస్తున్నారు ఇద్దరు.

సమయం ఉదయం పదకొండుదాటినా ఆ ప్రదేశం చాలా చల్లగా ఉంది.

దగ్గరలో కనిపిస్తున్న దేవాలయం వైపు నడుస్తున్నారు.

అంతా క్రొత్త ప్రదేశం. ఇద్దరు ప్రక్కప్రక్కగా నడుస్తున్నారు.

ఓ పది నిమిషాలు నడిచిన తర్వాత దేవాలయం చేరారు. ఆలయం చాలా చిన్నదే అయినా కళాత్మకంగా ఉంది. చుట్టూ విశాలమైన స్థలం ఉంది. టెంపుల్‌కి కాస్త దూరంలో ఏదో కన్‌స్ట్రక్షన్ పని జరుగులోంది.

దూరం నుంచి దేవాలయంలోకి వస్తున్న ప్రశాంత్, దివ్య రావటం గమనించిన పూజారి నూతన వధూవరులు మంచి దక్షిణ ఇస్తారని తెగ సంబరపడిపోతున్నాడు.

దేవాలయం ముందు ఒక చిన్న షాప్ లాంటిది ఉంది. అందులో కొబ్బరికాయ, కుంకుమ, అగరొత్తులు, కర్పూరంలాంటివి తీసుకొని ఇద్దరు భక్తిగా దేవాలయ ప్రాంగణంలోకి ప్రవేశించారు.

''అర్చన చెయ్యమంటారంతయ్య - క్రొత్త దంపతుల్లా ఉన్నారు. పేర్లు చెప్పండి'' అన్నాడు పూజారి నిపలైన ధోరణిలో.

రైట్ కార్నర్.

తాము భార్యాభర్తలు కాదు అంటే పూజారి శపిస్తాడేమోనని వెంటనే ''అవును. ప్రశాంత్, దివ్య'' అని చెప్పేశాడు.

పూజారి మంత్రాలు చదువుకుంటూ గర్భగుడిలోనికి వెళ్ళాడు.

ప్రశాంత్, దివ్యల పెళ్ళి కాకపోయినా, దేవుని సమక్షంలో వారిద్దరి పేరున అర్చన కూడా జరిగిపోయింది.

పూజారి అర్చన పూర్తిచేసి హారతి అందించాడు. ప్రశాంత్ పది రూపాయలు దక్షిణగా ఇచ్చాడు.

ఆ దక్షిణకు బాగా తృప్తిపడి, ఆనందభరితుడై ''శీఘ్రమేవ సుపుత్ర ప్రాప్తిరస్తు'' అని దీవించిపారేశాడు.

ఇదంతా ప్రశాంత్ ప్లాన్ ప్రకారం చేస్తున్నాడా అని దివ్య కోపంతో రగిలిపోతున్నది. దేవాలయం నుండి బయటికి వెళ్ళిన తరువాత ఎడా పెడా వాయించేయాలి అనుకుంది.

దేవాలయం నుండి బయటకు వస్తున్న ప్రశాంత్, దివ్యలను ఉద్దేశించి ''బాబూ ఆగండి, అలా వెళ్ళకూడదు. ఓ రెండు నిమిషాలు ప్రాంగ

ణంలో కూర్చొని వెళ్ళాలి. అది సంప్రదాయం'' అని పూజారి గుర్తు చేస్తూ అన్నాడు.

"అలాగే స్వామీ....'' అన్నాడు ప్రశాంత్.

ఇద్దరూ దేవాలయ ప్రాంగణంలో కూర్చున్నారు.

దివ్యకు ప్రశాంత్ మీద పిచ్చికోపం వస్తోంది. అందువల్ల ముభావంగా ఉండిపోయింది.

"ఏయ్ దివ్య, ఏమయింది...."అన్నాడు ప్రశాంత్ చాలా కూల్‌గా.

ఇక దివ్య టాలరేషన్ కోల్పోయింది. చివాలున తలఎత్తి ప్రశాంత్ కళ్ళలోకి చూస్తూ తీక్షణంగా "ఎందుకలా చెప్పారు?" అంది.

''నేనేం చెప్పాను?" అన్నాడు అమాయకంగా.

''నటించకండి, పూజారి గారితో మన పెళ్ళి అయిందని ఎందుకు చెప్పారు?" అంది నిలదీస్తూ.

"సారీ దివ్య.... అలా చెప్పకపోయి ఉంటుంటే.... శాస్త్ర ముందు పూజారి దేవాలయం ప్రాంగణంలో కూర్చోమన్నాడు కదా, మనం ఇద్దరం భార్యాభర్తలం కాదు అని ఆ పూజారితో చెపితే, దేవాలయం నుండి త్వరగా బయటకు వెళ్ళండి అని చెప్పకపోయినా, దాదాపు అలాగే ప్రవర్తించే వాడు. మన దేశంలో భార్యాభర్తలకున్న గౌరవం, ఆదరణ ప్రేమికులకు లేదు, ఉండదుకూడాను.

"నీవు రేషనల్‌గా ఆలోచించు దివ్య. నేను చెప్పానని కాదు కాని, నిన్ను నేను తప్ప వేరేవాడిని పెళ్ళి చేసుకోనిస్తానా?'' ధీమాగా అన్నాడు.

ఇప్పుడు అతని మీద కోపంలేదు, కొండంత నమ్మకం కలిగింది. ఆమె తల ఎత్తి అతని కళ్ళలోకి చూసింది. ఆ కళ్ళు ఎంతో నిర్మలంగా ఉన్నాయి.

"మన ఇద్దరి మధ్య ఓ తాళిబొట్టు అడ్డంగా నిలిచింది, నువ్వు ఊ అంటే ఇప్పుడే ఇక్కడే కట్టేస్తాను. నాకు మంత్రాలు కూడా తెలుసులే, కాస్త ముందే పూజారి ఇచ్చిన కాశీదారం ఉంది దానితో నీ మెడలో కట్టేయమంటావా?" అన్నాడు, పెళ్ళి అంటే బొమ్మల పెళ్ళిలా, చిన్న పిల్లాడిలా.

దివ్య తల వంచుకొని నవ్వుకుంటున్నది ప్రశాంత్ మాటలకు. ఆమె నవ్వటమే కాదు. అంతకు మించి సిగ్గుపడుతున్నది. కన్య పిల్లలకు సాధారణంగా రెండు మాటలు వింటే వాళ్ళకు సిగ్గు ముంచుకొస్తుంది. ఆ రెండు పదాలు మొదటిది పెళ్ళి, రెండవది తాళి. దివ్యకు కూడా ఈ రెండు పదాలు సిగ్గులో మునిగిపోయేలా చేశాయి. అందువల్ల ఆమె మౌనంగా ఉంది.

ప్రశాంత్ తనకు వచ్చిన శ్లోకం "కార్యేమ దాసీ,
కరణేషు మంత్రీ,
రూపేచ లక్ష్మి,
క్షమయా ధరిత్రీ,
భోజ్యేషు మాతా,
శయనేషు రంభా
షట్కర్మ యుక్తా కులధరపత్ని",

గుర్తు చేసుకుంటూ చదువుతూ కాశీదారంతో దివ్య మెడలో సరిగ్గా మూడు ముళ్ళు వేశాడు. నిజానికి తాళి కట్టేటప్పుడు ఆ శ్లోకం చదవరు.

ఆలయ ప్రాంగణంలో ఇదంతా భలే గమ్మత్తుగా ఉంది ఇద్దరికి.

''ఇక మన పెళ్ళి అయిపోయింది. ఈ దేవాలయం సాక్షిగా'' అన్నాడు ప్రశాంత్ గుసగుసగా. ఇద్దరూ పెళ్ళంటే బొమ్మలాటగా ఆడు కుంటున్నారు.

2 గంటల తరువాత ఇద్దరు రిసార్ట్‌కు వచ్చి భోజనం చేసిన తర్వాత సాయంత్రం నాలుగు గంటల వరకు రిసార్ట్ బాల్కానీలో నుంచి చుట్టు ఉన్న ప్రదేశాన్ని చూస్తూ టైమ్ పాస్ చేశారు.

సాయంత్రం కాఫీ త్రాగి బీచ్ దగ్గరికి వెళ్ళారు.

బీచ్ ప్రదేశంలో చాలామంది ఉన్నారు. అల్ట్రా మోడ్రన్ సొసైటీ అంటా.ఫ్రీ స్టైల్ పబ్లిక్‌గా ముద్దులు పెట్టుకోవడం వాళ్ళు సిగ్గుగా కాని, తప్పుగా కానీ భావించరు. అది వాళ్ల కల్చర్. మరికొన్ని జంటలు ఇంకా వచ్చి చేరుతున్నారు. ఆడ మగ అనే తేడా లేకుండా ఒకరి మీద ఒకరు చేతులేసుకుంటూ చాలా విచిత్రంగా ఉంది ఆ ప్రదేశం.

సూర్యుడు సముద్రంలో ఎర్రగా మారి దాక్కుంటున్నాడు.

దూరంగా ఎవరో ఒక ఆడ, ఒక మగ ముద్దు పెట్టుకుంటున్నారు. అది ప్రశాంత్ కంట పడింది.అది అతని కంట పడకపోయినా బాగుండేది. తను చూడటమే కాక "దివ్య....దివ్య అటుచూడు'' అని వాళ్ళ వైపు చూపించాడు.

''ఛీ పాడు, అటు చూడకండి తప్పు....'' అంటూ దివ్య తన చేతితో ప్రశాంత్ కళ్ళు మూసింది. అంతకు ముందు ఎప్పుడు లేని చొర వతో. ఆమె స్పర్శ ఎంతో తియ్యగా ఉంది.

ప్రశాంత్ మొండిగా పసి పిల్లాడిలా మారాం చేస్తూ "వాళ్లు అంత ఇదిగా అలా చేసుకుంటుంటే మనం చూడటం తప్పయిందా పాపం!'' అన్నాడు.

ఆమె ఏం చెప్పాలో అర్థంకాక "అబ్బ, అటు చూడకండి- తప్పు'' అంటూ చిరుకోపం నటించింది.

"పోనీ, నువ్వే అది ఒకటి ఇవ్వరాదు, నేను అటుచూడను" అన్నాడు బుంగమూతిపెట్టి.

''........" ఆమె ఏదో అంది. సముద్రపహోరులో కలిసిపోయింది.

రిసార్ట్ ఆవరణ అంతా ఫ్లడ్ లైట్లు వెలిగాయి. ఆ ఫ్లడ్ లైట్ల వెలుగు బీచ్ వరకు పడుతున్నది. ఆ వెలుగులో దివ్య నిజంగా భలే అందంగా కనిపిస్తున్నది.

చలి కాస్త ఎక్కువౌతున్నది. చూస్తూవుండగనే చిరుగాలి కాస్తా పెనుగాలిలా మారుతున్నది.

ఇద్దరు లేచి రిసార్ట్‌వైపు నడుస్తున్నారు.

గాలి వీస్తూనే ఉంది.

డైనింగ్ హాలులో వెళ్ళి కూర్చున్నారు. గాలి హోరు కాస్త తగ్గింది. రాత్రి ఎనిమిది గంటలకు డిన్నర్ తీసుకుంటూ, ''నా కోరిక తీరనేలేదు'' అన్నాడు - దివ్యవైపు చిలిపిగా చూస్తూ.

"ఏ కోరిక?" అంది చాలా మామూలుగా.,

డైనింగ్ హాల్‌లో ప్రశాంత్, దివ్యతప్ప ఎవరూ లేరు. రిసార్ట్‌లలో సాధారణంగా హౌస్‌కు (రూమ్) కే తెప్పించుకుంటారు డిన్నర్.

చేతులు వాష్ చేసుకొని తాపీగా కూర్చుంటూ ''అబ్బ, అదే - ఓ తియ్యటి ముద్దు" అన్నాడు. దివ్య అప్పటికే భోజనం ముగించి ఉంది.

''........",

''ఏంటి దివ్య మాట్లాడవు, ఒక్కటి - ఒక్కటంటే ఒక్కటి'' అన్నాడు.

"........"

"ఇన్ని రోజుల నుంచి ప్రేమించుకుంటున్నాము. ఒక్క ముద్దుకు కూడా నోచుకోలేదు నా బ్రతుకు....", అని నొచ్చుకుంటూ వాపోయాడు.

అద్భుతంగా, అగమ్యంగా నవ్వి ప్రశాంత్ వైపు చూసింది, ప్రశాంత్ ఎంతో ఆసక్తితో ఏం చెప్తుందా అని ఆసక్తిగా ఎదురు చూస్తున్నాడు.

దివ్య ఒక్కసారి హాల్ అంతా కలియజూసింది. దరిదాపులో ఎవరు లేరు. తృప్తిగా చెప్పటం ప్రారంభించింది. "అసలు ప్రేమంటే మీ ఉద్దేశ్యం ఏమిటండి, కేవలం శారీరక వాంఛలు తీర్చుకుంటేనే ప్రేమ ఉన్నట్లా? ప్రేమ అంటే తోడుగా, ఆత్మీయంగా, నీడగా నిలిచే స్నేహం అని నా అభిప్రాయం. నేను మిమ్మల్ని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. కాని, నా మనసు ఎందుకో ఆ పనికి అంగీకరించటం లేదు, నన్ను అర్థం చేసుకోండి ప్లీజ్!" అంది.

ఏదో అర్థం అయినట్లుగా తల ఊపి "ఓ.కే...." అన్నాడు.

బయట రివ్వున వీచే గాలి హోరు వింటుంటే తుఫాన్ వస్తుందేమో అనిపిస్తుంది. వర్షం ప్రారంభమయింది. గాలి హోరు పెరిగింది.

ఇద్దరు తమ గదిలోకి వెళ్ళారు.

అది డబల్ కాట్ మంచం, బయట వర్షం హోరు అధికమైంది. భయంకరమైన హోరు గాలి శబ్దం భయపెడుతున్నట్లుగా ఉంది. దానికి తోడు ఆకాశం మెరుపులు, సింహం గర్జించినట్లు ఉరుములు. ఉండి ఉండి ఎక్కడో పిడుగుపడ్డ శబ్దం.

ఆ పిడుగు శబ్దానికి ఆమె సుడిగాలిలా వచ్చి గట్టిగా హత్తుకుంది. అయినా భయంతో వణికి పోతున్నది.

"ఏ.... దివ్య.... భయపడ్డావా? ఏం పర్వాలేదు ఇటు చూడు, ఏంటి ఇంత పిరికిదానివి" అన్నాడు పొదివి పట్టుకుని.

"ఏం కాదు.... ఎప్పుడు ఇంత భయంకరమైన శబ్దం వినలేదు" అంది చక్రాలలాంటి కళ్ళు తిప్పుతూ.

"ఏ దివ్యా.... ఇప్పుడు నా కోరిక తీర్చుకోనా? ఒకటి ... ఒక్కటంటే ఒకటి...." అంటూ దివ్య పెదవులపై తన పెదవులతో గట్టిగా చుంబించాడు. ఆమెకు ఇది అనుకోని అనూహ్య సంఘటన.

వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ప్రశాంత్ తన ప్రవర్తనకు దివ్య ఇలా రియాక్ట్ అవుతుంది అని గ్రహించలేకపోయాడు. ఏం మాట్లాడాలో అర్థంకాక చివరకు ధైర్యం చేసి "ఐ యామ్ సారీ దివ్యా, నన్ను క్షమించు" అని ఒకే అర్థాన్ని ఇచ్చే రెండు వాక్యాలు మాట్లాడాడు. అంతే. అతను అలా మాట్లాడకుండా ఉన్నా బాగుండేది.

దివ్య చివాలున తల ఎత్తింది. అందమైన ఆమె కళ్ళు ఆవేశంతోనూ దుఃఖంతోనూ ఎర్రబడ్డాయి. ఆమె మనసు ఏ క్షణంలో అయిన బరస్ట్ అవ్వబోయే అగ్నిపర్వతంలా ఉంది. మనసులోని ఆవేశం ముఖంలో ప్రతిఫలిస్తున్నది. కోపంతో, బాధతో ఎండుటాకులా వాడిపోయి ఉంది. అంతకంటే మించి ఆవేదన.

ప్రశాంత్‌వైపు తీక్షణంగా చూస్తున్నది. "నాకు ఇష్టం లేనిది మీరు ఎలా చేయగలిగారండి, మీరు నన్ను నమ్మించి మోసం చేశారండి, మిమ్మల్ని దేవుడు క్షమించడు, మీకు కావలసింది శారీరకమైన సుఖమే, మీ మగబుద్ధి చూపించారండి, అందరిలా మీరు ఓ మట్టి మనిషి అని రుజువు చేశారండి" అంది తీవ్రంగా.

ప్రశాంత్ తప్పుచేసిన వాడిలా తల వంచుకొని నిలబడి ఉన్నాడు.

"ఏమిటండి మాట్లాడరు...." రెట్టించింది.

"....ఏమని మాట్లాడను దివ్య? నా అంచనాలన్నీ నన్ను వెక్కిరిస్తున్నాయని మాట్లాడనా, ఇన్ని రోజుల మన స్నేహాన్ని, ప్రేమను, అభిమానాన్ని, ఆప్యాయతను మరిచి 'నువ్వు నన్ను మోసం చేసిన మోస గాడివి' అని చెప్పినందుకు ఆనందంతో మాట్లాడమంటావా?

"నిన్ను శారీరకంగా కోరుకొనే వాడినే అయితే ఇంతవరకు ఆగ వలసిన అవసరం ఏముంది దివ్య? నువ్వు నా దానివి అనుకున్నాను. నీకు ఏ కష్టం వచ్చినా నాకు వచ్చినట్లే తల్లడిల్లి పోయాను. నీవే నా సర్వస్వం అనుకున్నాను, నువ్వు తప్ప నాకు మరో జీవితం లేదను కున్నాను." అతని గొంతులో బాధ, అవమానంతో గొంతు పూడుకు పోయింది. అతను గొంతులో నుంచి కాక గుండెలో నుంచి, మనసులో నుంచి మాట్లాడు తున్నట్లు అనిపిస్తుంది, ఆ మాటల్లో నిశ్చలత, నిలకడ ఉన్నాయి.

"దివ్య....మనం ఒంటరిగా కలిసి ఎన్నో గంటలు గడిపాం. ప్రతి క్షణం నువ్వు కేవలం నా దానివే అనుకున్నాను. నువ్వు నాతో రిసార్ట్‌కు వచ్చేప్పుడు నా ప్రేమ ఫలించిందని మురిసిపోయాను. ఇక్కడ రూమ్ కోసం మన పేర్లు భార్యాభర్తలుగా వ్రాయించినప్పుడు నువ్వు ప్రక్కనే ఉన్నావు. అప్పుడు నువ్వు నా భాగస్వామివి అయ్యేవని అనుకున్నాను. గుడిలో పూజారి మన ఇద్దరి పేరు మీద అర్చన చేసినప్పుడు మన మిద్దరం దేవుని దృష్టిలో ఒకటయ్యామనుకున్నాను. దేవాలయ ప్రాంగణంలోనే నీ మెడలో కాశీదారంతో మూడు ముళ్ళు వేసినప్పుడు నువ్వు నిజంగా నా దానివే అనుకున్నాను - కానీ దివ్య, నువ్వు నన్ను ఒక పిచ్చివాడిలా చూశావు. చాలు దివ్య ఈ నమ్మకం....ఈ మర్యాద" అన్నాడు బాధగా.

"నన్ను క్షమించండి, నా మనసు అంగీకరించటం లేదు" అంది.

"వొద్దు దివ్యా! సంజాయిషీలు, క్షమాపణలు. నిన్ను నా దానివి అనుకున్నాను. కానీ, నీ మీద నాకు ఏ రకమైన హక్కు లేదని చెప్పావు. చాలు; నేను నిన్ను ఏ రకంగానైనా మనసు నొప్పిస్తే నన్ను మన్నించు, మరలా ఇక ఎప్పుడు ఇలాంటి తప్పులు జరగవు, నన్ను మరచి...." దూరంగా ఎక్కడో పిడుగుపడ్డ శబ్దం. అంతకంటే భయంకరంగా దివ్య గుండెలో పడింది పిడుగు.

అందమైన కలలో అపశ్రుతి.

దివ్య డబల్‌కాట్ మంచం మీద కూర్చొని నిర్జీవంగా ఆలోచిస్తూ ఉంది. ప్రశాంత్ సోఫాలో కూర్చొని తీక్షణంగా ఏదో ఆలోచిస్తున్నాడు.

ఒకే గదిలో ఉంటూ అపరిచితులులా ఉన్నారు ఇద్దరు. ఇద్దరి మధ్య నిశబ్దం రాజ్యమేలుతున్నది. బయట వర్షం జోరు తగ్గలేదు ఇంకా.

ఆ గదిలో దాదాపు శ్మశాన నిశబ్దంగా ఉంది. ఆ నిశ్శబ్దంలో అక్షర శబ్దీకరణ చేస్తూ "ఏమండి...." అంది దివ్య.

ప్రశాంత్ సోఫాలో నుండి లేచి నిలబడ్డాడు. కాని, ఆమె పిలుపుని ఏమాత్రం పట్టించుకోవటంలేదు.

మంచం దిగి అతని ముందుకు వచ్చి "ఏమండి, నన్ను క్షమించండి, ఆవేశంలో మిమ్మల్ని ఎన్నో మాటలు అన్నాను, నన్ను క్షమించండి," అంది.

ప్రశాంత్ దివ్యవైపు కనీసం చూడటం లేదు.

ఆకాశం ఉండి ఉండి గర్జిస్తున్నది సింహంలా. ఆకాశం పగిలిపోయే భయంకరమైన పిడుగుపడ్డ శబ్దం.

దివ్య సుడిగాలిలా వచ్చి ప్రశాంత్‌ని చుట్టేసింది.

ఆకాశం ఇంకా భయంకరంగానే గర్జిస్తూనే ఉంది. ఆకాశం బ్రద్ద లయ్యేటట్లుగా ఉంది. ప్రశాంత్ దివ్యను బలంగా వొదిగి పట్టుకున్నాడు ఆమె అతని గుండెలమీద సెక్యూర్‌గా ఫీల్ అవుతున్నది.

అప్పటివరకు ప్రశాంత్ కాని, దివ్యకాని ఎవరిని కౌగిలించుకో లేదు. ఇరువురి గుండెలు దడదడలాడుతున్నాయి. ఆమె పెదవులు సన్నగా వణుకుతున్నాయి. దివ్య ముఖారవిందం ఎంతో ఇన్నొసెంట్‌గా ఉంది.

అప్రయత్నంగా ఒకరి కళ్ళలోకి ఒకరు సూటిగా చూసుకుంటు న్నారు. ఆమెకు అంతకు ముందు ఎప్పుడులేని భద్రతను పొందినట్లుగా ఉంది. ప్రశాంత్‌కు ఎప్పుడు పొందని ఒకరకమైన పులకింతగా ఉంది.

ఇద్దరి మనసుల్లో కోర్కెలు పురివిప్పి నాట్యం చేయసాగాయి. ఆమె బ్లౌజ్ హఠాత్తుగా బిగుతుగా మారింది. ప్రశాంత్ తన పెదవులతో ఆమె పెదవులతో కలిపాడు. కరెంట్‌షాక్‌లా అనిపించింది. నెగిటివ్ పాజిటివ్ కలుసుకున్నాయి సర్క్యూట్ పూర్తియింది. కన్య పెదవుల పరిమళం ఉధృతంగా ఉంది.

ఇరువురి శరీరాలు మరింత దగ్గరవుతున్నాయి.

కొన్ని నిముషాల క్రితం ఎంతో లాజిక్‌గా మాట్లాడిన దివ్య ఇప్పుడు రీజనింగ్‌ను మనసు ముంగిటకు రానివ్వని స్థితికి చేరుకుంది. వాళ్ళకు మెదడు ఉంది కాని, అది ఇప్పుడు పనిచేయుటంలేదు. హృదయం మాత్రం స్పందిస్తుంది. ఏ మత్తుకు అందని మైకంలో తేలిపోతున్నారు. తన్మయత్వం, లాలిత్యం, మోహం, తృష్ణ, మమత అనే నిర్వచనాలకి అందని భావమైకంలో ఉన్నారు. ఒకరి స్పర్శ మరొకరి ఇంద్రజాలంలా పనిచేస్తోంది. ఆమె వంట్లో రక్తం ఉరకలు వేస్తోంది. అతని నరాలన్నీ పట్టుతప్పుతున్నాయి. అతని స్పర్శ ఎంతో హాయిగా ఉంది. వాళ్ళు దివ్య లోకాలు చేరుకున్న ఒక భ్రాంతిలో ఉన్నారు.

సమ్మోహనంగా పూలతీగలా ప్రశాంత్‌ను చుట్టేసింది. అది అర్థం కాని, అదో ఆనందస్థితి. "ఒక స్థితి దాటిన తర్వాత కోరికలను నిగ్రహించు కోవటం అసాధ్యం" అనే ఒక వాక్యాన్ని ప్రాక్టికల్‌గా నిరూపించ బోతున్నారు.

ఆమె అతన్ని మృదువుగా కూడా నిరాకరించలేకపోతున్నది.

వంటిలోని అణువణువు పులకరించి పోతున్నది. అతని బలమైన కౌగిలిలో ఉక్కిరి బిక్కిరిగా ఉన్నా, అందులోనే ఎంతో హాయిగా ఉంది.

ఇద్దరిలో ఏదో తెలియని అనుభూతి ఆవరించింది. ఒంటిలో ఏదో తీయని బాధ క్షణ క్షణానికి పెరగసాగింది.

హృదయంలోని కోర్కెలకు ప్రతీకలుగా ఆమె ముక్కు పుటాలు అదురుతున్నాయి.

ప్రశాంత్ చేయి మెల్లగా ఆమె జాకెట్ వీపుమీద పడింది. హుక్స్ ఒక్కొక్కటి ఫట్ ఫట్ మంటూ విడిపోయాయి. రెప్ప వేయకుండా ఆమెనే ఆర్తిగా చూస్తు జాకెట్‌ను ఆమె భుజాల మీద నుండి తొలగించాడు. బ్రాసరి స్థానభ్రంశం చెందింది. ఆమె మీద ఉన్న దుస్తుల్ని ఒక్కొక్కటిగా తీసివేయ సాగాడు. దివ్య ట్రాన్స్‌లో ఉన్నట్టుగా ఏమాత్రం అడ్డు చెప్పకుండా సహకరిస్తోంది.

పసుపు పచ్చని శరీరం, నున్నగా గాజులా మెరుస్తోంది. రోజా రంగు బుగ్గలు, గుండ్రటి విశాలమైన భుజాలు, పాలవెల్లువ లాంటి వక్ష సంపద, రోజా రంగు సన్నటి నడుము, తెల్లటి శరీరంపై దిష్టి చుక్కలా బొడ్డు. ఆ తరువాత ఏటవాలుగా ... ఆమెలోని అన్ని అవయవాలు తీర్చి దిద్దినట్లుగా ఉన్నాయి.

ఆమె మెత్తటి హృదయం మీద ముఖాన్ని మోహంగా - కాంక్షగా ముద్దాడాడు. అర్థంకాని కోరికతో రగిలిపోతూ హత్తుకున్నాడు.

జీవితంలో అంతవరకూ ఇంత అపురూప అద్భుతమయిన సంఘటనలో పాల్గొనకపోవటవల్ల, అద్భుతమైన రసభావం పలుకుతున్నది.

ఇద్దరిమధ్య సిగ్గుపొరలు ఒక్కొక్కటిగా వీడిపోయాయి. మన్మథ సామ్రాజ్యంలోని రతీ, మన్మథుల్లా ఉన్నారు.

ఒళ్ళంతా ముద్దులతో తడిపేశాడు. ఆమె పులకరింతగా విల్లులా వెనక్కి వంగింది. ఆ తరువాతే అతన్ని తనమీదకు గట్టిగా లాగి, తీగలా అతన్ని అల్లుకుంది.

హృదయంలో ఏదో తెలియని అనిర్వచనీయమైన ఆనందం.

ఇద్దరి శరీరాల మీద నూలు పోగుకూడా లేదు. బయట ఒక ప్రపంచం ఉన్నదన్న ధ్యాసే లేదు.

ఎంత నేర్చిన, ఎంత చూసిన, ఎంత వారలైన ఇంతే.... అనే విధంగా ఎంత పెద్ద డాక్టర్ అయినా మొదట మనిషి, ఆ తరువాతే తన హోదా, పరపతి. సృష్టిలోని ప్రతిజీవి సమానం అనే ఓ చక్కటి సాదృశ్యం.

డబల్ కాట్ మంచం మీద అతడు ఆమెను ఆక్రమిస్తున్నాడు. అతడు ఆమెలో, ఆమెలో అతడు కరిగి ఒకటౌతున్నారు.

ఇద్దరికి ఇంతకి మించిన హాయి, ఆనందం లేదనిపిస్తోంది.

అతని మనసు అంతుచిక్కని ఆనందంతో ఊగిపోతున్నది. అది ఊపిరాడనివ్వని సంచలనం. ఆమె మనసు శరీరం ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది, ఆమె కళ్ళు బరువుగా కమ్ముతున్నాయి. అవ్యక్తమూ, అలౌకికము, అసామాన్యము అయిన ఒకానొక అద్భుతస్థితికి జారిపోయింది.

అతని బలమైన కుడిచేతిలో ఆమె ఎడమ చేయి. అతడి వీపుమీద ఆమె చేతులు బలంగా చుట్టుకున్నాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేగాన్ని పుంజుకున్నాయి.

ఈ కన్యకు ఇక వేరేమీవద్దని అనిపించే వెచ్చటి అనుభవం పొందు తున్న అనుభూతి. మధురంగా- తియ్యని రాగంలా గుండె లోతుల్లో తాకు తుంది ఆ భావం.

కొన్ని క్షణాలు అమృతం కురిసింది.

ఆమె కళ్ళు మూసుకొని ఉంది. రెప్ప విప్పితే గుండె గదిలో రూపు దిద్దుకుంటున్న మధురస్వప్నం ఎక్కడ చెదిరిపోతుందోనని కళ్ళు మూసు కొనే ఉంది.

ఇరువురి శరీరాల్లో వేడి చల్లారింది.

అయిపోయింది....అంతా అయిపోయింది.

అతడి వక్షస్థలం మీద ఆమె తలవాల్చి ఉంది.

ఎవరి శరీరం మీద దుస్తులు లేవు. అయినా వారికి ఏమీ అనిపిం చటంలేదు.

ఆమె కళ్ళ నుంచి జారిన వెచ్చటి కన్నీటిచుక్క ప్రశాంత్ వక్షం మీద పడింది. ఉలిక్కిపడి లేచి, దివ్య కళ్ళలోకి చూశాడు. ఆమె కళ్ళ నిండా కన్నీరుసుడులు తిరుగుతున్నాయి.

''ఏమయింది దివ్య....?'' అన్నాడు. నిజానికైతే ఏం జరిగిందో ఇద్దరికి తెలుసు.

దివ్య ఏమి చెప్పకుండా శోకదేవతలా ఏడుస్తూనే ఉంది.

''బాధపడకు దివ్య, జరిగినదానిలో నీ తప్పు ఏమీలేదు. నా హౌస్ సర్జన్సీ అయిపోయిన వెంటనే మన మిద్దరం పెళ్ళి చేసుకుందాము. ఇంకా ఎంత? ఆరు నెలల్లో నా హౌస్ సర్జన్సీ అయిపోతుంది....'' అన్నాడు ఓదా ర్చుతూ అనునయంగా.

నిజాయితీకి ప్రతిరూపంగా ప్రశాంత్ ముఖంలో ఏ భావం లేదు. చాలా కూల్‌గా ఉన్నాడు.

* * *

ఆదివారం మధ్యాహ్నం భోజన సమయానికి దివ్య, ప్రశాంత్ వేరు వేరుగా తమ తమ క్వాటర్స్‌కి చేరారు.

అప్పుడు వాళ్ళు ఓ నమ్మలేని వార్త వినవలసి వచ్చింది.

డాక్టర్ సత్యనారాయణ గారిని యాంటికరప్షన్ వాళ్ళు రెడ్ హ్యాండడ్‌గా పట్టుకున్నారని.

సత్యనారాయణ గారంటే హాస్పటల్‌లో అందరికీ హడలే. ఆయన రౌండ్స్‌కు వచ్చారంటే ఏటూ జెడ్ అన్నీ అడిగి తెలుసుకుంటూ ఉంటారు. అప్పుడప్పుడు నైట్‌డ్యూటీ వాళ్ళను చెక్ చేయటంకోసం వచ్చే వారు. కానీ మనిషి చాలా సున్నితమైన స్వభావం. మనిషి గంభీరంగా ఉన్నా, చాలా సింపుల్‌గా ఉంటారు. మంచి డాక్టర్- ఎప్పుడూ చిరు నవ్వుతో కనిపించేవారు.

హాస్పిటల్‌లో ఆయన అంటే కొంతమందికి గిట్టదు. నిర్లక్ష్యంగా, అవినీతిగా ప్రవర్తించే వారికి ఆయన సింహస్వప్నంగా నిలిచారు. పేషంట్స్‌కు పెట్టే భోజనం, పాలు, పండ్లు లాంటివి అందరికీ అందు తున్నాయో లేదో చాలా జాగ్రత్తగా పరిశీలించేవారు. ఆయనది పసిపాప మనస్తత్వం. ఎప్పుడూ నవ్వుతూ కనిపించే ఆయన ముఖంలో ఎలాంటి కల్మషభావం ఉండేదికాదు. మరి అలాంటి మంచి మనిషికి శత్రువులు ఎవరుంటారో అర్థం కావటంలేదు.

బాగా ఆలోచించిన తరువాత ఈ దేశంలో మంచివాళ్ళకు కూడా శత్రువులు ఉంటారని రజువైంది.

సాయంత్రం నాలుగు గంటలకు అభిమన్యు, ప్రశాంత్ డాక్టర్ సత్యనారాయణ గారిని పరామర్శించటానికి బయలుదేరారు. దారిలో లేడీస్‌వార్డు దగ్గర స్నేహిత, దివ్య కనిపించారు.

దివ్య "ఎక్కడికి డాక్టర్స్ బయలుదేశారు" అంది ప్రశాంత్ అభి మన్యులవైపు చూస్తూ.

చెప్పారు. "ఇలాంటి సమయంలో మనుషులకు తోటివారి సాను భూతి ఓదార్పే కావలసింది" అన్నాడు అభిమన్యు.

వెంటనే దివ్య అందుకొని "నిజం డాక్టర్, కాని సత్యనారాయణ గారి లాంటి మంచి వ్యక్తికి ఇలాంటి దశ రావటం మహాదారుణం. రిటైర్ మెంట్ కు పోబోయే ముందు ఇలాంటి దారుణాన్ని ఎలా భరిస్తారో...." అని ఇంకా ఏవో చెప్పబోయి, ఏమి చెప్పాలో అర్థంకాక అలా అసం పూర్తిగా వదిలేసింది.

"మేమూ వెళ్ళి పరామర్శించాలి అనుకున్నాము డాక్టర్, ఇంతలో మీరు కలిసారు. పదండి డాక్టర్, మేమూ వస్తాం", అంది స్నేహిత.

అభిమన్యు, ప్రశాంత్, స్నేహిత, దివ్య నలుగురు కలిసి డాక్టర్ సత్యనారాయణగారి ఇంటికి బయలుదేరారు. సత్యనారాయణగారు హాస్పటల్ అలాట్ చేసిన క్వాటర్స్‌లోనే ఉంటున్నారు. పది నిమిషాల కాలి నడక తరువాత ఇల్లు చేరారు.

ఇల్లు పెద్దదే కాని పెద్దగా అలంకరణ లేదు చాలా సాదా సీదాగా ఉంది. ఇంటి వాతావరణం చాలా ఉదాసీనంగా ఉంది.

సత్యనారాయణగారు లుంగీ కట్టుకొని ఫుల్ బనియన్‌మీద అతి సామాన్యంగా ఉన్నారు. ఆయన ఏ వేషంలో ఉన్నా, ఆయన్లో ఉండే ఠీవీ తనం ఏ మాత్రం చెదిరిపోలేదు.

నలుగురిని చూసి, "రండి కూర్చొండి...." అన్నారు.

మౌనంగా నలుగురు వెళ్ళి కూర్చున్నారు. ఓ నిమిషం తర్వాత "దిగులు పడకండి సర్, నిలకడమీద నిజం నిరూపించబడుతుంది" అంది ఓదార్పుగా స్నేహిత.

''ఇంకెక్కడి నిజం అమ్మా.... ఆ అవకాశం కూడా లేకుండా రెడ్ హ్యాండెడ్‌గా పట్టించారు'' అన్నారు సత్యనారాయణగారు.

''అసలు ఎలా జరిగింది సర్'' అని అడిగాడు అభిమన్యు.

''ఎలా జరిగిందని చెప్పను, అభి? వాళ్లు ఎవరో, నన్ను ఎందుకు ఇలా చేసారో అర్థం కావటం లేదు, వాళ్ళు ఎప్పటి నుండి ప్రయత్ని స్తున్నారో కూడా తెలియదు....

మొన్న శుక్రవారం ఉదయం నేను నా ఛాంబర్‌లో ఉన్నాను.

ఎవరో వ్యక్తి నాతో కలవటానికి వచ్చాడు. ఆ వ్యక్తి తనకు మూగవానిగా సర్టిఫై చేస్తూ సర్టిఫికెట్ వ్రాసి ఇవ్వమన్నాడు. నాతోనే చక్కగా మాట్లాడుతూ 'మూగవాడిలా' సర్టిఫై చేయమన్నందుకు నాకు కోపం వచ్చింది. అతని మీద ఆవేశ పడ్డాను. -ఆ వ్యక్తి ఓ వెయ్యి రూపాయలు నా టేబుల్ మీద ఉంచి 'ఇప్పుడు రాసివ్వండి నేను, మూగ వాడిలా సర్టిఫికెట్' అన్నాడు. నేను కోపంతో ఆ వెయ్యి రూపాయలు అతని మొహాన కొట్టి గెంటించేశాను.

తరువాతి రోజు శనివారం ఉదయం నేను హాస్పటల్‌కు తయారై రాబోతుండగా ఎవరో ఇద్దరు వ్యక్తులు నాకు ఎదురొచ్చారు. వారిలో ఒక వ్యక్తి కడుపునొప్పితో గింగిర్లు తిరిగిపోతున్నాడు. ఆ వ్యక్తులు ఇద్దరు దాదాపు ఏడుపుముఖాలతో ఉన్నారు. 'ఉదయం నుంచి ఒకటే కడుపు నొప్పితో తల్లడిల్లిపోతున్నాడు, మీ హస్తవాసి మంచిదని మీ దగ్గరికి వచ్చామయ్యా - దయ తలచండయ్యా' అన్నాడు ఆ వ్యక్తులలో ఒకడు. (వాస్తవానికి అయితే ప్రభుత్వ డాక్టర్ ఇంటి దగ్గర కాని, ప్రైవేట్ ప్రాక్టీస్ కానీ చేయకూడదు. ఆ రూల్ సత్యనారాయణ గారికి బాగా తెలుసు కనుకే) 'హాస్పటల్‌కు రాండయ్యా, అక్కడ చూస్తాను' అన్నాను.

"అలా అనకండి బాబు, మీ చేత్తో ఏ మందు ఇచ్చినా ఇట్టే బాగై పోతుంది బాబూ", అంటూ కాళ్ళా వేళ్ళా పడ్డారు.

ఇక చివరకు వాళ్ళను చూస్తే పాపం అనిపించి "ఎప్పటి నుండి నొప్పి?" అని అడిగి ఇంటిలోకెళ్ళి ఓ బెరాల్‌గన్ ట్యాబెలెట్ ఇచ్చి "ఇది మింగి హాస్పటల్‌కు రాండి అక్కడ చూస్తాను' అని చెప్పి, హాస్పటల్‌కు బయలుదేరాను. నేను హాస్పటల్ వస్తుంటే ఆ ఇద్దరి ఆగంతుకుల్లో ఒకడు ముందుకు వచ్చి నాకు ఒక కవర్ ఇచ్చాడు. నేను డ్యూటీ వచ్చే తొందరలో ఆ కవర్ అందుకున్నాను. "ఏమిటిది....", అని అడిగాను.

"ఇంతకు ముందు డాక్టర్ వ్రాసిన మందుల వివరాల చీటి సార్" అన్నాడు ఆగంతకుడు.

నేను అప్పుడే ఆ కవర్ విప్పి చూసుకుంటే బాగుండేది కాని, చూడ లేదు. ఆ కవర్ కోట్ జేబులో పెట్టుకొని హడావుడిగా హాస్పటల్‌కు వచ్చేశాను. హాస్పటల్ పనిలోపడి ఆ కవర్ విషయమే మరచిపోయాను. తరువాత అర్ధ గంటకు యాంటి కరప్షన్ వాళ్ళు నా ఛాంబర్‌లోకి వచ్చారు.

వాళ్ళు నా ఛాంబర్‌లోకి వచ్చి రాగానే "మేము యాంటి కరప్షన్ డిపార్ట్‌మెంట్‌నుంచి వచ్చాం, మీ గది సర్చ్ చేయాలి" అన్నాడు ఆఫీసర్ లలో ఒకరు.

నాకు ఏమీ అర్థం కాలేదు. అయినా "సరే మీ ఇష్టం" అంటూ ప్రక్కకు తొలిగాను. ఆఫీసర్స్ నా చాంబర్ అంతా చిందర బందరగా శోధించటం ప్రారంభించారు. అప్పుడు గుర్తుకొచ్చింది నాకు - ఉదయం కడుపునొప్పి అని వచ్చిన ఇద్దరు వ్యక్తులు, ఆ తరువాత వాళ్ళు ఇచ్చిన కవర్ గుర్తుకు వచ్చింది. అప్పుడు నేనే కోట్ రోజులో ఉన్న కవర్‌ను బయటికి తీసాను. ఆ కవర్ ఆ యాంటి కరప్షన్ ఉద్యోగస్థులలో ఒకడు

అందుకొని కవర్ తెరచి చూశాడు. అందులో రెండు క్రొత్త ఐదువందల రూపాయల నోట్లు ఉన్నాయి. ఆ నోట్లమీద ఉన్న నెంబర్స్, వాళ్ళదగ్గర ఉన్న నెంబర్స్‌తో ట్యాలీ చేశారు. రెండు నెంబర్స్ సరిగ్గా సరిపోయాయి- అంతే" అంటూ చెప్పటం ముగించారు.

వింటున్న అభిమన్యుకు వళ్లు జలదరించింది. ప్రపంచంలో చెడ్డ వారికే కాదు మంచివాళ్ళకుకూడా శత్రువులుంటారు అని తెలిపోయింది.

"ఒక వ్యక్తిని హాస్పిటల్‌లో అడ్మిట్ చేయటం కోసం వెయ్యి రూపాయలు అడిగి లంచం తీసుకోబోతూ, ప్రముఖ డాక్టర్ సత్యనారాయణ గారు పట్టుబడ్డారు" అని పేపర్‌లో వచ్చింది.

సత్యనారాయణ ముఖం దుఃఖంగా, నిరాశగా భవిష్యత్‌లోకి చూస్తున్నారు. పిల్లలు ఇంకా చిన్న చిన్న వాళ్లే, ఇన్నిరోజులు ఉద్యోగం చేసినా స్వంత ఇల్లు కూడా నిలుపుకోలేకపోయారు. మరో మూడేళ్ళలో రిటైర్ అవ్వబోతున్నారు. ఇలాంటి సమయంలో భరించలేని మానసిక వేదన ఎదురైంది.

"…. ……" ఒక నిమిషంపాటు ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

ఆ తరువాత సత్యనారాయణ "ఆది సరే, మీ హౌస్ సర్జన్సీ ఎలా ఉంది? మీ డాక్టర్ లైఫ్‌లో ఇది ఒక టర్నింగ్‌పాయింట్. ఈ సమయం లోనే మీరు బాగా నేర్చుకోవలసింది…." అంటూ తన బాధను మరచి పోవటం కోసం కొంతసేపు ఏవో మాట్లాడారు.

ఆయన ఏం మాట్లాడుతున్నా ఆ గొంతులో భవిష్యత్ గురించి విచారం ధ్వనిస్తున్నది.

కొద్దిసేపు మాట్లాడిన తర్వాత అభిమన్యు, ప్రశాంత్, స్నేహిత, దివ్య భారమైన హృదయాలతో డాక్టర్ సత్యనారాయణగారి ఇంటి నుంచి బయలుదేరారు.

* * *

ఉమేష్‌ని స్కాన్ విభాగంనుంచి రేడియాలజీ విభాగానికి మార్చారు. హౌస్‌సర్జన్‌లను ఒక్కొక్క నెల ఒక్కొక్క వార్డులోకి మారుస్తూ ఉంటారు ప్రతి నెల. ఈ సెక్షన్‌లో ఉమేష్‌కి పెద్ద పని ఉన్నట్లుగా అనిపించటంలేదు. ఈ సెక్షన్‌లో చేయవలసిన ముఖ్య పని ఎక్స్‌రే ఫోటోస్ చూసి డయాగ్నసిస్ చేయవలసి ఒంటుంది. పేషంట్స్ సాధారణంగా రారు. ఆ సెక్షన్‌లోకి ఎవరు వచ్చినా వారితో ఏదో ఒకటి మాట్లాడుతూ ఒక పట్టాన వదలడు ఉమేష్.

వార్డ్‌బాయ్ భీమ్‌రావ్ వచ్చాడు సెక్షన్ ఊడవటం కోసం.

ఉమేష్ సాధారణంగా తను అనుకునేది ఇతరులపై అప్లయ్ చేసి మరీ చేస్తాడు. అందులో భాగంగానే ''ఏం భీమ్‌రావ్, పెళ్ళెప్పుడు?''

భీమ్‌రావ్‌కు ఇరవై మూడు, ఇరవై నాలుగు సంవత్సరాలు ఉంటాయి.

పెళ్ళిమాట ఎత్తగానే ఆనందంతో, సిగ్గుతో పిల్లిమొగ్గ లేశాడు వార్డ్‌బాయ్.

ఉమేష్ తన కోరికను ఇతరులపై అప్లయ్ చేసి మరీ చెప్తాడు. నిజానికైతే అతనికే పెళ్ళి కోరిక పుట్టింది. కాని, పైకి మాత్రం పెద్ద మనిషి తరహాలో ''మరీ అంత సిగ్గుపడకయ్యా, పెళ్ళికి కాస్త ఉంచుకో.. అది సరే కాని భీమ్, ఏమంటుంది మీ మేడమ్? ఎంతవరకు వచ్చింది మీ వ్యవహారం?'' అన్నాడు. భీమ్‌రావ్ ఎప్పుడు కనిపించినా అలా అడగటం ఉమేష్‌కు అలవాటే.

అతని మాటలు ఎవరైనా వింటారని వార్డుబోయ్ ఇటు అటు చూసి ''మీరు ఊరుకోండి సార్! నే నెక్కడ? త నెక్కడ. తను తెల్లటి నర్స్ బట్టల్లో సీతాకోక చిలుకలా ఉంటుంది. నేనిక్కడ ఈ ఫినాయిల్ వాసనతో....'' అని నొచ్చుకున్నాడు.

"అయితే ఏం నువ్వు మనిషివి కాదా...." ఉమేష్ పెద్ద మానవతా వాదిలా ఓ పోజ్ పెట్టాడు.

వార్డుబాయ్ సిగ్గుపడుతూ "అవునుకదూ, నేను మనిషినే కదు" అని వాపోయాడు మనసులోనే.

అమాయకుల్లో ఇలా కోరికలు రెచ్చగొట్టటం ఒక వ్యాధిలాంటిదే. ప్రపంచంలోని మనుషులకు ఒక్కొక్కరికి ఒక్కొక్కటి అంటే ఇష్టం ఉంటుంది. ఇలా చెప్పటం అంటే ఉమేష్‌కు మహా ఆనందం. ఒక మనిషి తన కోరికలను స్పష్టంగా చెప్పకపోయినా అతని అభిరుచులకు, అతను చేసే పనులకు, అతను ఆశించే ఫలితానికి అవినాభావ సంబంధం ఉంటుంది కాని, అందరూ సామాన్యంగా కోరుకొనేది సుఖప్రదమైన జీవితం. ఉమేష్‌లో మాత్రం ఆలోచనలు ఎప్పుడు సుఖం గురించే కాని, జీవితం గురించి ఉండవు. అతని దృష్టిలో స్నేహం అనే పదానికి, నీతి అనే పదానికి అర్థాలే వేరుగా ఉన్నాయి.

పెళ్ళికాని ఏ ఆడపిల్లను చూచినా తనకు కాబోయే భాగస్వామి అయితే ఎలా ఉంటుంది అనుకుంటూ ఉంటాడు. వార్డులలో తిరిగే సిస్టర్స్‌ని సైతం ఆశగా చూసేవాడు.

మనిషి ప్రతి విషయాన్ని నోటితోనే చెప్పవలసిన పనిలేదు మనిషి లోని భావాలకు ప్రతీకలు అతని కళ్ళు. మనం ఎంత దాచుకుందామను కున్నా దాగనివి మన కన్నులు చెప్పే భావాలు. కళ్ళు మాత్రం చాలా ఎక్కువ మోతాదులో భావాలు ప్రకటిస్తుంటాయి-ఆడపిల్ల కనిపిస్తే.

పెళ్ళి అయిన నర్సులు ఉమేష్ చూపులను ఛీ కొట్టేవి. పెళ్ళికాని నర్సులు కొందరు సిగ్గుతో తప్పించుకుంటే, మరికొందరు అసహ్యించుకొనే వారు.

ఉమేష్‌కి ఎక్స్‌రే వార్డ్‌లో ఏమి పని లేకపోవటం చేత ఏదో ఆలోచల్లో మునిగి తేలుతున్నాడు. ప్రశాంత్, దివ్య కలిసి సినిమాలకు షికార్లకు వెళ్ళటం గుర్తుకు వస్తున్నది. వాళ్ళిద్దరు ఎలా ప్రేమించుకోటం మొదలు పెట్టారో అని ధర్మ సందేహం కలిగింది. ప్రశాంత్‌తో ఈ విషయం తెలుసుకోవాలి అనుకున్నాడు. అనుకోవటమే ఆలస్యం.

ఓ.పి. వార్డ్‌లో ప్రశాంత్ ఉన్నాడని తెలుసు. ఉమేష్ లేచి ఒ.పి. వార్డ్ వైపు నడుస్తున్నాడు తన ధర్మ సందేహం తీర్చుకోవటం కోసం.

కాని, ఆ క్షణాన అతనికి తెలియదు. ఆ వార్డ్‌లో అతనికి ఘోర అవమానం జరగబోతుందని.

సమయం ఉదయం పదిగంటలేఅయినా ఎండ మండిపోతున్నది.

ఓ. పి. వార్డ్‌లో పేషంట్స్ చాలా మంది ఉన్నారు. ప్రశాంత్ ఉన్న ఛాంబర్‌వైపు నడుస్తున్నాడు ఉమేష్. తాను ఆ వార్డ్‌లో రెండు నెలల క్రితమే పనిచేసాడు.

ప్రశాంత్ ఛాంబర్‌లోకి వెళ్ళాడు.

ప్రశాంత్ ఒక రోగిని టెస్ట్ చేస్తున్నాడు. ఉమేష్ రావటం గమనించి "హలో ఉమ, రారా కూర్చో, ఏమిటి ఏ వార్డ్‌లో ఇప్పుడు డ్యూటీ?" అడిగాడు.

చెప్పాడు.

"ఏమిటి విశేషాలు...." అని పరామర్శగా అడిగాడు కాని, ఉమేష్ సమాధానానికి కూడా ఆశించకుండా వార్డ్ బాయ్ వైపు చూస్తూ "తరువాత పేషంట్‌ని పిలూ" అన్నాడు వార్డ్ బాయ్‌ని ఉద్దేశించి.

ఉమేష్ ఏదో చెప్పబోయాడు.

కాని సరిగ్గా అప్పుడే ఒక రోగి ఊపిరి తీయకుండా దగ్గుకుంటూ ప్రశాంత్ ఛాంబర్ లోపలికి వచ్చాడు.

ప్రశాంత్ ఆ వ్యక్తిని డయాగ్నసిస్ చేసి పదినిమిషాల తరువాత ఆ వ్యక్తిని అడ్మిట్‌కు వ్రాశాడు. ఆ ఫార్మాలిటీస్ పూర్తి చేసేసరికి మరో పది నిమిషాలు పట్టింది.

ఉమేష్ తన ధర్మ సందేహాన్ని ప్రశాంత్‌తో అడగబోయాడు. అంతలో ప్రశాంత్‌కి ఫోన్ వచ్చిందని వార్డ్ బాయ్ వచ్చాడు. (గౌర్నమెంట్ హాస్పటల్స్‌లో ప్రతి డాక్టర్ దగ్గర ఫోన్ ఉండదు-గమనించండి.)

"ఉమ! ఇక్కడే ఉండు, నేను ఇప్పుడే వెళ్ళి ఫోన్ అటెండ్ చేసి వస్తాను" అంటూ ఫోన్ కాల్ అటెండ్ చేయటానికి ప్రశాంత్ వెళ్ళాడు.

"సరే త్వరగా వచ్చెయి...." అన్నాడు నిరుత్సాహంగా తన ధర్మ సందేహం తీరలేదని.

ఉమేష్ పది నిమిషాలు కూర్చున్నాడు, ప్రశాంత్ వచ్చే సూచనలు ఏమీ కనిపించలేదు. పది నిమిషాలు వెయిట్ చేశాడు కాని, ఇంకా ప్రశాంత్ రాలేదు. ఉమేష్ బోర్‌గా ఫీల్ అయి ఓ పేషంట్‌ని పిలిచి ఒకర్ని టెస్ట్ చేస్తే అన్నా టైమ్ పాస్ అవుతుంది అనుకొని, బాయ్‌ని పిలిచి, "నెక్ట్ పేషంట్‌ని పిలువు" అన్నాడు.

"సరే సార్...." అని వెళ్ళి ఒక పేషంట్‌ని పిలిచాడు.

ఒక వ్యక్తి తూలుకుంటూ లోపలికి వచ్చాడు. ఆ వ్యక్తి ఛాంబర్‌లోకి రావటంతోటే భయంకరమైన చౌకధర సారాయి వాసన రూమ్ అంతా అలుముకుంది.

అదే ఉమేష్ తన వార్డ్‌లో అయి ఉంటే ఆ పేషంట్‌ని నిర్దయగా బయటికి పంపించేవాడు. "ఏదో టైమ్ పాస్‌కు ఒక పేషంట్‌కు టెస్ట్ చేద్దాం అనుకుంటే ఈ తాగుబోతు వచ్చాడేంటిరాబాబూ!" అని మనసులోనే అనుకుంటూ పేషంట్‌ని కూర్చోబెట్టి జనరల్ నెసెసరీ హిస్టరీ తీసు

కున్నాడు. ఆ వ్యక్తి నుండి వచ్చేసారా వాసనకు ఉమేష్ కడుపులో తిప్పేస్తుంది. అయినా ఓపికగా భరిస్తున్నాడు.

ఆ వ్యక్తిని దయాగ్నసిస్ చేయటం కోసం వీపు మీద స్టెతస్కోప్ పెట్టి, "ఒకసారి దగ్గు" అన్నాడు ఉమేష్.

"రాత్రి అంతా దగ్గాను బాబు, ఈ మాయదారి దగ్గు నయం అవుతుందంటే ఈ రోజు ఉదయమే కాస్త తీర్థం పుచ్చుకున్నాను...." అన్నాడు. (తీర్థం అంటే సారాయి అని విశాల అర్థం. పాఠకులు గ్రహించాలి.)

"కాస్త ఏం ఖర్మ, ఓ పీపా పుచ్చుకోవాల్సింది. అంతటితో 'హరీ' అని ఉండేవాడివి, మా పీడా విరగడ అయి ఉండేది.'' ఉమేష్ కోపంగా, కసిగా అనుకున్నాడు.

''సరే మంచి పని చేశావు, ఒకసారి చిన్నగా దగ్గు ఇప్పుడు." స్టెతస్కోప్ వీపు మీద పెట్టి అడిగాడు.

''రాత్రి అంతా దగ్గాను డాక్టర్ బాబు, ఇది చాలక ఇప్పుడు మళ్ళీ దగ్గమంటే ఎట్టా బాబూ? నేను అబద్ధం అడతానా మీ అయ్యలాంటోన్ని" అని ఉమేష్ తలమీద చేయి వేయబోయాడు.

కాని, ఉమేష్ అతని చేయి మీదపడకుండా లాఘవంగా తప్పించుకున్నాడు. ఆ వ్యక్తి మీద భరించలేనంత కోపం వచ్చింది.

ఆ పేషంట్‌ని ఎలా దయాగ్నసిస్ చేయటమో అర్థం కావటం లేదు. పేషంట్‌ని బయటికి గెంటించేద్దామా అంటే అది తన వార్డ్ కాదు. దయాగ్నసిస్ చేద్దామా అంటే సహకరించటం లేదు. ఎలా చేయాలి అని ఆలోచిస్తూ ఉమేష్ ఓపిక కొని తెచ్చిపెట్టుకొని "చూడు పెద్దాయన ఒకసారిదగ్గు'' అన్నాడు కోపాన్ని అణచుకుంటూ.

"ఏమయ్య డాక్టరు, నేను నీకు అబద్ధాలాడే వాడిలా కనిపిస్తున్నానా?" అని మొదలుపెట్టి ఆ తాగుబోతు పేషంట్ ఏదేదో మాట్లాడుతున్నాడు.

ఉమేష్‌కు మెదడులో ఓ ట్యూబ్‌లైట్ లాంటి ఐడియా ఫ్లాష్ అయింది. అది ఏమిటంటే. సాధారణంగా నీళ్ళు త్రాగే సమయంలో మనిషిని ఒక్కసారిగా కదిలిస్తే పొర మారుతుంది. అలాంటప్పుడు ఆ నీళ్ళుత్రాగే వ్యక్తి కనీసం నలభై నుంచి యాభై సెకన్స్‌పాటు దగ్గుతాడు అని ఒక సూత్రం ఉంది. అలాగే ఏకధాటిగా గుక్క తిప్పుకోకుండా మాట్లాడే వ్యక్తికి అకస్మాత్తుగా కుడిదవడమీదకాని, ఎడమదవడమీదకాని చిన్నగా కొడితే ఆ వ్యక్తికి పొర మారుతుంది. అలాంటి సమయంలో వ్యక్తి ఇరవై నుంచి ముప్పయి సెకన్స పాటు దగ్గుతాడు 'అని ఎవరో చెప్పినట్లు గుర్తు.

టేబుల్ మీద నున్న నీళ్ళ గ్లాస్ ఆ తాగుబోతు పేషంట్‌కు ఇస్తూ "ఈ నీళ్లు త్రాగు" అన్నడు ఉమేష్ అనునయంగా.

కానీ, ఆ తాగుబోతు పేషంట్ మాత్రం ఆ నీళ్ళను అనుమానంగా చూస్తూ. "నువ్వెక్కడి డాక్టర్‌వయ్య బాబు? రాత్రి అంతా ఒకటే దగ్గుతో చచ్చిపోయాను అంటే నమ్మకుండా, దగ్గమంటావు. దగ్గు రావటంలేదు, నేను దగ్గనూ అంటే ఇప్పుడు అదేదో త్రాగమంటున్నావు నేను త్రాగను. నాకు సూది మందు రాసీవయ్యా నే పోత" అన్నాడు ఆ తాగుబోతు పేషంట్ మొండిగా.

గౌర్నమెంట్ హాస్పటల్స్‌కు వచ్చే ఎక్కువ మంది పేషంట్స్ తమకు ఇంజక్షన్ వ్రాయమని ప్రాధేయపడుతుంటారు - ఇది చాలా మామూలు విషయమే.

కాని ఈ పేషంట్ త్రాగి ఉన్నాడు కనుక ఇష్టం వచ్చినట్లు మాట్లాడేస్తూ ఉన్నాడు. ఆ వ్యక్తి మాటలకు కామా, ఫుల్‌స్టాప్ లేదు. ఏకధాటిగా, ధారాళంగా మాట్లాడుతున్నాడు.

ఉమేష్ ఆ వ్యక్తి వైపు సూటిగా చూసి కుడి దవడ మీద చిన్నగా తన కుడిచేతితో ఒక దెబ్బవేశాడు (ఉమేష్ అంచనా ప్రకారం ఏకధాటిగా మాట్లాడే వ్యక్తికి దవడమీద చిన్న దెబ్బవేస్తే ఆ మాట్లాడే వ్యక్తికి పొర తుంది. అందువలన ఆ వ్యక్తి ఇరవై సెకన్స్ పాటు దగ్గాలి. అప్పుడు తాను దయాగ్నిసిస్ చేయవచ్చునని ఉమేష్ నమ్మకం.)

కాని వింతగా ఆ తాగుబోతు వ్యక్తికి ఏ మాత్రం దగ్గు రాలేదు, సరికదా విపరీతమైన కోపంతో "నన్ను కొడ్తావా, మీ అయ్యలాంటోన్ని. నీవు అసలు డాక్టర్‌వేనా...." అని తిట్లకు లంఖించుకోటమే కాక తన చేతిబలంకొద్ది ఉమేష్ చెంపమీద కొట్టాడు.

ఆ దెబ్బకు చెంప పగిలినంత పని అయింది. తాగి ఉన్న వ్యక్తి అంత బలంగా కొడ్తాడని కాని, తన ప్రయోగం మీద అలా రియాక్ట్ అవుతాడని కాని ఊహించలేకపోయాడు.

జీవితంలో ప్రతి ఒక్కరు ఎప్పుడో ఒకసారి షాక్ తింటూ ఉంటారు. అలాంటి షాక్ తిన్నాడు ఉమేశ్.

సరిగ్గా అప్పుడే బయటినుండి ప్రశాంత్, వార్డుబాయ్ లోపలికి వస్తూ ఆ దృశ్యం చూసారు. మొగుడు కొట్టాడని కాదు, ఆడపడుచు నవ్వించని అనే స్థితిలా ఉంది ఉమేష్ పరిస్థితి.

ఉమేష్ డ్యూటీ అవర్‌లో తన వార్డులోనే ఉండి ఈ విషయం జరిగి ఉండి ఉంటుంటే పెద్ద హంగామా అయి ఉండేది. కాని ఉమేష్ తన వార్డువదిలి వేరే వార్డులోకి రావటం పొరపాటు. చీఫ్‌కు తెలిసిన

అనవసరంగా రభసే కాని ప్రయోజనం ఏమీలేదని తెలిసి తేలుకుట్టిన దొంగలా నోరు మెదపలేదు.

ఎవరు పనిగట్టుకొని ప్రచారం చేశారో కాని, ఉమేష్‌ను ఎవరో తాగుబోతు పేషంట్ చెంపమీద కొట్టాడన్న విషయం హాస్పటల్‌లోని వార్డ్ బాయ్ నుంచి, హెడ్ నర్స్ వరకు అందరికి తెలిసిపోయింది.

ముఖ పరిచయం ఉన్న ప్రతి ఒక్కరు వచ్చి యథాశక్తి సానుభూతి వాక్యాలు ఉమేష్‌మీద కురిపిస్తున్నారు.

ఆ తాగుబోతు కొట్టిన దానికన్న ఈ సానుభూతి వరద భరించలేని విధంగా తయారైంది. చాలామంది ఉమేష్ ముందు సానుభూతి మాటలు మాట్లాడినా వెనక్కివెళ్ళి నవ్వుకుంటున్నారు.

అతనికి బాధ కడుపులో నుంచి ఎగదన్నుకు వస్తోంది. ఒకటే వ్యథ. చాలా ఘోరంగా ఉంది అతని మానసిక పరిస్థితి. తనని చెంపమీద కొట్టిన ఆ తాగుబోతు పేషెంట్‌ని నరికి పోగులు పెట్టాలి అన్నంత కోపంతో ఊగిపోయాడు. ఒక్క తాగుబోతు ఎంతపని చేశాడు! "ఈ తాగుబోతు లందరికి దేశ బహిష్కరణ చేయాలి'' - చిన్నపిల్లాడిలా అనుకున్నాడు.

హాస్పటల్‌కు సెలవుపెట్టి ఎక్కడికైన వెళ్ళాలి అనుకున్నాడు. అదృష్టం కొద్ది రెండు రోజులు శెలవు దొరికింది. రూమ్‌కు వెళ్ళి మంచం మీద రిలాక్స్ అయ్యాడు. అతను శారీరకంగా రిలాక్స్ అయినా అతని ఆలోచనలు తనని చెంపమీద కొట్టిన ఆ సీన్‌ను ప్రతిక్షణం గుర్తుకు తెస్తున్నవి.

సాయంత్రం ఐదుగంటల వరకు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు. అప్పుడు లేచి రిక్రియేషన్‌కోసం క్లబ్‌కు వెళ్దామని అనుకొని బయలు దేరాడు. అతను అలా అనుకొని ఉండకపోతే బాగుండేవి. -తన చేతులార మరో సమస్యను సృష్టించుకోబోతున్నాడు.

హాస్పటల్ ఆవరణకు వెనుకవైపున రిక్రియేషన్ క్లబ్ ఉంది. ఉమేష్ క్లబ్‌కు వెళ్తూ హాస్పటల్‌వైపు చూశాడు.

హాస్పటల్ ఆవరణలో ఉదయం ఉన్న సందడి ఇప్పుడు మచ్చుకైనా లేదు. ఇప్పుడు ఎంతో నిర్మానుష్యంగా ప్రశాంతగా ఉంది.

అతని ఆలోచనలన్నీ డైవర్ట్ అయి, హాస్పటల్‌లో ఒక రౌండ్ వెళ్ళిరావాలి అనుకున్నాడు.

దర్జాగా ఆసుపత్రి అంతా కలియజూస్తూ కొంతమంది పేషంట్ల కేస్‌షీట్స్ చూస్తూ తిరుగుతున్నాడు.

మాట్లాడుకుంటున్న కొంతమంది రోగులు ఉమేష్‌ని చూసి మాట్లాడటం మానేసి అతనివైపు చూస్తూ ఉన్నారు.

కొంతమంది పేషంట్స్ దండాలు, నమస్కారాలు చేస్తున్నారు.

వార్డ్‌లో ఎవరో సిస్టర్ టెంపరేచర్ చెక్‌చేసి రికార్డ్‌షీట్‌లో నోట్ చేస్తూ, ఇంజక్షన్ ఇవ్వాల్సిన రోగులకు ఇంజక్షన్స్ ఇస్తున్నది. ఆ వార్డ్ అయిపోయిన తరువాత క్యాన్సర్ వార్డ్‌వైపు వెళ్ళబోయాడు. కాని, వార్డ్‌లో డాక్టర్‌గారు కనిపించారు. ఆవిడ చాలా మంచి మనిషే కాని, డ్యూటీ విషయంలో, క్యారెక్టర్ బిహేవియర్ విషయంలో చాలా కఠినంగా ఉంటారు. అందువలన ఆవిడ ఉన్నవైపు వెళ్ళటం ప్రమాదం అనుకొని ప్రక్కనే ఉన్న టి. బి. వార్డ్‌లోకి వెళ్ళాడు.

ఉమేష్ వార్డ్‌లో నడుస్తున్నాడు. బెడ్స్‌మీద పేషంట్స్‌గా అన్ని వయసులవాళ్ళు ఉన్నారు. వార్డ్‌లో ఒక పేషంట్ ఊపిరితిత్తులు తెగిపోయేలా దగ్గుతున్నాడు.

కొంతమంది కుర్రవాళ్ళే ఈ టి బితో పీడించబడుతున్నారు.

ఉమేష్ పరిశీలనగా చూస్తూ ముందుకు నడుస్తున్నాడు.

వార్డులోని పేషంట్‌లకు టెంపరేచర్ చెక్‌చేస్తున్న నర్స్ ఉమేష్ రావటం చూసి "హలో, గుడ్ యీవినింగ్ డాక్టర్!" నవ్వులు చిందిస్తూ గ్రీట్ చేసింది.

ఆమెను ఉమేష్ చాలాసార్లు చూశాడు కాని, ఇంత దగ్గరగా ఇలా నవ్వుతూ ఎప్పుడు చూడలేదు. ఆమెవైపు పరిశీలనగా చూశాడు. మనిషి ఎత్తు అంతంత మాత్రమే అయినా అందమైన అంగసౌష్ఠవం. రంగు కాస్త నలుపైనా నున్నటి గులాబీరంగు బుగ్గలు, అందమైన పెద్ద పెద్ద కళ్ళతో ముఖం కళగా ఉంది. ఆ సింపుల్ బ్యూటికీ ఏజ్ ఇరవై ఏళ్ళు కూడా ఉండవు. మెడలో ఒంటిపొర ముత్యాల దండ మాత్రమే ఉంది. మెడలో తాళి లాంటిది లేనందుకు మనసులోనే మహా సంతోషపడ్డాడు. ఆమె నిండు యవ్వనం సంతరించుకుంటున్న వయసు జాకెట్‌ని బిగుతుగా నింపింది అనుకుంటూ ఆమెను అలాగే చూస్తూ ఉండిపోయాడు.

కేస్‌షీట్‌లలో టెంపరేచర్ రికార్డ్ చేయటంలో, అవసరమైన పేషంట్లకు ఇంజక్షన్ ఇవ్వటం లాంటి పనులలో నిమగ్నమైంది. ఆమె ప్రతి కదలిక ఉమేష్‌కు ఎంతో అందంగా కనిపిస్తున్నది.

ఉమేష్‌కి ఆ నర్స్‌తో మాట్లాడాలి అనిపించింది. అందువలనే "ఎక్స్‌క్యూజ్‌మీ మిస్" అన్నాడు.

"ఎస్ డాక్టర్, చెప్పండి'' అంది, ఉమేష్ కళ్ళలోకి సూటిగా చూస్తూ....

ఆమె అలా కళ్ళలోకి చూస్తుందని అతను అనుకోలేదు. కంగారులో ఏమి అడగాలో అర్థంకాక "యస్, ఏమయిన సీరియస్ కేసులున్నాయా?'' అన్నాడు.

"మీరేనా నైట్ డ్యూటీ ఇన్‌చార్జ్?'' అని అడిగి "ఇప్పుడేకదా సర్, మీ డ్యూటీ బిగిన్ అయింది, రాత్రి అంతా ఉండాలి కదా, నైట్‌లో ఒకటి రెండు సీరియస్ కేసులు ఉంటాయి'' అంది.

ఆ విషయం ఉమేష్‌కి తెలుసు. అయినా నటిస్తూ "అలాగా?" అన్నాడు.

"ఓ.కే. డాక్టర్ సీయూ" అని చెప్పి వెళ్తున్నది.

ఆమె వెళ్తుంటే చేయి జారుతున్న తేనె పట్టులా అనిపించికిది. "ఒన్ మినిట్..." అన్నాడు అప్రయత్నంగా....

ఆగింది.

"యువర్ గుడ్ నేమ్...."

"మీనా...." అంది.

"ఓ నైస్ నేమ్, నైస్ గేల్" అని గొణిగాడు.

ఆమెకు వినిపించినట్లుంది, సిగ్గుపడుతూ వెళ్ళిపోయింది.

అబ్బ, భలే సిగ్గుపడింది - అనుకున్నాడు.

స్పెషల్ వార్డ్‌లోని పేషంట్స్ రికార్డ్ కేస్‌షీట్‌లను జాగ్రత్తగా చూస్తూ ముందుకు వెళ్తున్నాడు. ఒక పేషంట్ గాఢ నిద్రలో ఉన్నాడు. ఆ పేషంట్ మంచానికే తగిలించి ఉన్న కేస్‌షీట్‌ని తీసి తీక్షణంగా చూస్తూ ఉన్నాడు.

వెనుక నుండి మీనా వచ్చింది - ట్రేలో ఇంజక్షన్స్ తీసుకొని.

ఉమేష్ కేస్‌షీట్ చూడటం చూసి, "చాలా అడ్వాన్స్ స్టేజ్‌లో ఉంది కదు డాక్టర్" అంది.

"ఊఁ...." అన్నాడు.

పేషంట్ నిద్రలోనే ఉన్నాడు, అయినా మీనా వెళ్ళి యింజక్షన్ వేసింది.

ఉమేష్ మీనా వైపు తన్మయత్వంగా చూస్తూ "మీనా...", అని గొణిగాడు. మీనాకు అంత మెల్లిగా పిలిస్తే వినిపించదేమో అనుకున్నాడు. కాని అదృష్టానికో, దురదృష్టానికో మీనాకు వినిపించింది.

"చెప్పండి డాక్టర్....", అంది అతనివైపు చూస్తూ.

-ఓర్నాయనో పాము చెవులు ఉన్నట్లుంది, నేను అంత మెల్లగా అన్న మాట ఎలా వినిపించింది చెప్మా అని మనసులోనే ఆశ్చర్య పోయాడు. వెంటనే సర్దుకుంటూ "ఏం లేదు మీనా, నువ్వు చాలా అంకిత భావంతో సర్వీస్ చేస్తున్నావు. చాలా మంది నిజాయితీగా, సిన్సియర్‌గా, డెడికేషన్‌గా ఆలోచిస్తారే కాని, తమ ఆలోచనలకు అనుగుణంగా నిజాయితీగా, అంకిత భావంతో ఉద్యోగ ధర్మాన్ని పాటించలేరు. కాని, నువ్వు మాత్రం ఎంతో చాలా సిన్సియర్‌గా పనిచేస్తున్నావు" అన్నాడు ఉపన్యాసధోరణిలో.

ఆ మాత్రం పొగడ్తకే ఆమె కళ్ళు వంద వోల్టుల బల్బులా వెలిగి పోతున్నాయి.

ఉమేష్ మాత్రం కళ్ళార్పకుండా ఆమె అందాన్నే తనివితీర చూస్తూ ఉన్నాడు.

సరిగ్గా అదే సమయంలో డాక్టర్ ప్రశాంత్ దూరం నుంచి ఉమేష్‌ని చూస్తూ "హలో ఉమేష్, హౌ ఆర్ యూ" పరామర్శగా అన్నాడు-ఉమేష్ సమాధానాన్ని కూడా ఆశించకుండా మరలా ప్రశాంతే "అవును, సెలవు పెట్టావు కదా, ఏమిటి ఇక్కడున్నావ్" అన్నాడు.

"ఏం లేదు, రూమ్‌లో బోర్‌గా ఉంటే ఇటు వచ్చాను" అన్నాడు.

మీనా "ఎక్స్‌క్యూజ్ మీ" అని అక్కడి నుండి వెళ్ళిపోయింది.

ప్రశాంత్ ఆసక్తిగా "అది సరే ఉమ! నువ్వు నిన్న ఉదయం ఏదో విషయం మాట్లాడటానికి నా ఛాంబర్‌లోకి వచ్చావు కదా, నేను ఫోన్ అటెండ్ చేయటానికి వెళ్ళాను. సరిగ్గా అప్పుడు తాగుబోతు పేషంట్ ఎవరో నిన్ను చెంపమీద కొట్టాడు. ఆ తర్వాత మరలా ఇప్పుడు కని

పించావు, చెప్పు ఏ విషయం గురించి మాట్లాడాలనీ వచ్చింది?'' అని అడిగాడు. (ప్రశాంత్ ఉమేష్‌ని ''ఉమ'' అని పిలుస్తుంటాడు.)

ఉమేష్ ఏ విషయం మరచిపోవటానికి ప్రయత్నిస్తున్నాడో అదే విషయం గుర్తు చేస్తున్నాడు. ఆ తాగుబోతు పేషంట్ చెంపమీద కొట్టటం, వీళ్ళందరు దాన్నే పట్టుకొని పరామర్శల పేరుతో అతన్ని మెంటల్ టార్చర్‌కు గురి చేస్తున్నారు.

ఇక అక్కడ ఉండ మనస్కరించలేదు. ప్రశాంత్‌కు ఏమి చెప్పకుండా వార్డ్‌లోనుంచి బయటికి వచ్చాడు.

హాస్పటల్ వాతావరణం అంతా నియాన్ లైట్ల వెలుగులో పచ్చగా, చాలా అందంగా ఉంది. కాని, ఉమేష్‌కు ఒక్క క్షణం కూడ ఉండాలని పించటం లేదు. ఇంకా ఎవరైనా వచ్చి చెంప దెబ్బ గురించి పరామర్శిస్తారేమోనని ప్రక్కనే ఉన్న లైబ్రరీకి వెళ్ళాలని అనిపించింది.

హాస్పటల్‌కు ఆనుకొనే సిటీ సెంట్రల్ లైబ్రరీ ఉంది.

లైబ్రరీలోకి వెళ్ళాడు.

అక్కడ బయటి ప్రపంచంతో మాకేమీ సంబంధం లేదు అనే ధోరణిలో కొంతమంది నిశ్శబ్దంగా ఏవో బుక్స్ చదువుతున్నారు. మరి కొంతమంది డెయిలీ న్యూస్ పేపర్ చదువుకుంటున్నారు.

తను కూడా వెళ్ళి ఓ డెయిలీ పేపర్ తీసుకొని బలవంతంగా చదవటానికి ప్రయత్నంలో మునిగిపోయాడు. పేపర్‌లోని పెద్ద అక్షరాలతో ఉన్న ''వివాహ వేదిక, ఈ రోజే విచ్చేయండి. మీ జీవిత భాగస్వామిని మాద్వారా ఎన్నుకోండి'' అనే వార్త బాగా ఆకర్షించింది.

ఆ ప్రకటన అంతా ఆసక్తిగా ఒకటికి రెండు సార్లు చదివాడు. ''కంప్యూటరైజెడ్, రిజల్ట్ ఓరియంటెడ్ మ్యారేజ్ బ్యూరో'' అని దాని సారాంశం.

ఉమేష్ మనసులో ఓ సారి వెళ్ళి ఆ మ్యారేజ్ బ్యూరోను చూడాలి అనుకున్నాడు.

తనకు కాబోయే భార్య కాన్వెంట్‌లో చదివిన అమ్మాయి అయి ఉండాలి. ఇంగ్లీష్‌లో స్టయిల్‌గా మాట్లాడ గలిగి ఉండాలి. జడ పెద్దగా ఉండాల్సిన అవసరం లేదు, బాబ్డ్ హెయిర్ లేదా హిప్పి టైప్ అయి ఉంటే బాగుంటుంది. ఆమె హైట్ ఐదు అడుగుల ఏడు అంగుళాలు ఉండాలి కనీసం. మనిషి రంగు ఏదైనా పర్వాలేదు, కాని నలుపు లేదా చామన ఛాయ రంగు అయితే చాలా బాగుంటుంది. అలాగే ఆమె స్లిమ్ పేరుతో మరీ టీ.బీ. పేషంట్‌లా కాకుండా పుష్టిగా కాస్త లావుగా ఉండాలి. ఆమె గొంతులో కాస్త మగసిరి ధ్వనిస్తే బాగుంటుంది. శరోన్ ప్రభాకర్, ఉషా ఉతప్‌లా పాటలు పాడగలిగి ఉంటే మరీ మంచిది. అంతేకాక, తన భార్య లాజిక్‌గా కళ్ళు తిప్పుతూ మాట్లాడగలిగి ఉండాలి మనిషి ఎలా ఉన్నా పర్వాలేదు. ఇంకా భార్య రంభలా ఉండకపోయినా రంజింప గలిగి ఉండాలి - చాలు అనుకున్నాడు.

ఈ ఆలోచనలతో ఉమేష్‌కి రాత్రి అంతా నిద్ర రావటం లేదు.

ఇన్ని సలక్షణాలు కలిగిన అమ్మాయి తనకు దొరుకుతుందా అని అనుమానం వచ్చింది. "అయినా తనకేమి తక్కువ? అందం వుంది. మూడు పదులు వయసు నిండిన యవ్వనం, తలమీద కాస్త బట్టతల తప్పిస్తే, డొనేషన్‌లతో కొన్న చదువు వుంది, హోదా ఉంది, సంఘంలో మంచి గౌరవం ఉంది" అని తనలో తను అనుకుంటూ పులకరించి పోతున్నాడు. తనకు ఒక్కటేమిటి అన్నీ ప్రతిదీ ఉంది అని అనుకుంటూ ఉప్పొంగిపోయాడు.

ఉమేష్ ఆలోచనలు తనకు కాబోయే భార్యను గురించి ఆలోచించే కొద్దీ కోర్కెలు ఎక్కువై మనిషిని రెచ్చగొడుతున్నాయి.

తన స్వప్నసుందరి సుమారు ఐదడుగుల ఏడు అంగుళాలు ఎత్తు ఉండి, కాస్త లావుగా, చామన ఛాయ రంగులో, గొంతులో మగగొంతు వినిపించేలా కాస్త మగసిరి.... అని ఆలోచించుకుంటూ, ఈ ఆలోచనలతో ఏ అర్ధరాత్రికో నిద్ర ఒడిలోకి జారుకున్నాడు.

*  *  *

రాత్రి పన్నెండు దాటింది.

అప్పటి వరకు ఒక సీరియస్ కేస్‌తో పోటాపోటీ పడి, దాన్ని కాస్త నయంచేసి డ్యూటీ రూమ్‌కు వచ్చాడు. అతని కళ్ళు నిద్రలేక మండుతున్నాయి. కళ్ళేకాదు అభిమన్యు శరీరంలోని సర్వేంద్రియాలు శక్తిని కోల్పోయి ఉన్నాయి.

కళ్ళుమూసుకొని కుర్చీమీద వెనక్కి వాలాడు.

''సార్....సార్ ...'', అని పిలుపు వినిపించింది డోర్‌వైపు నుంచి. తలత్రిప్పి చూసాడు. డోర్ దగ్గర చేతిలో మెమో పుస్తకంతో వార్డుబాయ్ కనిపించాడు.

అతన్ని చూసినా వెంటనే పరిస్థితి అర్థమయింది. ఏ వార్డులో అయిన పేషంట్‌లకు సీరియస్‌గా ఉంటే సిస్టర్ మెమో పంపుతారు.

"ఏ వార్డులో'', అని అడిగాడు అభిమన్యు.

"చిన్న పిల్లల వార్డ్ సార్...." అన్నాడు వార్డ్‌బాయ్.

మెమో పుస్తకంలో కూడా సంతకం చేయకుండా. కూజాలో ఉన్న నీళ్ళు ముఖంమీద చల్లుకొని వార్డ్ బాయ్‌వెంట నడిచాడు అభిమన్యు.

రాత్రి పన్నెండున్నర అయింది.

వార్డ్‌బాయ్ ముందు నడుస్తుండగా అభిమన్యు అనుసరిస్తూ ఉన్నాడు.

హాస్పటల్ ఆవరణ అంతా నిర్మానుష్యంగా, ప్రశాంతంగా ఉంది. వాతావరణం బాగా చల్లగా ఉంది; చల్లటి పిల్లగాలులు వీస్తున్నాయి.

పెడియాట్రిక్ వార్డ్‌కు వెళ్ళటానికి ఐదు నిమిషాలు పట్టింది. ఒక నర్స్ అభిమన్యుకు ఎదురువచ్చి, ''రండి డాక్టర్, చాలా క్రానికల్‌గా ఉంది కండిషన్" అంటూ అభిమన్యుని వార్డ్‌లోపలికి పిలుచుకొని వెళ్ళింది.

ఆ వార్డులో అంతా పిల్లలే, రోజులు నిండిన చిన్నారి పసిగుడ్లు, నెలలు నిండిన పిల్లలు, కొద్దిగా ఎదిగిన పిల్లలు. వాళ్ళలో ఎక్కువమంది సాధారణంగా గురి అయ్యేది లివర్ జబ్బులు, నిమోనియాలు, డయోరియాలు, జ్వరాలు - ఇవేకాక చంటిబిడ్డల గుణాలు, అన్నింటి కంటే మించి పౌష్టిక ఆహారంలోపం వలన అనేక జబ్బులకు గురి అవుతుంటారు.

వార్డ్‌లో ముందు సిస్టర్, వెనుక డాక్టర్ అభిమన్యు నడుస్తున్నారు.

అంతర్రాత్రి అయినా కొంతమంది చిన్నపిల్లలు నిద్రపట్టక నసుగుతున్నారు. మరికొందరు చిన్నపిల్లలు నిద్రపట్టక ఏడుస్తున్నారు.

నర్స్ ఒక బెడ్ దగ్గరికి వెళ్ళి ఆగింది.

ఆ బెడ్‌మీద ఆరేళ్ళ పిల్లాడు కడుపునొప్పితో మెలికెలు తిరిగిపోతున్నాడు. ఆ బాబువైపు చూపిస్తూ "ఉదయం నుంచి కడుపునొప్పి అని చెప్తున్నాడట. మధ్యాహ్నం రెండు విరోచనాలు చేసుకున్నాడు. ఇప్పుడే కాస్త ముందు వామ్‌టింగ్ చేసుకున్నాడు" అని చెప్పింది నర్స్.

ప్రక్కనే ఉన్న బెడ్స్ దగ్గర ఉన్నవాళ్ళు పిల్లల తల్లులు "డాక్టర్ గారు వచ్చారు, ఎలా నయం చేస్తారో" అని ఆసక్తితో అభిమన్యువైపు చూస్తూ ఉన్నారు.

కొంతమంది ఆడవాళ్ళు ఆ పిల్లవాడి తల్లిని సముదాయిస్తున్నారు.

ఆ అబ్బాయి తల్లి మెల్లగా నోటికి కొంగు అడ్డం పెట్టుకొని ఏడుస్తున్నది.

అభిమన్యుని చూసిన ఆ తల్లి గద్గద స్వరంతో వలవల ఏడుస్తూ "నా పిల్లాడిని కాపాడండి డాక్టర్ బాబు'' అంది.

ఈ ప్రపంచంలో అన్నిటి కంటే భయంకరమైంది, భరించలేనిది దుఃఖం; ఆ స్థితిలో ఉంది ఆమె. ఆ తల్లి ముఖంలో దీనత్వం నివాసం ఉంటున్నట్లుగా ఉంది. ఆమెను చూస్తుంటే విపరీతమైన బాధ కలిగింది అభిమన్యునికి.

ఇప్పుడు ఈ కుర్రాడికి ఏమయినా అయితే....ఆ తలంపే భరించ లేని విధంగా ఉంది.

"ఏం కంగారు పడకండమ్మ, ధైర్యంగా ఉండండి," అన్నాడు ఉదార్పుగా. అంటూ పిల్లవాడి దగ్గరికి వచ్చాడు.

పిల్లవాడు ఏడ్చిఏడ్చి గొంతు బొంగురుపోయింది.

పిల్లల విషయంలో వాళ్ళకు ఇచ్చే డోసుల విషయం చాలా జాగ్రత్తగా ఉండాలి అనుకుంటూ ఏదైన మెడిసన్ డోస్ ఎక్కువగా ఇచ్చారేమోనని కన్ను క్రింది రెప్ప దగ్గిర పరీక్షగా చూశాడు కాని, అలాంటి ఫాల్ట్ ఏమీ కనిపించలేదు.

అబ్బాయి కడుపుమీద చేయివేసి చూశాడు. వెచ్చగా కాలిపో తున్నది శరీరం. కడుపు కుడి భాగంలో చేయిపెట్టి నొక్కాడు మెల్లగా, సున్నితంగా.పుండు మీద నొక్కినట్లుగా తల్లడిల్లిపోతున్నాడు ఆ అబ్బాయి బాధతో.

యస్-ఇది ఎపెండిసైటిస్.

ఇది సాధారణంగా వయసులో ఉన్నవాళ్ళకు వస్తుంది. కానీ, ఏ వయస్సువారికైనా రావచ్చు. దురదృష్టం వెంటాడితే సంవత్సరం బిడ్డకైనా రావచ్చు. విధి వక్రిస్తే వంద సంవత్సరాల వృద్ధుడికైన రావచ్చు. ఈ వ్యాధి ఎక్స్‌రే పరీక్షలు, స్కానింగ్‌లతో కనిపెట్టటానికి అవకాశం

లేదు. కేవలం వైద్యపరీక్ష చేసి వైద్యుడు తన చేతి స్పర్శవలన తెలుసుకో గలడు.

ఈ ఎపెండిసైటిస్ అనేది వెర్మిఫారం ఎపెండిక్స్ అచే చిన్న ప్రేగుకి వచ్చే వ్యాధి. ఈ ప్రేగు జీర్ణకోశం పేగుకి కనెక్ట్ అయివుంటుంది. వెర్మిఫారం ఎపెండిక్స్ సుమారు మూడు నాలుగు అంగుళాల పొడవు వుండి, సన్నగా చిన్న వానపాములా ఉంటుంది. దీనికి వ్యాధి వచ్చినప్పుడు చీము పడ్తుంది. ఇది కొద్ది రోజులకు వాచిపోతుంది. అలాంటి సమయం చాలా ప్రమాదం. ఇది ఉంది అని తెలుసుకున్న వెంటనే ఆపరేషన్ చేసి దాన్ని తొలగించాలి. ఆపరేషన్ చేయించుకోవటం అంటే భయపడి మందులతోనే సరిపుచ్చటంకోసం శక్తివంతమైన యాంటిబైటిక్ మందు వాడితే తాత్కాలిక ఉపశమనం కలిగించవచ్చు కాని, ఇది సరి అయిన పద్ధతి కాదు. ఒక్కొక్కసారి ఈ మందులు వాడినప్పుడు పైకి తగ్గినట్లు గానే అనిపించినా, లోపల హాని కలిగించవచ్చు. అందువలన ఎపెండి సైటిస్ సరి అయిన చికిత్స ఆపరేషన్ చేయించుకోవటం శ్రేయస్కరం.

అభిమన్యు ఆలోచనలలో నుంచి బయటపడి "ఆపరేషన్ చేయవలసి ఉంటుంది....'' అంటూ సిస్టర్ వైపు తిరిగి "సిస్టర్! వెళ్ళి ఆపరేషన్‌కి రెడీ చేయమని చెప్పండి, చాలా త్వరగా...." అన్నాడు.

"అలాగే డాక్టర్...." అంటూ సిస్టర్ పరుగులాంటి నడకతో ఆపరేషన్ థియేటర్ వైపు వెళ్ళింది.

ఆ పిల్లవాడి తల్లి అప్పటివరకు మౌనంగా ఏడుస్తున్నది. అభి మన్యు సిస్టర్‌తో అన్న మాటలు విని - గట్టిగా హృదయవిదారకమైన రోదన చేస్తున్నది. "ఏమైంది బాబు నా పిల్లాడికి....?'' అంది ఏడుస్తూనే.

''మీరేమి కంగారు పడకండమ్మ....ఆపరేషన్ చేస్తాం. ధైర్యంగా ఉండండి'' అన్నాడు.

"నాకు నా అనేందుకు వీడు తప్ప మరో జీవి లేదు. నా ఆశల్ని వీడిమీదే పెట్టుకుని బ్రతుకుతున్నాను బాబూ! వీడు పుట్టిన ఆరు నెలలకే వీడి తండ్రి రోడ్డు ప్రమాదంలో పోయాడు. ఇప్పుడు...." ఆమె గొంతు గద్గదంగా పలుకుతున్నది. ఆ గొంతుకు ఏదో అడ్డుపడినట్లు ఆగిపోయింది.

ఆమె చాలా సామాన్యంగా ఉంది. ఆమె వయస్సు ముప్పయి, ముప్పయి రెండు ఉండవచ్చు. శోకదేవతలా ఉంది.

ఈ కేస్‌కు మామూలుగా అయితే స్పెషలిస్ట్ తీసుకోవాలి. కాని, సమయం లేదు.

ఆలోచించుకుంటూ కూర్చునే సమయం కాదు. విధి వక్రిస్తే ఎంతలో ముంచుకురావాలి ప్రమాదం? ఇంకా ఆలస్యం చేస్తే ఆ చిన్నారి ప్రాణం చేతికందుతుందో లేదో చెప్పటం కష్టం. ఒక క్షణం భయం ఆవహించింది. ఆపరేషన్ అంటే ఎంతో థ్రిల్‌గా, ఆసక్తితో ఉరకలు వేసే అభిమన్యుకు ఒక క్షణంపాటు భయం కలిగింది.

ఒక మనిషి నిండు ప్రాణంతో వ్యవహారం.

డాక్టర్ మనోహర్ గారు ఇంటెన్‌సివ్‌కేర్ యూనిట్‌లో ఉన్న పేషంట్‌కు సీరియస్‌గా ఉంటే అక్కడ ఉన్నారు.

రాత్రి ఒంటి గంట సమయంలో ఇద్దరు సిస్టర్స్ సహాయంతో ఆపరేషన్ చేయటానికి నిర్ణయించుకున్నాడు.

థియేటర్‌లో దేదీప్యమానంగా లైట్లు వెలిగాయి. థియేటర్ బయట ఆ పిల్లాడి తల్లి, మరో ఇద్దరు స్త్రీలు ఉన్నారు.

థియేటర్‌లో వాష్ టబ్ దగ్గర కార్బాలిక్ సోప్‌తో చేతులు కడుక్కొని, ఆపరేషన్ థియేటర్ డ్రస్ అయిన పైజామా, పై చొక్కా, ముఖానికి మాస్క్, కాళ్ళకు తెల్లని రబ్బర్ బూట్లు వేసుకున్నాడు.

అభిమన్యు భగవంతుడి మీద భారం వేసి తను తన ప్రయత్నంలో భాగంగా ఇద్దరు సిస్టర్స్ ప్రక్కనుండగా ఆపరేషన్ చేయటంలో నిమగ్నమైనాడు.

మామూలు ఎపెండిసైటిస్ ఆపరేషన్ అయితే ఇంత కంగారు పడవలసిన అవసరం లేదు. కాని, ఇక్కడ పేషంట్ ఆరేళ్ళ పసివాడు కావటంవల్ల చాలా జాగ్రత్తగా జరగాలి. అంత పసివాడికి ఎపెండిసైటస్ అంటే అది విధి వైపరీత్యం కాకపోతే ఏమిటి?

ఓ గంటపాటు ఆపరేషన్ జరిగింది.

ఆపరేషన్ పూర్తి అయింది.

అభిమన్యు యివతలకు వచ్చి గ్లవ్స్ తీసేసి చేతులు కడుకున్నాడు. తరువాత మరలా పిల్లాడి దగ్గరకు వెళ్ళి చూశాడు; పల్స్ సంతృప్తికరంగా అనిపించింది. (డాక్టర్స్ సాధారణంగా ఆపరేషన్ పూర్తి అయిన వెంటనే పల్స్ చూస్తారు.)

ఆశాకిరణాలు పూర్తిగా విచ్చుకున్నాయి. పసివాడికి ప్రమాదం తప్పింది.

థియేటర్ బయట పిల్లాడితల్లి తచ్చటలాడుతున్నది. అభిమన్యు థియేటర్ నుండి బయటకు రావటం చూసి ఆమె తడితేరిన కళ్ళతో అతని దగ్గరకు వచ్చి "ఎలా ఉంది బాబూ.... నా బిడ్డకు...."

"ప్రమాదం తప్పింది, ఉదయానికి స్పృహ వస్తుంది. రేపు సాయంత్రం వరకు కేవలం పాలు మాత్రమే ఇవ్వండి, తినటానికి ఏమీ ఇవ్వకండి. ఇంక భయపడవలసిన పనిలేదమ్మ....' అన్నాడు.

ఆ తల్లి ఆనందంతో మరోసారి బరస్ట్ అయింది. ఆమె విశాలమైన నేత్రాలు కృతజ్ఞతాభరితాలై భరిణలవలె మెరుస్తూ ఉండగా "అంతా మీ చేతి చలువ బాబుగారు!" అంది.

అంతలో స్నేహిత అక్కడికి వచ్చింది.

అభిమన్యువైపు ప్రశంసగా చూస్తూ "చాలా రిస్క్ తీసుకున్నారు. ఆపరేషన్ సక్సెస్ అయినందుకు అభినందనలు" అంది. ఆ మాటలలో నిగూఢ అర్థం లేకపోయినా, ఆమె మాటలు చాలా శ్రావ్యంగా వసంత ఋతువులో ప్రకృతిని పులకింత పెట్టే కోకిల స్వరంలా ఉంది.

అభిమన్యు గుండె ఆనందంతో పొంగిపోయింది.

స్నేహిత మీదనుంచి వచ్చే పరిమళం ఆ అర్ధరాత్రివేళ క్రొత్త కోర్కెలను రేవుతున్న విధంగా ఉంది. మనసులు మాట్లాడటం ప్రారంభించాయి. చల్లటి ఆ అర్ధరాత్రివేళ రెండు మౌన హృదయాలు భారంగా డ్యూటీరూమ్ వైపు నడుస్తున్నాయి.

తూర్పున తెల్లతెల్ల వారుతున్నది.

ఈరోజు నుండే అభిమన్యు వైద్య జీవితం వేగాన్ని పుంజుకోబోతున్నది.

*　　　*　　　*

ప్రశాంత్, దివ్యల స్నేహం - ప్రేమగా, ప్రేమ అనురాగంగా మారినప్పటినుండి రోజులు త్వరత్వరగా గడుస్తున్నాయి.

ఇద్దరూ హాలిడే రిసార్ట్‌కు వెళ్ళి వచ్చి అప్పుడే నెల రోజులు దాటింది.

ప్రతినెల వచ్చే, రెగ్యులర్‌గా వచ్చే మెన్సెస్ రాలేదు. దివ్య ఎంతైనా ఒక క్వాలిఫైడ్ నర్స్ కనుక, తన పరిస్థితి వెంటనే తెలుసుకోగలిగింది. తను తల్లి కాబోతున్న విషయం ప్రశాంత్‌కు చెప్పాలనుకుంది. ఆరోజే ప్రశాంత్‌తో తన విషయం చెప్పటానికి ప్రశాంత్ ఛాంబర్‌లోకి వెళ్ళింది.

దివ్య తన ఛాంబర్‌లోకి రావడం ప్రశాంత్ గమనించలేదు. పేషెంట్‌కు డయాగ్నసిస్ చేస్తున్నాడు. "పేషెంట్ ఎవరో అమ్మాయి, పెళ్ళి కాకుండానే ప్రెగ్నసీ అయిన కేస్. ప్రెగ్నసీ బాగా అడ్వాన్స్డ్ స్టేజ్‌లో ఉందట. అబార్షన్‌కు ఏమాత్రం అవకాశం లేదు" అని ప్రశాంత్ మాటల ద్వారా తెలుస్తున్నది.

"చదువుకున్నవారు - ఆ మాత్రం జ్ఞానం లేదు, మీకు పెళ్ళికాక ముందే ఇలా ప్రవర్తించటం తప్పుగా అనిపించలేదూ, పోనీ తప్పయి పోయిందనుకోండి, మరీ ఇంత అడ్వాన్స్‌గా ఉంటే అబార్షన్ కూడా చాలా కష్టం. మీరు మూర్ఖంగా మొండికేస్తే మీకే ప్రమాదంగా పరిణమించ వచ్చు" అన్నాడు ప్రశాంత్.

"……." ఆ అమ్మాయి ఏడుస్తున్నదేకాని ఏమీ మాట్లాడటంలేదు.

"పెళ్ళి కాకముందు ఇలాంటివి ఏదీ జరగకుండా చూసుకోవాలి. అదే విజ్ఞత. క్షణిక ఆనందంకోసం నిండు జీవితాలు నాశనం చేసుకుం టున్నారు. నిన్ను ఈ స్థితికి తీసుకొచ్చిన్న ఆ ప్రబుద్ధుడికి బుద్ధి లేక పోయినా, నీకు ఉండక్కరలేదా? ఆడపిల్ల…."

ప్రక్కనుంచే వింటున్న దివ్యకు ఇక ప్రశాంత్ మాటలు విన మనస్కరించలేదు.

సుడిగాలిలా అక్కడినుండి బయటకు వచ్చేసింది.

ప్రశాంత్‌కు తను గర్భవతి అని తెలిసిన క్షణం ఎలా రియాక్ట్ అవుతాడో. రిసార్ట్‌లో జరిగిన "ఆ" పొరపాటుకు, తప్పుకు తనే కారణం అని దుఃఖంతో మనసులోనే బాధపడి ఏడ్చుకుంది.

కాలం స్థంభించిపోయిందా అనే ఒక ఫీలింగ్.

ప్రతి క్షణం ప్రశాంత్ ఆ అమ్మాయితో చెప్పిన మాటలే చెవుల్లో మారుమ్రోగుతున్నాయి. "నిన్ను ఈ స్థితికి తీసుకొచ్చిన ఆ ప్రబుద్ధుడికి

బుద్ధి లేకపోయినా, నీకు ఉండక్కరలేదా? ఆడపిల్ల...."ఎంత వద్దనుకున్న ఈ మాటలే మరల మరల వినిపిస్తున్నాయి.

దివ్యలో తను ఏదో తప్పు చేశాను అనే భావన అనవసరంగా వెంటాడటం ప్రారంభమయింది. తనమీద తనకే కోపం.

సమాజం అంటే ఆమెకు భయం, నలుగురు తన గురించి ఏదో అనుకుంటారని ఆమెలో అలజడి ప్రారంభమయింది. బాధ కన్నీటి రూపంలో తన్నుకొస్తున్నది.

ఆ మెంటల్ డిప్రెషన్‌తో మూడు నెలలు గడిపింది. తన విషయం మొదటే ప్రశాంత్‌తో చెప్పి ఉంటుంటే ఆమె జీవితం పూవుల పడవలా ఉండేది కాని, ఏదో మాటలు విని, ఏవో అపోహాలో తన విషయం చెప్పలేకపోయింది; ఇప్పుడు దివ్యకు మూడవ నెల కూడా దాటింది. ప్రశాంత్‌తో ఈ విషయం కనీసం ప్రస్తావించే స్థితిలో కూడా లేదు.

ఆ రోజు ప్రశాంత్ ఆ అమ్మాయితో అన్న మాటలే దివ్య చెవుల్లో మారు మ్రోగుకున్నాయి.

ఈ మెంటల్ టార్చర్ భరించలేక ఒక కఠినమైన నిర్ణయానికి వచ్చింది.

మనసులో బాధ ఉంటే అది ఎవరో ఒకరితో పంచుకోవాలి; చెప్పుకోవాలి. లేకపోతే ఆ సమయంలో మంచిచెడ్డలు, యుక్తాయుక్తాలను విస్మరిస్తుంది మన మెదడు. అలాంటి సమయంలోనే హత్యలు, ఆత్మహత్యలు జరుగుతుంటాయి.

అప్పుడు దివ్యకూడా అదే స్థితిలో ఉంది. ఆత్మహత్య ఏ సమస్యకు పరిష్కారం కాదని ఆమెకు తెలుసు, తను చేస్తున్నది తప్పనీ తెలుసు. ఆత్మహత్య అసమర్థుల లక్షణం. నిజమే. సందేహము లేదు. మరి తన సమస్యకు పరిష్కారం ఏమిటి? అని తనలో తనే తర్కించుకుంది.

అప్పుడే తనకు ప్రెగ్నసీ వచ్చి మూడు నెలలు నిండాయి మరో మూడు నెలల తర్వాతగాని ప్రశాంత్ హౌస్‌సర్జన్సీ పూర్తికాదు. ఈ విషయం ఇన్ని రోజులు చెప్పక ఇప్పుడు ప్రశాంత్ చెప్తే ఎలా రియాక్ట్ అవుతాడో ఆలోచించేకొద్దీ మెదడు మొద్దుబారిపోతున్నదే కాని, ఏమీ తోచటంలేదు.

ఆ రాత్రి అంతా నిద్రపట్టలేదు.

తెల్లవారబోతున్నది. తల అంతా తిమ్మిరిగా ఉంది, మనసు వికలంగా ఉంది. కళ్ళు బాగా మండుతున్నాయి. మనిషి కళావిహీనంగా నీరసంగా ఉంది. శారీరక శ్రమ చేసినవారికంటే మనసుతో మెదడుతో పనిచేసేవారు ఎక్కువగా విశ్రాంతి కోరుకుంటారు, మంచం మీద అలాగే ఒదిగి పడుకుంది.

మనసులో ఒక బాధ పెట్టుకున్నవాళ్ళు ఇతరులతో ఆ బాధ చెప్పకోలేనప్పుడు మనసులోనే మధన పడుతుంటారు. అదే మానసిక అశాంతికి కారణం అవుతుంది. అలాంటి వారు ఏదో ఒక అవకాశంలో తమ బాధను బయటపెట్టటం ఎంతైనా మంచిది.

దివ్యకు ఆ రోజు ఎందుకోకాని హాస్పటల్‌కి వెళ్ళకుండా ఇంటిలోనే రెస్ట్ తీసుకోవాలి అనుకొని, హాస్పటల్‌కు సెలవు చీటి పంపింది.

ఇంటిలో తల్లి, ఇద్దరు చెల్లెళ్ళు, ఒక తమ్ముడు అందరు తన ఉద్యోగం మీదే ఆధారపడి ఉన్నారు. కాని ఏదైనా అనుకోని పరిస్థితుల్లో తన ప్రెగ్నన్సీ విషయం బయటికి పొక్కితే, తన తరువాత ఉన్న ఇద్దరు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు జరగటం అసంభవం.

తమ్ముడు ఎలాగు ఇంటర్ పాస్‌అయి ఉన్నాడు. తను ఉన్నా లేకున్నా తమ్ముడు తన తల్లిని ఇద్దరు చెల్లెళ్ళను బాగానే చూసుకోగలడు అనుకుంది.

ఆ రోజే తమ్ముడి ఎమ్‌సెట్ రిజల్ట్ వచ్చింది. తమ్ముడు పాస్ కాలేదు. దివ్య తన మీద తనకే ఉన్న కోపంతో తమ్ముడిని ఈ చెంప ఆచెంప ఇష్టం వచ్చినట్లు చేతులు చురుక్కుమనేదాక చేతులు నొప్పిపుట్టే దాకా కొట్టింది.

ఆ తరువాత గదిలోకి వెళ్ళి వెక్కి వెక్కి ఏడ్చింది. ఉదయం పది గంటల వరకు ఏడుస్తూనే ఉంది

తమ్ముడు ఏడుస్తూ దివ్య దగ్గరికి వచ్చి "నన్ను క్షమించు అక్కయ్యా" అని ప్రాధేయపడ్డాడు. తను ఎమ్‌సెట్ పరీక్ష పాస్‌కాలేదని అక్కయ్య అంత బాధపడుతుందని అనుకుంటున్నాడే కాని, తన అక్కయ్య జీవిత పరీక్షలో తప్పిందని గుర్తించలేకపోయాడు.

ఆమె అంత ఇదిగా ఏడ్వటానికి కారణం తన బ్రతుకు ఇలా అయిందే అనే బాధతోనే కాని, తమ్ముడు ఫెయిల్ అయ్యాడని కాదు. కానీ చూసే వాళ్ళందరికి తమ్ముడు పరీక్ష తప్పినందుకు ఏడుస్తుంది అని మాత్రమే అనుకుంటారు.

ఉదయం పదకొండుగంటలప్పుడు వెళ్ళి ముఖం కడుక్కుంది. ప్రశాంత్‌ని ఓ సారి వెళ్ళి చూడాలని అనిపించింది. లెమన్ ఎల్లో కలర్ ఆర్గండిసారీ కట్టుకొని హాస్పటల్‌కు బయలుదేరింది.

ప్రశాంత్ చాలా నిశితంగా ఒక పేషంట్‌ని డయాగ్నసిస్ చేస్తున్నాడు. దివ్య రావటం చూసి ఆనందంగా "హలో దివ్య, హౌ ఆర్ యూ?" అన్నాడు నవ్వుతూ. మరలా ఆ వ్యక్తిని డయాగ్నసిస్ చేయటంలో నిమగ్నమైపోయాడు.

ఆ పేషంట్‌ని టెస్ట్ చేయటం అయిపోయిన తరువాత, దివ్య ప్రశాంత్ కళ్ళలోకి చూస్తూ "తమ్ముడు ఎమ్‌సెట్‌లో ఫెయిల్ అయ్యాడు" అంది.

"ఓ.... ఐయామ్ సారీ.... పర్వాలేదు. చిన్నవాడే కదా! ఇంకా మెచ్యూర్ కాలేదు, మరోసారి ఆ టెస్ట్ చేయవచ్చులే దివ్యా" అన్నాడు చాలా మామూలుగా ఊరడిస్తూ.

"...." ఆమె ఏమీ మాట్లాడలేదు.

"ఈరోజు చాలామంది పేషంట్స్ ఉన్నారు కదూ దివ్యా, కాస్త వెయిట్ చేయవలసి ఉంటుంది- తీరికగా మాట్లాడుకోవటం కోసం" అన్నాడు అలవోకగా దివ్యను ఉడికిస్తున్నట్లుగా నవ్వుతూ.

"సరే....అయితే" అని గిరుక్కున వెనక్కుతిరిగి ప్రశాంత్ ఛాంబర్‌లోనుంచి బయటకు వచ్చింది.

దివ్యకు కోపం వచ్చినప్పుడు అప్పుడప్పుడు సరదాగా అలా ప్రవర్తించటం మామూలే. అందువల్ల ప్రశాంత్ నవ్వుకొని, "నెక్స్ట్ ఎవరో పిలువు" అన్నాడు వార్డ్‌బాయ్‌ని ఉద్దేశించి.

మరో పేషంట్ వచ్చాడు, డయాగ్నసిస్ చకప్ చేయించుకోవటం కోసం.

దివ్య ప్రశాంత్ ఛాంబర్‌లో నుంచి బయటకు రావటం ఉమేష్ కంటపడింది. అంతకుముందే దివ్య. ప్రశాంత్ ఇద్దరు కలిసి తిరగటం చాలాసార్లు చూశాడు. అందువల్ల వాళ్ళిద్దరు అంటే ఉమేష్‌కు అసూయ తప్ప మరోభావం లేదు.

ఉమేష్‌లాంటివారు మన చుట్టూ ఉండే ప్రజలలో ఎక్కడో ఒకరు కనిపిస్తారు. వారు తమ చుట్టూ ఓ గోడ కట్టుకొని ఉంటారు. ఇతరులను అది దాటి రానివ్వరు, వాళ్ళు బయటకు రారు. అలాంటివారు మహా తెలివైనవారుగా, నలుగురిచేత గుర్తించబడాలని అనుకుంటూ ఉంటారు. ఫాల్స్ రెస్పెక్ట్‌కోసం పాకులాడుతుంటారు. ఇలాంటివారు ఎవరినీ ప్రేమించలేరు, ప్రేమించబడలేదు. ఎవరైనా ఆడా మగా స్నేహంగా

ఉంటే చూసి సహించలేక వేదనతో రగిలిపోతుంటారు. ప్రతి మనిషిలో ఏదో ఒకరకమైన బలహీనత ఉంటుంది. కానీ, ఈ రకమైన బలహీనత చాలా ప్రమాదకరమైనది.

ఉమేష్ దూరం నుంచి దివ్యవైపు చూస్తూ, ఓ.పి. వార్డులో మనుష్యులందరిని తప్పించుకుంటూ దివ్య దగ్గరకు వచ్చి "హలో........" అన్నాడు ఏదో పనిపడ్డవానిలా.

"హలో. .." అంది సంస్కారంకోసం, వెళ్ళబోయింది.

"ఒక నిమిషం........'' అన్నాడు.

దివ్య ఆగింది.

ఉమేష్ ఇటు అటు చూసి ఎవరు తమను గుర్తించలేదు, పట్టించు కోవటం లేదని నిర్ణయించుకొని దివ్యవైపు చూస్తూ ''ఏమంటున్నాడు మీ హీరో, రేపు ఎక్కడ ప్రోగ్రామ్?" అన్నాడు.

చివాలున తల ఎత్తి ఉమేష్ కళ్ళలోకి చూసింది. ఉమేష్ నవ్వు తున్నాడు. ఆమె మనసులో ఉన్న దుఃఖం, ఆవేశం ముఖంలో ప్రతిఫలిం చాయి. ఆమె మానసిక పరిస్థితి తెలియకుండా ఉమేష్ అలా అడగటంతో, దివ్య ముఖం కోపంతో నెత్తురు గడ్డలా మారింది.

అంతే...., ఫినిష్!

దివ్య కుడిచేయి ఊహించని రీతిగా వెళ్ళి ఉమేష్ చెంప చెళ్ళుమని పించింది.

ఆ దృశ్యం ఎవరూ చూడలేదు అనుకున్నాడు కాని, దగ్గరలో ఉన్న ఓ పి. వార్డ్‌లోని పేషంట్స్, కొంతమంది నర్సులు చూశారు,

ఉమేష్‌కు చెంప మొద్దుబారిపోయింది, ఆకాశంలోని చుక్కలు తెగి మీదపడినట్లు అనిపించింది. ఓ నిమిషంపాటు ఏమీ కనిపించలేదు అతని కంటికి. అంతా చీకటి.

దివ్య ఏడుస్తూ పరుగులాంటి నడకతో వెళ్ళిపోయింది. ఆమెకు కూడా కుడి అరచేయి మండుతున్నది.

ఆ క్షణంలో ఉమేష్ తనకు జరిగిన అవమానం గురించి ఆలోచిస్తు న్నాడే కాని, మరో గంటలో తన మీద మరో అభాండం వచ్చి పడుతుందని ఊహించలేకపోయాడు.

ఆమె సరిగ్గా ఫార్మసీ స్టాక్ రూమ్ వైపు వెళ్ళింది. అక్కడ అన్ని రకాల మందులు ఉన్నాయి. ఒక పెట్టెలోనుంచి కుడిచేత పిడికిలికి చిక్కినన్ని స్లీపింగ్ పిల్స్ (ట్యాబ్ లెట్స్) తీసుకుంది.

అక్కడినుంచి సరిగ్గా ఇంటికి వచ్చింది.

తమ్ముడు ఇంటిలో లేడు. అమ్మ ప్రక్కింటిలో పెళ్ళి చూపులు జరుగుతుంటే వెళ్ళింది. పెద్ద చెల్లెలు ఏదో పుస్తకం చదువుకుంటున్నది. చిన్న చెల్లెలు స్కూల్‌కు వెళ్ళి ఉంది.

దివ్య తన రూమ్‌లోకి వెళ్ళి తలు పేసుకుంది. లోపలి నుంచి గడియ పెట్టేసుకుంది.

తను తెచ్చుకున్న స్లీపింగ్ ట్యాబ్ లెట్స్ ఒక్కటికూడ వదలకుండా అన్నీ మింగేసింది.

మంచం మీద వాలి కళ్ళు మూసుకుంది. మరలా కళ్లు తెరవలేదు.

ఒక జీవి భూమిమీదనుంచి మౌనంగా నిష్క్రమించింది.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు చిన్న చెల్లెలు వచ్చి దివ్య ఉన్న తలుపు తట్టింది. లోపలినుంచి సమాధానం లేదు. నిద్రపోతుందేమో అను కుంది కానీ, తన అక్క శాశ్వతంగా నిద్ర పోతుందని తెలుసుకో లేక పోయింది.

మరో అర్ధగంట తరువాత దివ్య తల్లి వచ్చి తలుపుకొట్టి పిలిచింది, ఎంత పిలిచినా సమాధానం రాకపోయేసరికి, తల్లికి ఏదో పాడు అనుమానం వచ్చింది.

ప్రక్కింటివాళ్లను ఎదురింటి వాళ్ళను పిలిచి తలుపులు పగులగొట్టి తెరిచే లోపలే చిలుక కాస్తా ఎగిరిపోయింది.

తల్లి, పిల్లలు ఒక్కసారిగా గొల్లుమన్నారు.

ఈ వార్త మరో పది నిమిషాలకే హాస్పటల్ అంతా తెలిసిపోయింది. దివ్య చావుకు కారణాలు ఎవరికి తోచింది వాళ్ళు అనుకుంటున్నారు. కొంత మంది "తమ్ముడు ఎమ్‌సెట్ పరీక్షల్లో పాస్ కాకపోవటం వల్ల" అని అనుకున్నారు. దానికి నిదర్శనం ఆ రోజే రిజల్ట్ రావటం, తమ్ముడ్ని ఎప్పుడు లేనివిధంగా కొట్టి తనూ బాగా ఏడ్చింది.

మరి కొంతమంది "ఉమేష్ హాస్పటల్‌లో ఏదో అన్నాడని చెంప మీద కొట్టివచ్చిన ఓ గంటలోనే ఇది జరిగింది కనుక ఉమేష్ ఏదో అనకూడని మాట అంటే దివ్య ఆత్మహత్మ చేసుకుందేమో" అని ఒక నిర్ణయానికి వచ్చారు.

మరికొంత మంది అమ్మలక్కలు "దివ్యకు ఇంత వయసు వచ్చినా ఇంకా పెళ్ళి కాలేదని బాధతో ఆత్మహత్య చేసుకుందేమో" అని దీర్ఘాలు తీస్తూ వాపోయారు. తమ తెలివి తేటలకు మురిసిపోతూ, అమ్మలక్కలు ఇలా అనుకోవటానికి కారణం, అదేరోజు ప్రక్కింటిలో పెళ్ళిచూపులు జరుగుతున్న రోజునే ఇలా జరగటం.

కాని, అసలు కారణం దివ్య పెళ్ళికాకుండానే తల్లికాబోతున్నది అనే విషయం సమాజానికి తెలుస్తుందని ఆమె వెళ్ళిపోయింది. ఎవరు కనీసం ఆ యాంగిల్‌లో ఆలోచించలేకపోయారు.

ప్రశాంత్‌కు దివ్య వెళ్ళిపోయిన విషయం ఎవరో చెప్పుకుంటుటుండగా తెలిసింది. తన చెవులను తానే నమ్మలేక పోతున్నాడు. జస్ట్ రెండు గంటల ముందు తన ఛాంబర్‌లోకి వచ్చింది.

ఉదయం సరిగ్గా పదకొండు గంటల సమయంలో ప్రశాంత్ ఎవరికో టెస్ట్ చేస్తుండే వచ్చింది. అప్పుడు తను ఆపి ఉంటే ఈ ఘోరం జరగకుండా ఉండేది. దివ్య కాస్త ముందు రావటం మాట్లాడటం, లెమన్ ఎల్లో కలర్ ఆర్గండి చీర కట్టుకొని వచ్చిన దివ్య ఇంకా తన కళ్ళు ముందే మెదులుతున్నది.

ఆ భరించలేని నిజం తెలిసిన మరుక్షణం కత్తివేటుకి నెత్తురు చుక్క లేకుండా పాలిపోయింది అతని ముఖం. కళ్ళు బైర్లుకమ్మి పడిపో బోయి గోడను ఆసరాగా చేసుకొని నిలబడ్డాడు.

అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

జీవితం అంతా శూన్యంగా అనిపించింది.

దివ్యది ఆత్మహత్య అంటే అది మ్రింగుడు పడటంలేదు, దివ్య ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం ఏముంది అని ఆలోచించటం మొదలు పెట్టాడు. ఎంత ఆలోచించినా అంతుచిక్కటం లేదు.

కాలేగ్స్ అంతా రెండు గంటల సమయంలో అంతా కలిసి చూడటానికోసం వెళ్ళారు. అప్పటికే అక్కడ చాలామంది వచ్చి ఉన్నారు.

కొంత మంది కొలీగ్ నర్సులు ఏడుస్తున్నారు. ఆ ప్రదేశం హృదయవిదారకంగా ఉంది.

ప్రశాంత్‌కు గుండె పిండేసే బాధ. మాట పెగలడం లేదు.

అది ఆత్మహత్య కనుక పోలీస్ కేస్ అవుతుందేమోనని దివ్య తల్లి వెంటనే ఖననం చేయాలని ఆలోచిస్తున్నది.

శవాన్ని తరలించటానికి అన్నిపనులు జరిగిపోతున్నాయి.

ప్రశాంత్, దివ్యకు దేవాలయ ప్రాంగణంలో మూడుముళ్ళు వేసిన విషయం, అదేరాత్రి రిసార్ట్ హౌస్‌లో ఇద్దరు ఒకటైన విషయం అక్కడ చూస్తున్న ఎవరికీ తెలియదు. అన్ని తెలిసిన వ్యక్తి ప్రశాంత్ ఏమీ

చెప్పలేక భర్తకాని భర్తగా చూస్తూ చేష్టలుడిగి నిర్జీవంగా, జీవం ఉన్న శవంలా నిలబడిపోయాడు.

* * *

తెల్లవారింది.

దేశంలోని ఇతర ప్రాంతాలలో తెల్లవారినట్లే ఉమేష్ ఉంటున్న క్వాటర్ ప్రాంతంలో తెల్లవారింది. ప్రతిరోజు ఉదయం బాడీలైన్ సెంటర్‌కి వెళ్ళి నర్స్ క్వాటర్స్ మీదుగా జాగింగ్ చేస్తూ రావటం ఉమేష్‌కు అలవాటు.

అతనికి చాలా మందికి ఉండే యగ్జిబిషన్ హ్యాబిట్ కాస్తఎక్కువ. తను జాగింగ్ చేస్తున్నది ఎవరైన చూస్తున్నారా లేదా అని ఆలోచించే రకం మనిషి.

ఉమేష్ నర్స్ క్వాటర్స్ ముందు నుంచి జాగింగ్ చేస్తూవస్తున్నాడు.

"హల్లో డాక్టర్ ఉమేష్‌గారు....ఎవరో పిలిచినట్లు అనిపించింది.

పిలుపు వచ్చిన తలపుచూశాడు. మీనా నవ్వుతూ కనిపించింది.

"గుడ్ మార్నింగ్...." అంది మరోసారి.

"మార్నింగ్, నైట్ డ్యూటీనుంచా?" అని అడిగాడు.

"అవునండి" అంది.

నైట్ డ్యూటీ చేసి వస్తున్నందుకు బాగా అలసిపోయి ఉంది. అందుకే "ఒకే సర్" అని మరో మాటకు అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోయింది.

"అబ్బ భలే ఉంది. మంచికేస్" అనుకుంటూ, ఏదో తెలుగుపాట కూనిరాగం తీస్తూ తన రూమ్‌కు వచ్చి స్నానం ముగించి, మంచి డ్రస్ నీట్‌గా చేసుకొని 'వివాహ వేదిక' అనే మ్యారేజ్ బ్యూరోకు బయలు దేరాడు.

ఉదయం పదకొండు గంటల సమయం ఆ సంస్థ ఆఫీసుకు చేరాడు. అది చాలా చిన్న ఆఫీస్ అయినా అందులోనే అన్ని హంగులు అమర్చి ఉన్నారు.

ఉమేష్ వైపు చూస్తూ "చెప్పండి సార్!" అన్నాడు కౌంటర్‌లో కూర్చున్న ఓ కుర్రాడు.

"మీ డెరెక్టర్‌గారు, అదే ఆఫీసులో పెద్ద లేరా?" అని ప్రశ్నార్థకంగా అడిగాడు.

"చెప్పండి సార్! నేనే డైరెక్టర్‌ని" అన్నాడు కుర్రాడు.

అంత చిన్న వయసు కుర్రాడు మ్యారేజ్ బ్యూరో నడుపుతున్నాడు అన్న విషయం తెలిసి ఉమేష్ ఆశ్చర్యపోయాడు. ఒక నిమిషం తరువాత తేరుకొని "సారీ, మీరు కాదు అనుకున్నాను" అన్నాడు.

"బై ది బై, నా పేరు కె. ఉమేష్ ఎమ్.బి.బి.యస్. ఫ్రమ్...." చెప్పాడు.

"ఓ ఐసీ, ప్లీజ్ కూర్చోండి సార్."

"చెప్పండి, ఎవరి మ్యారేజ్ కోసం సంబంధం చూడాలి?" అని అడిగాడు ఆ కుర్రాడు.

సిగ్గుపడుతూ "నాకే" అన్నాడు.

"ఓ ఐసీ, మీరు ఈ అప్లికేషన్ ఫిలప్ చేయండి" అంటూ అప్లికేషన్ ఉమేష్‌కు అందించాడు.

ఆ కుర్రాడు పెద్దమనిషి తరహాలో "మా సంస్థలో సభ్యులుగా చేరాలి అంటే ఐ మీన్ మ్యారేజ్ ఏర్పాటుకోసం సంబంధం కుదర్చటం కోసం ఐదు వందలు డిపాజిట్ కట్టాలి. ఆ తరువాత మేము మీకు

అవసరమైన, మీరు కోరుకునే పెళ్ళి సంబంధం చూపుతాము. మీకు నచ్చే పెళ్ళికూతుర్ని మీరు సెటిల్ చేసుకోవచ్చు" అన్నాడు.

ఒక అరనిమిషం ఆగి, మరలా ఆ కుర్రాడు "మీ వాంటెడ్స్ ఏమిటో చెప్పండి. అంటే, మీరు మీకు కాబోయే భార్యలో ఎలాంటి లక్షణాలు కోరుకుంటున్నారు?...."

ఉమేష్ చెప్పటం ప్రారంభించాడు: "నాకు పెద్ద కోరికలు ఏమీ లేవండి. కాన్వెంట్‌లో చదువుకొని ఉండి, ఇంగ్లీష్‌లో స్టైయిల్‌గా మాట్లాడగలిగి ఉండి; మనిషి ఎత్తు కనీసం ఐదు అడుగుల ఏడు అంగుళాలు ఉండాలి. మనిషి స్లిమ్‌గా కాకుండా కాస్త లావుగా ఉండాలి. ఆమె గొంతులో కాస్త మగతనం ఉండాలి, మగాడు మాట్లాడేలా వినిపించాలి. పాటలు పాడగలిగి ఉంటే మంచిది; ఇక తల జుట్టు విషయంలో పెద్ద పట్టింపు ఏమీ లేదు. బాబ్డ్ హెయిర్ అయినా, గుండు అయినా బాగుంటుంది. కాని పెద్ద జడ మాత్రం ఉండటం నాకు ఇష్టంలేదు'' అంటూ ఆపాడు.

ఈ వాంటెడ్స్ వింటున్న ఆ కుర్రాడికి మూర్ఛ వచ్చినంత పని అయింది. ఆ కుర్రాడు మ్యారేజ్ బ్యూరో పెట్టినప్పటినుండి ఇలాంటి విచిత్రమైన కోర్కెలు కోరుకొనే వ్యక్తిని ఇప్పటివరకు చూడలేదు. ఆ కుర్రాడికి ఉమేష్‌మీద వెర్రికోపం వచ్చింది. ఉమేష్ జుత్తు పట్టుకొని కుడి ఎడమ తారతమ్యం లేకుండా వాయించాలన్నంత ఆవేశం కలిగింది. వాని, వ్యాపారం చేసుకునేవాడు కనుక అలాంటిపని ఏమి చేయలేదు.

ఉమేష్ మీద కోపాన్ని దిగమ్రింగుకుంటూ, ఓర్పుతో వినయంగా రెండు చేతులు జోడించి దండంపెడుతూ ''సార్! మీరు అడ్మిషన్ ఫీజ్ ఇవ్వవలసిన అవసరం లేదు సార్! మీరు కోరిన అన్ని విషయాలు ఉన్న పెళ్ళికూతురు మా బ్యూరోకు వస్తే మేము మీకు ఇన్‌ఫామ్ చేస్తాం సార్'' అన్నాడు. ఇక మీరు వెళ్ళవచ్చు అన్నట్లుగా....

''ఓ.కె. థ్యాంక్ యూ'' అని చెప్పి, ఇంటికి బయలుదేరాడు. ఉమేష్ తనకు జోడుగా మీనా ఉంటే ఎలా ఉంటుంది అనే తియ్యటి ఆలోచన కలిగింది.

''మీనా ఎత్తు కాస్త తక్కువ అనే కాని చామనచాయ రంగులో ఉంటుంది. తనకు కావలసింది అదే రంగు. ఇంకా తనకు కావలసింది మనిషి కాస్త లావుగా ఉండాలి, మీనాకూడా బలంగా పుష్టిగా ఉంటుంది తమకంగా అనుకున్నాడు. ఈ ఊహరాగానే మీనా పెదవులు కళ్ళలో మెదిలాయి.

మీనాను చూడాలని, ఆమెతో మాట్లాడాలని ఇంకేవో చెయ్యాలని అల్లిబిల్లిగా కోరికలు చుట్టుముడుతున్నాయి.

సాయంత్రం ఎప్పుడవుతుందా అని ఎదురుచూస్తూ ఉన్నాడు. మీనాతో కలిసి మాట్లాడటం కోసం. మీనాకు ఆరోజు నైట్‌షిఫ్ట్ అని ఉమేష్‌కి తెలుసు. సాయంత్రం ఆరుగంటలకంటే ముందే టి.బి. వార్డ్‌లో వెళ్ళి పచార్లు చేస్తున్నాడు. ఆ వార్డ్‌లోనే మీనా పనిచేస్తున్నది.

ఉమేష్ మానసికంగా వెలితి అయిన మనిషి. ఎప్పుడు ఏ ఆలోచన వస్తుందో, ఎప్పుడు ఏ కోరిక కలుగుతుందో తెలియదు, తనకు గుర్తింపు లభించటం లేదంటే చిర్రెత్తు కొస్తుంది. ఎప్పుడు కోపం వస్తుందో, ఎప్పుడు బాగుంటాడో తెలియదు. కనిపించిన ప్రతి ఆడదాన్ని గురించి ఏవేవో ఊహించుకోవటం, వాళ్ళను తక్కువగా అంచనా వేయటం. ఎల్లో పత్రికలు చదవటం, మిల్స్ అండ్ బూన్ బుక్స్ చదవటం; సీరియస్‌గా ఉన్నట్లు కనిపించటానికి ప్రయత్నించటం, ఎవరైన ఇద్దరు (ఆడ, మగ) కలసి ఉంటే చూసి ఓర్వలేకపోవటం .... ఇంకా ఇంకా. ఇలాంటివారు కనిపించిన ప్రతి ఆడదాన్ని ప్రేమించాలి అని వెంటబడుతుంటారు కాని, వీళ్ళు ఎవర్ని ప్రేమించలేరు, కామించటం తప్ప. వారిది కేవలం కామ వాంఛ.

ఇది చాలా సామాన్యమైన మానసిక వ్యాధి. ఈ వ్యాధి ముదిరితే ప్రమాదం కాని; మొదటి దశలో ఉంటే కేవల థెరపి ద్వారా నయం చేయవచ్చు. ఒక వ్యక్తి ఇలా ప్రవర్తించటానికి ముఖ్యంగా రెండు కారణాలు చెప్పుకోవచ్చు. మొదటిది ఊహ తెలియనప్పుడు నాటుకున్న కొన్ని సంఘటనలు, బుద్ధి పరిపక్వత చెందిన తరువాత కూడ జ్ఞాపకాలు వెంటాడుతునే ఉంటాయి. అందువలన వీరు అలా ప్రవర్తించటానికి కారణంగా చెప్పవచ్చు. మరో ముఖ్య కారణం తీరని కోరికలతో, తను పొందలేనిది ఇతరులు అనుభవిస్తూ ఉంటే అది చూసి ఓర్చుకోలేక, కోపం, బాధ, అసమర్థతలు కలిసి, ఆ వ్యక్తి అలా ప్రవర్తించవచ్చు.

సాయంత్రం ఆరు గంటలు దాటింది. డిశెంబర్ నెల కనుక కాస్త చీకటిగా ఉంది. హాస్పటల్ ఆవరణ అంతా లైట్లు వెలిగాయి. ఉమేష్ టి బి. వార్డ్ దగ్గర నిలబడి ఉన్నాడు మీనా వస్తుందేమోనని.

మరో పది నిమిషాలకు మీనా నవ్వుతూ వచ్చి "హలో డాక్టర్!" అంది.

ఉమేష్ ఇటు, అటు చూసాడు కనుచూపు మేరలో ఎవరు కనిపించ లేదు. అంతా ప్రశాంతంగా ఉంది ఆ ప్రదేశం. ఆ పరిసరాల్లో ఎవరూ లేరని నిర్ణయించుకొని మీనా వైపు చూస్తూ "నువ్వు చాలా అందంగా ఉన్నావు", అన్నాడు.

ఆ డైలాగ్‌కి చాలా మామూలుగా రియాక్ట్ అవుతూ "మీరు కూడా చాలా అందంగా ఉన్నారు", అంది.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను", అన్నాడు గబగబ!

"నేను మిమ్మల్ని ప్రేమించటం లేదుగా...", అని అంటూ వార్డ్ లోనికి వెళ్ళిపోయింది.

"మరీ చిన్న పిల్ల మనస్తత్వం, ఏదీ అర్థం చేసుకోలేదు'' అనుకున్నాడు. ఆ చిన్న పిల్లే మరో గంటలో అతన్ని ఏం చేస్తుందో ఆ క్షణంలో తెలియదు.

ఒక పేషంట్ ఉమేష్ అటుగా వెళ్ళడం చూసి, "డాక్టర్‌బాబు, దండాలు'' అన్నాడు.

"అ....నమస్తే., ఏలా ఉంది ఆరోగ్యం?'' అన్నాడు ఉమేష్.

"ఆరోగ్యం బాగానే ఉంది కాని బాబు, రోజూ ఈ ఇంజక్షన్‌లు వేయించుకొని చేతులు జల్లెడలై పోతున్నాయి, ఈ రోజు నుండి ఆ ఇంజక్షన్‌ల మందు నోటితో త్రాగేయాలి అనుకుంటున్నాను" అన్నాడు ఆ రోగి.,

"భలే వాడివే నయ్యా, అలా త్రాగకు. ఇంజక్షన్ మెడిసిన్ త్రాగితే చాలా ప్రమాదం; ఇంజక్షన్ మందు ఇంజక్షనే వేయించుకోవాలి" అన్నాడు.

"పెమాదం ఏముంది బాబు, ఎలాగైనా శరీరంలోకి పోయేదే గందా, ఎటునుంచి లోపలికి లోపలికి పోయినా ఏం...." అన్నాడు అమాయకంగా.

ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

మీనా ఆ వార్డ్ క్యారిడార్‌లో నుంచి వెళ్తున్నది. ఉమేష్ దృష్టి ఆమెమీద పడింది. ఆమెమీదనుంచి దృష్టి మరల్చుకోలేక పోతున్నాడు.

"చెప్పండి డాక్టర్ బాబు, ఇంజక్షన్ మందు త్రాగితే మంచిదే కదా?" అన్నాడు. "కష్టంలేకుండా కడుపులోకి వెళ్తుంది మందు" అన్నాడు మరలా అమాయకంగా.

ఆ రోగి మాటలకు ఉమేష్ విసుగ్గా "ఏమిటి ఇంజక్షన్ మందు నోటితో త్రాగేస్తావా?" అని అడిగాడు.

"అవును బాబు, సూదులు పొడిచి, పొడిచి చేతులు జల్లెడలు అయి పోయాయి" అన్నాడు.

"అయితే నీ యిష్టం, ఎలాగైనా చేసుకో; నాకు ముఖ్యమైన పని ఉంది, వస్తాను." అని చెప్పి ఆ వార్డ్‌లోనుండి క్యారిడార్‌లోకి వచ్చాడు.

దూరంగా క్యారిడార్‌లో మీనా నడుచుకుంటూ వెళ్తున్నది.

తను పరుగులాంటి నడకతో మీనా వెనకే నడుస్తున్నాడు. ఉమేష్ ఆమె వెనుక నుంచే ఆమె ఎత్తు, లావు, అన్ని కోణాల నుంచి గమనిస్తూ అన్ని కొలతలు మనసులోనే అంచనా వేసుకుంటున్నాడు.

ఆడపిల్ల.

పెద్ద అందమైంది కాకపోయినా, వయసులో వుంది కనుక అందంగానే ఉంది. వయసు జాకెట్‌ని బిగుతుగా నింపేసింది. ఆమె పెద్ద ఎత్తు లేక పోయినా మరీ పొట్టిమనిషి ఏంకాదు. చామన చాయలో ఉన్న అందమైన కళగల ముఖం.

క్యారిడార్‌లో ముందు మీనా, వెనుకే ఉమేష్. ఆమె అందాన్ని ఆస్వాదిస్తూ వస్తున్నాడు. "వయసులో ఉన్న ఆడవాళ్ళు ఏ డ్రస్ వేసుకున్నా అందంగానే ఉంటారు" అని ఒక నిర్ణయానికి వచ్చేశాడు.

ఆమె ఏదో గుర్తుకు వచ్చినదానిలా ఒక్కసారిగా ఆగి, గిరుక్కున వెనక్కి తిరిగింది. అతని కళ్ళు, ఆమె కళ్ళతో కలిశాయి.

ఆమె నవ్వుతూ "మీ కోసమే డాక్టర్, నేను రాబోయాను, అదృష్టంకొద్దీ మీరే కనిపించారు. ఈ రోజు నాకు స్టెరిలైజేషన్ సెషన్‌లో డ్యూటీ, మీరు కాస్త తోడువస్తే వెళ్దామని...." అంది చక్రాల లాంటి కళ్ళు తిప్పుతూ.

"తోడు ఎందుకు?" అన్నాడు.

"చీకటిలో వెళ్ళటం అంటే నాకు భయంగా ఉంది. అందువలన మీరు వస్తే ధైర్యంగా చీకటిలో వెళ్ళవచ్చని" అంది.

స్టెరిలైజేషన్ సెక్షన్ హాస్పిటల్‌లోనే ఉన్నా, అది అన్ని వార్డ్‌లకు దూరంగా ఉంది. సాధారణంగా అటు ఎవరూ వెళ్ళరు. టి.బి. వార్డ్ నుండి స్టెరిలైజేషన్ వార్డ్‌కు వెళ్ళే దారిలో పెద్ద మర్రిచెట్టు ఉంది. అది చీకట్లో కాస్త వికృతంగానే ఉంటుంది.

మీనా తనను అంత నమ్మకంగా రమ్మని అడిగినందుకు అతని గుండె ఆనందంతో పొంగిపోయింది.

"సరే పద" అంటూ నవ్వుతూ ఆమె వెంట నడిచాడు. ఆ క్షణం అతనిలో ఆనందం, సంతోషం తప్ప మరో ఆలోచన లేదు. అందువల్లనే మరో కొద్ది సేపటిలో తనకు జరుగబోయే దారుణమైన సంఘటనను ఊహించలేకపోయాడు.

మీనా అతని ప్రక్కనే నడుస్తున్నది. ఆమె ఉండి ఉండి ఉమేష్‌కు రాసుకుంటూ నడుస్తున్నది. ఆమె టచ్ అయిన ప్రతిసారి అతనిలోని రక్తం ఆనందంతో గంతులేస్తున్నది. ఆమె తనకు తగిలిన ప్రతిసారి ఒక క్రొత్తదనం ఉంది. అందువల్లనే అతని ఆనందంతో పులకరించి పోతున్నాడు. కాని పెదవి విప్పి ఏమీ మాట్లాడటం లేదు. గమనించండి-మనిషి విపరీతమైన ఆనందంలో ఉన్నప్పుడు ఏమీ మాట్లాడలేడు. ఉమేష్ అదే స్థితిలో ఉన్నాడు.

ఇద్దరూ ఐదు నిమిషాలల్లో స్టెరిలైజేషన్ సెక్షన్‌కు చేరారు.

మీనా తన దగ్గర ఉన్న కీస్‌తో తాళం తీయటానికి ఎంత ప్రయత్నించినా రాలేదు. ఉమేష్ చేతికి కీస్ ఇస్తూ "మీరు కాస్త ప్రయత్నించండి" అంటూ అందించింది.

ఉమేష్ కూడ రెండు నిమిషాలు క్రిందా మీదాపడి చివరకు తాళం తీయగలిగాడు. తాళం తీసిన తరువాత "నేను చూడు ఎంతటి పనివంతుడినో" అని సినిమా హీరో పోజ్ పెట్టాడు.

కీస్‌ని మీనాకు తిరిగి వాపస్ ఇస్తూ ఉంటే అతని చేతికి ఆమె మెత్తటి కొవ్వొత్తుల్లాంటి వేళ్ళు తగిలాయి. ఆమె స్పర్శ తగిలితేనే వెచ్చగా, తియ్యగా ఉంది. అది, ఇది అని వివరించలేని తన్మయత్వంగా ఉంది.

ఆమె స్టెరిలైజేషన్ సెక్షన్ తలుపు తెరిచింది ఆ సెక్షన్‌లో లైట్లు అన్నీ వేసి ఉన్నాయి.

"రండి సార్!" అంటూ సెక్షన్ లోపలికి నడిచింది.

అప్పటివరకు ఎప్పుడు ఉమేష్ ఆ సెక్షన్‌లోకి వెళ్ళలేదు.

మెల్లిగా పిల్లిలా ఆమె వెంటే సెక్షన్‌లోకి వెళ్ళాడు.

లైట్ల వెలుగు హాల్ అంతా పాలవెల్లువలా ఉంది, ఆ వెలుగులో మీనా ఎప్పుడులేని అందంగా కనిపిస్తున్నది.

తెల్లటి వెలుగులో ఆమె జాకెట్‌కి చీరకి మధ్యనున్న మిలమిల మెరిసే ఆమె నడుము మడతలు లేకుండా, అందమైన కూజా ఆకారంలో ఉంది..

ఆమె అతన్ని ఉద్దేశించి "కూర్చోండి ..." అంది.

"ఆ...." అంటూ టేబుల్ దగ్గర ఉన్న ఒక కుర్చీమీద కూర్చు న్నాడు

"ఒక క్షణం, ఇప్పుడే వస్తాను," అని చెప్పి సెక్షన్ లోపలి గదులలోకి వెళ్ళింది.

ఆమెను గురించి ఉమేష్ ఏవేవో ఊహించుకుంటున్నాడు. సరిగ్గా అప్పుడు అతనికి ఏదో ఎల్లో పత్రికలో చదివిన ఒక వాక్యం గుర్తుకు

వచ్చింది. "పెళ్ళికాని అమ్మాయిని తనవైపుకి తిప్పుకోవాలంటే ఆమెను ముందుగా బాగా పొగడాలి." తన మెమరీ పవర్‌కు మురిసిపోయి, తన అంత తెలివి గలవాడు, ప్రతిభ గలవాడు ఈ దేశంలోనే ఉండడు అని మనసులోనే అనుకున్నాడు.

మీనా బ్యాండేజ్ క్లాత్, చిన్న బండిల్ తెచ్చి టేబుల్‌మీద ఉంచి, టేబుల్ అవతలవైపు ఉన్న కుర్చీమీద కూర్చుంది.

ఆ టేబుల్‌కు ఒకవైపు ఉమేష్, మరోవైపు మీనా ఇద్దరు ఎదురెదురుగా. అతను ఆమెవైపు ఆశగా చూస్తూ ఉన్నాడు.

"మీరు తోడు రాకపోతే నేను సెషన్‌కు రావటానికి చాలా భయపడి ఉండేదాన్ని" అంది.

"మీలాంటి అందమైన అమ్మాయితో రావటానికి ఎవరికి ఇష్టం ఉండదు చెప్పండి? ఇప్పుడు మీరు ఉండమంటే ఈ రాత్రి అంతా మీతో గడపుతాను" అన్నాడు.

ఆ మాటలకు ఆమె ముఖం కోపంతో రక్తవర్ణంలోకి మారింది. అంతే.... ఆవేశంతో విసురుగా లేచి అతని కుడిచెంపమీద తన బలంకొద్దీ కొట్టింది.

స్నేహానికి, ప్రేమకు ఉన్న సున్నితమైన పొరను చూడలేనివారు, శరీర వాంఛలతో రగిలిపోయేవారు ఎప్పుడూ ఉమేష్‌లా పొరపాట్లు చేస్తూనే ఉంటారు. కామం ప్రేమను పుట్టించదు. కామం ఒకరకమైన ప్రేమలో చివరిస్తాయి. వాంఛతో, కోరికతో ప్రారంభమయ్యే ప్రేమ నిజమైన ప్రేమ కాదు - అది వ్యామోహం.

* * *

రాత్రి తొమ్మిది గంటలు కావస్తున్నది.

అది పిల్లల వార్డ్. పిల్లల ఏడుపులతో, తల్లుల కబుర్లతో చిన్న రొదలాంటి శబ్దం ఆ వార్డులోని వాతావరణం అంతా ఆవరించింది.

ఒక సిస్టర్ కొంతమంది పేషంట్‌లకు టెంపరేచర్ కేస్ షీట్‌లో రికార్డ్ చేస్తున్నది.

అభిమన్యు వార్డ్‌లోకి రావటంతో కొంత మంది తల్లులు ''డాక్టర్ గారు వస్తున్నారు....'' అంటూ ఎలర్ట్ అయ్యారు.

నిన్న ఎపెండిసైటస్ ఆపరేషన్ అయిన అబ్బాయి బెడ్ దగ్గరికి వెళ్ళి కేస్ షీట్ చూశాడు. అరచేతితో తాకాడు. వెచ్చగా వుంది శరీరం. నాడి చూచాడు. ఫాస్ట్‌గానే కొట్టుకుంటుంది. అంతా నార్మల్‌గా, సంతృప్తి కరంగా ఉన్నందుకు తృప్తిపడ్డాడు.

పేషంట్ తల్లి అభిమన్యుకి రెండు చేతులు జోడించి దండం పెట్టింది. ఆమె ఏడుపు స్వరంతో ''నా బిడ్డను దక్కించారు బాబు, మీరు దేవుళ్ళు చేసే పని చేశారు బాబు.మీ మేలు ఎలా తీర్చుకోగలం....?"అంది.

ఆ మాటలు విని అభిమన్యు కళ్ళు చెమర్చాయి.

''మధ్యాహ్నం ఏం ఇచ్చారు తినటానికి?...."

"పాలు ఇచ్చాను బాబు ... ఇప్పుడే నిద్రపోయాడు...." అంది.

''సరే.... ధైర్యంగా ఉండండి ..." అంటూ అక్కడినుండి ముందుకు వెళ్ళాడు.

రాత్రి పది గంటల సమయంలో డ్యూటీ రూమ్‌కు వెళ్ళాడు.

స్నేహిత కూర్చొని ఉంది, ఏదో ఫైల్ తీక్షణంగా చూస్తూ ఉంది.

అభిమన్యు రావటం గమనించి, ''హలో డాక్టర్, రౌండ్స్ అయిందా? సీరియస్ కేసులు తగిలాయా?'' అంది.

స్నేహిత నైట్ డ్యూటీకి వచ్చిన ప్రతిసారి అడిగే ప్రశ్నే ఇది.

దానికి అభిమన్యు సమాధానం ఒక చిరునవ్వు నవ్వుతాడు-అంతే.

"మంచివాళ్ళు, తెలివైనవాళ్ళు ఎక్కువ మంది ఉండరు. కాని, వారి ప్రభావం ఎక్కువ మందిపై ప్రసరిస్తుంది...." అంది స్నేహిత.

"అంటే....?"

"ప్రపంచంలో కాని, దేశంలో కాని మంచివాళ్ళు ఉండవచ్చు, అలాగే తెలివైనవారు ఉండవచ్చు. తెలివైన ప్రతివారు మంచివాళ్ళు కానవసరంలేదు. కానీ, మీరు మాత్రం తెలివైనవాళ్ళే కాకుండా మంచి వారు కూడా. అందువల్లే మీ ప్రభావం చాలా మందిపై ఉంటుంది" అంది లాజికల్‌గా మాట్లాడుతూ.

నిన్న రాత్రి జరిగిన ఆరేళ్ళ అబ్బాయి ఎంపెడిసైటిస్ కేస్ గురించి మాట్లాడుతున్నదని అర్థమయింది.

ఎలాంటి వారికైనా పొగడ్త, ప్రశంస ఒకరకమైన ఆనందాన్ని ఇస్తాయి. కాని ఇక్కడ ప్రశంస ఓ అందమైన ఆడపిల్ల చేస్తూంటే ఏ మగాడికైనా ఎంత ఆనందం కలుగుతుందో ఊహించుకోవచ్చు.

అభిమన్యు ఎక్కువ సమయం హాస్పటల్‌లోనే గడుపుతుండేవాడు. ప్రతి పేషంట్‌ను ఎంతో జాగ్రత్తగా పరీక్షచేసి కనుక్కొనేవాడే కాని, ఏ పేషంట్ వ్యాధిని ఊహించి మందులు ఇచ్చి టెస్ట్ చేసేవాడు కాదు.

కొంతమంది గర్భిణీ స్త్రీలు సాధారణంగా నడుమునొప్పితో బాధ పడుతూ వస్తూ ఉంటారు. ఇలా వచ్చేవారిలో ఎక్కువమంది కండరాల శక్తి కలిగి ఉండరు. దీనివలన ఒకవైపు కడుపు పెద్దదవుతుంటే ఆ స్త్రీలలో భరించలేనంత నడుమునొప్పి వస్తుంది. ఈ రకమైన సమస్యతో వచ్చిన వారికి పెయిన్ రిమూవర్ ట్యాబెలెట్స్ వాడవచ్చు కాని మరీ

ఎక్కువగా వాడితే ప్రమాదం అని మంచి ఆహారం, ఫలాలు తినమని ప్రిస్క్రయిబ్ చేసేవాడు.

నలభై ఐదు సంవత్సరాలు ఉన్న లేడీ పేషంట్ వచ్చి తల నొప్పి, నీరసం, తలతిప్పటం మొదలయిన లక్షణాలు చెప్పింది. బి.పి. ఇన్‌స్ట్రుమెంట్ కఫ్ ఆమె చేతికి కట్టి, బి.పి. టెస్ట్‌చేసి—

"రక్తపోటు ఉందమ్మా, నలభై సంవత్సరాలు దాటిన ఎక్కువ మందికి ఈ రక్తపోటు వస్తూనే ఉంటుంది .... ట్యాబ్‌లెట్స్ వ్రాస్తాను" అని అభిమన్యు వ్రాయబోతుంటే—

"అదేంటయ్యా, నాకు రక్తం లేదని మా ఇంటిదగ్గర ఓ డాక్టర్ చెప్పాడు" అంది.

"రక్తపోటు రావటానికి రక్తం ఎక్కువగా ఉండవలసిన అవసరం లేదమ్మా... అనవసర ఆందోళనలు, భయాలు ఉండటం వలన రావచ్చు. ఆహారంలో ఉప్పు, కొవ్వు పదార్థాలు ఎక్కువగా ఉండటం వలన ఈ బి.పి. వస్తుంది. దీనివల్లే తలనొప్పి, నీరసం వస్తుంది" అని వివరణం చేశాడు. నిజానికి రక్తపోటు పెరగటానికి, తలనొప్పి రావడానికి ఎలాంటి ప్రత్యక్ష సంబంధం లేదు. రక్తపోటు ఎంతమేరకు పెరిగినా తలనొప్పి వచ్చేది ఎవరూ ఖచ్చితంగా చెప్పలేరు. రక్తపోటు ఉన్న ఇద్దరు వ్యక్తులలో ఒకరికి తలనొప్పి ఉండవచ్చు; మరొకరికి ఉండకపోవచ్చు. రక్తపోటు ఉండే ప్రతి రోగికి తలనొప్పి, నీరసం ఉండితీరాలి అనే రూల్ ఏమీ లేదు!

కొందరు బి.పి. ఉన్న వ్యక్తులలో బి.పి. పెరిగినా తలనొప్పి ఉండకపోవచ్చు. అలాగే బి.పి. బాగా కంట్రోల్‌లో ఉన్నప్పుడు కూడా తలనొప్పి ఉండవచ్చు. కనుక తలనొప్పి, నీరసం బి. పి. ఉన్న పేషంట్స్‌లో ఉండవచ్చు, ఉండకపోవచ్చు.

అభిమన్యు కంటే రెండేళ్ళు సీనియర్ అశోక్ వచ్చాడు, అభిమన్యు ఛాంబర్‌లోకి. ఇద్దరు ఒకరిని ఒకరు కరచాలనం చేసుకున్నారు. అశోక్ ఒంగోలులో ప్రైవేట్ నర్సింగ్ హోమ్ పెట్టాడట. ప్రైవేట్ హాస్పటల్స్‌లో ఉండే సాధక సాధకాలు ఏకరువు పెట్టాడు.

''గార్నమెంట్ హాస్పటల్స్‌లోకంటే ప్రైవేట్ హాస్పటల్స్‌లో పేషంట్స్ మీద ఎక్కువ కేర్ తీసుకోవలసి ఉంటుంది బ్రదర్! ప్రైవేట్ నర్సింగ్ హోమ్ డాక్టర్ ఎప్పుడూ నవ్వుతూనే ఉండాలి. లేకపోతే రెప్యుటేషన్ తగ్గుతుంది. కొంత మంది పేషంట్స్ చెప్పిందే చెప్పి డాక్టర్లను నంజుకు తింటుంటారు. అలాంటి వారితో డీల్ చేసేటప్పుడు ఎంతో ఓపిక, సహనం ప్రదర్శించాలి, లేకపోతే హాస్పటల్ రెపిటేషన్ పెరగదు. పేషంట్ చెప్పే నానా సోది ఆసక్తిగా వినాలి. లేకపోతే, డాక్టర్‌గారికి లౌక్యమే తెలియదని ఆడిపోసుకుంటారు, పేషంట్ కోరిన ప్రకారం అవసరం ఉన్నా లేకపోయినా మన ప్రతిభ ప్రకటించుకోవటం కోసం పదిరకాల ట్యాబ్‌లెట్స్, ఐదురకాల ఇంజెక్షన్స్ వ్రాసి పారేయాలి. అలా అన్ని మందులు ప్రిస్క్రయిబ్ చేయకపోతే డాక్టర్‌గారికి ఏమీ తెలియదు అని ప్రచారం చేస్తారు. అందువలన మరలా రెప్యుటేషన్ తగ్గుతుంది. అందువలన ప్రైవేట్ నర్సింగ్‌హోమ్ నడపటానికి చాలా తెలివితేటలు ఉండాలి. ఆ.... అభిమన్యు! ఒక విషయంలో చాలా జాగ్రత్త ఉండాలి. ఏమిటో కనుక్కో'' అని అడిగాడు అశోక్.

అభిమన్యు ఏదో ఆలోచనలో పడ్డాడు.

"నీకు తెలియదులే. అయినా, ప్రయివేట్ నర్సింగ్‌హోమ్ నడపటం అంటే మాటలా? ప్రతి విషయంలో ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి. నవ్వుతూ పేషంట్‌ను ఆహ్వానించాలి. వాళ్ళు చెప్పే తలా తోకా లేని విచిత్రమైన మాటలు ఓపికగా వినాలి. అవసరం ఉన్నా లేకున్నా పది

రకాల మందులు వ్రాస ఇవ్వాలి. వీటన్నిటికీ మించి పేషంట్‌ను ఫీజ్ అడగకూడదు; ఫీజు అడిగితే కొంతమంది పేషంట్స్‌కు బి.పి. పెరిగి పోతుంది. అలాంటి వారిచేత చాలా జాగ్రత్తగా ఫీజు రాబట్టుకోవాలి. అప్పుడప్పుడు మంచి పేషంట్స్ కూడా దొరుకుతుంటారనుకో. ఎనీవే, ప్రైవేట్ నర్సింగ్‌హోమ్ నడపటం కోసం ఎటొచ్చి తెలివితేటలకంటే ఓర్పు, నేర్పు, కొంచెం మంచితనం లేకపోతే రాణించలేరు బ్రదర్'' అని ఒక స్టేట్‌మెంట్ పాస్ చేశాడు.

''నా ఓర్పు, నేర్పు, మంచితనం మీద నమ్మకం ఉంది అశోక్! అయినా, జీవితంలో పైకి రావాలంటే ఈ మూడు గుణాలు ఉండవలసిందే" అన్నాడు అభిమన్యు. అతని మాటలో ఎంతో ఆత్మవిశ్వాసం, అంతకంటే మించి నిశ్చలత్వం ఉన్నాయి.

అభిమన్యు హౌస్ సర్జన్సీలో ఎంతో నేర్చుకున్నాడు. అంత అనుభవం అనేక గుణపాఠాలను నేర్పింది.

ఒక డాక్టర్ జీవితంలోని అపూర్వ దశ పరిసమాప్తం అయింది ఆ తర్వాత 1982లో అభిమన్యు హెల్త్ సెంటర్ ప్రారంభించాడు. పట్టు దలతో, సేవాభావంతో వృత్తికి అంకిత మయ్యాడు. పురుష ప్రయత్నా నికి, పట్టుదలకు దేవతల ఆశీర్వాదం ఉన్నట్లు అతని దశ తిరిగింది ఐదేళ్ళ కాలంలోనే "అభిమన్యు హెల్త్ సెంటర్'' కాస్త "అభిమన్యు మెడి కల్ ఇనిస్టిట్యూట్"గా మారింది. క్రమంగా దక్షిణ భారత దేశంలో ప్రముఖ వైద్య సంస్థలలో "అభిమన్యు మెడికల్ ఇనిస్టిట్యూట్" ఒకటిగా మారింది.

అంతే—

అభిమన్యు ఇక అప్పటినుండి వెనుతిరిగి చూడలేదు.

* * *

స్నేహితకు స్పృహ వచ్చేసరికి సాయంత్రం ఆరుగంటలయింది. కళ్ళు తెరిచి చూసింది. తాను హాల్ మధ్యలో ఉన్న తివాచీ మీద ఉంది. చుట్టూ చూసింది. ఎవరూ కనిపించలేదు. తలలో చిన్న పోటుగా ఉంది.

లైట్లు అన్నీ వెలుగుతూనే ఉన్నాయి. లేచి వెళ్ళి కర్టన్ తొలగించి చూసింది. దూరంగా రోడ్డు కనిపించింది. సిటీకి బాగా దూరంగా ఉన్నట్లుంది, అందువల్ల ఆ రోడ్‌మీద జనసంచారం అసలు లేదు.

దివ్య ఉన్న భవనానికి, ఆ రోడ్డుకు మధ్య కనీసం రెండొందల గజాల దూరమయినా ఉంటుంది. అంతా మైదానం. రోడ్డుకూ భవనానికి మధ్య ఇల్లు కాని, పెద్ద చెట్లు కాని ఏమీలేవు.

చీరకొంగుని వీపుమీదనుంచి కప్పుకొని అసహనంగా ఇటు అటు తిరిగింది.

మరో గంట దాటితే కాస్త చీకటి పడవచ్చు. అప్పుడు ఎలాగోలా రోడ్ చేరితే అక్కడినుంచి ఏ బస్‌లో అయినా వెళ్ళి సిటీ చేరి మొదట పోలీస్ రిపోర్ట్ ఇవ్వాలి అనుకుంది.

కాని, క్షణక్షణానికి భయం అధికం కాసాగింది. భయంగానే వెళ్ళి ప్రక్క రూమ్‌లోకి వెళ్ళి చూసింది.

ఆ గదిలో నరేంద్ర, లూథర్, మస్తాన్ కుక్కపిల్లల్లా ఒకరి మీద ఒకరు పడి నిద్రపోతున్నారు. వాళ్ళు నిద్రపోతున్న ఉన్న గది డోర్ ఏ మాత్రం శబ్దం రాకుండా క్లోజ్ చేసింది. కాని, ఆ రూమ్‌లో నుండి బయటకు రావటానికి మరొక డోర్ ఉందని గ్రహించలేకపోయింది. సైకలాజికల్‌గా కాస్త ధైర్యం వచ్చింది. ఆ బిల్డింగ్ మెయిన్‌గేట్ దాటి, పరుగులాంటి నడకతో వచ్చి రోడ్ చేరింది.

అసహనంగా బస్సులు ఏమయిన వస్తాయేమోనని ఎదురుచూడటం ప్రారంభించింది.

గదిలో నిద్రపోతున్న నరేంద్రకు ఒక్కసారిగా మెలకువ వచ్చింది. టైమ్ చూసుకున్నాడు సాయంత్రం ఆరు గంటల పది నిమిషాలయింది.

నిద్ర కళ్ళతో లేచి వెళ్ళి కర్టన్ తొలగించి రోడ్ మీదకు చూసాడు. దూరంగా బస్‌కోసం ఎదురు చూస్తున్న స్నేహిత కనిపించింది. అంతలోనే మరలా అనుమానం; ఆ కనిపించే మనిషి స్నేహితేనా కాదా అనే అనుమానాన్ని రుజువు చేసుకోవటానికి హాల్‌లోకి రావటం కోసం డోర్ తెరవటానికి ప్రయత్నించాడు. హాల్‌లో నుంచి గడియ పెట్టినట్లు ఉంది. వేరే డోర్‌లోగుండా వచ్చి, స్నేహితను బంధించి ఉంచిన గది, హాల్ అంతా చూశాడు అక్కడ స్నేహిత లేదు.

నరేంద్రకు వెర్రి ఆవేశం కలిగింది, కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి, ఆ భవనం దద్దరిల్లేలా భయంకరంగా పొలికేక పెట్టాడు. ఆ అరుపుకు నిద్రలో ఉన్న మస్తాన్, లూథర్ లేచి కూర్చున్నారు.

స్నేహిత ఇప్పుడు అక్కడినుంచి తప్పించుకుంటే చౌదరిగారికి చాలా ప్రమాదం. అంత కంటే ముందు నరేంద్ర, లూథర్, మస్తాన్‌లకు ముప్పు. తమ రహస్యాలు తెలుసుకున్న స్నేహితను ఇక బ్రతకనివ్వ కూడదనే గట్టిగా నిర్ణయించుకొన్నారు.

త్రిమూర్తులు భవనం నుంచి బయటకు వస్తున్నారు స్నేహితను అంతమొందించటానికి. ఆ ముగ్గురిలో ఏ ఒక్కరికీ జాలి,దయ మచ్చుకైనా లేవు. వాళ్ళకు ఇప్పుడు రెండే ధ్యేయాలు-తమ రహస్యాలు తెలుసుకున్న వారిని ఎట్టి పరిస్థితుల్లో బ్రతకనివ్వకూడదు. ఆ ప్రయత్నంలో తమ ప్రాణాలు పోయినా లెక్కలేదు అనే తెగింపుతో స్నేహిత దగ్గరికి వస్తున్నారు.

కాని, స్నేహిత ఇది ఏమీ గమనించటం లేదు. ఆమె భవనంనుంచి రోడ్డుమీదకు వచ్చిన దారివైపు చూస్తున్నది కాని, ఆ దారేకాక మరో దారి ఉందని గ్రహించలేక పోయింది.

దూరం నుంచి ఏదో వాహనం మసక వెలుతురులో వస్తున్నది. ఆ వాహనం చూస్తూ వుండగానే వేగంగా వస్తూ దగ్గరవుతున్నది అది పోలీస్ జీప్.

ఆమెకు కొండంత ధైర్యం వచ్చింది.

చేయి ఊపుతూ ఆపమన్నట్లుగా సైగ చేసింది.

జీప్ ఆగింది. ఫ్రెంట్ సీట్‌లో యస్ ఐ. కూర్చొని ఉన్నాడు. వెనుక కొంతమంది కానిస్టేబుల్స్ ఉన్నారు.

ఎస్.ఐ. పోలీస్ కళ్ళు స్నేహితను నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూసిన తర్వాత "సరే, ఎక్కండి" అంటు ఫ్రెంట్‌లో సీట్ చూపాడు.

బాధతో ఒకవైపు ప్రమాదం నుంచి బయటపడ్డాననే కాస్త ఊరటతో ఉన్నా - మనసు పొరల్లోనుంచి దుఃఖం పొంగుకొస్తున్నది.

ప్రక్కనే ఉన్న ఎస్.ఐ. ఆమెను, ఆమె పరిస్థితిని చూస్తూనే ఉన్నాడు కాని, ఏమీ అడగటం లేదు. అది కొంతమంది పోలీస్ ఆఫీసర్ల స్టైల్.

చివరిగా స్నేహితయే ఎస్.ఐ.తో తన విషయం చెప్పటం కోసం గొంతు సవరించుకొని చెప్పటం ప్రారంభించింది:

"నా పేరు స్నేహిత, మెడికల్ రిపోర్టర్ ఎడిటర్...." అని ప్రారంభించి, తనను కిడ్నాప్‌చేసిన విషయం, అక్కడి నుండి తను తప్పించుకున్న విషయం అంతా పూసగుచ్చినట్లుగా చెప్పింది.

అంతా విని ఎస్. ఐ. కూల్‌గా ''మీరు చెప్పింది అంతా వింటుంటే థ్రిల్లింగ్ పిక్చర్ చూసినట్లుగా ఉంది; అలా అని మీరు చెప్పింది అంతా అబద్ధం అని కాదు నా ఉద్దేశ్యం, నిజమే అయి ఉండవచ్చు. కాని, ఇది అంతా నిజంగా జరిగిందే అని నిరూపించటాని మీదగ్గర సాక్ష్యం ఏదైన ఉందా?'' అన్నాడు.

అతను ఏ రకంగా అడిగినా ఒకటి మాత్రం నిజం-ఒక నేరస్తుడ్ని శిక్షించటానికి తప్పనిసరిగా సాక్ష్యం కావాలి. ఒక నిజాన్ని నిరూపించ డానికి సాక్ష్యం కావాలి అనుకుంది మనసులో. మన కోర్టులు అడిగే అతి చిన్న కోరిక "సాక్ష్యం,'' తమ్మిని బమ్మి చేయగలిగేది సాక్ష్యం.

ఆమె జీవితంలో మరణ మృదంగ ఘోష ప్రారంభమయింది. ఆ ముగ్గురు వ్యక్తులు ఏక్షణంలో వచ్చి ఏ రకమైన అఘాయిత్యం చేస్తారో అని భయం మనసులో నాటుకుంది. కాని గాడ్‌ఫాదర్ చౌదరి, ఆ ముగ్గురు ఈ దేశంలో ఉంటే తనకు ప్రమాదం అని నరేంద్ర, లూథర్, మస్తాన్ లను కొన్ని గంటలలోనే దేశ సరిహద్దులను దాటించేశాడు.

స్నేహిత అభిమన్యుకి దగ్గరగానే మెలుగుతున్నది కాని, తనకు జరిగిన కిడ్నాప్ విషయం కానీ, చౌదరి నిజరూపం కాని చెప్పలేక పోతున్నది. ఒకవేళ చెప్పినా అభిమన్యు నమ్ముతాడా అని అనుమానం. ఒకవేళ నమ్మినా ఎలా రియాక్ట్ అవుతాడో అని భయం. అన్నిటికంటే మించి ఆమె దగ్గర ఏమీ సాక్ష్యం లేదు - లూథర్ చేతిలో చినిగిన జాకెట్ తప్ప. కాని, ఆ సాక్ష్యం ఎలా చూపగలదు?

ప్రాజెక్ట్-సి పూర్తిస్థాయిలో తయారు చేయగలిగారు అభిమన్యు, విశ్వామిత్ర ఇద్దరూ కలసి. ఈసారి తమ ప్రయోగాన్ని మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా మెంబర్స్ ముందు ప్రదర్శించాలి, ప్రెజెంట్ చేయాలి అనుకున్నాడు డాక్టర్ అభిమన్యు.

ఈసారి ఫార్ములా చేజిక్కించుకోవటం కోసం డైరెక్ట్ అటాక్ జరుగుతుందని అభిమన్యుకాని, స్నేహితకాని ఊహించలేకపోయారు. అభిమన్యుని,అతని ప్రాజెక్టుని ఎలా స్మాష్ చేయాలో ప్లాన్ పూర్తి అయి ఉందిఅప్పటికే. చౌదరిమైండ్‌లో అతని గోడౌన్‌లోని మారణాయుధాలకు, రాక్షసుల్లా ఉండే అతని అనుచరులకు పూర్తిప్లాన్ ఎక్స్‌ప్లైన్ చేయబడింది ఒకరోజు ముందే.

* * *

రుక్మిణి ప్రవర్తనలను మాటతీరు రోజు రోజుకు మితిమీరుతున్నాయే కాని తగ్గటంలేదు. భార్య ప్రవర్తన అన్ని గమనిస్తూనే ఉన్నాడు కాని, ఏమీ అనలేని,చేయలేని అసమర్థుడిలా తయారైనాడు బుజ్జిబాబు. సమయం దొరికినప్పుడు మనసులోనే గబగబ ఏడ్చుకోవటంతో సరిపెట్టుకుంటు న్నాడే కాని, భార్యను మానసిక సైక్రియాటిస్ట్ దగ్గర చూపించి మంచి చికిత్స చేయించాలి అని మాత్రం అనిపించలేదు.

ఆ రోజు ఎవరో మిత్రులు ఆఫీస్‌లో మాట్లాడుకుంటూ హిప్నాటిజమ్‌తో మానసిక వ్యాధుల నివారణ, ఆ సందర్భంగానే నగరంలోని ప్రముఖ మానసిక వైద్యురాలు డాక్టర్ స్వాతి గురించి విన్నాడు.

బుజ్జిబాబుకు మంచి రోజులొచ్చినట్లుంది. వెంటనే ఆలస్యం చేయకుండా డాక్టర్ స్వాతి హాస్పిటల్‌కు బయలుదేరాడు.

హాస్పిటల్ కనుక్కోవటం పెద్ద కష్టం అనిపించలేదు.

కన్సల్టింగ్‌కోసం వచ్చినవారు దాదాపు ఇరవైమందిదాకా ఉన్నారు. బుజ్జిబాబు కన్సల్‌టింగ్‌కోసం స్లిప్ వ్రాయించాడు. కన్సల్‌టింగ్ ఫీజ్ యాభై రూపాయలు పోతేపోనీ మంచి సొల్యూషన్ చెప్తారు డాక్టర్‌గారు- భార్యను గుర్తుచేసుకుంటూ అనుకున్నాడు.

కన్సల్‌టింగ్ కోసం వచ్చినవారు డాక్టర్ ఛాంబర్‌లో దాదాపు అర్ధ గంటవరకు ఉంటూ ఉన్నారు.

వెయిటింగ్ హాల్‌లోని మెత్తటి కుషన్ సోఫాలో ధీమాగా కూర్చున్నాడు. చాలా రిలాక్స్‌గా ఫీల్ అవుతూ హాస్పిటల్ అవరణం అంతా కలియజూశాడు. ఆ హాస్పిటల్ వాతావరణంలో ఎక్కడా ఏడుపు శబ్దాలు కాని, క్లోరోఫామ్ వాసనలు కాని ఏమిలేవు. చాలా ప్రశాంతంగా భాస్కర ప్యాలెస్ హోటల్‌లోని వెయిటింగ్ హాల్‌లా ఉంది. చాలా అందంగా అమర్చిన ఇంటీరియర్ డెకరేషన్-అది అంతా చూస్తుంటే తను హాస్పటల్‌లో ఉన్నాను అన్న విషయమే మరచిపోయాడు.

అదృష్టంకొద్ది మరో పావుగంటలో కన్సల్‌టింగ్‌కోసం పిలుపు వచ్చింది.

బుజ్జిబాబు మెల్లగా తలుపు పుష్‌చేసి లోపలకు వెళ్ళాడు. చల్లటి ఎయిర్‌కండీషనర్ గాలి బుజ్జిబాబును ఓ నిమిషంపాటు కలవరపెట్టింది. మరుక్షణంలో గిలిగింతగా అనిపించింది. కన్సల్‌టింగ్ రూమ్ ఎయిర్ కండిషన్ చేసినట్లుంది. అది కన్సల్‌టింగ్ రూమ్‌లా కాకుండా కాన్ఫరెన్స్ హాలులా ఎంతో విశాలంగా ఉంది.

పెద్ద గ్లాస్ టేబుల్‌కు అటువైపు మూడు పదులకు కాస్త అటు ఇటులో ఉన్న డాక్టర్ స్వాతి చాలా నిండుగా ఉన్నారు. కాని, ఆమెను చూసినవారు ఆమెకు ఓ ట్వంటీ ప్లస్ ఫైవ్ అనుకుంటారే కానీ అంతకంటే ఎక్కువ అని అనుకోలేరు ఇలాంటి విషయాల్లో యక్స్‌పర్ట్ అయిన బుజ్జిబాబులాంటివాళ్ళు తప్ప.

డాక్టర్ స్వాతి చిలకపచ్చ రంగు పట్టుచీర కట్టుకొని ఉన్నారు. ఎర్రటి బుల్లిబుల్లి పెదవులు చిలుక ముక్కులా ఉంది; ఆమె టోటల్‌గా చిలకలా ఉంది అనుకున్నాడు బుజ్జిబాబు.

"యస్. ప్లీజ్ కమిన్." ఆమె గొంతు చక్కగా శృతి చేసిన వీణ పలికినట్లు ఉంది.

బుజ్జిబాబు అంచనా ప్రకారం డాక్టర్ అంటే బాగా వయసు ముదిరి అందులో మానసిక వైద్యులు అంటే మగవారైతే చిన్న పిల్లిగడ్డం ఉండి, యాభై సంవత్సరాలు పైబడి ఉంటారు. ఆడ మానసిక డాక్టర్ అయినట్లయితే ఎట్లా కాదన్నా ఓ యాభై సంవత్సరాలు ఉండి, తల నెరసి, కళ్ళు అద్దాలు పెట్టుకొని ఉండాలి. కాని, ఇక్కడ బుజ్జిబాబు స్టాటస్టికల్ లా తలక్రిందులైంది డాక్టర్ స్వాతిని చూస్తుంటే; అందువల్లనేమో బుజ్జిబాబుకు గొంతు తడి ఆరిపోయింది.

స్వాతి పరిస్థితి గమనించి "నీళ్ళు త్రాగండి...." అంది.

"వద్దండి...." అన్నాడు అతి బలవంతంమీద గొంతు పెగల్చుకుంటూ-

"ఏం పర్వాలేదు తీసుకోండి"

టేబుల్ మీద ఉన్న గాజు గ్లాస్‌లోని నీళ్ళు మూడు గుక్కల్లో త్రాగి కాస్త సేద తీర్చుకున్నాడు.

"ఏంతీసుకుంటారు, కాఫీ, టీ, కూల్‌డ్రింక్స్...." అంటూ ఇంటర్‌కమ్ నొక్కింది.

ఇది కలా నిజమా అనుకున్నాడు - మరుక్షణమే యాభైరూపాయలు కన్సల్‌టింగ్ ఫీజ్ ఉన్నప్పుడు ఇది సహజమేనేమో అని సరిపుచ్చుకున్నాడు.

"చెప్పండి ఏం తీసుకుంటారు" అంది హుందాగా డాక్టర్ స్వాతి.

"ఇరానీ చాయ్" అన్నాడు వెంటనే తడుముకోకుండా, ఆఫీస్ బాయ్ ఛాంబర్‌లోకి వచ్చాడు.

"ఏక్ ఇరానీ చాయ్ లాయియే" అని అంది ఎంతో స్పష్టంగా.

ఆఫీస్ బాయ్ బయటికి వెళ్ళాడు.

డాక్టర్ స్వాతి హుందాగా బుజ్జిబాబు వైపు చూశారు - ఇక మీ సమస్య చెప్పండి అన్నట్లు.

బుజ్జిబాబు చెప్పటం ప్రారంభించాడు: "నా పేరు బుజ్జిబాబు. నేను...." అని ప్రారంభించి తన పెళ్ళి, తరువాత సంవత్సరం చేదు అనుభవాలు అన్నీ చెప్పాడు. భార్య స్వభావం పూస గుచ్చినట్లు చెప్పాడు.

సాధారణంగా ఏ డాక్టర్ దగ్గరికి వెళ్ళినా ముందు జనరల్ ఇన్ఫర్మేషన్ హిస్టరీ తీసుకుంటారు కానీ డాక్టర్ స్వాతి పేషంట్‌తో ఓ పది నిమిషాలు మాట్లాడిన తరువాత హిస్టరీ అంతా రాబట్టి నోట్స్ వ్రాసుకుంటారు. అది అనుభవంతో, ప్రతిభతో వచ్చేదే కాని, అనవసరంగా తపనపడితే వచ్చేది కాదు. ఆ అసాధారణ ప్రతిభ స్వాతిలో ఉండటం విశేషం.

సమస్యకు మూలకారణాన్ని అన్వేషించటం ప్రారంభించారు డాక్టర్ స్వాతి. అన్నిటికన్నా ఇదే అతి ముఖ్యమైనది. అసలు కారణాన్ని ఏదో ఒకటిగా ఊహించరు. తెలుసుకుంటారు. కాని, అడిగికాదు; ఏది సరియైన ఖచ్చితమైన కారణమో మాటల్లో పెట్టి గ్రహిస్తారు డాక్టర్ స్వాతి.

"ఏ మాట అన్నా రుక్మిణికి తప్పుగానే తోస్తుంది. ఏదిమాట్లాడాలో ఏది మాట్లాడకూడదో అర్థం కావటం లేదు డాక్టర్! నేను ఈ మెంటల్ టార్చర్ భరించలేకపోతున్నాను డాక్టర్!" అని చెప్పి ఏడుపు మొఖం పెట్టాడు, ఏడవాలా వద్దా అని ఆలోచిస్తూ.

"ఓ.కే. ఇది చాలా చిన్న సమస్య...." అని శ్రావ్యంగా డాక్టర్ స్వాతి చెప్పటం ప్రారంభించారు.

ఆఫీస్ బాయ్ టీ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

"తీసుకోండి.... ప్లీజ్!" అన్నారు డాక్టర్ స్వాతి.

మరలా చెప్పటం ప్రారంభించారు: "జీవితాంతం మంచి స్నేహితుల్లా కల్సి ఉండాల్సిన భార్యాభర్తలు ఇలాంటి చిన్న చిన్న సమస్యలను విజ్ఞతతో మెలగాలి, అయినా భార్యాభర్తల మధ్య వచ్చే పోట్లాటలు అద్దం మీద పెసరగింజల వంటివి.

వ్యక్తిత్వం వికాసం లోపం వలన జీవితంలో అనుకోని సంఘటనలు జరగటంవల్ల తట్టుకోలేక కొందరు మానసిక రోగులుగా తయారౌతారు. అంతేకాక, జీవితంలో అనుకున్నవి సాధించలేనప్పుడు, జీవితంలో ఓడి పోయాము అనే భ్రమ కలిగినప్పుడు, మీ భార్యలా ప్రవర్తిస్తారు చాలా సాధారణంగా. ఇది భయంకరమైన వ్యాధి కానప్పటికీ అలక్ష్యం చేయదగ్గది మాత్రం కాదు. ఏ వ్యాధి అయినా మొదటి దశలోనే పూర్తి చికిత్స పొందటం అన్నివిధాల మంచిది. మీ భార్య 'న్యూరోసిస్' అనే వ్యాధితో బాధపడుతున్నట్టుంది. చిన్న చిన్న విషయాల్లో మొండిపట్టుదల చూపటం, గోరంతలు కొండంతలు చేయటం, దయ్యం పట్టినట్లు ప్రవర్తించటం, అతిగా మాట్లాడటం. మీరు ఓ సారి మీ భార్యను పిలుచుకొని రండి, కౌన్సిలింగ్ ప్రారంభిస్తాను. కానీ, మీ భార్యకు ఒక మానసిక రోగిగా కాకుండా, ఓ మామూలు మనిషిగా కాని లేదా ఓ శారీరక అవస్థ (సమస్య) వల్ల కాని, పిలుచుకొని రండి. మానసిక రోగులు సాధారణంగా తాము మానసిక రోగులు అని అంగీకరించరు. చాలా జాగ్రత్తగా డీల్ చేయండి. ఓ.కే." అన్నారు స్వాతి

"అలాగే మేడమ్, థాంక్స్!" అని సంస్కారంగా బయటకు వచ్చాడు.

బుజ్జిబాబు ఆనందం పట్టలేకపోతున్నాడు.

సాయంత్రం ఇల్లు చేరేసరికి, భార్య చేతి వేలికి తడిబట్ట చుట్టుకొని ఉంది.

"ఏమయింది రుక్మిణీ?" అని చేతిని చూస్తూ అడిగాడు.

"కూరగాయలు తరుగుతుండే కత్తి పీట కోసుకుంది, ఇంటిలో భార్య ఇంటి పనులకు చేదోడుగా ఓ పని మనిషిని పెట్టాలనే ఇంగితం లేదు...." అని దండకాన్ని మొదలుపెట్టింది.

బుజ్జిబాబు ఆమె మాటలను ఏమీ పట్టించుకోవటం లేదు. ఏదో గుర్తుకు వచ్చి ముఖం వంద వోల్ట్‌ల బల్బ్‌లా వెలిగినట్లు వెలిగింది.

వెంటనే రికార్డ్ మార్చాడు బుజ్జిబాబు. భార్య చేతిని పట్టుకొని "ఎంత పని అయింది. రుక్మిణీ అయ్యయ్యో....చొ....చో...." అని తెగ నటించేస్తున్నాడు. మనసులో మాత్రం ఎంతో ఆనందపడిపోయాడు. ఈ వేలు కోసుకుంది అనే సాకుతోనైనా రుక్మిణీని మానసిక డాక్టర్ దగ్గరకు తీసుకొని వెళ్ళవచ్చని బుజ్జిబాబు మాస్టర్ ప్లాన్.

భర్త ప్రవర్తన కాస్త క్రొత్తగా అనిపించింది.

మరుసటి రోజు బుజ్జిబాబు భార్యను తీసుకొని సరిగ్గా డాక్టర్ స్వాతి హాస్పిటల్‌కు వెళ్ళాడు. కన్‌సల్‌టింగ్ కోసం స్లిప్ వ్రాయించాడు.

ఓ అర్ధగంట తరువాత కన్సల్‌టింగ్ కోసం పిలుపు వచ్చింది. బుజ్జిబాబూ రుక్మిణీ వెళ్ళి డాక్టర్ ముందు కూర్చున్నారు.

రుక్మిణి కత్తిపీటతో కోసుకున్న వేలు, వేలుకు తెల్ల బట్ట వస్త్రం చుట్టుకొని ఉంది.

డాక్టర్ "అయ్యయ్యో ఎలా జరిగింది ఈ ప్రమాదం?" అంది నొచ్చుకుంటూ. బుజ్జిబాబు వైపు చూసి "మీరు బయట వెయిట్ చేయండి" అన్నారు స్వాతి.

బుజ్జిబాబు బయటకు వెళ్ళిపోయాడు.

"కత్తిపీటతో కూరగాయలు తరుగుతుంటే....", అని ఇంకా ఏదో చెప్పబోతోంది. రుక్మిణి స్వభావం తెలియటంవల్ల డాక్టర్ స్వాతి మధ్యలోనే అందుకొని అనుమానంగా "మీది అరేంజ్‌డ్ మ్యారేజా?" అని ప్రశ్నించారు.

కత్తిపీటతో వేలు కోసుకోవటానికి, అరేంజ్‌డ్ మ్యారేజ్‌కు ఉన్న సంబంధం ఏమిటో రుక్మిణికి అర్థం కాలేదు. ఏం చెప్పాలో అర్థం కాలేదు. కొన్ని సెకన్స్ ఆలోచించి పారేసి "అవునండి, మాది అరేంజ్‌డ్ మ్యారేజే. ఏం, ఎందుకు అలా అడిగారు?" అని అనుమానంగా అడిగింది రుక్మిణి.

"ఏమీ లేదు. ప్రేమించి పెళ్ళి చేసుకున్న వాళ్ళు అయితే ఇంటి పనిలో, వంట పనిలో భర్త సహాయం, సహకారం ఉంటుంది....", అని వదిలేశారు ఆ సెంటెన్స్‌ని.... వెంటనే రుక్మిణి అందుకుంది:

"అవునండి మా వారు అసలు ఇంటి విషయాలు ఏ మాత్రం పట్టించుకోరు, పేపర్ దొరికితే చాలు, అన్నీ మరచిపోతారు...." అని దండకం ప్రారంభించింది.

రుక్మిణి వాక్ ధాటికి డాక్టర్ స్వాతి ఓ నిమిషం పాటు కంగారు పడిపోయారు, వెంటనే తేరుకొని - "మీరు చెప్పిన ప్రతిమాట మీ వారు తూచా తప్పకుండా ఫాలో అవ్వాలండే నేను చెప్పినట్లు చేయాలి...." అన్నారు చాలా సామాన్యంగా గుసగుసగా.

డాక్టర్ స్వాతి తన టేబుల్ మీద నున్న ఒక స్విచ్ ఆన్ చేశారు. కౌన్సిలింగ్ రూమ్‌కు బయట ఓ రెడ్‌లైట్ వెలిగింది. అది డైంజర్ గుర్తు కాదు, ఎవరూ లోపలికి రావద్దు అని సింబల్ మాత్రమే.

"చెప్పండి డాక్టర్, నన్ను ఏం చేయమంటారు...." అని ఇంకా ఏదో చెప్పబోయి, టేబుల్ మీదకు వంగింది.

"ముందుగా మీరు మీ సీట్‌లో ఫ్రీగా కూర్చొండి...."

రుక్మిణి మారుమాట్లాడకుండా బుద్ధిగా సీట్ మీద సర్దుకొని కూర్చుంది.

"అలాగ, గుడ్! ఇప్పుడు కళ్ళుమూసుకోండి. నేను ఏమి చెప్తానో మీరు అది చేయాలి, ఓ. కే." అని-

"రిలాక్స్....రిలాక్స్....రిలాక్స్....", అంటూ సజెషన్స్ ఇవ్వటం ప్రారంభించారు డాక్టర్ స్వాతి.

రుక్మిణికి డాక్టర్ మాటలు వింటుండే నిజంగానే ఎంతో ప్రశాంతంగా ఉంది. హిప్నాసిస్‌లో గాఢ అవస్థకు తీసుకొని వెళ్ళి డాక్టర్ స్వాతి రుక్మిణిని ప్రశ్నించటం ప్రారంభించారు.

రుక్మిణి గాఢ నిద్రలో కళ్ళు మూసుకొని స్పష్టంగా నెమ్మదిగా చెప్పటం ప్రారంభించింది. ''తెలుగు సినిమాల్లో, నవలల్లో హీరోలకు ఉండే చురుకుదనం, ధైర్యం, ప్రేమ, ఆరాధనాభావం నా భర్తలో లేవు. నేను అందంగా సినిమా స్టార్‌లా ఉంటానని మా స్నేహితులు చెపుడూ ఉండేవారు. ఏదో ఒకనాడు నేను ఒక పెద్ద సినిమా యాక్టర్నో, అపోలో హాస్పిటల్ డాక్టర్నో పెళ్ళిచేసుకోవాలనుకున్నాను. కాని, అనుకోని పరిస్థితులలో నేను బుజ్జిబాబును పెళ్ళిచేసుకున్నాను. నా ఊహాల పల్లకిలోనుండి ఒక్కసారిగా జారి క్రింద పడ్డటయింది. జీవితంమీద విరక్తి కలిగింది. నా భర్త నన్ను ఎంతో ప్రేమగా చూసుకుంటారు, నాకు బుజ్జి బాబు అంటే ప్రేమ ఉంది; కాని, నా భర్త అంటే నాకు నిర్లక్ష్యం. అతను చాలా సామాన్యంగా ఉంటాడు, అందువల్లనే అతనంటే నాకు పడదు" అని చెప్పటం ఆపింది.

డాక్టర్ స్వాతికి సమస్య పూర్తిగా అర్థమయిపోయింది. అదే హిప్నాసిస్ స్థితిలో కొన్ని పాజిటివ్ సజెషన్స్ ఇచ్చారు డాక్టర్ స్వాతి. వ్యాధి

మొదటి దశలో ఉంటే చికిత్స సులభమే. డాక్టర్ స్వాతి వైద్య జీవితంలో మరో క్రొత్త ఫైల్ వచ్చిచేరింది.

రుక్మిణికి భర్త అంటే ఆదరణ ప్రేమ, గౌరవం పెరిగింది. బుజ్జిబాబు ఎంత అంటే అంతే. మారిన రుక్మిణిని చూసి బుజిబాబు ఆనందంతో భార్యనుచూస్తూ పసిపిల్లాడిలా కేరింతలేశాడు.

"అబ్బ ఏమిటండి ఆ కేరింతలు, మరో తొమ్మిది నెలలుపోతే మరో చిన్న బుజ్జిబాబు వస్తాడు ఈ ఇంటిలోనికి మీకుతోడుగా కేరింతలు వేయటానికి...." అంది సిగ్గు పడుతూ.,

బుజ్జిబాటుకు వెంటనే అర్థంకాలేదు, అర్థమయిన వెంటనే "ఏ.... దొంగ.... నిజమా...." అంటూ ఆనందంగా రుక్మిణిని గిరగిర తిప్పి రెండు చేతులలో ఎత్తుకున్నాడు - తెలుగు సినిమా హీరోలా.

రుక్మిణి సినిమా హీరోయిన్‌లా ఆనందంతో సిగ్గుపడుతూ పరవశించిపోయింది.

* * *

ప్రాజెక్ట్‌సికి సంబంధించిన ఫార్ములా, శాంపిల్ డోస్ తీసుకొని డాక్టర్, అభిమన్యు, విశ్వామిత్ర, స్నేహిత, సిద్ధార్థ, ప్రశాంత్, మరో సీనియర్ సర్జన్ మొత్తం ఆరు మంది ఒకే కారులో ఎమ్.సి.ఐకి బయలుదేరారు.

జనసంచారం బాగా ఉన్న రోడ్డుమీద కార్ వేగంగా పోకపోయినా చాలా వేగంగా వెళ్తునట్టుగా కనిపిస్తుంది. కార్ ఒక మలుపు తిరిగి వేగాన్ని పెంచబోయే ముందు అభిమన్యు చూస్తూ ఉండగానే కారుకు ఎవరో బిచ్చగత్తె అడ్డం వచ్చింది.

డ్రయివింగ్ సీట్ మీద ఉన్న సిద్ధార్థ కంగారుపడుతూ సడన్ బ్రేక్ వేశాడు.

బిచ్చగత్తె ఒక వస్తువును కార్ ముందు పడేసి మాయమైంది. మరుక్షణంలో కార్ ముందు నుంచి తెల్లపొగలు చుట్టూ అలుముకున్నాయి. అనుకోని వైపరీత్యం ఏమయిందో అర్థం కావటం లేదు. కార్ ముందుకు పోనీయాలన్నా, వెనక్కి పోవాలన్నా చుట్టూ పొగ - ఏమి కనిపించటం లేదు. భయంకరమైన తుపాకి తూటాల శబ్దంతో కార్‌మీద తూటాల (బుల్లెట్ల) వర్షం ప్రారంభమయింది. ఎవరు ఎటువైపు నుంచి కాలుస్తున్నారో తెలియటంలేదు. అన్నివైపులనుంచి శబ్దం వినిపిస్తున్నది. చెవులు చిల్లులు పడేలా ఉన్నది. కార్‌లో ఉన్న అందరు వదిగి దాక్కున్నారు. ప్రాణభయం ఎవరికైన ఒకటే. ఓ ఐదు నిమిషాల పాటు కాల్పులు జరుగుతూనే ఉన్నాయి. ఆ తరువాత కాల్పులు ఒక్కసారిగా ఆగాయి.

అభిమన్యు మెల్లగా తల ఎత్తి చూశాడు. కొన్ని క్షణాల క్రితం జనంతో కిటకిట లాడిన ఆ రోడ్ ఇప్పుడు నిర్మానుష్యంగా ఉంది. రోడ్డు మీద ఉన్న షాప్స్ కూడా మూసి ఉన్నారు.

అభిమన్యు మెల్లగా కార్‌లోనుంచి బయటికి దిగాడు. వీధి అంతా నిర్మానుష్యంగా ఉంది. కార్ అంతా కాల్పులకు తూట్లుపడి ఉంది. కార్ అద్దాలు పగిలి చెల్లాచెదరుగా గాజుముక్కలు పడి ఉన్నాయి.

కార్ ప్రక్కనే ఇద్దరు వ్యక్తులు తుపాకి గుళ్ళకు బలి అయి ఉన్నారు. వెంటనే వంగి ఆ వ్యక్తుల పల్స్ చూడటానికి ప్రయత్నించాడు. కాని, లాభంలేదు అంతా అయిపోయి ఉంది.

కాస్త దూరంలో పోలీస్ వ్యాన్ ఆగి ఉంది. పోలీస్ వాళ్ళు తుపాకులతో అటు పరుగెత్తుతున్నారు.

సిద్ధార్థకు బుల్లెట్ ఎక్కడ తగిలిందో, స్టీరింగ్ మీద వాలిపోయి ఉన్నాడు. కాని, అభిమన్యు గమనించలేదు.

పోలీస్ ఆఫీసర్ అభిమన్యు దగ్గరికి వస్తూ "డోంట్ వర్రీ సర్, సమయానికి మేం వచ్చేశాం కనుక సరిపోయింది...." అంటూ ఇంకా ఏంచెప్పాలో అర్థంకాక, ఓదార్చే ధోరణిలో-

"......." అయోమయంగా చూస్తూ ఉండిపోయాడు.

స్నేహిత కారు దిగి వెళ్ళి అభిమన్యు ప్రక్కన నిలబడింది.

పోలీస్ ఆఫీసర్ "ఇలా ఎవరు చేసి ఉంటారని మీ అనుమానం సర్"? అని ఇన్వెష్టిగేషన్ టైప్‌లో అడిగాడు.

"తెలియదు...." అన్నాడు.

అభిమన్యు దృష్టి స్టీరింగ్‌మీద పడివున్న సిద్ధార్థమీద పడింది. తూటా తలకు తగిలింది. వెళ్ళితాకాడు, చల్లగా మంచుగడ్డలా తగిలింది. చలించిపోయాడు.

"ఎందువల్ల ఈ దాడి జరిగి ఉంటుంది అనుకుంటున్నారు సర్?" అని అడిగాడు పోలీస్ ఆఫీసర్.

"క్యాన్సర్ వ్యాక్సిన్ ఫార్ములా ఎమ్.సి.ఐ.కి సబ్‌మిట్ చేయటానికి బయలుదేరాము. ఇలా జరిగింది. బహుశ వ్యాక్సిన్ ఫార్ములా కోసం జరిగి ఉండవచ్చు...." అన్నాడు సాలోచనగా.

"మీకు ఎవరి మీదైనా అనుమానం ఉందా సర్?"

"నో, నాట్ ఎటాల్. కారణం ఏమిటంటే, నేను ఈ ప్రయోగం చేయటంవల్ల ఎవరికీ నష్టం లేదు. భవిష్యత్తులో అందరికి ఉపయోగమే. అందువలన నేను ఎవరినీ అనుమానించలేకపోతున్నాను...." అన్నాడు.

"నో డాక్టర్! మీరు పొరపాటు పడుతున్నారు. మీ కంటే వయస్సులో, అనుభవంలో అర్హత కలిగిన వారు కనిపెట్టలేనిది, మీరు కనుక్కోవటం ఎవరైన కుసంస్కారం కలిగిన డాక్టర్ తనకు అవమానంగా భావించవచ్చు...." అంది స్నేహిత నిశ్చలంగా.

"నో....అలా అనిపించటానికి అవకాశమే లేదు. ఎంతో పవిత్రమైన ఈ వైద్య వృత్తిలో అలాంటి ఆలోచనలు రావటం అసంభవం...."

"లేదు డాక్టర్ మీరు పొరబడుతున్నారు. ఏ వృత్తిలో ఉన్నా, ఎంత పెద్ద పదవిలో ఉన్నా వాళ్ళు మొదట మామూలు మనుషులే. వ్యక్తులు ఏ వృత్తి చేస్తున్నా, వృత్తి వారి ప్రవృత్తిని అంత త్వరగా మార్చలేవు. ప్రవృత్తిలో మార్పు రావటం ముఖ్యం కాని, మనుష్యులు తమ ప్రతిభతో, తమ తెలివి తేటలతో ఎంతో ఉన్నతమైన వృత్తులు చేపట్టవచ్చుకాని, వారి ప్రవృత్తిలో అంత త్వరగా మార్పురాదు!

కొంతమందికి అహంకారం వలన తమ అంతవారు మరొకరు ఉండకూడదని పంతం. తమకంటే చిన్నవారు తమ స్థానం ఆక్రమించ గల స్థితిలో ఉండరాదనే కుసంస్కారం గలవాళ్ళు ఎంతో పవిత్రమైన ఈ వైద్య వృత్తిలో కూడా ఉన్నందువల్ల ఇంత ఘోరం జరిగింది.... ఇది ఊహకాని, కల్పితంకాని కాదు డాక్టర్! ఇది పచ్చినిజం. కుసంస్కారంతో ఈ ఘోరం సృష్టించిన ప్రబుద్ధులు ఎవరో నాకు తెలుసు, అయినా వారు ఇప్పటికీ సంస్కారంతో ప్రవర్తించకపోతే వైద్యచరిత్ర వారిని క్షమిం చదు...."

* * *

ప్రాజెక్ట్-సి రిజల్ట్ అయిన వ్యాక్సిన్. కె.సి. మానవునిపై ప్రయో గించబడింది. భవిష్యత్‌లో ఇక మనిషి క్యాన్సర్ అనే ఒక రోగంకు భయపడవలసిన పనిలేదు. చంటి పిల్లలకు సైతం వ్యాక్సిన్ తయారు చేశాడు డాక్టర్ అభిమన్యు. ఆ సందర్భంగా ఒక సమావేశాన్ని హాస్ప టల్ కాన్ఫరెన్స్ హాల్‌లో ఏర్పాటు చేశారు. స్టేజీ మీద డాక్టర్ అభిమన్యు, విశ్వామిత్ర, స్నేహిత, ప్రశాంత్ కూర్చున్నారు.

అభిమన్యు ఎంతో కాలంగా తను కలలు కన్న అపూర్వ విజ యాన్ని సాధించగలిగాడు. వైద్య చరిత్రలోనే ఒక నూతన శకం ప్రారంభం కాబోతున్నది.

డాక్టర్ విశ్వామిత్ర అభిమన్యుని ఆలింగనం చేసుకున్నారు.

ఆ తరువాత స్నేహిత అభిమన్యుకు పూలమాలవేస్తూ కమలంలా విప్పారిన ముఖంతో మనఃపూర్వకంగా అభినందించింది. "మీ అపూర్వ, అసామాన్యమైన ప్రతిభకు ఈ చిన్న కానుక," అంటూ పూలచెండు చేతి కందించింది.

గెలుపు, విజయం ఎప్పుడూ ధైర్యాన్ని, ఉత్సాహాన్ని ఇస్తుంది; అంతేకాక మనసుకు ప్రశాంతత, మెదడుకు విశ్రాంతి నిస్తాయి. అభిమన్యుకి ఆనందంతో కళ్ళు చెమర్చాయి. మాటలు రాని ఆ కళ్ళు తృప్తిగా నవ్వుతున్నాయి. అది మాటల కందని ఆనందం. అతని మనసంతా ఆనందంతో తృప్తితో నిండిపోయింది. ఆ సంతోషంలో మనసు, నోరు. మూగబోతున్నాయి. అది అతనొక్కని ఫీలింగ్ కాదు. ఆ హాల్‌లో ఉన్న ప్రతి ఒక్కరి పరిస్థితి అలాగే ఉంది. మాటల కందని ఆనందంతో తేలి పోతున్నారు.

అభిమన్యు మాట్లాడటానికి లేచి నిలబడ్డాడు. అతను నిటారుగా నిలబడి ఉన్నాడు. ఆ నిలబడిన తీరు అతని ఆత్మ విశ్వాసానికి ప్రతీకగా ఉంది. ప్రశాంతమైన చిరునవ్వు అతని మానసిక స్థితికి అద్దంగా నిలిచింది.

అభిమన్యుని చూస్తే ఒక భావం కలుగుతుంది, అతని ప్రతి ప్రయత్నంలో పట్టుదల, దీక్ష, నిజాయితీ, శ్రమ, పరిశ్రమ ఇవన్నీ వెరసి అతని ధైర్యం పట్టుదల కనిపిస్తాయి ప్రతి గొప్ప వ్యక్తి వెనుక ఓ స్త్రీ మూర్తి ఉంది అని నిరూపించటం కోసం "స్నేహిత."

ఆ మీటింగ్ అయిపోయిన తరువాత, అభిమన్యు, స్నేహిత ప్రాజెక్ట్‌-నీ ఫార్ములాను ఇండియన్ మెడికల్ కౌన్సిల్‌కు సబ్‌మిట్ చేయటం కోసం చార్టెడ్ ఫ్లయిట్‌లో బేగంపేట ఎయిర్‌పోర్ట్ నుండి బయలుదేరారు....



